ఈ గ్రంథము 14-01-2018 తేదీన

పరమ పవిత్రమైన ప్రదోషపూజ రోజు

పరమపదించిన శ్రీ బొబ్బా

సీతారామారావు గారి జ్ఞాపకార్థమై

2-02-2019వ తేదీన జరుపబడిన

ప్రథమ పుణ్యతిథి ఆరాధన సందర్భము నందు వారి ధర్మపత్ని శ్రీమతి వసుంధరగా-రు, కుమార్తె అన్నపూర్ణ

గారు, కుమారుడు శ్రీవత్సవ్ గారల

ధార్మిక ద్రవ్యదానముచే

ముద్రింపబడినది. వారందఱిపై

దైవానుగ్రహము, శివానుగ్రహము,

గుర్వనుగ్రహములు ఎల్లప్పుడు ప్రసరింపబ-డుచుండును గాక!

**- దివ్య జీవన సంఘము**

# ఏతద్గ్రంథము

శ్రీ శివానందాశ్రమములోనున్న
శ్రీ విశ్వనాథ మందిరము ప్రతిష్ఠ యొక్క
75వ వార్షికోత్సవము
(ప్లాటినం జూబిలీ 31-12-2018)
శుభ సందర్భమునందు ముద్రింపబడి,
శ్రీ విశ్వనాథ భగవానునికి
సమర్పించడమైనది.
ఓం నమఃశివాయ

**దివ్య జీవన సంఘము**

# శివుడు – శివపూజ

గ్రంథకర్త :

**శ్రీ శ్రీ శివానంద స్వాముల వారు**

అనువాదము :

**స్వామి హంసానంద**

ప్రకాశకులు :

దివ్య జీవన సంఘము

శివానందనగర్ 249 192.

టెహ్రీగఢ్వాల్ జిల్లా.

హిమాలయములు (ఉత్తరాఖండ్)

2019

ప్రచురణ కర్త :

**శ్రీ స్వామి పద్మనాభానంద**

దివ్య జీవన సంఘము

శివానందనగర్ - 249 192

హిమాలయములు (ఉత్తరాఖండ్)

తృతీయ ముద్రణము : **1000** ప్రతులు

వెల: రూ.**100/-**



ముద్రణా స్థలము :

**S.V.R. Printers**

మారుతీనగర్,

విజయవాడ-520 004

ఓ ముముక్షువులారా!

శివుడు ప్రేమమయుడు. అతని అనుగ్రహమునకు లేదు. అతడు సంరక్షకుడు మఱియు గురువు. ఆతడు ఉమానాథుడు, ఆతడు సత్యము, శివము, శుభము, సుందరము, శాంతము. నీ హృదయమునందు వెలుగొందు పరమప్రకాశమే పరమేశ్వరుడు.

ఆతని రూపమును ధ్యానించుము. అతని లీలలను శ్రవణ మొనర్చుము. అతని మంత్రమగు "ఓం నమఃశివాయ"ను ఉచ్చరించుము. శివపురాణమును పఠింపుము. ప్రతి నిత్యము ఆతనిని పూజించుము. సర్వనామ రూపములలో అతనిని దర్శిం చుము. అతడు తన దర్శనము నొసంగి, నిన్నాశీర్వదించును.

**- స్వామి శివానంద**

ఓం తత్సత్

# మున్నుడి

శ్లో॥ చంద్రోద్భాసిత శేఖరే స్మరహరే గంగాధరే శంకర్తే

నర్భైర్భూషిత కంఠకర్ణవివరే నేత్రోత్థవైశ్వానరే,

దంతిత్వక్కృత సుందరాంబరధరే త్రైలోక్య సారే-హర్తే

మోక్షార్థం కురుచిత్తవృత్తి మచలామన్యైస్తుకిం కర్మభిః

ప్రాతః స్మరణీయులు, బ్రహ్మీభూతులైన పరమపూజ్య శ్రీశ్రీశ్రీ శివానందస్వాముల వారు ఆంగ్లభాషలో సుమారు 300 గ్రంథములను రచించిరి. వారు వాస్తవముగా సిద్ధహస్తులు. ఏదైన ఒక గ్రంథమును వ్రాయుటకు- పక్రమించినట్లయితే అది సర్వతో ముఖముగా, సంపూర్ణముగా నుండుటయు, మృదుమధురమగు సరళమైన భాషయందుండుటయు హృదయా- కర్షనీయముగా నుండుటయు వారి వ్రాతలో గల గొప్ప విశేషము. ద్వాపర యుగములో శ్రీ వేదవ్యాసమహర్షి తర్వాత, ఈ యుగములో ఇన్ని గ్రంథములను ప్రాక్పశ్చిమదేశములకు,

సర్వజనావళికి అందుబాటులో నుండునట్లు రచించిన వారు పూజ్యశ్రీ స్వాముల వారేయను-టలో అతిశయోక్తి లేదు. వారు సాక్షాత్తుగా శివ స్వరూపులే! అందువలననే శివుని గుఱించి, శివ-పూజ గుఱించి ఇంత విపులముగా ఈ గ్రంథమును రచించిరి.

పరమ పూజ్యశ్రీ స్వాముల వారు రచించిన 300 గ్రంథము " లో "Lord Siva & Hits Wor-ship" అనునదొకటి. ఇందులో శివపురాణము మొదలగు అనేక గ్రంథములయందున్న శివత-త్త్వమంతటిని కూలంకషముగా వ్రాసుకొనియున్నారు. శివుడు, అతని మహిమలు, లీలలు, భక్తరక్షణము, శివ శక్తుల | తత్త్వము, మహిమ్నస్తోత్రము, లింగాష్టకము, శివపంచాక్షర స్తోత్రము మున్నగు అనేక స్తోత్రములు, శివార్చన మొదలగు కొంగొత్త విషయములనెన్నింటినో సమకూర్చి ఈ గ్రంథమును రచించిరి.

శివుడు ఆశుతోషుడు. అనగా అల్పసంతోషి, ఒక ఉద్ధరిణెడు జలము, ఒక బిల్వపత్రముతో సంతృప్తినొందును. అతడు నివసించునది మం-చుకొండ మఱియు శ్మశానము. కానీ భక్తులు కోరినట్లయితే, వారికి మంచి భవనములను ప్రసా-

దించును. అతడు స్వయముగా భస్మోద్ధూళిత వి-గ్రహుడుగా నుండును. కానీ భక్తులు వాంఛించినట్లయితే పౌడర్లు, స్నో మొదలగు సు-గంధ ద్రవ్యములను ప్రసాదించును. పుఱ్ఱెలు, సర్పములే అతనికి ఆభూషణములు. కానీ భక్తు-లకు స్వర్ణరజతాది ఆభూషణముల నొసంగును. ఇట్లు మనము అన్నియు విచారించి చూచినచో సామాన్య జనులమైన మనము పనికిరానివని తి-రస్కరించిన వస్తువులనే ఆ శంకర భగవానుడు సహర్షముతో సదా ధరించు చుండును. అతడు యో-గిరాజు మఱియు జ్ఞానమూర్తి. అతని మహిమలను ఎవరు వర్ణింపఁగలరు?

శ్లో॥ "అసితగిరి సమంస్యాత్కజ్జలం సింధుపాత్రే

సుర తరువర శాఖాలేఖినీ పత్రముర్వీ!

లిఖతి యది గృహీత్వా శారదా సర్వకాలం

తదపి తవ గుణానా మీశ పారం నయాతి"

అని పుష్పదంతుడు శివునిఁ గూర్చి కీర్తించెను. అట్టి వా-చామ గోచరుండైన శివుని తత్త్వమంతయు పూజ్యశ్రీ స్వాముల వారీ గ్రంథమునందు క్రోడీకరించి విశదపఱచిరి. ఆంగ్లభాష యందున్న "Lord Siva & His Worship" అను గ్రంథమును శ్రీ శివానంద శతజయంతి సందర్భమునందు

ప్రియాత్మీయులైన శ్రీ హంసా శివపూజ" యను పేరుతో నంద స్వాములవారు “శివుడు తెలుగుభాషలోని కనువదించిరి. పరమపూజ్యశ్రీ స్వాముల వారి భాష, భావముల నాకళించుకొని, సరళమైన తెలుగుభాషలోని కనువదించిరి. శివతత్త్వమునుఁ గూర్చి తెలుసుకొనగోరు శివ భక్తులకు ఈ గ్రంథము చాలా ఉపయోగపడును. ఈ గ్రంథము యొక్క వ్రాత ప్రతినంతటిని ప్రప్రథమముగా పఠించుట కవకాశమును కల్పించిన శ్రీ హంసానందస్వాముల వారికి కృతజ్ఞతాపూర్వక ధన్యవాదముల నర్పించుచున్నాను.

ఈ గ్రంథానువాదము ద్వారా ఆంధ్రలోక సోదర సోదరీ మణులకు శ్రీ హంసానంద స్వాములవారొనర్చిన సేవ కడు ప్రశంసనీయము. ఈ గ్రంథమును పఠించి, గ్రహించి, అనుష్ఠించి, పరమేశ్వరుని దివ్యానుగ్రహమును, తద్వారా కైవల్యసిద్ధిని పొందుదురని విశ్వసించుచున్నాను.

ఈ గ్రంథమును శ్రీ శివానంద శతజయంతి మాలలో 30వ పుష్పముగా ముద్రించుటకు శ్రీశైల భ్రమరాంబ మల్లికార్జున స్వామి దేవస్థానము వారు తమ భూరి విరాళము నొసంగినందుకు కడు ముదావహము.

శ్రీ భ్రమరాంబా మల్లికార్జునస్వామి యొక్కయు, శ్రీ సద్గురు దేవుని యొక్కయు దివ్యానుగ్రహము శ్రీశైల దేవస్థాన కార్యనిర్వహణ సభ్యులందఱిపై సర్వకాల సర్వావస్థల-

యందు ప్రసరింపఁబడునుఁగాక!

ఓం తత్సత్

శ్రావణ పూర్ణిమ ఇట్లు

8. 23-8-84 మీ దేవానంద చిన్న-స్వామి

## ప్రకాశకుల మనవి

ఇది సాధకులకు, ముఖ్యముగా శివభక్తులకు మిక్కిలి విలువైన మఱియు ప్రబోధాత్మకమైన గ్రంథము. దీనియందు పదునైదు అధ్యాయములున్నవి. శివతత్త్వము లేక దైవసాక్షాత్కారము నొందుటకై సాధనానుష్ఠానమునకు సంబంధించిన ప్రబోధము దీనియందున్నది. ఇందుఁగల అధ్యాయములు అసామాన్యములు, శివతాండవము శక్తియోగము, శివతత్త్వము మున్నగు వాటి యందుఁగల రహస్యములిందు రమ్యముగా వర్ణింపఁబడినవి. శైవోపనిషత్తుల యొక్క అనువాదము అందముగా కూర్చఁబడినది. శైవాచార్యులు, భక్తులు మఱియు నాయనారులు జీవితములు ప్రేరణదాయకములు మఱియు ఆత్మోత్తేజకములునై యున్నవి. వారి జీవితముల నధ్యయనము చేసిన వారి జీవితము పరిశుద్ధము మఱియు పవిత్రమగును.

ఇట్టి విస్తృతమైన, భావయుక్తమైన గ్రంథమింతవరకు లే-దనియే చెప్పవచ్చును. ఇందుఁగల వేదాంత విభాగముచే పాఠకులు ప్రభావితులై పవిత్రులగుదురు. పెరియ పురాణ-ము, లింగ పురాణము, శివపరాక్రమము మఱియు తిరువలయడల్ పురాణము వంటి సమస్త శైవపురాణముల సారమిందు కలదు. కొన్ని ముఖ్యమైన శివస్తోత్రములు మఱియు వాటి అనువాదముచే ఈ గ్రంథము యొక్క ప్రా-ముఖ్యత ఇనుమడించినది.

ఈ గ్రంథము స్వచ్ఛముగ తేటతెల్లమగు విధానము నందు వ్రా-యబడినది. ఆధ్యాత్మిక దృష్టి కోణము ననుసరించి ఈ గ్రంథము ఘనమైన విలువను కలిగియుండుటచే, ఇది సమస్త ధార్మిక పరా-యణచిత్తులగు వ్యక్తులచే అధ్యయన మొనర్పఁబడ

వలయును.

**-దివ్యజీవన సంఘము**

## Contents



# శివుడు – శివపూజ

## 1వ అధ్యాయము

## శివ మంత్రములు – స్తోత్రములు

## శివమంత్రములు

(1) ఓం నమః శివాయ

ఓంకారము సచ్చిదానంద పరబ్రహ్మము. "నమః శివాయ" అనగా "శివునికి సాష్టాంగ ప్రణామములు" అని అర్థము. ఇది శివ పంచాక్షర

మంత్రమని చెప్పఁబడును. ఇది మిక్కిలి శక్తివంత మైన మంత్ర-ము. దీనిని ఉచ్చరించు వారికి పరమానందము ప్రాప్తించును.

(2) తత్పురుషాయ విద్మహే, మహాదేవాయ ధీమహి, తన్నో రుద్రః ప్రచోదయాత్।।

మనమాపరమ పురుషుని గుర్తెఱింగి, మహాదేవునిఁ గూర్చి ధ్యానింతుముఁ గాక! అట్లొనర్చుటకు రుద్రుడు మనలను ప్రేరేపించునుఁగాక! ఇది రుద్రగాయత్రీ మంత్రము.

### *శివుడు - శివపూజ*

(3) ఓం త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనమ్।
ఉర్వారుక మివ బంధనాన్మృత్యోర్ముక్షీయమా మృతాత్॥

త్రినేత్రధారియు, సుగంధ ప్రపూర్ణుడును, మానవులకు పుష్టినొసంగు వాడునగు శివునికి నేను ప్రణమిల్లుచున్నాను. పండిన ఒక గుమ్మడికాయ తీగనుండి విడివడునట్లు, నన్నాతడు ఈ సంసారము మఱియు మృత్యుబంధము నుండి విడిపించునుఁ గాక! నేను అమృతత్వమునందు సుస్థిరుడ- నగుదునుఁగాక! ఇదియే మహా మృత్యుంజయ మంత్రము.

## శివ పంచాక్షర స్తోత్రము

(1) నాగేంద్రహారాయ త్రిలోచనాయ

భస్మాంగరాగాయ మహేశ్వరాయ।
నిత్యాయ శుద్ధాయ దిగంబరాయ
తస్మైనకారాయ నమఃశివాయ।

భస్మోద్ధూళిత విగ్రహుడును, త్రిలోచనుడును, ప్రథమా క్షరమగు నకారస్వరూపుడును, పరిశుద్ధుడును, దిగంబరుడును, శాశ్వతుడు-ను, నాగేంద్రమునే హారముగా ధరించిన వాడునగు దేవునికి నేను ప్రణమిల్లుచున్నాను.

## *శివుడు - శివపూజ*

(2) మందాకినీసలిల చందన చర్చితాయ
నందీశ్వర ప్రమథనాథ మహేశ్వరాయ
మందార పుష్పబహు పుష్పసుపూజితాయ
తస్మైమకారాయ నమఃశివాయ ||

మకార స్వరూపుడును, మందారాది అసంఖ్యాక దివ్య పుష్పములచే పూజింపఁబడువాడును, ప్రమథ గణనాథుడును, పవిత్రమైన గంగాజలముచే అభ్యంజన మొనర్పఁబడు- వాడునగు మహేశ్వరునికి నేను మోకరిల్లుచున్నాను.

(3) శివాయ గౌరీ వదనారవింద సూర్యాయ,
దక్షాధ్వరనాశకాయః
శ్రీ నీలకంఠాయ వృషధ్వజాయ,
తస్మై శికారాయ నమఃశివాయ।

నీలగ్రీవుడును "శి" అక్షర స్వరూపుడును, దక్షయజ్ఞమును

ధ్వంసమొనర్చిన వాడును, గౌరీవదనారవిందమునకు సూర్యుని వంటి వాడును, ఎవ్వని ధ్వజమునందు ఎద్దు చిహ్నము కలదో అట్టివానికి ప్రణామములు.

(4) వసిష్ఠ కుంభోద్భవ గౌతమార్య
మునీంద్ర దేవార్చిత శేఖరాయ
చంద్రార్క వైశ్వానరలోచనాయ,
తస్మైవకారాయ నమఃశివాయ||

## *శివుడు – శివపూజ*

దేవ దేవుడును, వకారస్వరూపుడును, సూర్యచంద్రాగ్నులే త్రి-నేత్రములుగా కలవాడును, వసిష్ఠుడు, అగస్త్యుడు, గౌతముడు మున్నగు మునిపుంగవుల చేతను, దేవతల చేతను పూజింపఁబడువాడును అగు శివునికి నేను ప్రణమిల్లుచున్నాను.

(5) యక్ష స్వరూపాయ జటాధరాయ,
పినాకహస్తాయ సనాతనాయ !
దివ్యాయ దేవాయ దిగంబరాయ,
తస్మైయకారాయ నమః శివాయ ||

సనాతనుడును, దిగంబరుడును, "య" అను అక్షర స్వరూపు-డును, అవతరించిన యక్షుడును, పొడుగైన, జడలుఁ గట్టిన వెంట్రుకలు కలవాడును, పినాకహస్తుడునగు శివునికి నేను ప్రణా-మము నొనర్చు చున్నాను.

(6) పంచాక్షర మిదం పుణ్యం,

యః పఠేచ్ఛివసన్నిధౌ |
శివలోక మవాప్నోతి,
శివేన సహమోద తే!

ఈ పంచాక్షర స్తోతమును శివుని ఎదుట ఎవడు ఉచ్చ రించునో, ఆతడు శివలోకమును చేరి, శివునితో శాశ్వతానందము ననుభవించును.

*శివుడు – శివపూజ*

## శివ షడక్షర స్తోత్రము

(1) ఓం కారబిందు సంయుక్తం,
నిత్యం ధ్యాయంతి యోగినః |
కామదం మోక్షదం చైవ,
ఓంకారాయ నమోనమః ॥

ధ్యాననిష్ఠలో దేనియందు యోగులు నిరంతరము తమ మనస్సులను నిలుపుదురో, సమస్త కోరికలను ఏది నివారించి, శాశ్వత మోక్షము నొసంగునో అట్టి ఓం కారమునకు ప్రణామములు.

(2) నమంతి మునయో దేవా,
నమంత్యప్సరసాంగణాః |
నరా నమంతి దేవేశం,
నకారాయ నమోనమః ॥

నరులు, మునులు, దేవతలు మరియు అప్సరగణములు న కార రూపమునందున్న ఏ దేవేశునికి నమస్కరింతురో, అట్టి దేవునికి మేము మరల మరల ప్రణమిల్లు చున్నాము.

(3) మహా దేవం మహాత్మానం,
మహా ధ్యాన పరాయణమ్ |
మహాపాపహరం దేవం,
మకారాయ నమోనమః ||

## *శివుడు - శివపూజ*

ఏ మహా దేవుడు మ కారరూపమునందున్నాడో, ఎవడు భావా-తీతుడో, నానావిధ పాపములను నశింపజేయు వాడెవ్వడో, ఎవడు పూజ్యుడు మరియు ధ్యాన యోగ్యుడో, అట్టి వానికి మేము సదా సర్వథా ప్రణమిల్లుచున్నాము.

(4) శివం శాంతం జగన్నాథం
లోకానుగ్రహకారకమ్ |
శివమేక పదం నిత్యం
శికారాయ నమో నమః ||

విశ్వమునకు శుభప్రదుడును, సర్వశ క్తిమంతుడును, శికార స్వరూపుడును, ప్రపంచమునకు శాంతి సౌఖ్యముల నొసంగు వా-డును, శాశ్వతుడును, ఏకైకుడునగు శివునికి సదా ప్రణామములు.

(5) వాహనం వృషభోయస్య,
వాసుకిః కంఠ భూషణమ్ |

వామేశక్తి ధరం దేవం,
వకారాయ నమోనమః ॥

వామభాగమునందు శక్తిని ధరించువాడును, వృషభ వాహనుడును, వాసుకిని కంఠము నందలంకరించుకొన్న వాడును వకార స్వరూపుడునగు శివునికి. మరల మరల ప్రణామములు.

(6) యత్ర యత్ర స్థితో దేవః
సర్వవ్యాపీ మహేశ్వరః |



యోగురుః సర్వ దేవానాం,
య కారాయ నమోనమః ॥

సర్వ వ్యాపియు, యకార స్వరూపుడును, సగుణ నిర్గుణ రూపుడును, సర్వ దేవతలకు గురువున్నూ అగు మహేశ్వరు డెచ్చటున్నను, ఆతనికి మా ప్రణామముల నర్పించుకొను చున్నాము.

(7) షడక్షర మిదం స్తోత్రం,
యఃపఠేచ్ఛివ సన్నిధౌ |
శివలోకమవాప్నోతి,
శివేన సహ మోదతే ॥

"ఓం నమఃశివాయ" యనెడి షడక్షర సమన్వితమగు ఈ స్తోత్రము నెవ్వడు శివసన్నిధియందు పఠించునో, అతడు శివుని శాశ్వత ధామమునందు పరనూనందము ననుభవించును.

# లింగాష్టకము

(1) బ్రహ్మమురారి సురార్చితలింగం,
నిర్మలభాసిత శోభితలింగమ్ |
జన్మజదుఃఖ వినాశక లింగం,
తత్ప్రణమామి సదాశివలింగమ్ ||

***శివుడు - శివపూజ***

బ్రహ్మ, విష్ణువు మఱియు ఇతర దేవతలచే అర్చింపబడు వాడును, నిర్మలమైన, పవిత్రమైన మాటలచే స్తుతింపబడు వాడును, జనన మరణ దుఃఖమును నివారించువాడునగు సదా శివలింగమునకు ప్రణామములు.

(2) దేవముని ప్రవరార్చిత లింగం,
కామదహం కరుణాకర లింగమ్ |
రావణదర్ప వినాశనలింగం,
తత్ప్రణమామి సదాశివలింగమ్ ||

కాముని దహనమొనర్చిన వాడును, దేవతలు, మునులచే అర్చింపఁబడువాడును, కరుణాసముద్రుడును, రావణుని గర్వము నణచినవాడునగు సదాశివలింగమునకు ప్రణామములు.

(3) సర్వ సుగంధ సులేపితలింగం,
బుద్ధివివర్ధన కారణలింగమ్ |
సిద్ధ సురాసుర వందిత లింగం,

తత్ప్రణమామి సదాశివలింగమ్ ||

సకలవిధ సుగంధముల నలదుకొన్నవాడును, వివేకమును, బుద్ధిని వికసింపజేయు వాడును, సిద్ధ సురాసురులచే నమస్కరింపబడువాడునగు సదాశివలింగమునకు ప్రణామములు.

(4) కనక మహామణి భూషిత లింగం,
ఫణిపతి వేష్టిత శోభిత లింగమ్
దక్షసుయజ్ఞ వినాశన లింగం,



తత్ప్రణమామి సదాశివలింగమ్ ||

దక్షయజ్ఞమును ధ్వంసమొనర్చినవాడును, నానావిధ భూషణములచే అలంకరింపబడినవాడును, కనక మహా మణులచే శోభించువాడును, సర్పరాజముచే చుట్టంబడినవాడు నగు సదాశివలింగమునకు ప్రణామములు.

(5) కుంకుమ చందన లేపిత లింగం,
పంకజహార సుశోభితలింగమ్ |
సంచితపాప వినాశన లింగం,
తత్ప్రణమామి సదాశివ లింగమ్ ॥

కుంకుమ, చందనముల నలదుకొన్నవాడును, పద్మహారములచే శోభించువాడును, కూడబెట్టబడిన పాపరాశిని భస్మమొనర్చువాడునగు సదాశివలింగమునకు ప్రణామములు.

(6) దేవగణార్చిత సేవితలింగం,
భావైర్భక్తి భి రేవచలింగమ్ |

దినకర కోటి ప్రభాకరలింగం,
తత్ప్రణమామి సదాశివలింగమ్ ||

దేవగణములచే పూజింపఁబడువాడును, భక్తి శ్రద్ధ, విశుద్ధ భావములతో అర్చింపఁబడువాడును, కోటిసూర్యసమ ప్రభుడును అగు సదా శివలింగమునకు ప్రణామములు.

(7) అష్టదళోపరి వేష్టితలింగం,
సర్వసముద్భవ కారణలింగమ్ |



అష్టదరిద్ర వినాశనలింగం,
తత్ప్రణమామి సదాశివలింగమ్ ||

అష్టవిధ దరిద్రములను నశింపఁజేయువాడును, సకల సృష్టికి కారణమైనవాడును, అష్టదళములపై ప్రతిష్ఠితుడైనవాడు నగు సదాశివలింగమునకు ప్రణామములు

(8) సురగురు సురవర పూజితలింగం,
సురవనపుష్ప సదార్చితలింగమ్ |
పరాత్పరం పరమాత్మక లింగం,
తత్ప్రణమామి సదాశివలింగమ్ ||

భావాతీతుడును, పరాత్పరుడును, సురగురువుచేతను, సురశ్రేష్ఠులచేతను పూజింపఁబడువాడును, దేవతలవనములోని పుష్పములచే అర్చింపఁబడువాడునగు సదాశివలింగమునకు ప్రణామములు.

(9) లింగాష్టక మిదం పుణ్యం,

యః పఠేచ్ఛివ సన్నిధౌ |
శివలోకమవాప్నోతి,
శివేన సహమోదతే ॥

ఈ యెనిమిది శ్లోకముల నెవ్వడు శివుని సన్నిధియందు పఠించునో, మరియు శివలింగమునెవ్వడు స్తుతించునో; అతడు శివుని పరమధామమునొంది, శాశ్వతానందమును మఱియు మోక్షానందమును౽బడయును.

*శివుడు – శివపూజ*

# అర్ధనారీ - నటేశ్వర స్తోత్రము

(1) చాంపేయ గౌరార్ధ శరీర కాయై,
కర్పూర గౌరార్ధ శరీర కాయ |
ధమ్మిల్లకాయై చజటాధరాయ,
నమః శివాయైచ నమః శివాయ ||

చొక్కపు బంగారమువలె శోభిల్లు శరీరము౽గలదానికి, శుద్ధ స్పటికమువ౽టి శరీరము౽గల వానికి, ధమ్మిల్లముచే శోభించు దానికి జటాశోభితుడునగు వానికి గౌరీమహేశ్వరులకు ప్రణామములు.

(2) కస్తూరికా కుంకుమ చర్చితాయై,
చితారజః పుంజ విచర్చితాయ |
కృతస్మరాయై వికృతస్మరాయ,
నమః శివాయై చ నమఃశివాయ ॥

కస్తూరి, కుంకుమ చే అలద౽బడిన శరీరముగలదియు, శ్మశానభస్మముచే పూయ౽బడిన శరీరము౽గలవాడును, అందమును,

ప్రేమను వెదజల్లునదియు, కాముని దహింపఁ జేసిన వాడును అగు గౌరీ శంకరులకు ప్రణామములు.

(8) చలత్క్వణత్కంకణ నూపురాయై,
మిలత్ఫణా భాస్వర నూపురాయ ।
హేమాంగదాయై భుజగాంగదాయ,
నమః శివాయై చ నమః శివాయ ॥

## ***శివుడు – శివపూజ***

అందమైన కంకణ, నూపురములను ధరించునదియు, కాళ్ళ-యందు చుట్టఁబడిన సర్పనూపురములను ధరించిన వాడును, బంగారు కడియములచే శోభించునదియు, పన్నగ కడియములచే శోభిల్లు వాడునగు ఉమామహేశ్వరులకు ప్రణామములు.

(4) విలోల నీలోత్పలలోచనాయై,
వికాసి పంకేరుహ లోచనాయ |
సమేక్షణాయై విషమేక్షణాయ,
నమఃశివాయైచ నమః శివాయ ॥

నీలోత్పలములవంటి కన్నులుఁ గలదియు, వికసించిన పద్మములవంటి నేత్రములుఁ గలవాడును, రెండుకండ్లు కల ది-యు, మూడుకండ్లు కలవాడునగు గౌరీ శంకరులకు ప్రణామములు.

(5) మందారమాలా కలితాలకాయై,
కపాలమాలాంకిత కంధరాయ |
దివ్యాంబరాయైచ దిగంబరాయ,

నమఃశివాయై చ నమః శివాయ ॥

మందార పుష్పమాలికలచే అలంకరింపఁబడిన శిరస్సు కలదియు, తలపుర్రెలచే అలంకరింపఁబడిన కంఠముఁగల వాడును, దివ్యాంబరములచే శోభించునదియు, దిక్కులే అంబరముగా కలవాడును అగు ఉమామహేశ్వరులకు ప్రణామములు.

(6) అంభోధర శ్యామల కుంతలాయై,
తడిత్ప్రభాతామ్ర జటాధరాయ ।

***శివుడు – శివపూజ***

గిరీశ్వరాయై నిఖిలేశ్వరాయ,
నమఃశివాయై చ నమఃశివాయ ॥

నల్లని మేఘమువంటి వెంట్రుకలు కలదియు, మెరుపు రంగుఁగలజటలుఁ గలవాడును, హిమాలయములకు ఈశ్వరియు, విశ్వేశ్వరుడునగు గౌరీశంకరులకు ప్రణామములు.

(7) ప్రపంచ సృష్ట్యున్ముఖలాస్యకాయై,
సమస్త సంహారక తాండవాయ |
జగజ్జనన్యై జగదేకపిత్రే,
నమఃశివాయై చ నమఃశివాయ ॥

ఏతల్లి నాట్యము చే సమస్త ప్రపంచము సృష్టింపఁబడునో, ఎవరినాట్యముచే ఈ ప్రపంచ ప్రళయము సూచింపఁబడునో, ఎవరు జగజ్జననియో, ఎవరు జగత్పితయో, అట్టి ఉమా మహేశ్వరులకు ప్రణామములు.

(1) ప్రదీప్త రత్నోజ్జ్వల కుండలాయై,

స్ఫురన్మహా పన్నగ భూషణాయ |
శివాన్వితాయైచ శివాన్వితాయ,
నమః శివాయైచ నమః శివాయ ॥

ఉజ్జ్వలమైన రత్న కుండలములచే శోభించునదియు, మహాసర్పములే భూషణముగా కలవాడును, శివునియందెల్లప్పుడైక్యమైయున్నదియు, గౌరియందెల్లప్పుడు ఐక్యమైయున్న వాడు-నగు గౌరీశంకరులకు ప్రణామములు.

***శివుడు - శివపూజ***

# శివ కవచము

ఋషభర్షి యువరాజుతో ఇట్లనెను:-

ఓమ్. ఉమా ప్రియుడును, త్రినేత్రుడును, తన బలపరా క్ర-మముతో శత్రువులను నశింపజేయు సహస్రహస్తుడగు శంభువైన నీలకంఠునికి నా ప్రణామములు.

ఇప్పుడు నీ శ్రేయస్సుకొరకు తపస్సులన్నింటి యొుక్క రహ-స్యమును నీకు తెలియఁజేయుదును. దానిచే నీవుపాపములు, దుఃఖములనుండి విముక్తుడవై విజయవంతుడవగుదువు.

సర్వవ్యాపకుడగు ప్రభువును స్తుతించిన అనంతరము, మా-నవుల యోగ క్షేమము నిమిత్తమై శివకవచముయొక్క గూఢార్థమును నేను వెల్లడి చేయుచున్నాను.

ఒక పవిత్రమైన స్థలమునందు నెమ్మదిగా కూర్చుండి, ఇం-ద్రియములను మఱియు ప్రాణములను నిగ్రహించి, అవినాశియగు శివునిఁగూర్చి చింతించవలయును.

సర్వవ్యాపకుడును, ఇంద్రియాతీతుడునగు ఈశ్వరుని హృ-దయపద్మమునందు ప్రతిష్ఠించుకొని, సూక్ష్మమైన అనంతుడైన దేవునిఁ గూర్చి ధ్యానించవలయును

నిరంతర ధ్యానముచే కర్మబంధవిముక్తుడై, పరమానంద మునందు పూర్ణముగా మగ్నుడై "ఓం నమఃశివాయ" యనెడి షడ-క్షర మంత్రముపై హృదయమును జొనిపి, శివకవచమును ధరించి, తన్ను తాను సంరక్షించుకొనవలయును.

## *శివుడు శివపూజ*

.

అగాధమైన, అంధకారబంధురమైన సంసారకూపము నుండి పరమేశ్వరుడు నన్ను ఉద్ధరించునుగాక! మఱియు ఆతని దివ్య-మైన నామముచే నా సమస్త పాపములు నిశ్శేషముగా

నశించునుఁగాక!

సకల రూపములయందున్న వాడును, ఆనంద స్వరూపు డు-ను, సూక్ష్మాతి సూక్ష్మడును, మహాబలశాలియునగు ఈశ్వరుడు సమస్త స్థలములలో నన్ను సమస్త పాపములనుండి విడివడఁ జే-యునుఁగాక!

భూదేవి రూపమునందు విశ్వమున కాధారమైయున్న అష్ట-రూపుడగు శివుడు నన్ను సమస్త భౌతిక క్లేశములనుండి సంరక్షించునుఁగాక! మరియు జలరూపము నందు మానవజాతికి జీవనము నొసంగు దేవుడు నన్ను జలగండమునుండి రక్షించు-నుఁగాక !

కల్పాంతము నందు తాండవ మొనర్చుచు, లోకము లన్నింటిని దహన మొనర్చు కాలాగ్నిరుద్రుడు నన్ను ప్రచండాగ్ని నుండి

మఱియు భయంకరమైన వాయువునుండి రక్షించును(గాక!

విద్యుత్తు మరియు సువర్ణమువంటి ప్రకాశమానుడును, త్రిన-యనుడును, చతుర్వదనుడునగు శివుడు నన్ను తూర్పుదిక్కునందు రక్షించును(గాక! మఱియు గొడ్డలి, వేదము, కొక్కెము, జా-రుముడి, త్రిశూలము, జపమాలలను చేతులలో ధరించిన వాడును; వర్షించుచున్న మేఘమువలె నల్లని మరియు మెఱుపు వర్ణముకలవాడు నగు శివుడు నన్ను దక్షిణదిక్కునందు సంరక్షిం-చును(గాక !

## *శివుడు - శివపూజ*

మల్లెపువ్వు, చంద్రుడు, శంఖము, స్ఫటికమువలె పరి శుద్ధు-డును, నిష్కళంకుడును, తనహస్తములలో వేదములను మఱియు జపమాలను ధరించువాడును అగు శివుడు నాకు వరములను మఱియు నిర్భయత్వమును ప్రసాదించి నన్ను పశ్చిమ దిక్కునందు రక్షించును(గాక! మఱియు వికసించు పద్మమునందు కేస-రమువలె భాసించు శివుడు నన్ను ఉత్తరదిశయందు సంరక్షించును(గాక !

పంచవక్త్రుడును, స్ఫటికమువలె పరిశుద్ధుడు మరియు పార-దర్శకుడును, జారుముడి, కొక్కెము, గొడ్డలి, తలపుర్రె, డమరు, త్రిశూలము, వేదములు మరియు జపమాలను చేతులలో

ధరించి అభయమునొసంగుచు శివుడు నన్ను ఊర్ధ్వమునందు రక్షించునుగాక !

చంద్రమౌళి నాతలను రక్షించునట్లును, ఫాలనేత్రుడు నా-

నుదురును కాపాడునట్లును మఱియు కామారి నా నేత్రములను సంరక్షించునట్లును నేను ప్రార్థించుచున్నాను.

వేదములలో సుప్రసిద్ధుడును, చేతిలో తలపుర్రెను ధరించు వాడునగు విశ్వనాథుడు నా ముక్కు, చెవులు మఱియు తలపుర్రె-ను రక్షించుటకై నేను పూజించుచున్నాను.

వేదవక్తుడును, పంచముఖుడునగు శివుడునాముఖమును మరియు నాలుకను రక్షించునుగాక! పినాకపాణియగు నీలకంఠు-డు నాకంఠమును మఱియు హస్తములను రక్షించును గాక !

దక్షయజ్ఞ విధ్వంసకుడును, రూపముఁ దాల్చిన ధర్మము వంటి బాహువులు కలవాడునగు దేవుడు నా వక్షస్థలమును



మఱియు బాహువులను రక్షించి అపాయమును, దౌష్ట్యము-ను నివారించునుఁగాక !

కామారియు, పర్వతమునే విల్లుగా ధరించు వాడునగు ధూర్జ-టి నాతుంటిని, నడుమును, ఉదరమును, నాభిని రక్షించునుఁగాక !

కరుణా సాగరుడగు శివుని రక్షణకై నా తొడలను, మోకాళ్ళను మరియు పాదములను సమర్పించితిని.

ప్రథమప్రహరమునందు మహేశుడు నన్ను రక్షించును గాక! ద్వితీయ ప్రహరమునందు వామదేవుడు, తృతీయ ప్రహరము నందు త్రిలోచనుడు, చతుర్థప్రహరమునందు వృషకేతువు నాకు రక్షకులై యుందురుఁగాక !

సాయంకాలమునందు శశిశేఖరుడు నా దౌష్ట్యములను దు-
నుమాడునుఁగాక ! గంగాధరుడు మధ్యరాత్రియందును, గౌరీ పతి ప్రాతఃకాలము నందును, మృత్యుంజయుడు సర్వవేళల యందు-
ను నా దురితములను దూరమొనర్తురుఁగాక !

నేనులోన ఉన్నప్పుడు శంకరుడు నన్ను రక్షించునుఁగాక! బయట ఉన్నపుడు స్థాణువు, మధ్య ఉన్నప్పుడు పశుపతి మఱి-
యు సదాశివుడు అన్ని స్థలములలోను నాకు రక్షకులైయుందురుగాక!

నేను కూర్చున్నప్పుడు వేద వేద్యుడు, నేను నడచుచు న్న-
ప్పుడు ప్రమథగణాధిపతి మఱియు నేను విశ్రమించునప్పుడు విశ్వపాలకుడు నన్ను పరిపాలింతురుఁగాక !

## *శివుడు శివపూజ*

త్రిపురారియైన నీలకంఠుడు పర్వత శిఖరములలోను, లో-
తైన లోయలలోను నాకుఁగల భయములను, అపాయములను

తొలగించునుఁగాక !

నేను దట్టమైన అరణ్యములలో పయనించునప్పుడు, క్రూర-
మైన వన్యమృగముల బారినుండి సర్వశక్తిమంతుడైన ఈశ్వరుడు నన్ను రక్షించునుఁగాక !

కల్పాంతమునందు యమునివంటి భయంకర స్వరూప మును ధరించువాడును, భయంకరమైన తన నవ్వుచే లోకములను కం-
పింపఁ జేయువాడును, దారుణమైన శత్రువుల భయమును

నివారించువాడునగు వీరభద్రుని నేను హృదయ పూర్వకముగా ప్రార్థించుచున్నాను.

కాల్బలము, తురగములు, రథములు, ఏనుగులనెడి చతుర్వి-ధవ్యూహములుగా అమర్పఁబడియున్న శత్రు సైన్యమును తన దారుణమైన ఖడ్గతలముచే తుత్తునియలు చేయు దేవుని నేను పూజింతును.

ప్రభువుయొక్క త్రిశూలమునుండి ఉత్పన్నమైన అగ్నిచే పరమ దుర్మార్గులు బూడిదయగుదురుఁగాక ! మరియు ఆతని వి-ల్లు, పినాకములచే పులులు, సింహములు, ఎలుగుబంట్లు భయకంపితమగునుఁగాక !

దుస్స్వప్నములు, దుశ్శకునములు, మానసిక మరియు శారీరిక బాధలు, నానావిధములగు తాపములచే జనించు దౌష్ట్యముల-నుండి ఈశ్వరుడు నన్ను రక్షించునుఁగాక!

## *శివుడు శివపూజ*

పరమ సత్యస్వరూపుడును, యజ్ఞయాగాది క్రతుస్వరూ పుడును, సత్యజ్ఞానాతీతుడును, బ్రహ్మ మఱియు రుద్రుని అవతారము-న్నూ, సూర్యచంద్రాగ్నులే నేత్రములుగా కలవాడును, భస్మలేపిత శరీరుడును, మణులు, ముత్యములచే పొదగంబడిన కిరీటమును ధరించువాడును, విశ్వము యొక్క సృష్టిస్థితి ప్రళయముల నొన-ర్చు వాడును, దక్షయజ్ఞ విధ్వంసకుడును, కాలతరంగ హంతయు, మూలాధారవాసియు, జ్ఞానభూమికల నతిక్రమించినవాడును, తన మస్తకమునందు గంగను ప్రతిష్ఠించు కొన్నవాడును, సర్వజీవవ్యా-పకుడును, షడ్గుణసమేతుడును, దార్శనిక సత్యమునకు సారస్వరూపుడును, ధర్మార్థకామములను సాధింపఁజేయు- వాడు-

ను, లోకనాథుడును, కంఠమునందష్ట సర్పరాజములను ధరించువాడును మఱియు సాక్షాత్ప్రణవ స్వరూపుడునగు సదాశివునికి నేను సాష్టాంగముగా ప్రణమిల్లు చున్నాను.

చైతన్యఘనస్వరూపుడును, దిక్కులు మరియు ఆకాశమే రూపముగాఁగలవాడును, గ్రహములు, నక్షత్రములనెడి మాలను ధరించినవాడును, పరిశుద్ధుడును, నిష్కళంకుడును, సమస్తలోక సంరక్షకుడును, సమ స్తవిశ్వమునకు సాక్షి స్వరూపుడును, సమస్త వేదములకు, పరమ రహస్యమైన వాడును, దర్శనము లన్నింటికి అతీతుడును, తన భక్తులకు వరముల నొసంగు వాడును మఱియు బీదవారిని, అజ్ఞానులను అనుగ్రహించువాడునగు దేవదేవుని నేను స్తుతించుచున్నాను.

## శివుడు శివపూజ

పరిశుద్ధుడును, ఆనంద స్వరూపుడును, మోహము, పేరాస, చింతలులేనివాడును, దోషరహితుడును, గుణవివర్జి తుడును, వ్యాధి, వాంఛ, అహంకారము, సంగములేనివాడును, సర్వవ్యాపకుడును, అనంతుడును, శాశ్వతుడును, కార్యకారణ బంధమునకతీతుడును, సుఖదుఃఖములు, గర్వాహంకారములు, ఆడంబరము, భయము, అపాయములు ఎవ్వనియందణగి నశించునో అట్టి కరుణానిధియగు పరమేశ్వరుని నేను ప్రార్థించు చున్నాను.

శుద్ధ చైతన్య స్వరూపుడును, ఎవ్వనియందు సంశయములు నివారింపఁబడి, కర్మలు నిశ్శేషమగునో, కాలము, నాశమువంటి

సమస్తమైన మార్పులకెవ్వడతీతుడో, ఎవ్వడు పరిపూర్ణుడు, పరిశు-
ద్ధుడు, మునిపుంగవుడు మరియు శాశ్వతుడో, ఎవ్వడు సచ్చిదానంద స్వరూపుడో, చెప్పనలవికానివాడెవ్వడో, ఎవ్వడు ప్ర-
కాశస్వరూపుడో, శ్రేయస్సునొసంగువాడెవ్వడో, అనంతమైన అందమును, మోక్షానందము నొసంగు వాడెవ్వడో, అట్టి జీవుని నే-
ను పూజించుచున్నాను. ఓ ప్రభూ! నీకు విజయము కలుగునుం గాక! నీవు రుద్రుడు, రౌద్రుడు మరియు భద్రునియొక్క అవతార-
మైయున్నావు. నీవు మహాభైరవుడవు, కాలభైరవుడవు. నీవు తలపుర్రెలమాలలనుధరింతువు. మరియు నీ హస్తములలో ఖట్వాంగము. ఖడ్గము, చర్మము, జారుముడి, కొక్కెము, డమరు, త్రిశూలము, విల్లు, బాణము, గద, శక్తి మున్నగు దివ్యాయుధము లను ధరించియున్నావు. ఓ సహస్రముఖుడవైన దేవా! నీ భయం-
కరమైన దంతములను చూచుటకు భయము కలుగును. మరియు పెళ పెళమనెడి నీ నవ్వు సమస్త లోకములను భేదించును. సర్ప-
ములే నీకు

## *శివుడు - శివపూజ*

చెవిపోగులు, మాలలు మరియు కంకణములై యున్నవి. నీవు నీ శరీరమునందు ఏనుగు చర్మమును ధరింతును. నీవు మృత్యుం-
జయుడవు, త్రిపుర సంహారివి మరియు త్రినేత్రధారివైన దేవుడవు.

ఓ శంభూ! నీవే సమస్తము, సర్వవ్యాపకుడవు. శాంతి స్వరూపుడ-
వు, మునివి మరియు పరమానందదాయకుడవు. నీవు నిశ్చయముగా వేదము మరియు వేదాంత ప్రతిపాదితమగు బ్ర-
హ్మమైయున్నావు. నీవు సర్వవ్యాపకుడవు, పురాతనుడవు మరియు శాశ్వతుడవు. ఓ ప్రభూ! నన్ను రక్షించుము. అకాల మరణము

మరియు అపాయములవలన కలుగు నా భయమును తొలగించుము. నీ శూలము చే నాశత్రువులను నశింపఁజేసి, నీ ఖడ్గతలముచే వారిని దునుమాడుము. భేతాళ, కూష్మాండ సమూహములను బాణము మరియు విల్లుచే భయకంపితమ నర్చుము. ఘోరమైన నరకమునందు పతనము కాకుండునట్లు నన్ను కాపాడుము. మరియు నాకు స్వాతంత్ర్యమును, నిర్భయత్వమును ప్రసాదించుము. నీకవచముచే నన్ను ఆచ్ఛాదించి, ఎల్లప్పుడు నన్ను రక్షించుము. నేను బీదవాడను, బలహీనుడను, నిస్సహాయుడను మరియు విధేయుడనై యున్నాను. నేను సమస్తమును నీ చరణ కమలములయందు సమర్పించి, నీకు శరణాగతుడనైతిని. కేవలము నీవే నాకు దిక్కు మరియు సంరక్షకుడవు. ఓ ప్రభూ! సదాశివా! మృత్యుంజయా! త్ర్యంబకా! నీకు మరల మరల నమస్కారములు.

ఋషభుడిట్లు పలికెను :- ఇట్లువరముల నొసంగునదియు, సమస్తకోరికలను సిద్ధింపఁజేయునదియు మరియు సమస్తదుః



ఖముల నుండి, బాధలనుండి నివర్తింపఁజేయునగు శివకవచము యొక్క రహస్యమును నేను వివరించితిని.

ఎల్లప్పుడీ శివకవచమును ధరించినవాడు సమస్త భయములు, అపాయములు, పతనములనుండి విముక్తుడై శివుని దివ్యానుగ్రహము నొందును.

మానవుడు దీర్ఘకాలవ్యాధులనుండి మరియు మృత్యు ముఖము

నుండి విడివడి, దీర్ఘజీవనమును మరియు శాశ్వతా నందము నొందును.

ఈ శివకవచము దౌష్ట్యమూలమును ఖండించి, శాంతి సౌఖ్య-ములను మరియు సిరిసంపదల నొసగును.

మానవుడు తుట్టతుదకు సమస్త పాపములు మరియు ఆటంక-ములనుండి విడివడి, కవచముయొక్క మహాబలముచే ఆనంద దాయకమగు మోక్షధామమునొందును.

కావున ఓ బాలుడా! నీకు సుహానందము నొసంగునట్టి నాచే ఒసంగఁబడిన ఈ కవచమును పూర్ణశ్రద్ధగల వాడవై ధరించుము.

సూతుడిట్లనెను:- ఋషభర్షి ఇట్లుపలికి యువరాజునకు అనతి-కాలములోనే తన శత్రువులను జయించునట్టి బృహచ్ఛంక మును మరియు బలమైన ఖడ్గమునొసంగెను,

అప్పుడాతడా యువరాజుపై పంద్రెండువేల ఏనుగుల బలము నొసంగునట్టి పవిత్రమైన భస్మమును చల్లి, దివ్యమైన స్పర్శ నొ-సంగెను.

## *శివుడు శివపూజ*

ఇట్లు బలమును, శక్తిని, ధైర్యమును పొందిన యువరాజు శర-త్కాల భాస్కరునివలె ప్రకాశించెను.

మునిమరల ఆతనితో ఇట్లు పలికెను :- నాచే ఒసంగఁ బడిన ఈ ఖడ్గము పవిత్ర మైన మంత్రములచే పునీత మొనర్పఁ బడినది. కేవలము దీని దర్శనముచే శత్రువు విగత జీవుడగును. స్వయ-

ముగా మృత్యుదేవత భయకంపితమై కాలికి బుద్ధి చెప్పును.

ఈ శంఖముయొక్క పిడుగువంటి ధ్వనిని విని, శత్రువులు చైతన్యరహితులై, తమ ఆయుధములను క్రిందపడవేసి, పతనమగుదురు.

ఈ రెండు ఆయుధముల చే శత్రుసైన్యము నశించి, నీ సైన్యమునకు ధైర్యము చేకూరును.

ఈ యాయుధద్వయముచే నీవు శివకవచముచే కప్పఁ బడిన వాడవై, నీ శత్రువులను నశింపఁజేయఁగలుగుదువు. నీవు నీపైతృకరాజ్యమును పొంది, ఈ భూతములను ఉత్కృష్టముగా పరిపాలింపఁగలుగుదువు.

ఋషీశ్వరుడు ఇట్లాతనిని ఓదార్చి, ఆశీర్వదించి, ఆతనిచే గౌరవసన్మానములను పొందినవాడై బయల్వెడలెను.

***శివుడు - శివపూజ***

# సర్వలింగస్తవము

(1) ఓ ఓంకారేశ్వర, ఉమామహేశ్వర,
రామేశ్వర, త్ర్యంబకేశ్వర

మహాబలేశ్వర, మహాకాళేశ్వర, ముక్తేశ్వర,
ఓంనమఃశివాయ ॥

(2) ఓ జంబు కేశ్వర, కాళహస్తీశ్వర,
తారకేశ్వర, పరమేశ్వర,
నర్మదేశ్వర, నాగేశ్వర. నంజుండేశ్వర,
ఓంనమఃశివాయ ||

(3) ఓ అర్ధనారీశ్వర, కపాలీశ్వర,
బృహదీశ్వర, భువనేశ్వర, కుంభేశ్వర,
వృద్ధాచలేశ్వర, ఏకాంబరేశ్వర,
ఓం నమఃశివాయ ||

(4) ఓ కైలాసపతే, పశుప తే,
గౌరీపతే, పార్వతీపతే,
ఉమాపతే, శివకామీపతే,
ఓం నమఃశివాయ ||



(5) ఓ విశ్వేశ, త్యాగేశ, సర్వేశ,
సుంద రేశ, మహేశ, జగదీశ,
ఘుసృణేశ, మాతృభూతేశ,
ఓం నమః శివాయ ||

(6) ఓ కైలాసనాథ, కాశీనాథ,
కేదారనాథ, ముక్తినాథ,
అమరనాథ, పశుపతినాథ,
ఓం నమః శివాయ ||

(7) ఓ కాశీవిశ్వనాథ, కంచినాథ,
సోమనాథ, బైజ్యనాథ, వైద్యనాథ
తుంగనాథ, త్రిలోకినాథ,
ఓం నమఃశివాయ ||

(8) ఓ కాల భైరవ, త్రిపురాంతక,
నీలలోహిత, హరోహర,
శివశంభో, శంకర సదాశివ,
ఓం నమఃశివాయ ||

(9) ఓ మహా దేవ, మహా కాళ,
నీలకంఠ, నటరాజ, చంద్రశేఖర,
చిదంబరేశ, పాపవిమోచక,
ఓం నమఃశివాయ ||



(10) ఓ హలస్యసుందర, మీనాక్షి సుందర,
కళ్యాణ సుందర, కదంబవన సుందర,
శ్రీశైలవాసా, వీరభద్ర,

ఓం నమః శివాయ ||

(11) ఓ గౌరీ శంకర, గంగాధర,
దక్షిణామూర్తే, మృత్యుంజయ,
ఓం నమో భగవతే రుద్రాయ,
ఓం నమఃశివాయ ||

(12) ఓ కైక్కటప్ప, తిరువొనియప్ప,
చిత్తాంబల, పొన్నాంబల,
చిత్సభేశ, చిదంబరేశ,
ఓం నమ:శివాయ ||

(13) ఓ కామదహన, బ్రహ్మశిరచ్ఛేద,
కూర్మ - మత్స్య - వరాహస్వరూప,
వీర భైరవ, వృషభారూఢ,
ఓం నమఃశివాయ ||

(14) ఓ కాలాంతక, మల్లికార్జున,
అరుణాచల, నందివాహన,
భిక్షాదాన, భక్తరక్షక,
ఓం నమః శివాయ ||

***శివుడు - శివపూజ***

(15) ఓ భీమశంకర, భస్మాధార,
పన్నగభూషణ, పినాకధారి,

త్రిలోచన, త్రిశూలపాణే,
ఓం నమః శివాయ ||

(16) ఓ హరా! నీమహిమ నెవరు వర్ణింపగలరు?
శ్రుతియు "నేతి నేతి" యని పలుకునయ్య,
నీవే పరబ్రహ్మము కదయ్య,
శుభంకరుడవు నీవేనయ్య,
ఓం నమః శివాయ ||

(17) ఓ త్రిపుర సంహర్తా,
నామౌనమైన స్తుతులు నీకు,
నీవు ప్రళయాగ్ని రుద్రుడవయ్య,
నీవు అమృతత్వ ప్రదాతవయ్య,
ఓం నమఃశివాయ ॥

(18) నందివాహనుడవు నీవయ్య,
పులి చర్మమే నీకు దుస్తులయ్య,
త్రిశూలము, డమరు, గొడ్డలి
నీకు ఆయుధములగునయ్య,
ఓం నమఃశివాయ ॥

***శివుడు - శివపూజ***

(19) సర్పమే నీకు భూషణమయ్య,

భస్మలేపితుడవు నీవయ్య, శివుడు – శివపూజ
గంగ నీ మస్తకమునుండి పడునయ్య,
చంద్రుడు నీకు చూడామణి యగునయ్య,
ఓం నమఃశివాయ ॥

(20) దక్షిణామూర్తిగ నీవవతరించితివయ్య,
మౌనము, చిన్ముద్రల మూలమున మామయ్య,
బ్రహ్మజ్ఞానము నుపదేశించివి నీవు,
సనకసనందాదులకయ్య,
ఓం నమఃశివాయ ॥

(21) నీ రూపము వైరాగ్యమును నేర్పునయ్య,
నీవు జ్ఞాన స్వరూపుడవయ్య,
నాట్యమునకు నీవు పేరుగాంచితి వయ్య,
"అగడభం" అని నీవు పాడుదువయ్య,
ఓం నమః శివాయ ॥

(22) నీవు జ్యోతిరూపమును ధరించితినయ్య,
నిన్ను కొలుచుటకు బయలుదేరినట్టి
బ్రహ్మవిష్ణువులు ఓడిపోయిరయ్య,
నీవు అనంతుడవు, శాశ్వతుడవయ్య,
ఓం నమః శివాయ ॥

## ***శివుడు - శివపూజ***

(23) మార్కండేయుని, మాణిక్యవాచకరుని రక్షించితివయ్య,

కన్నప్పను, తిరునవక్కరసును, జ్ఞానసంబంధరును,
సుందరేశ్వరుని, అప్పరుని మఱియు
పట్టినాథడియారును ఆశీర్వదించితివయ్య,
ఓం నమఃశివాయ ॥

(24) నీవు కరుణా సముద్రుడవయ్య,
నీవు వర ప్రదాతవయ్య,
అర్జునుని, బాణుని ఆశీర్వదించితివయ్య,
విషపానమొనర్చి లోకమును రక్షించితివయ్య,
ఓం నమఃశివాయ ||

(25) కామదహన మొనర్చితివి నీవయ్య,
నీవే గంగకు మఱియు
సుబ్రహ్మణ్యునికి తండ్రివయ్య,
దక్షుని శిరచ్ఛేదకుడవు నీవయ్య,
ఓం నమఃశివాయ ॥

(26) త్రిపుర సుందరి, రాజరాజేశ్వరి,
గౌరి, చండీ, చాముండి,
దుర్గ, అన్నపూర్ణ దేవీలు
నీకు శక్తులు మాయయ్య,
ఓం నమఃశివాయ ॥

## ***శివుడు - శివపూజ***

(27) తలపుర్రెల మాలను ధరింతువయ్య,

నీ జటాబంధమే గంగకు స్థానమయ్యా,
నీవు స్మశానమునందు వసింతువయ్యా,
నీవు భయంకరమైన మహాకాలుడవయ్యా,
నీవు మృత్యువుకే మృత్యువగుదువయ్యా,
ఓం నమఃశివాయ ||

(28) నీవు హరికి భక్తుడవయ్యా,
గంగను నీ తలలో ధరింతువయ్యా,
అది హరిపాదములనుండి పారునయ్యా,
నీవు కాశీలో రామతారకము నుపదేశింతువయ్యా,
ఓం నమఃశివాయ ||

(29) రామేశ్వరములో రాముడు నీకు చెప్పెనయ్యా,
శబ్దములో నీవు సదాశివుడవయ్యా,
హృదయములో నీవు ఆత్మలింగుడవయ్యా,
వేదములలో నీవు ప్రణవరూపుడవయ్యా,
ఓం నమఃశివాయ ||

(30) ఓ హరా! ఓ దేవా! ఓ శివా!
నీకు మరల మరల ప్రణామములయ్యా,
ఎల్లప్పుడు నిన్నే నేనుతలంతునుగాక!
ఎల్లప్పుడు నీయందే నేను వసింతునుగాక !
ఓం నమఃశివాయ ||

**శివుడు - శివపూజ**

(31) నిష్కామున్ని, నిర్భయుని, నిరహంకారునిగ మార్చుమయ్య,
నీపంచాక్షరమును సదాజపించునట్లు చేయుమయ్య,
నిన్ను సర్వత్రఁగాంచఁగల్గునట్లు చేయుమయ్య,
నీలో నేను ఐక్యమగునట్లొనర్పుమయ్య,
ఓం నమఃశివాయ ||

(32) ఈ సర్వలింగ స్తవమును ప్రాతఃసాయంసమయములలో,
ఎవ్వడు శ్రద్ధ, భక్తిభావముతో పఠించునో,
ఆతని సమస్త పాపములు, వ్యాధులు నివారణమగునయ్య,
అష్టైశ్వర్య, భక్తి, భుక్తి, ముక్తులనొందునయ్య,
ఓం నమః శివాయ ||

## శివుని లక్షణములు

(1) అద్వైత, అఖండ, అకర్త, అభోక్త,
అసంగ, అశక్త, నిర్గుణ, నిర్లిప్త,
చిదానందరూపః శివోహం శివోహమ్ ॥

(2) అవ్యక్త, అనంత, అమృత, ఆనంద,
అచల, అమల, అక్షర, అవ్యయ,
చిదానందరూపః శివోహం శివోహమ్ ॥

(3) అశబ్ద, అస్పర్శ, అరూప, అగంధ,
అప్రాణ, అమాన, అతీంద్రియ, అదృశ్య,
చిదానందరూపః శివోహం శివోహమ్ ॥

(4) సత్యం, శివం, శుభం, సుందరం, కాంతం,
సచ్చిదానంద, సంపూర్ణ, సుఖ, శాంతం,
చిదానందరూపః శివోహం శివోహమ్ ॥

(5) చేతన, చైతన్య, చిదన, చిన్మయ,
చిదాకాశ, చిన్మాత్ర, సన్మాత, తన్మయ,
చిదానందరూపః శివోహం శివోహమ్ ॥

(6) అమల, విమల, నిర్మల, అచల,
అవాఙ్మనసగోచర, అక్షర, నిశ్చల,
చిదానందరూపః శివోహం శివోహమ్ ॥

(7) నిత్య, నిరుపాధిక, నిరతిశయానంద,
నిరాకార, హ్రీంకార, ఓంకార, కూటస్థ,
చిదానందరూపః శివోహం శివోహమ్ ॥

(8) పూర్ణ పర బ్రహ్మ, ప్రజ్ఞాన, ఆనంద,
సాక్షి, ద్రష్ట, తురీయ, విజ్ఞాన ఆనంద,
చిదానంద రూపః శివోహం, శివోహమ్ ||

(9) సత్యం, జ్ఞానం, అనంతం, ఆనందం,
సచ్చిదానంద, స్వయంజ్యోతి ప్రకాశం,
చిదానంద రూపః శివోహం శివోహమ్ ॥

(10) కైవల్య, కేవల, కూటస్థ, బహ్మ,
శుద్ధ, సిద్ధ, బుద్ధ, సచ్చిదానంద,
చిదానంద రూపః శివోహం శివోహమ్ ||

(11) నిర్దోష, నిర్మల, విమల, నిరంజన,
నిత్య, నిరాకార, నిర్గుణ, నిర్వికల్ప,
చిదానంద రూపః శివోహంశివోహమ్ ||

(12) ఆత్మ, బ్రహ్మస్వరూప, చైతన్యపురుష,
తేజోమయానంద "తత్త్వమసి" లక్ష్య,
చిదానంద రూపః శివోహం, శివోహమ్ ॥

(13) సోహం, శివోహం, అహం బ్రహ్మాస్మిమహావాక్య,
శుద్ధ, సచ్చిదానంద, పూర్ణ పర బ్రహ్మ,
చిదానంద రూపః శివోహం శివోహమ్ ॥

# ఉత్కృష్టమైన దృష్టి

# I

(1) కరుణ, ప్రేమ, ఆనందసముద్రుడగు దేవుని,
నాహృదయములోని పరంజ్యోతిని,
సంబంధర్, అప్పర్లకు భోజనమిడిన దేవుని,
ఋషుల స్థానమునందు నేనుఁగాంచితిని.

(2) యోగులకు లక్ష్యమైన మహా-సనాతనుని,
పురియందు వెలసిన పరమపురుషుని,
వేదములు గానమొనర్చు ఆదిదేవుని,
ఋషుల స్థానమునందు నేనుఁగాంచితిని.

(3) బ్రహ్మ, విష్ణువులను భంగపుచ్చిన జ్యోతిర్లింగమును,
మార్కండేయుని రక్షించిన దయాసముద్రుని,
పాండ్య రాజుచే దెబ్బలుతిన్న మధురై దేవుని,
ఋషుల స్థానము నందు నేనుఁగాంచితిని,

(4) నాలుగింటిని నేర్పినట్టి పరమగురువును,
ఐదురూపములనుఁ దాల్చిన ఆది దేవుని,
పరమ, వ్యూహ, విభవ, అర్చ, అంతర్యామిని,
ఋషుల స్థానము నందు నేనుఁ గాంచితిని.

***శివుడు - శివపూజ***

(5) విశ్వమంతటా వ్యాపించియున్న దేవుని,
ఆత్మకు సూత్రమైయున్న సూత్రాత్మను,
శ్రుతులకు లక్ష్యమైయున్న పరమాత్మను,
ఋషుల స్థానము నందు నేనుగాఁచితిని.

(6) త్రికమున కతీతమైయున్న తేజస్సును,
ప్రళయానంతరమున్నూ ఉనికిఁగలవానిని,
కన్నప్పను, సుందరర్ను రక్షించిన వానిని,
ఋషుల స్థానమునందు నేనుఁగాంచితిని.

(7) విషము త్రాగి విశ్వమును రక్షించిన దేవుని,
చిదంబరములో నాట్యమొనర్చినవానిని,
జ్యోతిర్లింగముగా ప్రకాశించినవానిని,
ఋషుల స్థానమునందు నేనుఁ గాంచితిని.

(8) పాండ్యునికి నక్కగుఱ్ఱములను తెచ్చిన దేవుని,
సంబంధర్ కు ముత్యపుపల్లకిని ఇచ్చిన దేవుని,
పంచాక్షరమునకు సారమైయున్న దేవుని,
ఋషుల స్థానమునందు నేనుఁ గాంచితిని.

(9) కాశీలోను, వేదములోను, నివసించు దేవుని,
రామేశ్వరం, అరుణాచలం, కంచిలోని దేవుని,
జీవులందరి హృదయమునందుండు దేవుని,
ఋషుల స్థానము నందు నేనుఁ గాంచితిని.

(10) దారుమి తరఫున వ్యాజ మొనర్చిన దేవుని,
కైలాసములో ఉమాసమేతుడైయున్న దేవుని,
సుందరర్ కు కంటిదృష్టిని ఇచ్చిన దేవుని,
ఋషుల స్థానమునందు నేనుఁగాంచితిని.

## II

(11) గుడ్డిఅప్పర్కు కళ్లనిచ్చిన దేవుని,
సుందరర్ కు భిక్షమిచ్చిన దేవుని,
అప్పయ్య దీక్షితర్కు మార్గబంధువైన దేవుని,
ఋషుల స్థానమునందు నేనుఁగాంచితిని.

(12) పరవైకి సందేశ మొసంగిన దేవుని,
దారుమికి పద్యముఁవ్రాసి ఇచ్చిన దేవుని,
సర్కిరర్' ను కాల్చి వేసినట్టి దేవుని,
ఋషుల స్థానమునందు నేనుఁ గాంచితిని.

(13) మధురైలో కూలీపని చేసిన దేవుని,
వరదలనాపుటకై మట్టిని మోసిన దేవుని,
చిన్నని మిఠాయి ముక్కను తిన్నట్టి దేవుని,
ఋషుల స్థానమునందు నేనుఁగాంచితిని.

(14) భక్తునికై చెరువును, తోటను కట్టిన దేవుని,
తన భక్తులకు బానిసయై నట్టి దేవుని,
సంబంధర్కు ముత్యాలపల్లకి నంపిన దేవుని,
ఋషుల స్థానమునందు నేనుగాంచితిని.

(15) అర్జునునితో జగడమాడిన వేట కానిని,
శంకరునితో వాదమొనర్చిన చండాలుని,
పాండ్యుని కై గుఱ్ఱాలను తెచ్చినవరుని,
ఋషుల స్థానమునందు నేను గాంచితిని.

(16) వామ భాగమునందు ఉమయున్న దేవుని,
పాలసముద్రములోనున్న నారాయణుని,
మఱియాకుపై నిద్రించుచున్న బాలుని,
ఋషుల స్థానమునందు నేనుఁగాంచితిని.

(17) పవిత్రమైన, పురాతనమైన దేవుని,
జ్యోతియందున్న పరంజ్యోతిని,
దేవతలు, ఋషులచే స్తుతింపఁబడు దేవుని,
ఋషుల స్థానమునందు నేనుఁగాంచితిని.

(18) చిదంబరములో అంబల మైయున్న దేవుని,
అరుణాచలములోని తేజోమయ దేవుని,
రూపములలో దాగియున్న మహాచోరుని,
ఋషుల స్థానమునందు నేనుఁగాంచితిని.

(19) చిదాకాశముగా వెలుగొందు సద్గురువును,
బంధత్రయమును ఛేదించుదేవుని,
ముముక్షువులను మోక్షమార్గమున చేర్చు దేవుని,
ఋషుల స్థానమునందు నేనుగాంచితిని.

(20) సహస్రారమునందు వసించు దేవుని,
మార్గ ము, లక్ష్యము,కేంద్రమైయున్న దేవుని,
మహా వాక్యములోని సత్యస్వరూపుని,
ఋషుల స్థానమునందు నేనుఁ గాంచితిని.

## నటరాజునుఁ గూర్చిన పాట

**శివాయ నమ ఓం శివాయనమః |**

**శివాయ నమ ఓం నమఃశివాయ ||**

(1) చిదంబర వాసా నట రాజా,
తిల్లై అంబలం నటరాజా,
భువనేశ్వరికి, రాజరాజేశ్వరికి,
శివ కామసుందరికి ఇష్టమైనవాడా ।
పాపనాశకా, ఐశ్వర్య దాయకా,
కష్టనివారకా, అమృతప్రదాయకా,

శివాయనమ ఓం శివాయ నమః
శివాయ నమ ఓం నమఃశివాయ

(2) త్రిశూలపాణీ, నీలకంఠా,
యోగీశ్వరా, మార్తాండ పరిపాలకా,
కైలాసనాసా, నందివాహనా,
కామదహనా, సిద్ధిదాయకా ।
త్రినేత్రధారీ, పంచముఖశివా,
గరళకంఠా, దేవదేవా,
శివాయనమ ఓం శివాయ నమః
శివాయ నమ ఓం నమఃశివాయ ॥

(3) నీవే నాగురువువు, నీవే నాశరణ్యము,
ఓ దయాసముద్రా, వందనముదేవా,
నీ కరుణావృష్టియే నా కాశీర్వాదము,
కనికరమైన నీమోమును నాకు చూపుము ।
నీలో నన్ను సదానివసింపనిమ్ము,
ఇదియే నా హృదయపూర్వక ప్రార్థన,
శివాయనము ఓం శివాయ నమః
శివాయ నమ ఓం నమఃశివాయ

# శివుని మహిమ

ఓమ్. జగత్పతి, జగద్గురువు, అహంకారము - మోహము - క్రోధ-ములనెడి త్రిపురములను సంహరించినవాడును, ఉమాశంకరుడును, గౌరీశంకరుడును, గంగాశంకరుడును, జ్యోతి-ర్మయుడును, చిదానందమయుడును, యోగీశ్వరుడును, జ్ఞాననిధియు, మహాదేవుడు, శంకరుడు, హరుడు, శంభు, సదాశివు-డు, రుద్రుడు, శూలపాణి, భైరవుడు, ఉమామహేశ్వరుడు, నీలకంఠుడు, త్రిలోచనుడు, త్ర్యంబకుడు, విశ్వనాథుడు, చంద్ర శేఖరుడు, అర్ధనారీశ్వరుడు, మహేశ్వరుడు, నీలలోహితుడు, పర-మశివుడు, దిగంబరుడు, దక్షిణామూర్తి, మున్నగునామములచే పేర్కొనఁబడు శివునికి నేను ముకుళిత హస్తములచే ప్రణమిల్లుచు-న్నాను.

అతడెంతటి కరుణాసముద్రుడు! అహా! ఆతడెంతటి ప్రేమమ-యుడు మఱియు దయామయుడు! ఆతడు తన మెడచుట్టు తన భక్తులయొక్క తల పుఱ్ఱెలమాలను కూడా ధరించును. అతడు త్యాగము, దయ, ప్రేమ మరియు జ్ఞానమునకు నిలయము. ఆతడు సంహారకుడని పలుకుట పొరపాటు. శివుడు నిజమునకు పునరు-ద్ధారకుడు. ఈ జన్మయందీ భౌతికశరీరము వ్యాధిచేతను, వృద్ధాప్యము చేతను, మరి ఏ యితర కారణముచేతను వికాసము నకు పనికిమాలినదైనప్పుడు, ఆతడు శీఘ్రవికాసమునకై నూతన-మైన, ఆరోగ్యప్రదమైన, వీర్యవంతమైన శరీరమునొసంగును. అతడు తన సంతానమునంతటిని తన పాద పద్మములయందు శీఘ్రముగా చేర్చుకొనగోరును. వారి కాతడు తన మహిమాన్వితమైన "శివపదము" నొసంగఁగోరును. హరికంటెను హరుని రంజింపఁ జే-

యుట సులభము. కొద్ది ప్రేమభక్తులు, కొద్దిపంచాక్షర

## శివుడు శివపూజ

జపానుష్ఠానము శివుని రంజింపఁ జేయుటకు చాలును. అతను తన భక్తులకు వరములనిచ్చుటకు సంసిద్ధుడై యుండును. ఆహా! ఆతని హృదయ మెంత విశాలమైనది! అర్జునుడు కొద్ది తపమొనర్చినందుకు ఏలాటి కష్టము లేకుండా అతడు తన పాశుపతాస్త్రము నొసంగెను. భస్మాసురుని కాతడు విలువైన వరము నొసంగెను. తిరుపతికి సమీపమునందున్న కాళహస్తిలో మూర్తియందు ఏడ్చుచున్న కన్నులనుఁగాంచి, తన స్వంత కన్నులను పెరికి అమర్చినట్టి భక్తుడును, వేటకాడునగు కన్నప్ప నాయనార్కు దర్శనమొసంగెను. చిదంబరము నందు అస్పృశ్యుడును, మాలవాడునగు నందనారుకూడా శివుడు దర్శన మొసంగెను. మృత్యుదేవతయగు యముని పాశమునందు బంధింపఁబడిన మార్కండేయుని అమరునిగా నొనర్చుటకై ఆతడు మిక్కిలి వేగముతో పరుగెత్తుకొనివచ్చెను. లంకకు అధిపతియైన రావణుడు తన సామగానముచే శివుని ప్రీతినొందించెను. శివుడు దక్షిణామూర్తి రూపమునందు బ్రహ్మమానసపుత్రులైన సనక, సనందన, సనాతన, సనత్కుమారులకు జ్ఞానోపదేశము నొసంగెను. దక్షిణ భారతములోని మధురైలో సుందరేశ్వరుడు (శివుడు) ఒక బాలుని రూపమును ధరించి వేగైనదిలో ఆనకట్ట కట్టుటకై ఒక భక్తిగల మహిళ వద్ద సత్తు పిండిని కూలీగా తీసుకొని, మట్టిని మోసెను. తనభక్తులపై ఆతనికి గల అనంతమైన దయనుఁగాంచుడు! బ్రహ్మదేవుడు మరియు విష్ణు దేవుడు శివునితలను మరియు పాదములను కనుగొనుటకై బయలు దేరగా, ఆతడు అనంతమైన జ్యోతిర్మయ స్వరూపుడయ్యెను. వారు తమ

ప్రయత్నమునందు విఫలులైరి. ఆహా! ఆతడెంతటి ఘనమైనవా-డు. మఱియు స్వయంజ్యోతి స్వరూపుడై యున్నాడు! దక్షిణభారతదేశములోని పట్టినట్టుస్వామి గృహములో ఆతడనేక



సంవత్సరములు పెంపుడు కొడుకుగా ఉండి, ఈ క్రింది విధముగా వ్రాసి అదృశ్యుడయ్యేను. "నీ మరణానంతరము ఒక విరిగిపోయిన సూదికూడా నీ వెంటరాదు." ఈ వాక్యముయొక్క పఠనము చేపట్టి-నట్టు స్వామికి జ్ఞానోదయ మయ్యేను. శివుని సాక్షాత్కరించు కొనుటకై ఈ క్షణము నుండియే నీవు హృదయపూర్వకముగా ఏల ప్రయత్నింప కున్నావు.

హఠయోగులు మూలాధారచక్రమునందు దాగియున్న కుండ-లినీశక్తిని ఆసన, ప్రాణాయామ, కుంభక, ముద్ర, బంధములచే మేల్కొలిపి, స్వాధిష్ఠాన, మణిపూర, అనాహత, విశుద్ధ, ఆజ్ఞాచక్ర-ములోనికి గొంపోయి, మస్తకమునందున్న సహస్రదళ పద్మమునందున్న శివునితో ఐక్యమొనర్తురు. వారు శివజ్ఞానామృ-తమును పానమొనర్తురు, ఇదియే అమృత స్రావమనఁబడును. శక్తి శివునితో ఐక్యమైనప్పుడు యోగి పూర్ణ సాక్షాత్కారమునుఁబడయు-ను.

శివుడు బ్రహ్మముయొక్క సంహార కార్యమునకు ప్రతీకము బ్రహ్మ-ముయొక్క తమోగుణ ప్రధానమాయయొక్క అంశమే సర్వవ్యాపకుడైన మరియు కైలాసశిఖరవాసియైన ఈశ్వరుడు, లేక శివుడు, ఆతడు జ్ఞానమునకు భాండాగారము వంటివాడు. పార్వతి, కాళి, లేక దుర్గ లేని శివుడే శుద్ధ నిర్గుణ బ్రహ్మము. మాయ (పార్వ-తి)తో కూడియున్నప్పుడు భక్తులు - ఉపాసించుటకై ఆతడు

సగుణబ్రహ్మమగును. శ్రీరాముని భక్తులు శివుని కూడా ఉపాసింపవలయును. రామేశ్వరమునందు రాముడు స్వయముగా శివుని పూజించెను. శివుడు తాపస శ్రేష్ఠుడు, యోగీశ్వరుడు మరియు దిగంబరుడునై యున్నాడు.

## ***శివుడు శివపూజ***

శివుని కుడి చేతియందున్న త్రిశూలము సత్వరజస్తమో గణన సూచించును. అది అతని ఆధిపత్యమునకు చిహ్నము. ఆ త్రిగుణములద్వారా ప్రపంచమునేలును. అతని ఎడమ చేతియందున్న డమరు శబ్దబ్రహ్మమును సూచించును. భాషలన్ని యు దేనినుండి ఉత్పన్నమైనవో, అట్టి ఓం కారమును అది సూచించును. డమరు శబ్దమునుండి ఆతడు సంస్కృత భాషను సృష్టించెను.

శివుడు తన తలపై అర్ధచంద్రుని ధరించుట, ఆతడు మనస్సును పూర్తిగా తన వశమునందుంచుకొనుటను సూచించును. గంగా ప్రవాహము అమృతత్వమనెడి మకరందమును సూచించును. ఏనుగు గర్వమును సూచించును, ఏనుగు చర్మమును ధరించుటచే, శివుడు గర్వమును జయించుటను సూచించును. పులిమోహమును సూచించును. పులి చర్మము పై కూర్చుండుట అతడు మోహమును జయించుటను సూచించును. ఒక చేతియందు జింకను ధరించుట, అతడు మనశ్చాంచల్యమును నిర్మూలించుటను సూచించును. జింక ఒక స్థలమునుండి మరియొక స్థలమునకు వేగముగా గంతులు వేయును. మనస్సు కూడా ఒక పదార్థము నుండి మరియొక పదార్థము వైపు గంతువేయును.

సర్పములను తన మెడచుట్టు ధరించుట, ఆతని జ్ఞానమును మరియు శాశ్వతత్వమును సూచించును. సర్పములు అనేక సం-వత్స రములు జీవించును. ఆతడు త్రిలోచనుడు, భ్రూమధ్యమునందు జ్ఞానమనెడి మూడవ నేత్రమును అతడు కలిగియున్నాడు. శివలింగమున కెదురుగా కూర్చుండు నంది ప్ర-ణవము, లేక ఓం కారమును సూచించును. లింగము అద్వైతమును సూచించును. అది "ఏక మేవాద్వితీయమ్" అను-వాక్యార్థమును సూచించును. ఒక మానవుడు తన కుడి చేతిని శిరస్సుపై కెత్తి, కుడి



చూపుడు వేలును పై కెత్తు నట్లు ఈ లింగము అద్వైతమును సూ-చించును.

టిబెట్ లోని కైలాసపర్వతములు సముద్రతలమునుండి 22,280 అడుగుల ఎత్తు నందుండి, శాశ్వతముగా తెల్లగా మెరయుచున్న మంచుచే కప్పఁబడి, మధ్య భాగము నందు ప్రాకృతిక సౌందర్య-ము చే విరాజిల్లుచున్నవి. కొందఱు 22,028 అడుగుల ఎత్తునందున్నట్లు చెప్పుదురు. ఈ ప్రత్యేక శిఖరము స్వాభావిక-ముగా విరాడ్రూప శివలింగాకారము నందున్నది. ఈశివరూపము దూరమునందుండియే పూజింపఁ బడును. అచ్చట మందిరముఁ-గాని, పూజారిఁగాని, దైనిక పూజగానిలేదు. 1931 జూలై 22వ తేదీన నేను శివుని అనుగ్రహముచే ఈ కైలాసశిఖరమును దర్శింపగలిగి-తిని. సింధు నదియొక్క ఉత్పత్తి స్థానమగు కైలాస శిఖరాగ్రమును కూడా నేను ఎగబోయు శ్వాసతో ఎక్కఁగలిగితిని. అది మిక్కిలి సౌం-దర్యవంతమైన, ప్రేరణదాయక మైన దృశ్యము. కైలాస

పరిక్రమయందున్న ప్రథమ విశ్రామ స్థలమగు దిదీఫగుహ నుండి ఎక్కవలసి యుండును. కైలాస · శిఖరము యొక్క వెనుక భాగము నందున్న మంచుఖండము నుండి సింధునది ఒక చిన్న కాలువ రూపమునందు పెల్లుబుకును. గంగ శివుని మస్తకమునుండి బయ-ల్వెడలునట్లు మనము చిత్రములలోఁగాంచినను, నిజమునకు భౌతికముగా శివుని మస్తకము (కైలాసము) నుండి సింధునది ఉత్పన్నమగును. కైలాస పర్వత పరిక్రమ 30 మైళ్ళుండును. ఈ పరిక్రమకు 3రోజులు పట్టును. దారియందు శాశ్వతముగా మంచు-చే కప్పఁ బడియుండు సుప్రసిద్ధమైన, పవిత్రమైన గౌరీకుండ్ ఏతెంచును. స్నానమొనర్చుటకై నీవు మంచును పగులగొట్టవలసి యుండును.

## శివుడు శివపూజ

నీవు శివ నామమును సవ్యముగను, అపసవ్యముగను, తెలిసి-యు, తెలియకయు, జాగ్రతతోను, అజాగ్రత్తతోను ఏవిధముగా ఉచ్చరించినను అది నీకు వాంఛితఫలము నొసంగును. శివనా-మముయొక్క మహిమను బుద్ధిచేతను, తర్కము చేతను, నిశ్చయింపలేము. అది నిశ్చయముగా భక్తి విశ్వాసముల చేతను, భగవన్నామమును భావపూరితముగా నిరంతరము గానమొన-ర్చుట చేతను తెలియఁబడును. ప్రతి నామమునందు అనంతమైన శక్తులున్నవి. నామముయొక్క శక్తి అవర్ణ నీయము. దాని మహిమ చెప్పనలవికానిది. శివ నామము నందంతర్ని హిత-మైయున్న శక్తి మరియు ప్రభావము అగాధమై యున్నది.

శివ స్తోత్రము మరియు నిరంతర శివనామోచ్చారణచే మనస్సు పరిశుద్ధమగును. స్తోత్రములు శ్రేష్ఠమైన, పరిశుద్ధమైన భావములచే

నిండియుండును. శివగానమునుచ్చరించుటచే మంచి సంస్కారము లలవడును. "యద్భావం తద్భవతి" ఇది మానసిక సిద్ధాంతము. శ్రేష్ఠమైన, పవిత్రమైన భావముల నాలోచించుటకు శిక్షణ ఒసంగఁబడిన మనస్సు సద్భావములనే కలిగియుండును. ఆతని స్వభావము సద్భావనలచే మలచబడును. గానమొనర్పునప్పుడు మనస్సు మూర్తినిఁగూర్చి ఆలోచించు నప్పుడు, మానసిక పదార్థము నిజమునకు ఆమూర్తి రూపమును ధరించును. ఆలోచించిన పదార్థముయొక్క రూపము మనస్సు నందు ముద్రింపఁబడును. ఇదియే సంస్కారమనఁబడును, ఈ కార్యము మరల మరల ఒనర్పఁబడినప్పుడు, సంస్కారములు శక్తి వంతములై మనస్సు నందొక వృత్తి ఏర్పడును. నిరంతరము దివ్యమైన ఆలోచనలను కలిగియుండువాడు దివ్యరూపుడేయ ||గును. ఆతనియొక్క భావము పవిత్రమై దివ్య రూపమునుం దాను. శివునిఁగూర్చి స్తుతించువాడు

## ***శివుడు - శివపూజ***

శివునితో తాదాత్మ్యము నొందును, వ్యష్టిమనస్సు సమిష్టిమనస్సు నందైక్య మగును. శివుని మహిమను గాన మొనర్చువాడు శివుని యందైక్యమగును.

మండెడి పదార్థములను అగ్ని ఎట్లు కాల్చి వేయునో, శివనామము నుచ్చరించువాని పాపములు, సంస్కారములు, వాసనలు దహింపఁబడి, అతనికి శాశ్వతశాంతి మరియు నిత్యానందము సంప్రాప్తించును.

దాహక శక్తి అగ్నియందెట్లంతర్నిహితమై యున్నదో, అట్లే ముముక్షువుయొక్క పాపములను మూలమట్టమొనర్చి, భావ సమాధి

ద్వారా ప్రభువునందైక్య మొనర్చు శక్తి భగవన్నామము నందున్న-
ది.

ఓ మిత్రులారా! శివనామమును శరణుపొందుడు. అతని స్తోత్ర-
ములను పఠింపుడు. నామము మఱియు నామి అభిన్న ములు. నిరంతరము శివునిస్తుతులను గూర్చి గానమొనర్పుడు. ఉచ్ఛ్వాస నిశ్శ్వాసలలో భగవన్నామమును జ్ఞప్తి యందుం చుకొనుడు. ఈ కలియుగమునందు నామస్మరణము దేవుని చేరుటకు మరియు అమృతత్వమును, శాశ్వతానందము నొందుటకు సులభమైన, శీ-
ఘ్రమైన, సురక్షితమైన మరియు నిశ్చితమైన మార్గమైయున్నది. శివునికి జయము! ఆతని నామమునకు జయము!!

రావణుడు తన స్తోత్రముచే శివుని సంతృప్తి పరచెను. పుష్ప-
దంతుడు తన సుప్రసిద్ధమగు శివమహిమ్నస్తోత్రముచే శివుని తృప్తి నొందించెను. ఈ స్తోత్రమును ఇప్పటికిని భారతదేశములోని శివభక్తులు పఠించి ఐశ్వర్యమును, సిద్ధులను మరియు ముక్తినిఁ బడయుచున్నారు, శివస్తోత్రమహిమ అవర్ణనీయము. మీరందఱు శివనామస్మరణచే అజ్ఞాతమగు భవిష్యత్తునందు కాకుండా, ఇప్ప-
డీ క్షణమునందే ఆతని

## ***శివుడు - శివపూజ***

అనుగ్రహమును మఱియు ముక్తినిఁ బడయుదురుగాక! నీవు శివుని సులభముగా తృప్తి నొందింప వచ్చును. శివరాత్రిరోజు ఉపవసిం-
పుము. ఇట్లు చేయజాలనిచో పాలు, పండ్లను తీసుకొనుము. రాత్రియంతయు జాగరణ చేసి, అతని స్తోత్రములను పఠించి "ఓం నమఃశివాయ" మంత్రమును జపించుము. శివుని ఆశీర్వాద-
ములు మీ అందరియందుండునుఁ గాక!

**ఓం శాంతిః శాంతిః శాంతిః**

*శివుడు - శివపూజ*

# 2వ అధ్యాయము

## శివతత్త్వము

నాలోనే విశ్వమునకు మూలమున్నది,

నాలోనే దీనికి ఉనికియున్నది.

నాలోనే అది అంతర్ధానమైనది. (శివుడు)

నేనేసుమి కాలమునకతీతుడను,

శివోహం ! శివోహం !! శివోహమ్ !!!

కాముని దహించినవాడును, శాశ్వతానందమును మరియు అమృతత్వము నొసంగువాడును, సమస్త జీవులను సంరక్షించు-వాడును, పాపనాశకుడును, దేవదేవుడును, పులిచర్మధారియు, పూజ్యులలో శ్రేష్ఠుడును, తనజటలనుండి గంగను ప్రవహింపఁజే-యువాడును అగు శివునికి ప్రణామములు.

శివుడు పరిశుద్ధుడు, మార్పులేనివాడు, గుణవివర్జితుడు, సర్వ-వ్యాపకుడు, భావాతీతుడునగు చైతన్య స్వరూపుడై యున్నాడు. అతడు నిష్క్రియుడు. ప్రకృతి ఆతని వక్షస్థలముపై నాట్యమాడు-చు సృష్టిస్థితి లయములనొనర్చుచున్నది.

జ్యోతిఁగాని, అంధకారముఁగాని లేనప్పుడు, రూపముఁ గాని-శక్తి-గాని లేనప్పుడు, శబ్దముఁగాని - పదార్ధముఁగాని లేనప్పుడు, భౌతిక సత్తాకు ఉనికి లేనప్పుడు శివుడు తనయందు "తానువసించును. అతడు దేశ కాలాతీతుడు, జనన మరణ తరహితుడు మరియు అక్షయుడు. ఆతడు ద్వంద్వాతీతుడు.

## ***శివుడు - శివపూజ***

అతను అవ్యక్త పరబ్రహ్మము. ఆతడు సుఖదుఃఖముల చేతను, నుంచిచెడ్డల చేతను అంటుఁబడడు. ఆతడీ నేత్రములచే చూడ-బడడు, కాని ఆతనిని భక్తి ధ్యానములచే హృదయమునందు సాక్షాత్కరించుకొనవచ్చును.

శివుడు తన శక్తితో కూడియున్నప్పుడు పరమా రాధ్య దైవమగు-

ను. అప్పుడాతడు సర్వశక్తిమంతుడు, సర్వజ్ఞుడు మరియు క్రియా-శీలుడగును. ఆతను పరమానందముతో నాట్యమాడుచు, తన నాట్యకౌశలముచే సృష్టి, స్థితి, లయముల నొనర్చును.

ఆతడు తన భక్తులయొక్క సమస్త బంధములను, సంకుచిత-త్వమును మరియు దుఃఖమును నివారించును. ఆతడు ముక్తి ప్రదాత, విశ్వాత్మ మరియు సమస్త జీవులకు అంతరాత్మయై యు-న్నాడు. ఈ ప్రపంచమునకు మరణశీలురై యున్న జీవులు వసించు శ్మశాన వాటికయందు ఆతను వసించును.

జీవులు మఱియు ప్రపంచము ఆతనినుండి ఉత్పన్న మగును. ఆతనిచే పాలింపఁబడును. ఆతనిచే త్యజింపఁబడును. తుట్టతు-దకు ఆతనియందే లీనమగును. ఆతడీ సమస్త ప్రపంచమునకు మూలమునకు ఉత్పత్తిస్థానము మఱియు ఆధారమైయున్నాడు. అతడు సత్యము, సౌందర్యము, సత్త్వము మరియు ఆనందమున-కు నిలయమై యున్నాడు. అతడే సత్యం, శివం, శుభం సుందరం మఱియు కాంతమ్.

అతడు దేవదేవుడు మఱియు మహాదేవుడు, ఆతడు ప్రజాపతి. (పితృ దేవతలకు దేవుడు.) అతడు తన హస్తములో త్రిశూలమును ధరించియుండు భయంకరమైన రుద్రుడు. అతడు ఆశుతోషుడు.



ఆతడు అందరికి అందుబాటు నందుండును. అస్పృశ్యులైన చండాలురు మరియు నిరక్షరకుక్షులైన గ్రామీణులు సైతము ఆతని దరిఁజేరఁగలుగుదురు.

అతడు సమస్తజ్ఞానమునకు మరియు బుద్ధిశక్తికి స్థానము. అత-

డొక ఆదర్శయోగి మరియు మునీశ్వరుడు. ఆతడొక ఆదర్శవంత-మైన కుటుంబమునకు ఆదర్శవంతుడైన యజమాని. ఉమయే అతనికి భక్తురాలైన భార్య. దేవసేనాధిపతియగు సుబ్రహ్మణ్యుడు మరియు విఘ్నహరుడగు గణేశుడు అతని కుమారులు.

## సదాశివుడు

ప్రళయాంతమునందు పరమేశ్వరుడు ఈ ప్రపంచమును తిరిగి సృష్టింపఁగోరును. అప్పుడతడు సదాశివుడని పేర్కొన బడును. ఆతడు సృష్టికి మూలకారకుడు. సదాశివునినుండి సృష్టి ఉత్పన్న-మగును. మనుస్మృతియందాతడు స్వయంభువని చెప్పబడును. సదాశివుడు అవ్యక్తుడు. అతడు ప్రళయమునకు కారణమైన తమ-స్సును తొలగించును. మఱియు పంచమహా భూతాదులను సృష్టించి, స్వయం ప్రకాశమానుడై వెలుగొందును.

శివుడు ప్రకృతి పురుషులకతీతుడని శివపురాణము పలుకును. శివుడే మహేశ్వరుడు. అతడు సమస్త జీవులకు సాక్షి శుభకాముడు మరియు పోషకుడై యున్నాడు. గీత ఇట్లు పలుకును. “ఉపద్రష్టా-ను మంతాచ భర్తా భోక్తామహేశ్వరః”

### *శివుడు - శివపూజ*

మహేశ్వరుడు తన ఇష్టానుసారముగా సృష్టి కార్యము నొనర్చు-ను. శ్రుతిఇట్లనును “మాయాంతు ప్రకృతింవిద్ధి, మాయినంతు మహేశ్వరమ్" ప్రకృతిని మాయగాను మఱియు మహేశ్వరుని ప్ర-కృతికి నియామకునిగాను తెలిసికొనుము. శివ శక్తి రెండు

విభిన్నమైన మార్గములలో పనిచేయును. ఒకటి మూల ప్రకృతి. రెండవది దైవీప్రకృతి. మూలప్రకృతియే అపరాప్రకృతి యనఁబ-డును. దానినుండి పంచ భూతములు, ఇతర దృశ్యపదార్థ ములు మరియు అంతఃకరణము ఉత్పన్నమగును. పరాప్రకృతియే చైత-న్యశక్తి. అది అపరా ప్రకృతిని మార్చి, దానికి నామరూపముల నొసగును. అపరా ప్రకృతియే అవిద్య, పరాప్రకృతియే విద్య. శివుడే ఈ ప్రకృతి ద్వయమునకు నియామకుడు మరియు నియంత.

శివుడు బ్రహ్మ, విష్ణువు మరియు రుద్రులకు విభిన్నుడు.

శివుడు అనంతకోటి బ్రహ్మాండనాయకుడు. శివుని ఆజ్ఞచే ఈశ్వ-రుడు మాయతో కలిసి, రజస్సత్వతమోగుణములనుండి క్రమముగా బ్రహ్మ, విష్ణువు మరియు రుద్రులను సృష్టించును. బ్ర-హ్మ విష్ణు రుద్రులు ప్రపంచమునకు త్రిమూర్తులు.

త్రిమూర్తులైన బహ్మ, విష్ణు, రుద్రులలో భేదము లేదు. మహేశ్వ-రుని ఆజ్ఞచే వీరు ముగ్గురు ప్రపంచము యొక్క సృష్టి స్థితి ప్రళయముల నొనర్తురు. ఈ ముప్పురు కలిసి మెలిసి కార్యముల నొనర్తురు. ఈ నామరూపయుక్తమగు విశ్వముయొక్క సృష్టి స్థితిల-యముల నొనర్చుటలో వారియందొక నిశ్చితమైన ఉద్దేశ్యము మరియు ఏకైకలక్ష్యముండును. ఈ ముప్పురు దేవతలు విభిన్ను-లని ఎవ్వడు



తలంచునో, అతడు నిస్సంశయము గా పిశాచముతో సమానమని శివపురాణము నుడువును.

త్రిగుణాతీతుడైన మహేశ్వరునియందు బ్రహ్మ, కాల, రుద్ర, విష్ణువులనెడి నాలుగంశములున్నవి. శివుడు ఈ నాలుగింటికి ఆధారభూతుడు. ఆతడు శక్తికికూడా ఆధారమై యున్నాడు. త్రిమూర్తులయందున్న రుద్రునికి శివుడు విభిన్నుడు. రుద్రుడొనర్చు నానావిధ కార్యములచే ఏకాదశ రూపములను ధరించినను, ఆతడు నిజమునకు ఏకైక రూపుడై యున్నాడు.

ప్రథమ ముఖముచే శివుడు క్రీడ యొనర్చును. ద్వితీయ ముఖముచే తపస్సు నొనర్చును. తృతీయ ముఖముచే ప్రపంచ మును లయమొనర్చును. చతుర్థముఖముచే ప్రజలను రక్షించును. పంచమ ముఖము జ్ఞానమగుటచే, విశ్వమంతటిని తనశక్తిచే కప్పివేయును. ఆతడు సష్టికర్తయగు - ఈశానుడు మరియు జీవులందరి అంతఃకరణమును ప్రేరేపించు వాడునై యున్నాడు.

ప్రకృతిని భోగించు క్షేత్రజ్ఞ పురుషుడే శివుని ప్రథమ రూపము. భోగ్య ప్రకృతియందు స్థితుడైనట్టి సత్వగుణోపేతుడగు తత్పురుషుడే ద్వితీయరూపము. ధర్మము ఇత్యాది అష్ట విధములై యున్న బుద్ధియందు స్థితుడై యున్న ఘోరరూపము తృతీయము. అహంకారస్థితుడైయున్న వామదేవుడు చతుర్థ రూపము. మనస్సు యొక్క అధిష్ఠాన దేవతయగు సద్యోజాతుడు పంచమరూపము. శర్వ, భవ, రుద్ర, ఉగ్ర, భీమ, పశుపతి, ఈశాన, మహాదేవ అనునవి శివుని అష్టవిధరూపములు. ఇవి క్రమముగా పృథ్వి, జలము, అగ్ని, వాయువు,



ఆకాశము, క్షేత్రజ్ఞుడు, సూర్యుడు మఱియు చంద్రునియందు నె-

లకొని యున్నవి.

## అర్ధనారీశ్వరుడు

బ్రహ్మ తన మానసిక సృష్టిచే జీవులను సృష్టించుటకు అసమర్థుడై యుండెను. సృష్టిక్రమమును తెలిసికొనుటకై ఆతడు తపస్సునొనర్చెను. అతని తపఃఫలితముగా బ్రహ్మయొక్క మనసునందు ఆద్యశక్తి ఉత్పన్నమయ్యెను. ఆద్యశక్తి యొక్క సహాయముచే బ్రహ్మ త్ర్యంబకేశ్వరుని(గూర్చి ధ్యానించెను. బ్రహ్మయొక్క తపస్సుచే ప్రీతినొందినవాడై శివుడు అర్ధనారీశ్వర రూపమునందు ప్రత్యక్ష మయ్యెను. బ్రహ్మ అర్ధనారీశ్వరుని స్తుతించెను. అప్పుడు శివుడు తనశరీరము నుండి ప్రమాశక్తి యనెడి ఒక దేవిని సృష్టించెను. బ్రహ్మ, దేవితో ఇట్లనెను. "నామానసిక శక్తిచే జీవులను సృష్టించుటకు నేను అశక్యుడనై యున్నాను. నేను దేవతలను సృష్టించినప్పటికి, వారిని వృద్ధి నొందింప(జాలకున్నాను, కావున అన్యోన్యసంసర్గము ద్వారా నేను జీవులను సృష్టింప(దలంచితిని. ఇంతవరకు నేను అనంతమైన స్త్రీజాతులను సృష్టించుటకు శక్యుడనైయుంటిని. కావున ఓ దేవీ! కరుణతో నా కుమారుడైన దక్షునికి కుమార్తెవై జన్మించుము."

# జగద్గురువు

ప్రపంచమునకు యోగము, భక్తి, జ్ఞానము ఇత్యాదులను శివుడు ప్రసాదించి శుభంకరమును, ఉపయుక్తమునగు కార్యము నొనర్చు చుండును. తన అనుగ్రహము వినా ఈ సంసారమును దాటలేని-వారిని మఱియు తన అనుగ్రహమునకు యోగ్యులైన వారిని ఆతడాశీర్వదించును. ఆతడు జగద్గురువే కాకుండా జీవన్ముక్తుల-కు ఆదర్శప్రాయుడు. అతడు తన దైనిక జీవికక్రియల చేతనే ప్రబోధము నొనర్చుచుండును.

# పాశుపత యోగము

ఇంద్రియనిగ్రహము ద్వారా ఆత్మను శివతత్త్వముతో సంయోగ మొనర్చుటయే నిజమైన భస్మధారణమగును. ఏలననగా శివుడు తన జ్ఞాననేత్రముచే మోహమును భస్మమొనర్చెను. జపము ద్వారా ప్రణవధ్యానము నొనర్పవలయును. స్థిరమైన అభ్యాసముచే సాధ-కుడు జ్ఞానము, యోగము మఱియు భక్తిని ఆర్జింపవల యును. హృదయమునందు దశదళపద్మమున్నది. దానికి దశవిధనాడు-లున్నవి. ఇది జీవాత్మకు స్థానము . ఈ జీవాత్మ మనస్సునందు సూక్ష్మ రూపమునందుండును. ఇదియే చిత్తము, లేక పురుషుడ-నఁబడును. గురూపదేశము ననుసరించి క్రమమైన యోగాభ్యాసముచేతను, వైరాగ్యము, ధర్మ పరాయణత, సమత్వ-ము నభ్యసించుట చేతను దశాగ్ని నాడిని ఛేదించి సాధకుడు చంద్రునివైపు

అధిగమించవలయును. సాధకుని క్రమమైన యోగాభ్యాసము చే-తను మరియు నాడీశుద్ధిచే తను ప్రీతినొంది, చంద్రుడు పూర్ణత్వమునొందును. ఈ యవస్థయందు సాధకుడు ధ్యానాభ్యా-సము ద్వారా జాగ్రత్సుషుప్తుల నధిగమించి, జాగ్రదావస్థయందే ధ్యేయవస్తువునందు లయించును.

# 3వ అధ్యాయము

# శైవసిద్ధాంత దర్శనము

# శివ తత్త్వములు

"సత్యం శివం శుభం సుందరం కాంతమ్"

వేదాంతముయొక్క సారస్వరూపమే శైవసిద్ధాంతక్రమము. క్రీస్తు శకమునకు పూర్వమే అది దక్షిణ భారతదేశమునందు వ్యాపించి-యున్నది. శైవసిద్ధాంత దర్శనమునకు తిరునల్వేలి మఱియు నుధురై కేంద్రములై యున్నవి. క్రీ॥శ॥ పదునొకండవ శతాబ్దము-నందు శైవులు శైవసిద్ధాంత మనెడి ప్రత్యేక దర్శనమును నెలకొల్పిరి. దక్షిణ భారతమునందు శైవమతముకూడా మిక్కిలి సుప్రసిద్ధమైన తెగయై యున్నది. ఇది వైష్ణవమతమునకు విరుద్ధ-మైయున్నది.

తిరుమూలర్ యొక్క గ్రంధమైన తిరుమంత్రము నాధారము-గాఁగొని శైవసిద్ధాంత దర్శనము నిర్మింపబడినది. ఇరువది ఎనిమిది శైవాగమములు, శైవసత్పురుషుల గానములు దాక్షిణాత్య శైవసిద్ధాంతమునకు మూలాధారములై యున్నవి.

శైవమతమును గూర్చి ప్రబోధించు గ్రంథములలో (1) కలిశ పా-శుపతము (2) శైవము (8) ప్రత్యభిజ్ఞము (4) రాసేశ్వరములనెడి చతుర్విధ దర్శనములు కాననగును.

శివుడే పరమసత్యము. ఆతడు శాశ్వతుడు, నిర్వికారుడు, స్వ-తంత్రుడు, సర్వవ్యాపకుడు, అద్వితీయుడు, అనాది, అకారణుడు,

నిత్యశుద్ధుడు. అతడు కాలాతీతుడు. అతడు అనంతానందము మఱియు అనంత జ్ఞాన స్వరూపుడునై యున్నాడు.

శివుడు తన శక్తిచే ప్రపంచమంతయు పరివేష్టించి యున్నాడు. ఆతడు తన శక్తి ద్వారా పనిచేయును. శక్తి శివునికి చైతన్యము నొ-సంగును. శివునియొక్క శరీరమే ఆమె. ఒక కుండకు కుమ్మరివాడు ప్రథమ కారణము. కఱ్ఱ మరియు చక్రములు నిమిత్త కారణములు. కుండకు మట్టి ఉపాదాన కారణమై యున్నది. అదే విధముగా శివు-డీ ప్రపంచమునకు ప్రథమ కారణమై యున్నాడు. శక్తి నిమిత్త కారణమై యున్నది. మాయ ఉపాదాన కారణమైయున్నది.

శివుడు ప్రేమమయుడు. ఆతని అనుగ్రహమున కంతములేదు. అతను సంరక్షకుడు మరియు గురువు. జీవులను భౌతిక బంధ-మునుండి విముక్తి నొందించుటకై ఆతడు రతుడై యం. మానవులపై గల మిక్కుటమైన ప్రేమచే ఆత గురురూపమును ధరించును, అందరున్నూ తనను గుర్తెరింగి.. ఆనందప్రదమగు శివపదము నొందవలయునని ఆతడు వాంఛించును. జీవులొన-ర్చు కర్మలకు అతడు సాక్షియైయుండి, వారి పురోభివృద్ధికి తోడ్పడును.

శైవ సిద్ధాంతమునందు 36 తత్త్వములున్నవి. వాటిలో 24 ఆత్మత-త్వములనియు, 7 విద్యాతత్త్వములనియు, శేషించిన 5 శివతత్త్వములనియును చెప్పబడును. 24 ఆత్మతత్త్వము లేవనగా పృథివ్యప్తేజోవాయురాకాశములనెడి 5 భూతములు, శబ్దస్పర్శ-

రూపరస గంధములనెడి 5 తన్మాత్రలు, నేత్రశ్రోత్ర త్వగ్రసన ఘ్రాణములనెడి 5 జ్ఞానేంద్రియములు, అంతఃకరణము, వాక్పాణి-పాదపాయూపస్థలనెడి 5 కర్మేంద్రియములు, అహంకా రము, బుద్ధి మరియు గుణము. 7

## *శివుడు - శివపూజ*

విద్యాతత్త్వము లేవనగా పురుషుడు, రాగము, విద్య, కళ, నియతి, కాలము మరియు అశుద్ధమాయ. 5 శివతత్వము లేవనగా శుద్ధవి-ద్య, ఈశ్వరుడు సదాశివుడు, శక్తి మరియు శివుడు.

మాయసూక్ష్మమైన అంశములలో వ్యాపించి, తదనంత రము స్థూలమునందు ప్రవేశించును. జీవుడు విద్య ద్వారా సుఖ దుఃఖ-ముల ననుభవించును. సమస్త చైతన్యమునకు మరియు క్రియలకు శివతత్త్వమే ఆధారమైయున్నది. నిష్కళమగు శుద్ధ మా-యయగు శివశక్తి తన కార్యములను ప్రారంభించును. అప్పుడు శివుడు భోక్త యగును. అప్పుడతడు సదాశివుడు, లేక సదాఖ్యు డనఁబడును. ఈతడు నిజమునకు శివునికి భిన్నుడు కాడు. శుద్ధ-మాయ కార్యశీలమగును. అప్పుడు భోక్తయగు శివుడు పరిపాలకుడగును. అప్పుడతడు సదాశివునికి భిన్నుడు కాని ఈశ్వరుడని చెప్పఁబడును. సత్యజ్ఞానమునకు శుద్ధవిద్యయే కారణ మగును.

సృష్టి, స్థితి, సంహార, తిరోభావ, అనుగ్రహములనునవి శివుని పంచకృత్యములు. ఇవి బ్రహ్మ, విష్ణు, రుద్ర, మహేశ్వర, సదాశివుల కార్యములని కూడా చెప్పఁబడును.

"నమఃశివాయ" యనెడి పంచాక్షరి మంత్రములోని "న" కారము ప్రపంచములోని జీవుని సంచరింపఁజేయునట్టి దేవుని ఆవరణశక్తి. "మ" కారము జీవుని జనన మరణ శీలమగు సంసారచక్రమునందు బంధించును. "శి" యనునది శివునికి చిహ్నము. "వా" యనునది శివుని అనుగ్రహమునకు చిహ్నము. "య" అను నది జీవుని సూచించును.

## ***శివుడు - శివపూజ***

జీవుడు "న" మఱియు "మ" వైపు అభిముఖుడై నప్పుడతడు ప్రాపంచికత యందు మునుగును. "వా" వైపు అభిముఖుడగునేని, అతడు శివుని వైపు చలించును.

పంచాక్షరి యొక్క భావార్థమును మఱియు శివలీలలను యే "శ్రవణ"మనఁబడును. పంచాక్షరి మంత్రార్థమును మరల మరల భావించుటయే "మననము" లేక "చింతన" యనఁబడును. శివునిపై భక్తి ప్రేమలను నొందించుకొని, ఆతనిఁగూర్చి ధ్యానించుటయే "శివధ్యానమనం బడును. శివానందమునందు లగ్నుడై యుండుటయే "నిష్ఠ" లేక 'సమాధి' యనఁబడును. ఈ స్థితిననుభవించినవాడు "జీవన్ము క్తుడ"నఁబడును.

## **పతి – పశువు – పాశము**

శివుడే "పతి" శివుడు, బంధింపఁబడిన జీవులు మరియు బంధ-

నమును(గూర్చి వర్ణించుటయే సమస్త వేదములు మరియు ఆగ-మములయొక్క ముఖ్యోద్దేశ్యము. శివుడు అనంతుడు, శాశ్వతుడు, అద్వితీయుడు. అతడు అఖండ నిర్వికారస్వరూపుడు. అతడు జ్ఞానానందస్వరూపుడు. ఆతడు జీవులందరి బుద్ధులకు ప్రాణశక్తి నొసంగును. ఆతడు మనస్సుకు, వాక్కుకు అతీతుడు. ఆతడందరికి పరమ లక్ష్యమైయున్నాడు. అతడు "అణోరణీయాన్, మహతో



మహీయాన్ " అనగా సూక్ష్మాతి సూక్ష్ముడు, స్థూలాతి స్థూలుడు. అతడు స్వయం ప్రకాశుడు, స్వయంభువు, స్వయంతుష్టుడు మఱియు ఆత్మానందుడు.

"పశువుల"నగా సంసార పంకిలమునందు మునిగియున్న జీవులని అర్థము. వారు తమ కర్మఫలానుసారము గా నిమ్నోన్నత జన్మలనెత్తి మంచి, చెడ్డ ఫలితములననుభవించుటకే శరీరములను ధరింతురు. వారు తమ కర్మఫలములననుభవించునప్పుడు పుణ్యపాప కర్మలనొనర్చుటతో అనేక జననమరణముల ననుభవింపవలసి వచ్చును. తుట్టతుదకు తమ పుణ్యకర్మలచే శివుని అనుగ్రహమును పొంది, వారు తమ అజ్ఞానమును నివారించు కొందురు. వారు ముక్తినొంది, శివునితో ఐక్యమగుదురు.

"పాశమ"నగా బంధము. బంధనపుటల్లిక అవిద్య, లేక ఆనవమలము, కర్మ మఱియు మాయగా విభజింప(బడును. ఆనవమలమే అహంకారము. జీవుని సంకుచితత్వము యొక్క కళంకమే ఇది. జీవుడు శరీరమునందు బంధింప(బడి అంత వంతుడుగాను,

అల్పమైనశక్తి, జ్ఞానములను కలిగియున్నట్లును ఊహించును. అతను నాశవంతమగు శరీరముతో అక్రమముగా తాదాత్మ్యము-నొంది, శరీరమునే సత్యముగా తలంచును. ఆతడు తన శ్రేష్ఠమైనది దివ్యస్వరూపమును మఱచిపోయెను.

శరీరములకు, శారీరికానుభవములకు మఱియు జనన - మరణ-ములకు కర్మయే కారణమైయున్నది. అదిఆనాది. అది

*శివుడు - శివపూజ*

చైతన్యాత్మను జడశరీరముతో సంయోగము నొందించుటకు, కార-ణమై యున్నది. ఇది ఆవిద్యకు సహాయకశక్తియైయున్నది. ఇదిమనో వాక్కాయములచే ఆచరింపఁబడును. ఇది పుణ్యపాప రూపములను దాల్చి, సుఖదుఃఖముల నొసంగును. అది సూక్ష్మ-ము మఱియు అదృష్టమై యున్నది. సృష్టియందిది ఉనికిని కలిగి యుండి, ప్రళయ కాలము నందు మాయయొక్క మూలమునందు లంచును. దానికి నాశము లేదు. అది తన ఫలముల నొసంగి తీరు-ను.

మాయ ఈ ప్రపంచమునకు ఉపాదాన కారణమైయున్నది. ఇది జడము, సర్వవ్యాపకము మరియు అవినాశియై యున్నది. ఇది ప్ర-పంచమునకు బీజమువంటిది. తను, కారణ, భువన, భోగములనెడి శరీరముయొక్క నాలుగంశములు మాయనుండి ఉత్పన్నమగును. ఇది సర్వత్ర వ్యాపించి, కార్మిక జీవుల బుద్ధిని వక్రింపఁ జేయును. ప్రళయ కాలమునందు జీవులందరికి ఇది ప్ర-ధానమైన ఆశ్రయమైయున్నది. ఇది స్వయముగా జీవులకు

బంధనమైయున్నది. శివుని ప్రేరణచే దీని కార్యకలాపములు జరుగుచుండును. ఒక బీజమునుండి బోదె, ఆకులు, ఫలములు ఉత్పన్నమగునట్లు, కాలమునుండి పృథ్వీ వరకుఁగల ఈ విశ్వ-మంతయు మాయనుండి ఉత్పన్నమగును.

శివుని సంకల్పముచే శుద్ధమాయనుండి శబ్దమునకు మూలమ-గు నిజమైన నాదముబయల్వెడులును. నాదమునుండి . నిజమైన బిందువు ఉత్పన్నమగును. దానినుండి నిజమైన సదాశివుడు ఉత్పన్నమై ఈశ్వరుని సృష్టించును. ఈశ్వరునినుండి శుద్ధ అవి-ద్య



వికసించును. బిందువునుండి ప్రపంచము ఉత్పన్నమై నానావిధ రూపములను దాల్చును.

## సాధన

అహంకారమునుండి విడివడినప్పుడు మానవుడు శివుని యం-దు భక్తి ప్రేములను పెంపొందించుకొనును. అహంకారమును నశింపజేసి శివుని పొందుటకు చర్య, క్రియ, యోగము జ్ఞానము లనెడి చతుర్విధ సాధనలు, లేక సోపానములు కలవు. మందిర ని-ర్మాణము, దేవాలయములను శుభ్రపఱచుట, పుష్ప మాలలను కూర్చుట, దేవుని స్తుతించుట, ఆలయములలో దీపములను వె-

లిగించుట, పుష్పవాటికలను నిర్మించుట చర్యయనఁబడును. పూజ మఱియు అర్చనలలొనర్చుట క్రియయనఁబడును. ఇంద్రి-యనిగ్రహముచే మనస్సును అంతరిక జ్యోతియందు ధారణ మొనర్చుట యోగమనఁబడును. ఆణవ, కర్మ, మాయయనెడి త్రి-విధమలములను తొలగించి, శివునిఁగూర్చి నిరంతరము ధ్యానించుట ద్వారా పతి పశు పాశము యొక్క ముఖ్యార్థ మును గు-ర్తెరింగి, శివుని యందైక్యమగుటయే జ్ఞాన మనఁబడును.

భౌతిక పదార్థముల ద్వారా సర్వవ్యాపకుడును, శాశ్వతుడు నగు పరమాత్మను పూజించుటయే చర్యయగును. దీనికి సమయ దీక్ష



అత్యావశ్యకమై యుండును. విశ్వపాలకుని విశ్వరూపమును భౌతి-కముగను, ఆంతరంగికముగను ఉపాసించుటయే క్రియ యగును, నిర్వికారుడగు దేవుని ఆంతరంగికముగా పూజించు టయే యోగమ నఁబడును. క్రియ మరియు యోగము ననుష్టించు టయే విశేషదీక్ష యనఁబడును. జ్ఞానగురువు ద్వారా శివుని ప్రత్యక్ష దర్శనము నొం-దుటయే జ్ఞానమనఁబడును. జ్ఞానోపదేశమే నిర్వాణ దీక్షయనఁబడును.

సాధకుడు ఆణవ, కర్మ, మాయయనెడి మలత్రయము నుండి విముక్తుడు కావలయును, అప్పుడు మాత్రమే అతడు శివునిఁనం-దైక్యమై "శివానందము" నొందఁగలుగును. అతడు తన అహంకారమును పూర్తిగా తొలగించుకొని, కర్మబంధము నుండి వి-డివడి, అపవిత్రతలన్నింటికి మూలమైయున్న మాయను

నశింపఁ జేయవలయును.

ముక్తిపథము నొందుటకు గురువు అత్యావశ్యకమై యుండును. శివుడు దయాసాగరుడు. అతడు ముముక్షువులకు సహకరించును. భక్తి, శ్రద్ధలతో తనను పూజించువారిని మఱియు బాలునివంటి విశ్వాసమును కలిగియున్న వారిని అతడను గ్రహించును. స్వయముగా శివుడే గురువు. శివుని అనుగ్రహమే ముక్తికి దారితీయును. శివుడు గురువుయందువసించి, గురువు యొక్క నేత్రముల ద్వారా విశ్వసనీయుడైన సాధకుని మిక్కిలి ప్రేమతో వీక్షించును. మానవజాతిపై నీవు ప్రేమగలవాడవై యుందువేని, నీవు దేవుని ప్రేమించిన వాడవగుదువు.

### *శివుడు - శివపూజ*

సాధకుడు తనయందును, శివునియందును ప్రతిష్ఠించు కొనునేని, అతను శీఘ్రముగా భక్తిని పెంపొందించుకొనఁ గలుగును. ఆతడు తిరునవకరసర్ వంటి దాసస్వభావమునుఁ గాని, తిరుజ్ఞానసంబంధర్ కలిగియున్నట్టి వాత్సల్యభావమునుఁ గాని, సుందరర్ కలిగియున్నట్టి సఖ్యభావమునుఁగాని, లేక మాణిక్య వాచకర్ కలిగియున్నట్టి సన్మార్గ భావమునుఁగాని కలిగియుండ వచ్చును. ఇది వైష్ణవులయొక్క మాధుర్య భావమును, లేక ఆత్మనివేదనమును పోలియుండును.

మలత్రయము (పాశము) నశించినప్పుడు నీటియందు ఉప్పువలె, పాలలో పాలవలె భక్తుడు శివునియందుకలిసిపోవును. కాని ఆతడు సృష్టియొక్క పంచవిధ కార్యముల నొనర్పఁజాలడు. దేవు-

డుమాత్రమే ఈ కార్యముల నొనర్పఁగలుగును.

బంధవిముక్తుడే జీవన్ముక్తుడనఁబడును. ఆతడు శరీరమునందు ఉన్నను, పూర్ణ పురుషుని యందైక్యమైయుండును. భవిష్యచ్ఛరీరములకు కారణమగు కార్యము నాతడు చేయడు. ఆతడు అహంకార రహితుడై యుండుటచే, కర్మ అతనిని బంధింపదు. అతడు లోక సంగ్రహముకొరకై పుణ్యకార్యముల నొనర్చును. తన ప్రారబ్ధకర్మ క్షయించునంత వరకాతడు శరీరమును ధరించియుండును. ప్రస్తుతకర్మలన్నియు దైవానుగ్రహ ముచే నశించును. తన అంతఃకరణము నందున్న దేవుని ప్రేరణచే జీవన్ముక్తుడు సమస్త కర్మలనొనర్చును. శివునికి మఱియు శివశక్తికి జయము!



# అష్టమూర్తి

శివునికి ఎనిమిది రూపములున్నట్లు చెప్పఁబడినది. పంచ మహాభూతములు, సూర్యుడు, చంద్రుడు మరియు యాజ్ఞికుడే ఈ ఎనిమిది రూపములు.

పాలసముద్రమును మథించిన అనంతరము విష్ణువు మోహిని రూపము నందవతరించెను. ఆ రూపము నందున్న విష్ణువును శివుడు ఆలింగనమొనర్చుకొనెను. శివుడు మరియు మోహినియొక్క సంతానమే శాస్త్ర శాస్త్ర, హరిహర పుత్రుడని కూడా చెప్పఁబడును.

శివునియొక్క మరియొక రూపమే విష్ణువని శైవులందరు భావించవలయునని అప్పర్ వాంఛించెను.

అప్పర్ అభిప్రాయము ననుసరించి శివునికి మూడు రూపములున్నవి. (1) ప్రాపంచిక ప్రళయము నొనర్చి, జీవులను బంధవిముక్తులనుఁగావించు నిమ్నమైన శివుడు. (2) ఉన్నతమైన రూపము పరాపర మని చెప్పఁబడును. ఈ రూపము నందు శివుడు అర్ధనారీశ్వర రూపమునందు కానఁబడును. దీనికి పరంజ్యోతియని పేరు. ఈ జ్యోతిని బ్రహ్మ మఱియు విష్ణువు తెలిసికొనలేకపోయిరి. (3) ఈ రెండురూపములకవ్వల బహ్మ విష్ణు రుద్రులు ఉత్పన్నమైనట్టి "పరం" అనెడి పరమ పురుషుడుం డును. ఇది శుద్ధమైన శైవరూపము. ఇది నిర్గుణము. శైవసిద్ధాంతము యొక్క "శివం" ఇదియే. వేదాంతులు మరియు ఉపనిషత్తులు నుడువు పర బ్రహ్మమిదియే.

## శివుడు - శివపూజ

విష్ణుపురాణములోని మహావిష్ణువునకు శైవసిద్ధాంతుల యొక్క "పరం" అనుగుణమైయుండును. నారాయణుడు, లేక మహావిష్ణువు అప్పర్, లేక శైవసిద్ధాంతుల యొక్క పరంజ్యోతి

కనుగుణమైయుండును. నిమ్నమైన విష్ణువు సంరక్షణ కార్యము నొనర్చును. ఆతడు నిమ్నమైన శివుని కనుగుణుడై యుండును.

విష్ణువు శివుని పూజించెనని పలుకు శైవుల వాక్యము మఱియు శివుడే విష్ణువును పూజించెనని పలుకు వైష్ణవుల వాక్యము యొక్క అంతరార్థమేమి? నిమ్నమైన శివుడు నారాయణుడు, పరాపరము,

లేక పరంజ్యోతిని అధికముగా భావించును.

ఇక నిమ్నమైన విష్ణువు పరంజ్యోతిని, లేక పరాపరమును ఉన్న-తమైనదిగా భావించును. ఉన్నతమైన విష్ణువు ఉన్నతమైన శివునితో తాదాత్మ్యమునొందును. వారు ఉన్నతోన్నతమైన "పరం"కు నిమ్నులై యుందురు.

శివముక్తియనెడి ఉన్నతోన్నతమైన స్థితిలో ద్వంద్వము లేదు. ఎవడు కూడా ఏపదార్థమునై నను చూడఁజాలడు. ఉన్నతోన్నత-మైన శివంనందు ఆతడు లయించును. ఒక వేళ నీవు దానిని చూడదలంతు వేని, నీవు వెంటనే నిమ్నమైన స్థితికి దిగజారవలసి యుండును.

నిర్గుణమైన నిజమైన "శివం "కు శివమూర్తి. నిమ్నస్థాయి యం-దుండును.

## *శివుడు - శివపూజ*

శైవసిద్ధాంత దర్శనము ననుసరించి తొంబదియారు - తత్వ-ములు గణింపఁబడును. అవి ఏవనగా :

24 ఆత్మ తత్వములు, 10 నాడులు, 5 అవస్థలు, 8 మలములు, 3 గుణములు (సత్వ రజస్తమస్సులు), 3 మండల ములు (సూర్యుడు, చంద్రుడు, అగ్ని), 3 ద్రవములు (వాత పిత్త, శ్లేష్మములు), 8 వికార-ములు (కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్య, దంభ, అసూయలు ), 6 ఆధారములు, 7 ధాతువులు, 10 వాయువులు, 5 కో-

శములు మఱియు 9 ద్వారములు. 5 భూతములు, 5 తన్మాత్రలు (శబ్దాదులు), 5 జ్ఞానేంద్రియములు, 5 కర్మేంద్రియములు, 4 కరణములు (మనో బుద్ధి చిత్తాహంకారములు) కలిసి ఇరువది నాలుగు తత్త్వముల గును. ఈ 96 తత్త్వములు శరీరమునకు సంబంధించియున్నవి. ఈ 96కు పైన 5 కంచుకములున్నవి. నియతి, కాలము, కళ, రాగము మఱియు విద్యయని వాటికి పేర్లు. ఈ ఐదు శరీరము నందు ప్రవేశించి, శరీరములోని తత్వములను ఆచ్చాదించి, శరీర క్లేశమునకు కారణమగును.

## శుద్ధశైవము

కేవలము క్రియచే శుద్ధ శైవమునకు మోక్షము సిద్ధింపదు. ఆతడు సాలోక్యమును మాత్రమే పొందును . క్రియలోని జ్ఞానము శివలోకమగు

### *శివుడు - శివపూజ*

సాలోక్యమును చేర్చును. చర్యలోని జ్ఞానము శివసన్నిధిని చేర్చును. యోగములోని జ్ఞానము సారూప్యమును ప్రసాదించును. ఇక జ్ఞానములోని జ్ఞానముచే సాయుజ్యము, లేక లయము సిద్ధించును.

“అంబలమ్” అనగా హృదయములోని విశాలస్థలము లేక చిదాకాశము, లేక చిదంబరమని అర్థము. ఇంక "లింగమ”నగా

విశ్వరూపమని భావము.

ప్రపంచమును నశింపఁజేయువాడే శివుడు, లేక రుద్రుడు. ఈ కారణము చేతనే ఆతడు బ్రహ్మ మఱియు విష్ణువు కంటెను శ్రేష్ఠుడని చెప్పఁబడును.

సిద్ధాంతులు జీవులను విజ్ఞానకల, ప్రళయకల మరియు సకలయని త్రివిధములుగా విభజించిరి. విజ్ఞానకలలోని జీవులు కేవలము ఆణవమలము (అహంకారము)ను కలిగియుందురు. ప్రళయకాలలోని జీవులు ఆణవము మఱియు మాయను కలిగి యుందురు. సకలజీవులు ఆణవ, కర్మ మరియు మాయయనెడి సమస్తమలములను కలిగి యుందురు. మలములు జీవులను మాత్రమే ప్రభావితమొనర్చును. కాని, శివుని ప్రభావితమొనర్చవు. ఈ మలములనుండి విముక్తులైన వారు శివునితో తాదాత్మ్యము నొందుదురు. అట్టి వారు సిద్ధపురుషులని చెప్పఁబడుదురు.



# 4వ అధ్యాయము

## సాంకేతిక తత్త్వజ్ఞానము

## సాంకేతిక తత్వజ్ఞానము

శివుడు బ్రహ్మము యొక్క విధ్వంసక అంశమునకు ప్రతీకము.

తమోగుణ ప్రధానమాయచే ఆవరింపఁబడిన బ్రహ్మముయొక్క అంశమే సర్వవ్యాపకుడగు ఈశ్వరుడును, కైలాసపర్వత వాసియగు శివుడునై యున్నాడు. ఆతడు విజ్ఞాన భాండాగారమైయున్నాడు. పార్వతి, కాళి, లేక దుర్గ లేని శివుడు స్వయముగా నిర్గుణ బహ్మమని చెప్పఁబడును. మాయయగు పార్వతీసహితుడై నప్పుడాతడు తన భక్తులు ఉపాసించు నిమిత్తమై సగుణ బహ్మమగును. శ్రీరామభక్తులు రాముని ఉపాసించుటకు ముందు 3 లేక 6 మాసములు శివుని పూజింపవలసియుండును. సుప్రసిద్ధమైన రామేశ్వరమునందు రాముడు స్వయముగా శివుని పూజించెను. శివుడు తాపసేశ్వరుడు, యోగీశ్వరుడు, దిగంబరుడు.

శివుని కుడి చేతియందున్న త్రిశూలము సత్త్వరజస్తమ ములనెడి త్రిగుణములను సూచించును. ఇది ఆధిపత్యమునకు చిహ్నమువంటిది. ఈ త్రిగుణములచే ఆతడీ ప్రపంచమును నిర్వహించును. అతని ఎడమ చేతియందున్న డమరు శబ్దబ్రహ్మ మును సూచించును. భాషలన్నియును దేనినుండి రూపొందినవో, అట్టి ఓంకారమును అది సూచించును. ఆతడే డమరునుండి సంస్కృతభాషను రూపొందించెను.

## శివుడు - శివపూజ

అతడు తన మనస్సును పూర్తిగా నిగ్రహించుటను అర్ధ చంద్రాకృతి మనకు సూచించును. గంగా ప్రవాహము అమర త్వము యొక్క అమృతమును సూచించును. ఏనుగు సాంకేతిక ముగా గర్వమును సూచించును. ఆతడు ఏనుగు చర్మమును ధరించుట గర్వమును నిర్మూలించుటను సూచించును. పులి మోహమును

సూచించును. అతడు పులిచర్మముపై కూర్చుండుట మోహమును జయించుటను సూచించును. ఒక జింకను తన చేతియందు ధరించుట అతడు మనశ్చంచలతను తొలగించుటను సూచించును. జింక ఒక స్థలమునుండి మరియొక స్థలమునకు శీఘ్రముగా గంతు వేయును. ఆతడు సర్పములను ధరించుట అతని విజ్ఞానమును మఱియు శాశ్వతత్వమును సూచించును. సర్పములు అనేక సంవత్సరములు జీవించును. అతడు త్రిలోచనుడు, అతని భ్రూమధ్యభాగములో జ్ఞాన నేత్రమున్నది.

"హౌమ్" అనునది శివుని బీజాక్షరము. అతడు శివం (శుభంకరుడు), సుందరం (అందమైనవాడు), కాంతం (తేజ స్వంతుడు). "శాంతం శివమద్వైతమ్" (మాండూక్యోపనిషత్తు)

అద్వైతుడును, ప్రపంచము మఱియు మనస్సులన్నింటికి ఆధారమైనవాడును, సచ్చిదానంద స్వరూపుడును, పరిపాల కుడును, అంతర్యామియు, సమస్తమునకు సాక్షిరూపుడును, స్వయం జ్యోతియు, స్వయంభువున్నూ, పరిపూర్ణుడును, మూలా విద్యను తొలగించు వాడును, ఆదిగురువు, పరమగురువు, లేక జగద్గురువైన శివుని

## *శివుడు - శివపూజ*

పాదపంకజములకు నేను కోట్ల పర్యాయ ములు చేతులు జోడించి, ప్రణమిల్లుచున్నాను.

నిజమునకు అట్టిశివుడనే నేను. శివోహం, శివోహం, శివోహమ్.

# శివుని శరీరముపై సర్పము

పరమాత్మయగు శివునిపై విశ్రమించు జీవుడేసర్పము, ఐదు పడగలు ఐదు ఇంద్రియములను, లేక పృథ్వ్యాప్తేజోవాయురాకాశముల నెడి పంచతత్వములను సూచించును. శరీరమునందు సర్పమువలె బుసకొట్టునట్టి పంచ ప్రాణములను కూడా అవి సూచించును. ఉచ్ఛ్వాసనిశ్వాసలు సర్పము బుసకొట్టుట వంటివి. శివుడు స్వయముగా పంచతన్మాత్రలు, పంచజ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు, ఇతర పంచ విభాగములుగా రూపొం దెను. ఈ తత్వములద్వారా జీవుడు ప్రాపంచిక పదార్ధములను పభోగించును. ఇంద్రియ దమనము మఱియు మనోనిగ్రహము ద్వారా జీవుడు జ్ఞానము నార్జించినప్పుడు, పరమాత్మయగు శివుని యందాతడు శాశ్వతముగా విశ్రమించును. తనశరీరమునందు శివుడు సర్పమును ధరించుటలోగల గూడార్ధమిదియే.

శివుడు పూర్ణముగా నిర్భయుడు. "బ్రహ్మము అభయము మరియు అమృతమ"ని శ్రుతులు వచించును. ప్రాపంచిక ప్రజలు



సర్పమును చూచుటతోడనే భయపడుదురు. కాని శివుడు సర్పములను తన శరీరము పై ఆభరణములవలె ధరించును. దీనిచే శివుడు పూర్ణముగా నిర్భయుడు మరియు అమరుడని సూచింపఁబడుచున్నది.

సామాన్యముగా సర్పములు వందలకొలది సంవత్సర ములు జీవించును. శివుడు సర్పములను ధరించుటచే ఆతడు శాశ్వతు-డని తెలియుచున్నది. ఈ కారణము చేతనే ఆతడు సర్ప భూషణుడని చెప్పఁబడును.

## భస్మము, నంది మున్నగు వాటి అంతరార్థము

"నమఃశివాయ" యనునది శివమంత్రము. "న" పృథ్వీని మరి-యు బ్రహ్మను సూచించును. "మ" జలమును మరియు విష్ణువును సూచించును. "శి" అగ్ని మఱియు రుద్రుని సూచిం చును. "వా" వాయువు మరియు మహేశ్వరుని సూచించును. "య" ఆకాశమును, సదాశివుని మఱియు జీవుని కూడా సూచించును.

శివుడు తెలుపువర్ణమును కలిగియుండును. తెలుపురంగు యొ-క్క అంతరార్థమేమి? ప్రజలు శుద్ధమైన హృదయమును మరియు పరిశుద్ధ మైన భావములను కలిగియుండి కపటము, మంత్రాంగ-ము, మోసము, ద్వేషము, అసూయ మున్నగు వాటిచే విముక్తులై యుండవలయునని అతడు మౌనముగా బోధించును.



శివుడు తన నుదుట మూడు రేఖలలో తెల్లటి భస్మమును, లేక విభూతిని ధరించును, దీనియొక్క అంతరార్థమేమి? ఆణవ, కర్మ మఱియు మాయయనెడి మలత్రయమును నశింపఁ జేయవల-

యుననియు, ధనేషణ, దారేషణ, పుత్రేషణ యనెడి ఈ షణ త్రయములను వర్జింపవలయుననియు, లోకవాసన, దేహ వాసన, శాస్త్రవాసన యనెడి వాసన త్రయమును త్యజింపవలయు ననియు మఱియు పరిశుద్ధ హృదయముతో పరమేశ్వరుని దరిఁ జేర వలయుననియును ఆతడు మనకు మౌనముగా బోధించు చున్నాడు.

శివాలయములోని గర్భగృహమునకు ముందుండు బలి పీఠముయొక్క భావార్థమేమి ? ప్రజలు దేవుని దరిఁ జేరుటకు ముందు తమ అహంకార, మమకారములను పరిత్యజింప వలయును. ఇదియే దీని అంతరార్థము.

శివలింగమునకు ముదుండునంది, లేక వృషభము దేనిని సూచించును? నంది శివుని ద్వారపాలకుడు. అదిశివునికి వాహనము. అతడు సత్సంగమును సూచించును. సత్పురుషులతో సహవాసమొనర్తు వేని, నీవు దైవ సాక్షాత్కారమునుఁ బడయుట నిశ్చయము. ఆతనిని చేరుటకు సత్పురుషులు నీకు మార్గమును చూపుదురు. నీ మార్గము నందున్న చిక్కులను మరియు గోతులను వారు తొలగింతురు. వారు నీ సంశయములను నివారించి, నీ హృదయమునందు వివేక వైరాగ్య విజ్ఞానములను ప్రతిష్ఠింతురు. నిర్భయత్వము మరియు అమృతత్వమనెడి తీరమునుచేరుటకు సత్సంగమును మించిన సురక్షితమైన నావ మరియొకటి లేదు.

***శివుడు - శివపూజ***

సత్పురుషులతో క్షణకాలము సత్సంగమొనర్చినను అది ముము-

క్షువులకు మఱియు ప్రాపంచిక మనుజులకు గొప్ప వరప్రసాదము వంటిది. సత్సంగము ద్వారా వారికి దేవుని ఉనికి యందు దృఢని-శ్చయ మేర్పడును. సత్పురుషులు ప్రాపంచిక సంస్కారములను తొలగింతురు. మాయా వ్యామోహమునుండి రక్షింపఁబడుటకు సత్సంగమొక బలిష్ఠమైన దుర్గమువంటిది.

శివుడు సంహార కార్యమునకు ప్రతీకమువంటివాడు. కైలాసప-ర్వత శిఖరము నందాతడు ధ్యానమగ్నుడై యున్నట్లు చూడఁబడును. ఆతడు ప్రశాంతత, త్యాగము మఱియు ప్రాపంచిక విముఖత్వమునకు చిహ్నమువంటివాడు. తన ఫాలభాగమునం-దున్న మూడవనేత్రము సంహారకార్యమునకు

కేంద్రమువంటిది. ఆ నేత్రము తెరువఁబడినప్పుడు, దాని సం-హారశక్తి చే ప్రపంచమునకు వినాశ మేర్పడును. నంది అతనికి ప్రియమైనది. అది ఆతనికి ద్వారపాలకుడు. ఈశ్వరుని సమాధికి భంగముకలుగకుండా ఆతడు నిశ్శబ్దముగా కూర్చొనియుండును. శివునికి ఐదు ముఖములు, పది చేతులు, పది నేత్రములు మరి-యు రెండు పాదములున్నవి.

వృషభము ధర్మ దేవతను సూచించును. శివుడు ఎద్దుపై సవారి చేయును. ఎద్దు ఆతనికి వాహనము. దీనిచే శివుడు ధర్మ సంరక్ష-కుడనియు, ధర్మ స్వరూపుడనియును సూచింపఁ బడుచున్నది.

## శివుడు - శివపూజ

జింక వేదములను సూచించును. దాని నాలుగు కాళ్ళే నాలుగు

వేదములు. శివుడు తన చేతియందు జింకను ధరిం చును. దీని చే ఆతడు వేదములకు ప్రభువని తెలియుచున్నది.

ఆతని ఒక చేతియందు ఖడ్గము కలదు. దీనిచే అతడు జనన మరణములను రహితమొనర్చునని తెలియుచున్నది. బంధ నములన్నింటిని భస్మమొనర్చి, జీవులను సంరక్షించునని ఆతని ఒక చేతియందున్న అగ్ని సూచించుచున్నది.

## అభిషేకము యొక్క అంతరార్థము

పార్వతీ ప్రియుడును, పశుపతియు, ఆనంద పూర్ణుడునగు శివు-నికి స్తుతులు మఱియు సాష్టాంగ ప్రణామములు.

"అలంకార ప్రియోవిష్ణుః, అభిషేక ప్రియోశివః" విష్ణువు అలం-కార ప్రియుడు (మంచిదుస్తులు, అందమైన ఆభరణములు మున్నగునవి.) శివుడు అభిషేకప్రియుడు, శివాలయములలో శివ-లింగమునకు పైన ఒక రాగి, లేక ఇత్తడిపాత్రకు దిగువనున్న రంధ్రమునుండి నీరు రాత్రింబగళ్ళు కారునట్లొనర్తురు. లింగము-పై నీరు, పాలు, నెయ్యి, పెరుగు, తేనె, టెంకాయనీరు, పంచామృ తము మున్నగువాటిని ఒలకబోయుటయే అభిషేక మనబడును. వాటిచే శివునికి

***శివుడు - శివపూజ***

అభిషేకమొనర్పఁబడును. అభి షేకముతో పాటు రుద్రము ఉచ్చ-రింపఁబడును. అభిషేకముచే శివుడు సంతుష్టు డగును.

సముద్రమునుండి బయల్వెడలిన విషమును శివుడు పాన మొనర్చెను. అప్పుడాతని శిరస్సు చల్లఁబడుటకై తన తలపై 'గం-గను మఱియు చంద్రుని ధరించెను. ఆతనికి అగ్నితో సమానమైన మూడవ నేత్రమున్నది. నిరంతరము అభిషేక మొనర్చుటచే ఈ నేత్రము చల్లఁబడును.

హృదయపద్మము నందున్న ఆత్మలింగము పై శుద్ధ ప్రేమ జలము ఒలకఁబోయుటయే మహోన్నతమైన అభిషేకమగును. నానావిధ పదార్థములచే ఒనర్పఁబడు | భౌతికమైన అభిషేకము శివుని పై భక్తి శ్రద్ధలను పెంపొందించు టకై సహకరించి, తుట్టతు-దకు శుద్ధమైన ప్రేమ ప్రవాహమనెడి శాశ్వత అభిషేకమునకు కారణమగును.

అభిషేకము శివపూజయందొక అంశము. అభిషేకము వినా శివ-పూజ అసంపూర్ణముగానుండును. అభిషేకమొనర్చున ప్పుడు స్వర యుక్తముగాను మఱియు క్రమబద్ధముగాను రుద్రము, పురుష సూక్తము, చమకము, మహామృత్యుంజయ మంత్రము మున్నగున-వి ఉచ్చరింపఁబడును. సోమవారము మరియు నెలకు రెండుమార్లు వచ్చునట్టి ప్రదోష సమయము (త్రయోదశి) శివునికి మిక్కిలి పవిత్రమైనది. ఈ రోజులలో శివభక్తులు ప్రత్యేకపూజ, అభి షేకము, ఏకాదశరుద్రము, అర్చన, పుష్కలమైన ప్రసాదము మరి-యు వివిధజ్యోతులచే శివుని పూజింతురు.

ఏకాదశ రుద్రాభిషేకమునందు ప్రతిరుద్రము నందు అభిషేక-మునకు భిన్నభిన్నమైన పదార్ధములనుపయోగింతురు. అభిషేకమునకై గంగాజలము, పాలు, నెయ్యి, తేనె, గులాబి జలము, టెంకాయనీరు, చందనద్రవ్యము, పంచామృతము, సుగంధద్ర-వ్యము, చెఱకురసము మఱియు నిమ్మరసములను వాడుదురు. ప్రతి అభి షేకముయొక్క అంతమునందు శుద్ధమైన జలము శివు-ని మస్తకముపై పూరింపఁబడును. రుద్రము ఒక సారి ఉచ్చరింపఁబడినప్పుడు, రుద్రము యొక్క ప్రతి వాక్యము చివర అభిషేకమునకై ఒక్కొక్క రకమగు పదార్ధము వాడబడును. అభిషేక మొనర్పఁబడిన జలమును మఱియు ఇతర పదార్ధము లను ప్ర-సాదముగా స్వీకరించుటచే భక్తులకు మిక్కిలి శ్రేయస్సు కలుగును. అది హృదయమును శుద్ధమొనర్చి, అసంఖ్యాకముల-గు పాపములను నశింపఁ జేయును. నీవు దానిని మిక్కిలి భక్తి శ్రద్ధలతో సేవింపవలసియుండును.

నీవు మిక్కిలి భక్తిశ్రద్ధలతో అభి షేక మొనర్చినప్పుడు నీ మన-స్సు కేంద్రీకరింపఁబడును. శివుని రూపముతోను, దివ్య భావములతోను నీ హృదయము నింపబడును. నీ శరీరమును, దా-ని సంబంధమును మఱియు దాని పరిసరములను నీవు మరిచి పోవుదువు. అహంకారము క్రమక్రమముగా నశించును. నిన్ను నీవు మఱచినప్పుడు నీవు శాశ్వతమైన శివానందము నొందుదువు. రు-ద్రము, లేక ఓం నమఃశివాయ ఉచ్చారణచే మనస్సు సత్యముచే నింపఁబడి, పరిశుద్ధమగును.

ఏదోయొక వ్యాధిచే బాధపడుచున్న వ్యక్తి పేరుతో రుద్ర పాఠ-

యుక్తముగా నీవు అభిషేకమొనర్తువేని, అతడా వ్యాధినుండి



విముక్తుడగును. నయము కాని వ్యాధులు అభిషేకముచే నయమగును. అభిషేకముచే ఆరోగ్యము, ఐశ్వర్యము, అభ్యుదయము, సంతానము మున్నగునవి కలుగును. సోమవారము రోజు చేయు అభిషేకము మిక్కిలి శుభంకర మైనది.

దేవునికి పంచామృతము, తేనె, పాలు మున్నగువాటిని సమ-ర్పించుటచే నీ శరీరభావన నశించును. స్వార్థపరత్వము మెల్ల మెల్లగా సన్నగిల్లును. నీకు అమితానందము కలుగును. దేవునికి . నీవు సమర్పించుకొను పదార్థములసంఖ్య పెంపొందును, అప్పు-డు స్వార్థత్యాగము మఱియు ఆత్మ సమర్పణము నీ యందు ప్రవేశిం చును. ఆ సమయమునందు స్వాభావికముగా "నేను నీవా-డను. దేవా! అంతయు నీదే ప్రభూ!" అనెడి హృదయోద్గార మేర్పడును.

దక్షిణభారతములోని కాళహస్తిలోనున్న శివలింగమునకు మహాభక్తుడును, వేటకాడునైన కన్నప్పనాయనారు తననోటిలోని జలముచే అభిషేకమొనర్చి, శివుని సంతుష్టిపరచెను. శివుడు శు-ద్ధమైన భక్తిచే సంతృప్తినొందును. మానసిక భావమే ప్రధానము, కాని బాహ్యాడంబరముకాదు. శివుడు దేవాలయములోని పూజారి తో ఇట్లనెను. “నా ప్రియభక్తుడైన కన్నప్పనోటి నుండి వచ్చిన ఈ జలము గంగాజలము కంటెను మిక్కిలి పవిత్రమైనది.”

శివునికి అభిషేకమొనర్చుటలో భక్తుడు క్రమము తప్ప రాదు.

అతడు రుద్రమును, చమకమును కంఠస్థమొనర్చవల యును. ఏకాదశ రుద్రము మిక్కిలి శక్తిమంతము మఱియు ప్రభావశీలమైన-ది. ఉత్తర

***శివుడు - శివపూజ***

భారతములోని ప్రతి స్త్రీ, పురుషుడు ఒక చెంబుతో నీరు తీసుకొని శివలింగమునకభిషేక మొనర్చును. దీనిచేత కూడా లాభ దాయక-ములగు ఫలితములు కలుగును. మఱియు కోరికలు సిద్ధించును. శివరాత్రిరోజు ఒనర్పఁబడిన అభిషేకము మిక్కిలి ప్రభావంతమైన-ది.

ప్రతిప్రాణియందును, ప్రతిచరాచర జీవియందును వ్యక్తమై యున్న శివుని మహిమనుగూర్చి వర్ణించునట్టి రుద్రపాఠమును మీరందరు ఉచ్చరింతురుగాక! మీరు ప్రతి నిత్యము అభిషేక మొ-నర్చి, శివుని అనుగ్రహమును పొందుదురుగాక! విశ్వనాథుడు మిమ్ములనందరిని ఆశీర్వదించునుఁగాక!

## శివాలయములో అభిషేకము మఱియు రుద్రజపమొనర్చినచో కలుగు ఫలము

చమకమునందు పదునొకండు విభాగములుకలవు. వీటిలో ప్ర-తియొక్కటి నమకము (రుద్రము)చే కలుపఁబడి ఉచ్చరింపఁబడును. ఇది రుద్రమని చెప్పఁబడును. ఇట్టి పదునొ

కండు రుద్రములుకలిసి ఒక లఘురుద్రమగును. పదునొకండు లఘురుద్రములు కలిసి ఒక మహారుద్రమగును. పదునొకండు మహారుద్రములు కలిసి ఒక అతిరుద్రమగును.

## *శివుడు - శివపూజ*

ప్రారంభమునందు సంకల్పము, పూజ, న్యాసము, అంగము, పంచామృతస్నానము, ధ్యానమొనర్చిన అనంతరము రుద్రము-ను ఉచ్చరింపవలయును. రుద్రజపముయొక్క ఫలము

ఈ దిగువ ఉదహరింపఁబడినది :-

| **సంఖ్య** | **జపఫలము** |
|---|---|
| 1. రుద్రము | బాలగ్రహ (పిల్లల రోగములు) విముక్తి. |
| 2. రుద్రములు | తనకు కలుగనున్న కష్టములు నివారింపఁబడును. |
| 5. రుద్రములు | దుష్టగ్రహముల యొక్క దౌష్ట్యము తొలగిపోవును. |
| 7. రుద్రములు | మహాభయము నుండి విముక్తి కలుగును. |
| 9. రుద్రములు | వాజపేయ యాగమొనర్చిన ఫలము మఱియు మనశ్శాంతి కలుగును. |

| | |
|---|---|
| 11 రుద్రములు | రాజుల అనుగ్రహము మఱియు గొప్ప ఐశ్వర్యము పొందఁబడును. |



| | |
|---|---|
| 33 రుద్రములు | కోరిన పదార్థములు లభించును. మఱియు శత్రునాశ మేర్పడును |
| 77 రుద్రములు | మహానందము ననుభవించుట జరుగును. |
| 99 రుద్రములు | పుత్రులు, మనుమలు, ధనము, ధాన్యము, ధర్మార్థ కామ మోక్షములు కలిగి, మృత్యువు నుండి విముక్తి కలుగును. |
| 1 మహారుద్రము | రాజుల అనుగ్రహము కలిగి, మహదైశ్వర్యమునకు ప్రభువగును. |
| 3 మహాౄరుదములు | అసాధ్యమైన కార్యములు సాధింపఁబడును. |
| 5 మహారుద్రములు | విశాలమైన భూములు ప్రాప్తించును. |
| 7 మహారుద్రములు | సప్తలోకములు ప్రాప్తించును. |

9 మహారుద్రములు జనన మరణ రాహిత్యము

## *శివుడు - శివపూజ*

1 అతి రుద్రము దైవసాక్షాత్కారము

అభిషేకమునకు కావలసిన

పదార్థములు : శుద్ధజలము, పాలు,

చెఱుకురసము, నెయ్యి, తేనె, పవిత్ర-మైన నదులలోని నీరు, సముద్రజలము,

వర్షము కురియుటకై శుద్ధజలముతో అభిషేకమొనర్పబడ వల-యును. రోగవిముక్తుడగుటకు మరియు సంతానప్రాప్తికి పాలతో అభిషేకమొనర్పవలయును. పాలతో అభిషేక మొనర్చి నచో గొ-డ్రాలుకు కూడా సంతానము కలుగును. పురుషుడు పుష్కలమైన గోసంపదను పొందును. కుశాజలముతో అభిషేకమొనర్చినవాడు సమస్తరోగముల నుండి విముక్తుడగును. ఐశ్వర్యమును కాంక్షిం-చువాడు, నెయ్యి, తేనె మఱియు చెఱకు రసముతో అభిషేకమొనర్పవలయును. మోక్షమును కాంక్షించు వాడు పవి-త్రమైన జలముతో అభిషేక మొనర్పవలయును.

# 5వ అధ్యాయము
# శివతాండవ దర్శనము
# శివతాండవ తత్త్వజ్ఞానము

## I

శ్లో॥ పాదస్యావిర్భవంతీ మవనతిమవనే
రక్షతః స్వైరపాతైః,
సంకోచేనైన దోష్ణాంముహురభి
నయతః సర్వలోకాతిగానామ్ ।
దృష్టిం లక్ష్యేవునోగ్ర జ్వలనకణము చం
బధ్నతోదాహభీతే
రిత్యాధారాను రోధాత్ త్రిపుర విజయినః
పాతువోదుఃఖవృత్తమ్ ॥

శివుని తాండవనృత్యము పులకరింపును కలుగఁ జేయున దిగ-

ను, ఉజ్జ్వలమైనదిగను, స్వరవిన్యాసము మనోహరమైనదిగను మఱియు నిశితమైన ప్రభావమును కలుగఁజేయునదిగను ఉన్నది.

ఆంతరిక దివ్యభావమునననుసరించి శరీరములోని వివిధములైన అవయవములను చిత్రవిచిత్రముగా చలింపఁ జేయుటయే నృత్యము, లేక తాండవమనఁబడును. నృత్యము ఒక దివ్యమైన విజ్ఞానము. శివుడు,

## *శివుడు - శివపూజ*

కృష్ణుడు మఱియు కాళీమాత ఈ దివ్యమైన నృత్యమునకు ఆదిగురువులు. నృత్యమునందు సృష్టి. సంహారము విద్య '' తి మరియు అగతియనెడి షడ్భావములు ప్రదర్శింపఁబడును.

ప్రపంచ శ్రేయస్సుకొరకై శివుడు నాట్యమొనర్చును . మాయాబంధనమునుండి మఱియు ఆణవ, కర్మ, మాయయనెడి త్రివిధ బంధనములనుండి జీవులను విముక్తినొందించుటయే ఆతని నృత్యముయొక్క ఉద్దేశ్యము. ఆతడు సంహారకర్త కాడు, కాని పునరుద్ధారకుడు. ఆతడు మంగళదాత మరియు ఆనందదాత. ఆతడు విష్ణువుకంటెను సులభముగా ప్రీతినొందును. కొద్దిపాటి తపస్సునొనర్చినను, లేక కొద్ది పంచాక్షరి మంత్రమును జపించినను అతడు శీఘ్రముగా వరములను ప్రసాదించును..

“అగడభం” అనునది అతని నాట్యముయొక్క పాట. శివుడు నాట్యమును ప్రారంభించినప్పుడు బ్రహ్మ, విష్ణువు, శివగణ ములు, మరియు తలపుర్రెను ధరించిన కాళి ఆతనిని కలియు దురు. ప్రదోష నృత్యముయొక్క పటమును నీవు చూడలేదా? దానిచే శివుని

నాట్యములోని భావము నీకు స్పష్టముగా ప్రదర్శితమగును.

కాళి తననాట్యచాతుర్యమును గూర్చి గర్వమును కలిగి యుండె-ను. ఆమె యొక్క గర్వమునణచుటకై శివుడు నాట్యమొన ర్చుట ప్రారంభించెను. అతడు మనోరంజకముగాను, కళా కౌశలముతోను నాట్యము చేసెను. కాళి సిగ్గుచే తలవంచుకొన వలసి వచ్చెను.

## *శివుడు - శివపూజ*

ఎడమ భాగమునందున్న పై హస్తమునందు శివుడు జింకను ధరించును. కుడివైపునందున్న క్రింది చేతి యందాతడు త్రిశూ-లమును ధరించును. అగ్ని, డమరు, మాలు (ఒకవిధమైన ఆయుధము) అతని చేతులయందున్నవి. ఆతడు ఐదుసర్పము-లను ఆభూషణములుగా ధరించును. ఆతడు తలపుర్రెలమాలను ధరించును. నాగుబామును ధరించియున్నట్టి మూయలకుడనెడి మరుగుజ్జుడగు రాక్షసుని ఆతడు తనపాదములతో అణచి వేయు చుండును. ఆతడు దక్షిణాభిముఖుడై యుండును. స్వయముగా పంచాక్షరియే ఆతని శరీరము. శివుడిట్లనెను: - సర్పములవలె బు-సకొట్టుచున్న పంచేంద్రియములను నిగ్రహించుడు మనస్సు జింకవలె గంతులు వేయును. మనస్సును నిగ్రహించుడు. ధ్యాన-మనెడి అగ్నియందు దానిని భస్మమొనర్చుడు. వివేకమనెడి! త్రిశూలముచే దానిని కొట్టి క్రిందపడవేయుడు. అప్పుడు మీరు నన్ను చేరగలుగుదురు." ఇది శివుని పటములోని తత్త్వజ్ఞాన రహ-స్యము.

నీవు శివుని నాట్యమును సముద్ర తరంగములలోను, మానసిక చంచలతయందును, ప్రాణేంద్రియ చలనము నందును నక్షత్ర-ములు మరియు తారాగణభ్రమణమునందును, విశ్వప్రళయమునందును, అంటువ్యాధులలోను, భయంకరమైన వెల్లువలు మరియు అగ్నిపర్వతో ద్భేదములలోను, భూకంపము లలోను, భూపతనములలోను, మెరుములు మఱియు ఉరుముల లోను, దావాగ్నులు మఱియు సుడిగాలులలోనుఁగాంచ వచ్చును.

## శివుడు - శివపూజ

త్రిగుణములు సమాన స్థాయియందుండు గుణసామ్యావస్థ, ఈశ్వర సంకల్పముచే చెదరగొట్టబడినప్పుడు గుణములు వ్యక్తమై, పంచీకరణమునకు కారణమగును. అప్పుడు శబ్ద బ్రహ్మము, లేక ఓంకారధ్వని ఉత్పన్నమగును. ప్రధానశక్తి వ్యక్తమగును. ఇదియే శివునినాట్యము. సమస్త విశ్వముయొక్క లీలానాటకమే శివుని నృ-త్యము. సమస్త విశ్వ చలనముల న్నియును ఆతని నృత్యమే. ఆతడు ప్రకృతిపై చూడ్కులను నిగిడించి, ఆమెను శక్తివంతమొ-నర్చును. మనస్సు, ప్రాణము జడపదార్థమున్నూ నాట్యమొనర్చుట ప్రారంభించినప్పుడు శక్తి తత్త్వము వ్యక్తమగు-ను. శక్తి నుండి నాదము, నాదమునుండి బిందువు ఉత్పన్న మగును. అప్పుడు నామరూప జగత్తు వ్యక్తమగును. అభిన్నమైయు-న్న జడపదార్థము, శక్తి మరియు శబ్దము భిన్నత్వము నొందును.

శ్మశానవాటికలు శివునికి స్థానములు. ఈశ్వరుని సంహా రాత్మక-

మగు అంశమే రుద్రుడు. శివుడు తన దశ భుజరూపము నందు కాళితో కలిసి శ్మశానమునందు నృత్యమొనర్చును. ఆ నాట్యము నందు శివగణములు కూడా వచ్చి కలియును.

చిదంబర నటరాజు మిక్కిలి చతురుడైన నటుడు. అతనికి నాలుగు చేతులుండును. అతడు తన జటలపై గంగాదేవిని మఱియు అర్ధ చంద్రుని ధరించును. ఆతడు తన కుడిచేతియందు డమరును ధరించును. లేవనెత్తఁబడిన ఎడమచేతితో అతడు తన భక్తులకు అభయ ముద్రను ప్రదర్శించును. దీని అంతరార్ధ మేమనగా "ఓ భక్తులారా! భయపడకుడు. నేను మిమ్ములనందరిని రక్షింతును." ఒక

## శివుడు - శివపూజ

ఎడమ చేతియందు అగ్ని ఉండును. కుడి చేయి నాగుపామును ధరించినట్టి మూయలకుడనెడి అసురుని ఉద్దేశించి చూపును. అతడు తన ఎడమ పాదమును రమణీయముగా పైకెత్తి యుంచును.

మరుధ్వని జీవులను అతని పాదముల వైపు ఆహ్వానిం చును. అది ఓంకారమునకు ప్రతీకము. సంస్కృత అక్షరములన్ని యును డమరును వాయించుటచే బయలుదేరినవి. డమరుచే సృష్టి ఉత్పన్నమైనది. అభయముద్రను సూచించు హస్తము మనలను సంరక్షించును. అగ్నినుండి సంహారము ప్రారంభ మగును. పైకి లేపబడిన పాదము మాయను సూచించును. అధోభాగమును ఉద్దేశించి చూపు హస్తముచే తన పాదములే జీవులకు శరణ్యమను

విషయము సూచింపఁబడును. తిర్యక్షి ఓంకారము, లేక ప్రణవము-ను సూచించును.

దక్షిణ దేశమునందు చిదంబరము పవిత్రమైన యాత్రా స్థల-ము. నటరాజును స్తుతించుచు తమిళ సాధువులందరును పాటలను రచించిరి. ఇచ్చట ఒక ఆకాశలింగమున్నది. శివుడు ని-రాకారుడనియు, నిర్గుణుడనియును ఇది సూచించును. ఒక ప్రఖ్యాతమైన వాక్యమేమనగా:- "ఎవడు కాశీలో తన హృద యము-లోను, పెదవుల పైనను రామనామమునుచ్చరించుచు తనువును త్యజించునో, ఆతడు ముక్తినొందును. అరుణాచలము, లేక తిరు-వణ్ణామలైని స్మరించువాడు మోక్షమునొందును. ఎవడు నటరాజును దర్శించుకొనునో, అతడు పరమ ధామము నొందు-ను." నిజమైన చిదంబరము హృదయము నందున్నది. అహంకారము, మోహము, ద్వేషము, గర్వము మఱియు



అసూయలను భస్మమొనర్చినట్టి భక్తుల హృదయములలో నట-రాజు నాట్యమాడును.

ఆతడు మిక్కిలి నిదానముగా నాట్యమొనర్చును. ఒకవేళ అత-డు ప్రచండముగా నాట్యమొనర్చినచో పృథ్వియంతయు వెంటనే కృంగిపోవును. ఆతడు తన నేత్రములను మూసికొని నాట్యమొ నర్చును. ఏలననగా ఆతని నేత్రములనుండి వెలువడు మిణుగు-రు లచే విశ్వమంతయు దహింపఁబడును. సృష్టి, స్థితి, సంహార, తిరోభావ, అనుగ్రహములనెడి పరమేశ్వరుని పంచవిధములగు క్రి-

యలే శివుని నాట్య భంగిమలు.

శివుని నాట్యమునందున్న నిజమైన అంతరార్థమును మీరంద-ఱు గ్రహింతురుఁగాక ! మీరందఱు తన్మయులై శివునితో కలసి నాట్య మొనర్చి ఆతనియందు లయించి, జీవిత పరమ లక్ష్యమగు శివానందము ననుభవింతురుఁగాక !

## II

శివుడు విజ్ఞాన స్వరూపుడు. అతడు జ్యోతులకు జ్యోతి. ఆతడు స్వయంజ్యోతి. శివ తాండవము ప్రాపంచికశక్తియొక్క కదలికను మఱియు తాళబద్ధతను సూచించును. ఆతని నాట్యముచే దుష్టశ-క్తులు మఱియు అంధకారము పెళ్ళగింపబడి నశించును.

### *శివుడు - శివపూజ*

బ్రహ్మదేవుని రాత్రియందు, లేక ప్రళయ కాలమునందు ప్రకృతి జడమై, చలనరహితమై యుండును. అదిగుణ సామ్యావస్థ యనఁ-బడును. త్రిగుణములు సమానస్థాయియందుండును. శివుడు సంకల్పించునంతవరకు ఆమె నృత్యమొనర్పజాలదు. శివుడు తన కాష్ఠమౌనమునుండి మేల్కొని నృత్యమొనర్చుటకు ప్రారం-భించును. డమరుయొక్క కదలికచే అభిన్నరూపమునం దున్న శబ్దము భిన్నత్వమునొందును. శబ్దబ్రహ్మము వ్యక్తమగను. అభి-న్నరూపము నందున్న ప్రాణశక్తి కూడా భిన్నత్వమునొందును.

గుణసామ్యావస్థ క్షోభించును. సత్త్వరజస్తమములనెడి త్రిగుణములు వ్యక్తమగును. అణువులు, పరమాణువులు మఱియు లోకములన్నియును క్రమబద్ధముగాను, తాళయుక్తముగాను నృత్యమొనర్చును. అణువులు పరమాణువులయందును, పరమాణువులు అన్ని శరీరములలోను నాట్యమాడును. నక్షత్రములు దేశకాలములలో నృత్యమొనర్చును. ప్రకృతికూడా ఆతని యొక్క విభూతిని, లేక మహిమను వర్ణించుటకై నాట్యమాడును. ప్రాణము ఆకాశము, లేక సూక్ష్మాంశమునందు వ్యక్తమగుటకు ప్రారంభించును. నానావిధరూపములు వ్యక్తముల గును. హిరణ్యగర్భుడు, లేక విశ్వమనస్సు కూడా వ్యక్తమగును.

సమయమేతెంచినప్పుడు శివుడు నాట్యమొనర్చుచు, అగ్ని ద్వారా సమస్త నామరూపములను భస్మమొనర్చును. అప్పుడు మరల ప్రశాంతత ఏర్పడును.

## *శివుడు - శివపూజ*

నటరాజరూపమునందు ఇట్టి అంతరార్థమున్నది. శివుని - హస్తములోని జింక అశుద్ధమాయను సూచించును. గొడ్డలి, అజ్ఞానమును నశింపజేయు జ్ఞానమును సూచించును. డమరు, అగ్నిని ధరించియున్న హస్తము, గంగాజలము, గొడ్డలిగల చేయి, మూయలకాసురుని పైనున్న పాదము ఇవన్నియును రూపములేని సూక్ష్మ పంచాక్షరములనబడును.

డమరునందు సృష్టికలదు. అభయహస్తమునందు స్థితి యున్నది. గొడ్డలిని ధరించిన చేతియందు సంహారము కలదు. అణచనున్న పాదము నందు తిరోభావమున్నది. పైకి లేపఁబడిన పాదమునందు అనుగ్రహమున్నది.

శివుని నృత్యములు నానావిధములు, సంహారనృత్యము, పంచవిధనృత్యములు, షడ్విధనృత్యములు, అష్టవిధ నృత్య-ములు, కోడుకొట్టి నాట్యము, పందంనాట్యము, కోడునాట్యము మున్నగు రకములగు నాట్యములున్నవి. సమస్తము నశించిన తర్వాత ఓనర్పబడునది కోడుకొట్టి నాట్యమనఁబడును. ముల్లోక-ములు నశించిన తర్వాత, ఆలోకముల భస్మమునుధరించి చేయు నాట్యము నాట్య మనఁబడును. చేతియందు బ్రహ్మయొక్క శిర-స్సును ధరించి చేయునది కోడు లేక కపాల నాట్యమనఁ బడును. ప్రళయ కాలమునందొ నర్పఁబడునది సంహార నాట్యమ

సృష్టి, స్థితి, సంహార, తిరోభావ, అనుగ్రహ, ముని తాండవము, అనవరత తాండవము, ఆనంద తాండవములనెడి అష్టవిధ



నృత్యములు కలవు. శివానంద నాట్యము, సుందర నాట్యము, సు-వర్ణపురి నాట్యము, బంగారు చిదంబరనాట్యము మఱియు ఆశ్చర్యకర నాట్యములనెడి పంచవిధ నాట్యములు కలవు. ఈపం-చవిధ నాట్యములలో ఆనంద నాట్యమును చేర్చినప్పుడు షడ్విధ నాట్యములగును.

శివుడు మాత్రమే నర్తకుడు. ఆతడు మిక్కిలి చతురుడైన నర్త-

కుడు. ఆతడు నర్తక శిరోమణి, ఆతడు కాళియొక్క గర్వమున ణచి వేసెను. శివుని సంహారక్రియ ఏకైకము కాదు. అది అనేక క్రియల పరంపర. ఒక్కొక్క భూమికయందు ఒక్కొక్క రకమగు నాట్యముం-డును.

శాశ్వతమగు శివానందము నొందుటకే మహానర్తకుడు నటరా-జు నీకు సహకరించునుగాక !

## మహా నర్తకుడగు నటరాజు

"ననుఃశివాయ"లోని "య" అను అక్షరము జీవుని సూచించు-ను. పంచాక్షరియగు "నమః శివాయ"యే శివునికి దేహము, అగ్నిని ధరించు హస్తమే "న" మూయలరాక్షసుని అణచునట్టి పాదమే "మ", డమరును ధరించునట్టిహస్తమే "శి", ఇటునటు చలించు కు-డి, ఎడమ చేతులే "వా" అభయమును ప్రదర్శించునట్టి హస్తమే "య"

### *శివుడు - శివపూజ*

ఒకప్పుడు ఋషుల సమూహము నిజమైన దేవునియందు తమ విశ్వాసమును కోల్పోయి, క్షుద్ర దేవతలను ఉపాసింపనా రంభించిరి. శివుడు వారికొక పాఠమును నేర్పదలంచెను. ఆతడు వారియందు విచిత్రమైన మోహమును రేకెత్తించెను. ఋషులు మి-

క్కిలి ఉగ్రులైరి. వారు తమ తపోబలముచే అనేక దుష్ట శక్తులను సృష్టించి, వాటిని శివునిపై వదలిరి. శివుడు వాటన్నింటిని జయిం-చి, తుట్టతుదకు విశ్వ నృత్యము ద్వారా ఋషులు సృష్టించిన మహాకాళిని ఓడించెను.

నటరాజు నాట్యమాడునప్పుడు పతంజలిఋషి మఱియు వ్యాఘ్రపాదుడు ఆ నాట్యమును చూచి ఆనందించుచుండిరి. వా-రు శివునికి ఇరువైపుల నిలఁబడియుండిరి. నటరాజమూర్తి యొక్క విగ్రహము మఱియు చిత్రములలో కూడా ఒక వైపు పతంజలి, మరియొక వైపు వ్యాఘ్రపాదుని బొమ్మలుండుటను నీవుఁగాంతువు. వ్యాఘ్రపాదుని దిగువ శరీర భాగము ఒక పులిని మఱి జలియొక్క దిగువ శరీరము ఒక సర్పమును పోలి యుండును,

నటరాజుయొక్క మిక్కిలి ఆశ్చర్యకరమైన నాట్యము ఊర్ధ్వ తాండవమనఁబడును. ఈ నాట్యము నందు ఎడమకాలు పైకెత్తబ-డును. మఱియు కాలిబొటన వేలు ఆకాశమును చూపును. ఇది నాట్యమునందు మిక్కిలి కష్టతరమైన అంశము. నాట్యము లోని ఈ భంగిమచే నటరాజు కాళిని ఓడించెను. నాట్యముయొక్క ఇత-రాంశములన్నిటి యందు కాళీ నటరాజుతో పోటీపడి విజయమునొందెను. నృత్యమొనర్చుచుండగా

**శివుడు - శివపూజ**

నటరాజు తన చెవి పోగును పోగొట్టుకొనెను. సభికులకు తెలియ కుండా తన కాలి బొటన వ్రేలిద్వారా చెవిపోగును యథాస్థానము-నందుంచుటలో నటరాజు విజయము నొందెను.

తన కుడికాలును పైకెత్తి నటరాజు నాట్యమాడెను. ఇది నృ-త్యము నందు గజహస్తభంగిమ యనఁబడును. తన కాళ్ళను మార్చకుండా అతడు అఖండముగా నృత్యమొనర్చెను.

ఏనుగుతలపై శివుని మరియొక నాట్యభంగిమ కలదు. ఈ రూపమునందు శివుడు గజాసనమూర్తి యనబడును. శివుని పాద-ము క్రింద గజాసురుని మస్తకముండును. శివునికి ఎనిమిది చేతులుండును. అతడు తన మూడు కుడి చేతులలో త్రిశూలము, డమరు మఱియు జారుముడిని కలిగియుండును. రెండు చేతుల-లో అగ్ని మఱియు తలపుర్రెయుండును. మూడవ ఎడమ చేయి విస్మయరూపము నందుండును.

కాశీలోని విశ్వనాథ శివలింగము చుట్టు ధ్యానమగ్నులై కూ-ర్చొనియున్న బ్రాహ్మణులను హతమార్చుటకై ఒక అసురుడు ఏనుగురూపమును ధరించెను. శివుడు అకస్మాత్తుగా లింగము నుండి బయటికి వచ్చి, గజాసురుని సంహరించి, చర్మమును తన-కు దుస్తులుగా ఉపయోగించుకొనెను.

***శివుడు - శివపూజ***

## శివుని నృత్యము

(1) పందొమ్మిది వందల ఇరువది నాలుగులో
ఋషీకేశ్లోని వరదలు భయంకరమైయుండెను.

అది అనేక మహాత్ములను, సాధువులను పొట్టబెట్టుకొనెను
ఇదియే శివుని నృత్యము.

(2) ఉగ్రమైన చంద్రభాగా నది,
1948లో ఉప్పొంగెను.
ప్రజలు దానిని అతికష్టముతో దాటిరి.
ఏనుగులసహాయముతో నదినిదాటిరి
ఇదియే శివుని నృత్యము.

(3) 1945 జనవరి 11వ తేదీ ఉదయము,
హిమాలయ ప్రాంగణము నందు,
మంచు వర్షము కురిసెను. విపరీతమైన చలివేసెను. ఇది-
యే శివుని నృత్యము.

(4) ఒకప్పుడు అడవిగానున్న ప్రదేశములో,
ఇప్పుడు విశ్వనాథుడు వెలసియున్నాడు.
అతడు విశ్వశ్రేయస్సు నొసంగును



ఆయురారోగ్యములను ప్రసాదించును
ఇదియే శివుని నృత్యము.

(5) అడవులు ఆశ్రమములగును,

ద్వీపములు సముద్రములగును,
సముద్ర మొక ద్వీపమగును,
పట్టణములు ఎడారులగును,
ఇదియే శివుని నృత్యము.

(6) శివుడు శక్తి పై దృష్టిని సారించును
అప్పుడు అణువులు నాట్యమాడును
ప్రకృతియు నృత్యమొనర్చును
శివుడు కేవలము సాక్షియై యుండును.
ఇదియే శివుని నృత్యము.

(7) ఇంక ప్రాణస్పందనము, మనశ్చలనము,
ఇంద్రియశక్తి, బుద్ధిశక్తి,
హృదయ స్పందనము, ఊపిరితిత్తుల శ్వాస,
ఉదర జీర్ణ శక్తి, ప్రేగుల విసర్జనము,
ఇదియే శివుని నృత్యము.

## శివుడు - శివపూజ

(8) మార్పునొందునదే ఈ ప్రపంచము,
మార్పునొందునదేదో, అది నశించును.
నాశము లేని, మార్పు లేని పదార్థమును
తెలిసికొని అమరుడవగుము.

సర్వవ్యాపకుడగు దేవుని క్రియాశీలతయే శక్తి యనఁ బడును. రూపముఁ దాల్చిన క్రియయే శక్తి యని చెప్పఁబడును. ఆమె ఈ విశాలమైన విశ్వమున కాధారభూతమైయున్నది. ఈ పరాశక్తి వల్లనే ఈ ప్రపంచము నిలిచియున్నది. ఆమె జగజ్జనని, ఆమెయే దుర్గ, కాళి, చండి, చాముండి, త్రిపురసుందరి, రాజ రాజేశ్వరి, అగ్ని మఱియు దాహకశక్తికి భేదము లేనట్లే, దేవుడు మఱియు ఆతని శక్తికి భేదము లేదు.

ఈ విశ్వము యొక్క సృష్టి, స్థితి, సంహారముల నొనర్చు పరాశక్తిని ఉపాసించువాడు శాక్తేయుడనఁబడును. స్త్రీలందఱును ఆదివ్య జననియొక్క రూపములే.

మార్పు లేని చైతన్యమే శివుడు. అతని శక్తియే మార్పు నొంది, మనస్సు మఱియు భౌతికపదార్థముగా కానఁబడును శక్తి వాదము, లేక శాక్తదర్శనము అద్వైతవాదముయొక్క ఒకరూపము.

శరీరము నందున్న శక్తులను మేల్కొలిపి, శివశక్తులను ఐక్యమొనర్చుటకు శాక్తేయుడు సాధన చేయును షడ్చక్రములను భేదించి, కుండలినీశ క్తిని మేల్కొలిపినప్పుడు అతనిసాధన సిద్ధించును. పూర్ణసిద్ధినిఁ బడసిన గురువును ఆదర్శముగాఁగొని దీనిని

## శివుడు - శివపూజ

అనుష్ఠింపవలసియుండును. ధ్యానము, భావము, జపము, మంత్రశక్తులచే శక్తి మేల్కొలుపబడవలయును. వివిధ చక్ర ములలో నానావిధ అక్షర రూపమునందు ఏబది అక్షరముల స్వరూపము-

నుఁదాల్చిన జనని కలదు. ఒక ఆర్మోనియములోని శ్రుతిపేటికలు నొక్కఁబడినప్పుడు, మధురమైన సంగీతము ఉత్పన్నమగును. అదేవిధముగా ఆ యక్షరపేటికలు ఒక క్రమము నందు నొక్కఁబడి-నప్పుడు, ఆయక్షరములకు ఆత్మయైయున్న క్రములలో చలించునట్టి జనని స్వయముగా మేల్కొనును. ఆమె మేల్కొన్న-ప్పుడు సాధకుడు సులభముగా సిద్ధిని బదయం గలుగును. ఏసాధకునికి, ఎప్పుడు, ఎలాటి రూపమునందామె గోచరించునో చెప్పుట కష్టము, శక్తిని విస్తరించుట, రేకెత్తించుట, లేక మేల్కొలు-పుటయే సాధనయఁబడును - సాధనా విధానములు సాధకుని యొక్క సంస్కారములు మఱియు శక్తి సామర్థ్యములపై ఆధార పడియుండును.

మనమీ విశ్వము నందు జీవించుట కేది ఆధారమై యున్న-దో, అదియే శక్తి యనఁబడును. ఈ ప్రపంచమునందు తన బిడ్డ కోరు కోరికలన్నింటిని తల్లి నెరవేర్చును. బిడ్డయొక్క పెరుగుదల, వికాసము, పోషణ వీటినన్నింటిని తల్లి చూచు కొనును. అదే విధ-ముగా జీవితములోని సమస్త ఆవశ్యకతలు, ఈ ప్రపంచములోని క్రియాకలాపములు, వాటికవసరమగు ప్రాణశక్తి, ఇవన్నియును జగజ్జనని, లేక శక్తిపై ఆధారపడి యుండును.

## *శివుడు - శివపూజ*

తల్లియొక్క అనుగ్రహము లేకుండా ఎవ్వడైనను మనస్సు మఱియు మాయాజాలముయొక్క బంధమునుండి విముక్తుడు కా-

జాలడు. మాయయొక్క సంకెళ్ళను ఛేదించుట మిక్కిలి కఠినము. మహామాతగా నీవామెను పూజింతువేని, ఆమెయొక్క శ్రీశ్రీ అనుగ్రహము మఱియు ఆశీర్వాదములచే నీవు సులభముగా ప్రకృతిని అతిక్రమింపఁగలుగుదువు. ఆమె నీ మార్గములోని ఆటంకములను తొలగించి, శాశ్వతానందమనెడి అనంత సామ్రాజ్యమునందు చేర్చి నిన్ను సర్వతంత్ర స్వతంత్రునిఁగావిం చును. ఆమె అనుగ్రహించి, నీ పై ఆశీర్వాదములను ప్రసరింపఁ జేసినప్పుడు మాత్రమే, నీవీ దాటశక్యముకాని సంసార బంధమునుండి విడివడఁజాలుదువు.

ఒక పసిబిడ్డ, లేక చతుష్పాద జంతువు మొట్టమొదట తల్లియను నామమును ఉచ్చరించును. తన తల్లి ప్రేమకు పాత్రము కాని ఏ బిడ్డయైనను కలదా? తల్లియే నిన్ను రక్షించును, ఓదార్చును, ఆమె నీ సమస్త జీవితమునకు ఆదర్శము, సంరక్షకు రాలు, స్నేహితురాలు మఱియు ప్రబోధకురాలు, జగజ్జననియే మానవరూపము నందు తల్లిగా అవతరించును.

పర మేశ్వరుడే శివునిగా వర్ణింపఁబడును. మఱియు ఆతని శక్తియే ఆతని భార్య, బలము, దుర్గ, లేక కాళిగా చెప్పఁబడును. భార్యాభర్తలు తమ కుటుంబ శ్రేయస్సునెట్లు వాంఛింతురో, అట్లే శివుడు మఱియు ఆతని శక్తి ప్రపంచ శ్రేయస్సును వాంఛింతురు.

## శివుడు - శివపూజ

రాధ, దుర్గ, లక్ష్మీ, సరస్వతి మఱియు సావిత్రియనెడి పంచ ప్ర-

ముఖ రూపములు ప్రకృతి, లేక దేవికి సంబంధించి యున్నవి. దుర్గ విష్ణువు ద్వారా మధు, కైటభులను సంహరించెను. మహాల-క్ష్మిగా అవతరించి ఆమె మహిషాసురుని సంహరించెను. ఇక సరస్వతిగా అవతరించి శుంభనిశుంభులను మఱియు వారి సహ-చరులగు ధూమ్రలోచన, చండ, ముండ, రక్తబీజులనెడి రాక్షసులను హతమార్చెను.

విష్ణువు మఱియు మహాదేవుడు అనేక రాక్షసులను సంహ రించినప్పుడు వారి వెనుక దైవీ శక్తియుండెను. దేవి బ్రహ్మ, విష్ణు, రుద్రులను తీసుకొని వెళ్ళి వారికి సృష్టి, స్థితి, ప్రళయ కార్యముల నొనర్చుటకు తగిన శక్తి నొసంగెను. ఆమె విశ్వ మంతటికి కేంద్రమై యున్నది. మన శరీరములలో ఆమె మూలాధార చక్రరూపమునం-దున్నది. ఆమె సుషుమ్నానాడి ద్వారా శరీరమునకు ప్రాణశక్తినొసంగును, మేరు పర్వత శిఖరమునుండి ఆమె విశ్వము-నకు ప్రాణశక్తి నొసంగును.

ఈశక్తి దర్శనసిద్ధాంతమునందు శివుడు సర్వవ్యాపకుడు, అవ్య-క్తుడు, నిష్క్రియుడై యుండును. అతడు శుద్ధ చైతన్యము శక్తి, క్రియాశీలమై యుండును. శివశక్తులు ప్రకాశము మఱియు విమర్శ-మువంటి సంబంధమును కలిగియుందురు. శక్తి, లేక విమర్శము శుద్ధ చైతన్యమునందు సూక్ష్మరూపమునందుండును. విమర్శ-ముచే విభిన్నలోకములు ఉత్పన్నములగును. శివుడే చిత్తు శక్తియే చిద్రూపిణి. బ్రహ్మ, విష్ణు, శివులు శక్తికి విధేయులై తమ శ్రీ సృష్టి, స్థి-తి, ప్రళయ కార్యముల నొనర్తురు. శక్తి ఇచ్ఛ, జ్ఞానము మఱియు క్రియలచే

కూడియుండును. శివశక్తులు ఏకమే శక్తి తత్త్వము మఱియు శివత-త్త్వము విడదీయరానివి. శివుడెల్లప్పుడు శక్తిసమన్వితుడై యుండును. శక్తిదర్శనమునందు ముప్పదియారు తత్త్వములు-న్నవి. శక్తితత్త్వమునందు శక్తి, సదాఖ్య తత్వమునందు నాదము మఱియు ఈశ్వర తత్త్వమునందు బిందువులున్నవి. పరమ శివుని సృష్ట్యంశమే శివ తత్త్వమనఁబడును. శివ తత్త్వమే ప్రథమసృష్టి చలనము. శివసంకల్పమే శక్తితత్త్వము. అది సమస్త ప్రపంచము-నకు బీజము మఱియు గర్భమువంటిది.

ప్రథమ సృష్టి సదాఖ్య, లేక సదాశివతత్త్వమనఁబడును. ఈ తత్త్వమునందు భావములు రూపొందుట ప్రారంభమగును. ఈ తత్త్వమునందు నాదశక్తియుండును. తదనంతరము ఈశ్వరతత్త్వ మేర్పడును. ఈ తత్త్వము బిందువనఁబడును. నాల్గవ తత్త్వము విద్య, లేక శుద్ధ విద్యయనఁబడును. అప్పుడు ప్రకృతి మనస్సు, ఇంద్రియములు మఱియు జడపదార్థముగా మార్పు నొంది, ఈ ప్ర-పంచ నిర్మాణము నొనర్చును.

శక్తి యొక్క వివిధ మైన అంశములకు నాదము, బిందువని పేర్లు. నిజమునకు నాదము శివునిశక్తి. శివుడు రెండంశములను కలిగియున్నాడు. ఒక అంశమునందాతడు మార్పులేని పరమ సచ్చిదానంద స్వరూపుడై యుండును. ఇది పరాసంవిత్తన బడు-ను. రెండవ అంశమునందాతడు ప్రపంచముగా మార్పు నొందును, శివతత్త్వమే ఈ మార్పునకు కారణము. ఈ శివ తత్త్వము మఱియు

శక్తితత్వము విడదీయరానివి. శక్తితత్త్వము బహ్మము . _ యొక్క ప్రథమ క్రియాశీలమగు అంశము.

నిష్కళశివుడే నిర్గుణశివుడు. ఆతడు, సృజనశక్తితో సంబంధ-ములేని వాడైయుండును. సకళశివుడు సృజనశక్తితో కలిసియుండును. మాయ, లేక ప్రకృతిశక్తి యొక్క గర్భము నందు-న్నది. మాయ ఈ ప్రపంచమునకు గర్భాశయమువంటిది. ప్రళయకాలమునందు మాయ సూక్ష్మరూపమునందుండును. ఆమె సృష్టియందు బలసమన్వితమైయుండును. శక్తియొక్క పర్యవేక్షణయందు మాయ నానావిధభూతములలోను మఱియు సమస్త చేతన జీవులయందు ఇతర భౌతిక విభాగములలోను వ్యా-పించును. శక్తిదర్శనమునందు ముప్పదియారు తత్త్వములు ఉన్నవి. శక్తిదర్శనమునందు బ్రహ్మము, శక్తి, నాదము, బిందువు, మఱియు శుద్ధమాయయుండును. శైవసిద్ధాంత దర్శసమునందు శివుడు, శక్తి, సదాఖ్య మరియు శుద్ధమాయ యుండును. శేషించిన శక్తిదర్శన వికాసము, శైవ సిద్ధాంత దర్శనమును పోలియుండును.

శక్తి యొక్క జ్ఞానము ముక్తికి దారితీయును. "శక్తి జ్ఞానంవినా దే-వినిర్వాణం నైవ జాయతే" "ఓ దేవీ ! శ క్తి జ్ఞానము వినా ముక్తి పొందఁబడదు. (ఈశ్వరుడు దేవితో పలుకును.) జీవుడు మాయచే ప్రభావితుడైనప్పుడు తాను కర్త, భోక్తయని తలంచి, శరీరముతో తా-దాత్మ్యము నొందును. సాధన చేతను, ఆత్మసంయమము చేతను, శక్తి యొక్క అనుగ్రహము చేతను జీవుడు సమస్త బంధనము నుం-డి విడివడి, అధ్యాత్మిక పరిజ్ఞానము కలవాడై, పరమ పదమునొందును.

## శివుడు - శివపూజ

నిజమునకు ఏకైకమగు ఆత్మకు వినా మరియొకటి లేదు. భో-జ్యము భోక్తకు భిన్నమై లేదు. మనస్సు, లేక మాయయనెడి దర్పణముద్వారా బ్రహ్మము ప్రపంచముగా కానఁబడును. ఒక పదార్థము మాయద్వారా అనాత్మగాను, తనకు తాను కర్తగాను కా-నఁబడును. నిర్వికల్ప సమాధియందు జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయములనెడి త్రిపుటి నశించును. పరమశివుడు, లేక బ్రహ్మము మాత్రమే ఉనికిని కలిగియుండును.

అసురులను జయించుటచే దేవతలు గర్వముకలవారైనట్లు కేనోపనిషత్తునందు చెప్పఁబడినది. తమస్వంత శక్తిసామర్థ్యము-లచే తమకు జయము కలిగినట్లు వారు పొరపాటుచే తలంచిరి. పరమేశ్వరుడు వారికొక పాఠము నేర్పఁదలంచెను, అద్యంతము-లు తెలియని యక్షుడనెడి ఒక బృహద్రూపము నందాతడు వారికి కానఁబడెను. ఈ రూపముయొక్క రహస్య మును తెలిసికొనుటకై దే-వతలు అగ్ని దేవునిపంపిరి. యక్షుడు అగ్నిని ఇట్లడిగెను. "నీ యొక్క పేరేమి? నీ శక్తి ఎట్టిది?" అగ్ని ఇట్లనెను. " నేను అగ్నిని. జా-తవేదసుడను. నేను క్షణకాలములో ఈ విశ్వమంతటిని కాల్చి వేయఁగలను." యక్షుడు అగ్ని ఎదుట ఒక ఎండిన గడ్డిపోచ నుం-చి, దీనిని కాల్చివేయుమని పలికెను. కాని అగ్ని దానిని దహింపలేకపోయెను. అతడు సిగ్గుపడి యక్షుని వదలి పారిపోయె-ను. అప్పుడు దేవతలు యక్షుడెవరో తెలిసికొని రమ్మని. వాయువును పంపిరి. వాయువు యక్షుని సమీపించెను. యక్షుడు వాయువుతో ఇట్లనెను. “నీ వెవడవు? నీశక్తి ఎట్టిది?" వాయువిట్ల నె-

ను. "నేనువాయుదేవుడను. నేను క్షణకాలములో ప్రపంచ మంత-టిని ఎగుర వేయఁగలను." అప్పుడు యక్షుడొక గడ్డిపరకను వాయువు ముందుంచి,



దానిని ఎగరవేయుమని పలికెను. వాయువు దానిని ఆ స్థలము-నుండి ఒక అంగుళము కూడా కదల్చలేక పోయెను. సిగ్గుచే ఆతడాస్థలమును వదలిపెట్టి వెళ్ళి పోయెను. చిట్టచివరకి ఇంద్రు-డు స్వయముగా అచ్చటికి వచ్చెను. ఇంద్రుడాస్థలమును చేరుసరికి యక్షుడు మాయమయ్యెను.

అప్పుడు ఇంద్రుని ఎదుట ఉమ ప్రత్యక్షమై యక్షునియొక్క నిజమైన తత్త్వమును బయల్పఱచెను. ఆమె ఇంద్రునితో ఇట్లనె-ను, "దేవతలు విజయము నొందుటకు కారణము జగజ్జననియొక్క శక్తియేకాని, దేవతలశక్తి కాదు. దేవతలందరి బలమునకు మూల కారణము శక్తి. ఉమ, హైమవతి, లేక శ్రీకృష్ణుని సోదరియే యగును". శక్తియే జ్ఞానగురువు. ఆమె తన భక్తులకు జ్ఞానము నొసంగును.

మీరందఱును శక్తి, లేక జగజ్జనని యొక్క అనుగ్రహ మును పొంది, పరమపదప్రాప్తిచే కలుగు పరమానందమునను భవింతు-రుగాక !

## II

శక్తియే చిద్రూపిణి. ఆమెయే పరిశుద్ధానంద చైతన్యము. ఆమె పకృతిమాతకు తల్లి. ఆమె స్వయముగా ప్రకృతియని చెప్పవచ్చు-ను. ఆమె బ్రహ్మము, లేక శివునికి శక్తి. ఆమె ఈ ప్రాపంచిక నాటకమును

## *శివుడు - శివపూజ*

నడుపును. ఆమె దేవునిలీలను కొనసా గించును. ఆమె జగజ్జనని, మహిషాసురమర్ధిని, భ్రాంతినాశిని మఱియు దారిద్ర్యనాశిని.

శివుని శక్తియే దేవి. ఆమె జడశక్తి మఱియు చిచ్ఛక్తి. ఆమె ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి మఱియు జ్ఞానశక్తి, ఆమె మాయాశక్తి, శక్తియే ప్ర-కృతి, మాయ, మహామాయ, శ్రీ విద్య. శక్తి స్వయముగా బ్రహ్మము. ఆమెయే లలిత, కుండలిని, రాజేశ్వరి, త్రిపుర సుందరి, సతి మరి-యు పార్వతి. దశమహావిద్యలనెడి పదిరూపములలో సతిశివునికి వ్యక్తమయ్యెను. అవి ఏవనగా: - కాళి, బగళాముఖి, ఛిన్నమస్త, భువ-నేశ్వరి, మాతంగి, షోడశి, ధూమావతి, త్రిపుర సుందరి, తార మఱియు భైరవి.

శక్తి పూజ, లేక శాక్తమతము ప్రపంచములో మిక్కిలి పరివ్యాప్త-మైయున్న పురాతన మతములయందొకటి. ఈ ప్రపంచములోని ప్రతివ్యక్తియు శక్తిమంతుడు కాఁగోరును. ఆతడు శక్తిచే ఉప్పొంగిపో-వును. శక్తిచే ఆతడుఇతరుల పై ఆధిపత్య మును వహింపఁగోరును. శక్తి పై గల పేరాసయే యుద్ధమునకు హేతువు. విజ్ఞాన వేత్తలు, శాక్త మతముననుసరింతురు. సంకల్ప బలమును మరియు 'సౌంద-ర్యవంతమగు వ్యక్తిత్వమును పొందగోరువాడు శాక్తేయుడు.

నిజమునకీ ప్రపంచములో ప్రతిమానవుడున్నూ శాక్తేయుడేయని చెప్పవలసియున్నది.

సమస్తము శక్తియేయనియు, జడపదార్థములన్నింటికి మూ-లము శక్తియేననియు నేటి వైజ్ఞానికవేత్తలు పలుకుదురు. ఇదేవిషయమును "శాక్తేయులు చాలాకాలము క్రింద చెప్పి యుం-డిరి. ఇంతే కాదు, ఈశక్తి

## *శివుడు - శివపూజ*

అనంతమైయున్న మహాశక్తి యొక్క లవ లేశాంశమై యున్నదని వారుపలుకుదురు.

శక్తి ఎల్లప్పుడు శివునితోకలిసియుండును. వారు అగ్ని మఱి-యు వేడివలె విడదీయనివారై యుందురు. శక్తి నాదమును మఱియు నాదముబిందువును వికసింపఁ జేయును. శక్తి యొక్క వ్యక్తీకరణమే ఈ ప్రపంచము. శుద్ధమాయమే చిచ్ఛక్తి ప్రకృతి యే-జడశక్తి, నాదము బిందువుమున్నగునవి శక్తి యొక్క వివిధములగు అంశములకు పేర్లు.

ఈ యసంఖ్యాకములగు లోకములన్నియును ఆజగజ్జనని _ యొ-క్క పవిత్రమైన పాదములయొక్క దూళిమాత్రమే. ఆమె యొక్క ప్రతిభ అనిర్వచనీయము. ఆమె యొక్క తేజస్సు వాచామ గోచర-ము అమెయొక్క మహిమ అగాధము. ఆమె తన నిజమైన శ్రీ భక్తులను అనుగ్రహించును. ఆమె జీవుని ఒక చక్రము నుండి మరియొక చక్రమునకు, ఒక భూమిక నుండి మరియొక భూమిక కుఁగొంపోయి, అతనిని సహస్రారములోని శివునితో ఐక్య మొందిం-

చును.

శరీరమే శక్తి. శరీరముయొక్క ఆవశ్యకతలే శక్తి యొక్క ఆవశ్యకతలు. మానవుడు అనుభవించునప్పుడు, శక్తియే ఆతనిద్వారా అనుభవించును. ఆతని నేత్రములు, - చెవులు, చేతులు మఱియు పాదములన్నియు ఆమెవే. ఆమె ఆతని నేత్రముల ద్వారా చూచును. అతని చెవులద్వారా వినును. శరీరము, మనస్సు, ప్రాణము, అహంకారము, బుద్ధి, ఇంద్రియములు మఱియు ఇతర క్రియాకలాపము లన్నియును ఆమెయొక్క వ్యక్తీకరణములే.

## *శివుడు - శివపూజ*

శాక్తేయులు దేవునియొక్క వ్యక్తావ్యక్త అంశములను గూర్చి ప్రబోధింతురు. బ్రహ్మము నిష్కళము, లేక ప్రకృతిరహితము మఱియు సకళము, లేక ప్రకృతిసహితమునై యున్నది. వేదాంతులు నిరుపాధిక బ్రహ్మము (మాయా రహితమగు శుద్ధ నిర్గుణ బ్రహ్మము) మఱియు సోపాధిక -బ్రహ్మము (ఉపాధి, | లేక మాయాసహితమగు సగుణ బ్రహ్మము) గూర్చియు పలుకుదురు. ఈ రెండింటికిని తారతమ్యము లేదు. పేర్లు మాత్రమే భిన్నమైయున్నవి. ఇదియం తయు కేవల శబ్దజాలము. కేవలము శబ్దమును గూర్చి ప్రజలు పోట్లాడుదురు. వాగ్యుద్ధ - మొనర్తురు. వెంట్రుకలను లాగికొందురు. తర్క వితర్కముల నొనర్తురు. మఱియు బుద్ధిచాతుర్యమును చూపుచుందురు. నిజమునకు సారము ఏకైకమైయున్నది. మట్టియే సత్యము. కుండఇత్యాది పరిణామములన్నియును నామమాత్రములే. నిర్గుణ బ్రహ్మమునందు శక్తి సూక్ష్మరూపమునందుండును. ఇంక సగుణబ్రహ్మము నందది

గతిశీలమై యుండును.

"వేదమేశాక్తేయమునకు మూలము. బ్రహ్మముయొక్క స్వరూ-పముఇత్యాది భావాతీతవిషయములకు వేదమే మూలము మఱియు ప్రమాణమని శాక్తేయులు పలుకుదురు. శాక్తేయము కేవ-లము వేదాంతమే వేదాంతులకు వలెనే శాక్తే యులున్నూ ఆధ్యాత్మికానుభవములనుఁబడయుదురు.

ఋగ్వేదములోని దేవీ సూక్తము, శ్రీ సూక్తము, దుర్గా సూక్తము, భూసూక్తము, నీళాసూక్తము మఱియు త్రిపుర తాపిన్యు పనిషత్తు, సీతోపనిషత్తు దేవ్యుపనిషత్తు, సౌభాగ్యోపనిషత్తు, సరస్వత్యుపనిష-త్తు,

## శివుడు - శివపూజ

భావనోపనిషత్తు, భహ్వృ చోపనిషత్తు, మున్నగు ప్రత్యేక శాక్తోపని-షత్తులున్నూ దేవుని మాతృరూపాంశమునుఁ గూర్చి మాటిమాటికి ప్రబోధించినవి. కేనోపనిషత్తు కూడా ఇంద్రునికి మఱియు దేవత-లకు ఆత్మజ్ఞానో పదేశము నొసంగిన ఉమ(హైమవతి)నుఁ గూర్చి పలికినది.

జగన్మాత సర్వత్ర త్రివిధరూపము నందుండును. ఆమె సత్వరజస్తమములనెడి త్రిగుణములతో కూడియుండును. ఆమె ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి, మఱియు జ్ఞానశక్తి, రూపములలో విలసిల్లును. ఆమెబ్రహ్మతో కూడియున్నప్పుడు బ్రహ్మశక్తి (సరస్వతి) యనియు, విష్ణువుతోకూడి యున్నప్పుడు విష్ణుశక్తి (లక్ష్మి) యనియు', శివునితో కూడియున్నప్పుడు శివశక్తి (గౌరి) యని యును చెప్పఁబడును. ఈ

కారణముచే ఆమె త్రిపుర సుందరి యని నుడువఁబడును.

శ్రీనగరము దివ్యమాతయగు త్రిపుర సుందరికి స్థానము. ఈ యద్భుతమైన పట్టణము ఇరువదియైదు తత్త్వములను సూచించు "ఇరువదియైదు ప్రాకారములను కలిగియున్నది. తేజస్వంతమగు చింతామణి భవనము మధ్యభాగమునందున్నది. ఆ యద్భుతమైన భవనమునందుఁగల శ్రీ చక్రములోని బిందు పీఠము నందు దివ్యమాత ఆసీనురాలై యుండును. మానవుని శరీరమునందు కూడా ఇటువంటి స్థానమే ఆమెకు కలదు. ప్రపంచమంతయు ఆమెకు శరీరరము పర్వతములే ఆమెకు ఎముకలు. నదులే ఆమెకు నాడులు. సముద్రమే ఆమెకు మూత్రాశయము. సూర్యచంద్రులే ఆమెకు నేత్రములు. వాయు వే ఆమెకు శ్వాస. అగ్నియే ఆమెకు నోరు.

## ***శివుడు - శివపూజ***

శక్తి భుక్తి. (ఇహలోక సౌఖ్యము) మఱియు ముక్తి (పార లౌకిక సౌఖ్యము)ల ననుభవించును. శివుడు జ్ఞానానంద స్వరూపుడు. శివుడు స్వయముగా సుఖదుఃఖ సమ్మిశ్రిత జీవితమును గడుపు మానవునివలె మనకు గోచరించును. ఈ విషయమును నీవెల్లప్పుడు జ్ఞప్తి యందుంచుకొందువేని సమస్త ద్వంద్వము, అసూయ, ద్వేషము, గర్వములు నశించును. మానవుడొనర్చు ప్రతి కార్యమును పూజ, లేక ఉపాసనగా నీవు తలంచవలయును. నీవు సద్భావనను కలిగియుందువేని కాలకృత్యములను తీర్చుకొనుట మాట్లాడుట. భుజించుట, నడచుట, చూచుట, వినుటకూడా దేవుని పూజలే యగును. మానవుని బాహ్యాభ్యంతరములలో శివుడే కార్య

మొనర్చును. అప్పుడు అహంకారము, లేక వ్యక్తిత్వ మెచ్చటి నుం-
డి ఏతెంచును? మానవుని కార్యములన్నియును. దివ్య కార్యములే.
విశ్వవ్యాప్తమగు ఒకే జీవితము సమస్త హృదయములలో స్పందిం-
చును. సమస్త నేత్రములలో చూచును. సమస్త హస్తములలో
పనిచేయును. సమస్త శ్రోత్రములలో వినును." ఈ క్షుద్రమైన
'అహం'ను నలిపి వేసి ఈయనుభూతినొందుట ఎంతటి ఆనందక-
రమైన విషయము పరిపూర్ణ పరబ్రహ్మానుభూతినొందు ఈమార్గము
నందు నీ పూర్వ సంస్కారములు, పూర్వవాసనలు, పూర్వాభ్యాస-
ములు ఆటంకమును కలిగించును.

ప్రపంచము దివ్యమాతతో తాదాత్మ్యము నొందియున్నట్లు
ముముక్షువు తలంచును. తన స్వరూపమును దివ్యమాత స్వరూ-
పముగా తలంచి సంచరించుచు, ఆతడు సర్వత్ర ఏకత్వ
మునేఁగాంచును.

## శివుడు - శివపూజ

దివ్యమాత పరబ్రహ్మముతో 'తాదాత్మ్యము నొందియున్నదనికూ-
డా ఆతడు భావించును.

ప్రగతినొందిన సాధకుడిట్లు తలపోయును. "నేనే దేవిని
మఱియు దేవి నాయందున్నది" ఆతడు భౌతిక పదార్థము నర్చిం-
చుటకు బదులుగా తన్ను తానే దేవిగాతలంచి పూజించు కొనును.
ఆతడు "సాహమ్" ఆమె (దేవి). యే నేను" అనును.

శాక్తేయము కేవలమొక ఊహఁగాని, నాదముఁగాని కాదు.

అది సాధకుని వికాసస్థాయి, సామర్థ్యము మఱియు ఉత్సాహము ననుసరించి అతనికి క్రమమైన యోగసాధనను, సూటియైన క్రమ-శిక్షణ నొసంగును. అది సాధకుని కుండలినీ శక్తిని మేల్కొలిపి, దానిని శివునితో ఐక్య మొందించి, నిర్వి కల్ప సమాధి, లేక పరమా-నందము ననుభవింపఁజేయును. కుండలిని నిద్రాణమై యున్నప్పుడు మానవుడు ప్రాపంచిక జాగృతిని కలిగి యుండును. ఆతడు దృశ్యవస్తు చైతన్యమును కలిగియుండును. ఆమె మేల్కొ-న్నప్పుడు ఆతను నిద్రించును. ఆతడు ప్రాపంచిక చైతన్యము నంతటిని కోల్పోయి దేవునితో ఏకత్వము నొందును. సమాధిస్థితి-యందు సహస్రారములోని శివశక్తి సమైక్యముచే ప్రవహించునట్టి అమృతముచే శరీరము పోషింపఁబడును.

శక్తి యోగ సాధనభ్యసించుటకై గురువు అత్యావశ్యక మై-యుండును. ఆతడు సాధకునికి ఉపదేశమునొసంగి ఆతనియందు దివ్యశక్తిని ప్రసరింపఁ జేయును.

## *శివుడు - శివపూజ*

స్త్రీతో యొనర్చు భౌతిక సంభోగము స్థూలమైథునమనం బడును. ఇది పశుభావము. నిర్వికల్ప సమాధియందు సహ సార-ములోని శివునితో కుండలినీ శక్తి ఐక్యమగును. ఇదియే నిజమైన మైథునమని చెప్పఁబడును. ఇదియే దివ్యభావము. నీవు సత్సంగ-ము, గురు సేవ, త్యాగ వైరాగ్యములు, జపధ్యానముల ద్వారా పశుభావమునుండి దివ్య భావమునందడుగిడవలసి యున్నది.

ఆమె యొక్క అనుగ్రహము నొందుటకై నీవు దివ్యమాతను శ్ర-

ద్ధాభక్తులతోను, ఆత్మసమర్పణతోను అర్చింప వలసియుం డును. కేవలము అమెయొక్క అనుగ్రహము చేత మాత్రమే నీవు శాశ్వత-జ్ఞానము నొందఁగలుగుదువు రాజరాజేశ్వరియు, లలితా దేవియు, విశ్వజననియునగు త్రిపుర సుందరికి జయము ' ఆమె యొక్క ఆశీ-స్సులు మీ అందరియందుండునుగాక!

## శివుడు మఱియు, శక్తి

నిజమునకు శక్తితత్త్వము శివతత్త్వమునకు భిన్నమైన అంశమై యున్నది. భిన్నముగా చెప్పఁబడినను అవి నిజముగా ఏకమేనై-యున్నవి. శివుని సంకల్పమే శక్తితత్త్వము.

అంబాల్, అంబిక, గౌరి, జ్ఞానాంబిక, దుర్గ, కాళి, రాజేశ్వరి, త్రిపుర సుందరి ఇవన్నియును శక్తికి పేర్లు. శక్తి స్వయముగా పరిశుద్ధానంద



చైతన్యస్వరూపమై యున్నది మఱియు ప్రకృతి స్వయముగా ఆమె యొక్క సృజనాత్మక సంకల్పశక్తియై యున్నది. దేవుని విశ్వజనని-గా ఊహించుటయే శాక్తేయమత సిద్ధాంత మైయున్నది.

విశ్వమును సృష్టించి, పోషించునదగుటచే శక్తి జగ జ్జననిగా చె-ప్పఁబడినది. కాని దేవుడు స్త్రీయు, పురుషుడున్నూ కాడు. తాను వ్యక్తమైయున్న శరీరమునుబట్టి ఆతడు నామమును ధరించును.

ప్రపంచములో హిందూమతము మాత్రమే దేవుని మాతృ స్వ-రూపమునుఁ గూర్చి నొక్కి చెప్పినది. ఋగ్వేదములోని దశమ మండలమునందు దేవీ సూక్తము కానఁబడును. ఆంబ్రిన్ మహర్షి యొక్క పుత్రికయగు బాక్చే అది వ్యక్తమొనర్పబడెను. దివ్యమాత-నుఁగూర్చి స్తుతింపఁబడిన ఈ ఋగ్వేద సూక్తమునందు. బాక్ విశ్వమంతయు వ్యాపించియున్న జగజ్జననిని తాను సాక్షాత్క రిం-చుకొన్న విధానము. వర్ణింపఁబడినది. బెంగాల్ దేశము నందు మాతృపూజ మిక్కిలి పరివ్యాప్తమై యున్నది. ప్రతి బెంగాలి • మనుజుని పెదవులపై 'మా' యను శబ్దము తాండవమాడు చుం-డును.

శివుడు మఱియు శక్తి సార స్వరూపమునందేకమే. శబ్దము మఱి-యు దాని అర్థమునందెట్టి సంబంధము కలదో, సంబంధమే శివుడు మఱియు శక్తి యందు కలదని కాళిదాసు యొక్క రఘువం-శములోని ప్రథమశ్లోకము వర్ణించును. అగ్ని మఱియు వేడి ఎట్లు అభిన్నములో, శక్తి. మఱియు శివుడున్నూ అభిన్నములు. శక్తిలే-కుండా శివుడేమియు

## శివుడు - శివపూజ

చేయ జాలడు. సౌందర్య హరిలోని ప్రథమ శ్లోకము నందీ విషయ-ము శ్రీ శంకరా చార్యులవారిచే నొక్కి చెప్పఁబడినది.

శక్తి చలనముఁగల సర్పమువంటిది. శివుడు చలనము లేని సర్పము వంటివాడు. శివుడు అలలు లేని సముద్రమువంటి వా-

డు. అలలుఁగల సముద్రమే శక్తి. శివుడు భావాతీతుడగు పరమపు-
రుషుడు. ఆ పరమపురుషుని నుండి వ్యక్తమైన అంశమే శక్తి. శివుడు
నిర్గుణుడు, అతడు నిష్క్రియుడు. శక్తి గుణ సహితము. ఆమె సృ-
ష్టించును. శక్తి మూడు వర్ణములుగల తాళ్ళచే పేనఁ బడిన
త్రాడువంటిది.

శివుని వక్ష స్థలముపై కాళిమాత నాట్యమాడును. ఆమెకు
భయంకర రూపమున్నను, నిజమున కామె భయంకరమైనది కాదు.
ఆమె దయాసముద్రము మఱియు సౌమ్య పుంజమై యున్నది.
ఆమె తలపుజ్జెలచే నిర్మింపఁబడిన మాలను ధరించును. దీనిభా-
వమేమి? అమెతనభక్తులయొక్క మస్తకములను ధరించును. ఆమె
తన భక్తులపై ఎంతటి ప్రేమను మఱియు సానుభూతిని కలిగి-
యున్నదో చూడుడు!

కాళి ఒక దివ్యమాత. ఆమె శివునిశక్తి. ఆమె శివుని క్రియాశీలమగు
అంశము. శివుడు స్థిరమైన అంశము. శివుడుఒక మృతకళేబరము-
వంటివాడు, దీని భావమేమి? ఆతడు సమాధి స్థితియందు
నిమాళితనేత్రుడై ప్రశాంతముగను, చల నరహితుడు గను, శ్వాస-
రహితుడుగను ఉండును. ఆతడు నిష్క్రియుడు, నిర్వికల్పుడు.
ఆతడు తన వక్ష స్థలముపై శాశ్వతముగా కొనసాగు చున్న విశ్వలీ-
లచే అంటుఁబడని వాడై యున్నాడు.

## శివుడు - శివపూజ

ప్రపంచమునకాతడు పూర్ణముగా మృత ప్రాయుడు. అతడు త్రి-
గుణాతీతుడు, ఆతనియందు ద్వంద్వముఁగాని, బహుళత్వముఁ

గాని, సంబంధముగాని, కర్త-కర్మ విభేదముగాని, విభిన్నతగాని, వ్యత్యాసముగాని, రాగ ద్వేషములు గాని, మంచి చెడ్డలుగాని, ద్వంద్వములుగాని లేవు. అతడు నిత్య శుద్ధుడు, నిర్లిప్తుడు, ఐనను అతడీవిశ్వమునకు మూలము", అధారము, ఆశ్రయము మఱియు ప్రథమ కారణమై యున్నాడు. ఆతడు కేవలము తనదృష్టిని సారించును. అప్పుడు శక్తి ప్రాణవంత మగును. ఆమె కార్యమొనర్చి, సృష్టించును. ఆతని సత్తా మాత్రముచే శక్తి ఈ విశ్వలీలను కొనసాగించును. ప్రపంచ మంతయు కేవలము ఆతనియందొక స్పందనమువంటిది. అతడు సమాధిస్థితుడై యున్నను, విశ్వ చైతన్యము కలవాడై యుండును. ఆతడు సర్వనామ రూప సమన్వితుడై యున్నను, సమ స్తనామ రూపముల కతీతుడై యున్నాడు. ఇది అంతవంతమగుబుద్ధిచే ఊహింపబడజాలని మహదాశ్చర్యము మఱియు పరమ రహస్యమై యున్నది.

శివుని వినాశక్తికి అస్తిత్వము లేదు. మఱియు శక్తికి శివునికి వ్యక్తిత్వము లేదు. శక్తి ద్వారానే అవ్యక్తుడగు పరమశివుడు, లేక నిర్గుణ బ్రహ్మము వ్యక్తపురుషుడు, లేక సగుణ బ్రహ్మమగును. శివుడు దుర్గ, లేక కాళికి ఆత్మవంటి వాడు. దుర్గ లేక కాళి శివునితో తాదాత్మ్యము నొందియున్నది. శివుడు సచ్చిదానంద స్వరూపుడు. దుర్గ, లేక కాళి సచ్చిదానంద స్వరూపిణి. శివుడు మఱియు శక్తి ఏకైకము. వారియందొకరు"

## ***శివుడు - శివపూజ***

మరియొకరికంటే ఉన్నతమైనవారు కారు. శక్తియే చిత్తు, చిద్రూపిణి, చిన్మాత్రరూపిణి.

## శివుడు మఱియు పార్వతి

ఓ దేవీ! సర్వశుభ ప్రదాయినీ! ఐశ్వర్య, విజయదా యినీ! మేము నీకు మోకరిల్లుదుము. నీ దయాదృష్టిచే ఈ పృథ్విపై శాంతిసౌఖ్యములను ప్రసరింపఁ జేసి మమ్ములను సంరక్షించుము.

పర్వత రాజైన హిమవంతుని పుత్రికయే పార్వతి. ఆమె శివునికి అర్ధాంగిని, లేక శక్తి. ఆమె ఈ విశ్వమునకు ఉత్పత్తి స్థానము, ఆమె బ్రహ్మమును వ్యక్తమొనర్చును. ఆమె లోక మాత మాత్రమే కాదు. బ్రహ్మవిద్యకూడానైయున్నది. "శివజ్ఞాన ప్రదాయిని" అని ఆమెకుఁగల పేర్లలో ఒకటి. ఆమె శివదూతి, శివారాధ్య, శివమూర్తి. మఱియు శివశంకరి యనియు చెప్పఁ బడును.

దైవసాక్షాత్కారము నొందుటకై దేవి యొక్క అనుగ్రహము అత్యావశ్యకమైయున్నది. పార్వతి, లేక శక్తియే సమస్తము. నీవు శక్తిని యోగముచే మేల్కొలుప వలసియుండును. అప్పుడు శక్తి శ్రీ యొక్క అనుగ్రహముచే దైవసాక్షాత్కారము, పరమపదము, అనంతము మఱియు శాశ్వతమగు పరమానందము పొందం.

***శివుడు - శివపూజ***

స్కందపురాణములోని మహేశ్వర కాండమునందు మహిమా-న్వితమైన పార్వతియొక్క చరిత్ర వర్ణింపఁబడినది, బహ్మకుమారుడైన దక్ష ప్రజాపతియొక్క కూతురగు సతి, శివుని పెండ్లాడెను. శివునివికారరూపము, వింత చేష్టలు మఱియు విపరీ-తమైన అలవాట్లవలన దక్షునికి తన అల్లునిపై ఏవగింపు కలిగెను. దక్షుడొక యజ్ఞమును నిర్వహించెను, అతడు తన కూతురునుఁ గా-ని అల్లునిఁ గాని ఆహ్వానించ లేదు. సతికి అవమా నముగా తోచి, తన తండ్రివద్దకి వెళ్ళి ప్రశ్నించెను. ఆతడు ఆమెకు అసంతుష్టిక-రమైన సమాధానము నొసంగెను. దీనిచే సతి క్రోధోద్రిక్తురాలయ్యెను. ఆమె అతనికూతురుగా పిలువఁబడుటకు ఇష్ట పడకుండెను . ఆమె తన శరీరమును అగ్ని దేవునికి సమ ర్పించి, శివుని పెండ్లాడుట కై తిరిగి పార్వతిగా జన్మించుటకు సం-కల్పించెను. ఆమె తన యోగశక్తిచే అగ్నిని సృష్టించి, ఆ యోగాగ్నియందు తన శరీరమును భస్మ మొనర్చుకొనెను.

శివుడు వీరభద్రుని పంపెను. వీరభద్రుడు యజ్ఞమును ధ్వంస-మొనర్చి, అచ్చటగుమిగూడిన దేవతలనందరిని తరిమి వేసెను. దక్షుని శిరస్సు ఖండింపఁబడి, అగ్నియందు త్రోయ బడెను. బ్ర-హ్మ దేవుని ప్రార్థనచే శివుడు దక్షుని దేహము పై ఒక మేక తలను అతికించెను.

శివుడు తపస్సు నొనర్చుటకై హిమాలయములవైపు బయలు దే-రెను. శివపార్వతులకు కలుగు పుత్రుని చేతమాత్రమే మరణము సంభవించునని తారకాసురునికి బ్రహ్మదేవుడు వర మొసంగెను.

## శివుడు - శివపూజ

కావున సతిని తన కుమార్తెగా స్వీకరింపుమని దేవ తలు హిమవంతుని ప్రార్థించిరి. హిమవంతుడు అంగీకరించెను. సతి హిమవంతుని పుత్రికయగు పార్వతిగా జన్మించెను. తపో కాలము నందు ఆమె శివుని సేవించి, పూజించెను. శివుడు పార్వతిని పాణిగ్రహణ మొనర్చెను.

నారదుడు కైలాసమునకు వచ్చినపుడాతడు శివ పార్వ తులను ఒకే శరీరమునందు సగము స్త్రీరూపమ, సగము పురుష రూపముగల అర్ధనారీశ్వర రూపమునందుఁగాంచెను. వారి పాచికలాటను అతడు చూడఁదలంచెను శివుడు తానేగెలిచితినని పలికెను. పార్వతి తానే గెలుపొందితినని పలికెను. వారి మధ్య జగడమేర్పడెను. శివుడు పార్వతిని విడిచి, తపస్సొనర్చుటకై వెళ్లెను. పార్వతి ఒక వేట కత్తె వేషమును ధరించి శివుని కలిసి కొనెను శివుడా వేటకత్తెను ప్రేమించెను. తమ వివాహమును ఒప్పించుటకై ఆమెతో కలిసి అతడామె తండ్రి వద్ద కేగెను. ఆ వేటకత్తె పార్వతియేయని నారదుడు శివునితో పలికెను. తన ప్రభువును క్షమించుమని నారదుడు పార్వతితో పలికెను. వారు తిరిగి ఐకమత్యము నొందిరి.

శివుడు ఒకలింగముగా అరుణాచల పర్వతరూపమును ధరించెను. బ్రహ్మ మఱియు విష్ణువు తమ గొప్పదనమునుఁ గూర్చి జగడమాడుచుండగా శివుడు వారి గర్వమునణచి వేసెను. అరుణాచల మొక తేజోలింగము. పార్వతి శివుని అరుణాచలేశ్వ రునిగా దర్శించెను. శివుడు పార్వతిని తిరిగి తన పార్శ్వమునందు చేర్చుకొని, మరల తన అర్ధాంగినిగా చేసికొనెను.

***శివుడు - శివపూజ***

తారకాసురుడు దేవతలను మిక్కిలి హింసింపసాగెను. మహి-సాగర సంగమక్షేత్రము ఆతని ముఖ్యపట్టణ మైయుండెను పార్వతీ దేవియొక్క రెండవ పుత్రుడైన సుబ్రహ్మణ్యస్వామి, తాను జన్మించిన ఏడవరోజే ఈయసురుని సంహరించెను.

పార్వతి తన సంతుష్టికే ఏనుగుతలఁగల ఒక బిడ్డను సృష్టించెను. ఆతడే గణేశుడు. ఆటంకములను తొలగించుటకై ఆతడు జీవులందరికి ప్రభువు గా చేయఁబడెను. ప్రపంచమును ప్రథమముగా ఎవ్వరు చుట్టివత్తురో, వారికొక ఫలమునొసంగు దునని శివుడుతనఇరువురు పుత్రులతో పలికెను. సుబ్రహ్మణ్యుడు ప్రపంచమును చుట్టి వచ్చుటకై బయలు దేరెను. గణేశుడు శ్రీ విశ్వవ్యాపియగు మహాలింగస్వరూపుడైన తన తండ్రియగు శివునికి ప్రదక్షిణ చేసి, ఆ ఫలమును పొందెను.

పార్వతి నల్లని చర్మమును కలిగియుండెను. ఒక రోజు శివుడు ఆమె యొక్క నలుపువర్ణముఁ గూర్చి పరిహాసమాడెను. శివుని ఎగతాళిచే ఆమె మనస్సులో బాధపడెను. ఆమెతపస్సు - నొనరుచుటకై హిమాలయముల కేగెను. అప్పుడామె అందమైన వర్ణముకలదయ్యెను మఱియు “గౌరి ” యని పిలువఁబడుచుం బ్రహ్మయొక్క అనుగ్రహముచే గౌరి శివునితో ఐక్యమైనప్పు డాతడు అర్ధనారీశ్వరుడని పిలువఁబడెను.

ఒక రోజు పార్వతి శివుని వెనుక నుండివచ్చి అతని కన్ను లను మూసెను. విశ్వమంతయు అంధకార బంధురమై, ప్రాణ మును కోల్పోయి నట్లయ్యెను. తనతప్పు క్షమింపఁబడుటకై శివుడు పార్వతితో తపస్సునొనరుచుమని పలికెను. ఆమెకంచికి వెళ్ళి ఘో-

తపస్సునొనర్చెను. శివుడు ఒక ప్రవాహమును సృష్టిం చెను. పార్వ-తి పూజించుచున్న శివలింగము కొట్టుకొని పోవుటకు సిద్ధముగా నుండెను. ఆమె ఆలింగమును ఆలింగన మొనర్చు కొనెను. అప్పు-డాలింగమచ్చట ఏ కాంబరేశ్వరుడను పేరుతో నిలిచెను. ఆమె ప్రపంచ శ్రేయస్సుకే అచ్చట కామాక్షియను పేరుతో నిలిచెను.

శివునికి శక్తిగా పార్వతి ఎల్లప్పుడు ఆతనితో వసించి - యుండు-ను. ఆమె ఈ విశ్వమునకు దివ్యమాత ఆమె తనభక్తులపై అనుగ్రహమును, జ్ఞానమును ప్రసాదించి, వారిని తన ప్రభువుతో ఐక్య మొందించును. జీవులందరికి నిజమైన జననిజన కులైన పా-ర్వతి మఱియు శివునికి ప్రణామములు.

## దివ్య మాత

పసిబిడ్డలు తండ్రికంటె తల్లితో ఎక్కువ చనువుగా నుందురు. తల్లి ప్రేమ, దయ మఱియు కరుణాస్వరూపిణి. ఆమె పిల్లలయొక్క కోర్కెలను నెఱవేర్చును. బాలునికేమి కావలసి యున్నను ఆతడు తల్లిని సమీపించునే కాని, తండ్రిని సమీపింపడు. ఆధ్యాత్మిక విష-యమునందు కూడా సాధకుడు తండ్రియగు శివుని కంటే, తల్లియగు కాళితో ఎక్కువ చనువుగా నుండును. శివుడు భౌతిక ప్ర-

పంచమునకు తటస్థుడైయుండును. అతడు దాని కంటఁబడక-
యుండును, ఆతడు



తన నేత్రములను మూసికొని, సమాధియందు మగ్నుడై యుండు-
ను. శక్తి లేక దివ్యమాత మాత్రమే, నిజమునకు ప్రాపంచిక వ్యవహారమును చూచుకొనును. భక్తునియొక్క విశ్వాసపాత్రతచే ప్రీతినొంది, ఆమె ఆతనిని పరమపద ప్రాప్తి నొందించుమని తన ప్రభువుతో పరి చయము చేసి, ప్రార్థించును.

శివుడు మఱియు శక్తి, అభిన్నములు. ఈ విషయము శివపార్వ-
తులు సగము స్త్రీ రూపము, సగము పురుషరూపముఁ గల అర్ధనారీశ్వర రూపమునందు తెలుపబడినది. శివుడు పార్వతిని తనశరీరమునకు వామార్ధ భాగముగా కలిగియున్నాడు.

శివజ్ఞానము ఆత్మసాక్షాత్కారమును కలిగించి, శాశ్వ నందము నొసంగి మనలను జననమరణములనుండి విముక్తి అది మన జీ-
వితమునకు ప్రకాశము నొసంగును. అది అంతర్జ్ఞాన చక్షువు. అది శివునికి మూడవ నేత్రము. ఈ తృతీయ నేత్రము మాయామోహ-
ములను నశింపఁజేయును.

శక్తి నానావిధ రూపములయందు ఉనికిని కలిగియుం డును. సరస్వతి విద్యలకు దేవి. లక్ష్మి ధన దేవత. పార్వతి, లేక ఉమ ఆనందప్రదాయిని యగు దేవి.

మార్కండేయ పురాణమునందు ఏడు వందల శ్లోకము లుఁ-
గల సప్తశతి, చండి, లేక దేవీ మాహాత్మ్యముకలదు. ఇది

హిందువులకు మిక్కిలి సుప్రసిద్ధమగు గ్రంథములయందొకటి. ఇదిగీతకు సమానముగా తులతూగును. ముక్తి మార్గము నందాటం-కమునుకలిగించుకోరిక,

***శివుడు - శివపూజ***

క్రోధము, పేరాస మఱియు అజ్ఞానములను మనము జగన్మాతను పూజించి, ఆమె యొక్క అనుగ్రహమును(బడయుట ద్వారా తొల-గించుకొనవచ్చునని ఇది మనకు రూపకాలంకారమునందు వర్ణించి చెప్పును.

ఈగ్రంథము నందు జగన్మాతయొక్క తామసిక, రాజ సిక, సా-త్త్వికాంశములగు మహాకాళి, మహాలక్ష్మి మఱియు మహాసరస్వతి యొక్క రమణీయమైన వర్ణన కలదు.

దేవతలు అసురులచే హింసింప(బడిరి. దేవతలు దివ్య శ్రీ మాతయొక్క ఆశీస్సులను అర్థించిరి. ఆమెపై నుడువ(బడిన మూ-డురూపములను ధరించి, అసురులను సంహరించి, దేవత లను రక్షించెను. కష్టదశయందు తనను ఎవరు స్మరింతురో, వారిని రక్షింతునని దివ్యమాత మనుజులకు మఱియు దేవతలకు సుని-శ్చితమైన, అమోఘమైన హామీయొసంగెను.

## శక్తి త్రిమూర్తులకు బలము నొసంగును

ఓ శివా ! నీకు నామౌనమైన స్తుతులు. నీవు కేవల శరణ్యుడవు,

స్తుతిపాత్రుడవు, ఏకైక విశ్వపోషకుడవు మఱియు స్వయంప్రకాశు-డవై యున్నావు. నీవు ఈ విశ్వమును సృష్టించి పోషించి, సంహరింతువు. నీవు ఉన్న తోన్నతుడవు, అచలుడవు మఱియు పరిపూర్ణుడవు.

## ***శివుడు - శివపూజ***

ఏ కార్య మొనర్చుటకైనను శక్తిమనకు చైతన్యము నొసంగు-ను. మానవుడే కార్యము నొనర్చినను, అతడు శక్తి. యొక్క అనుగ్రహమువల్లనే దానిని నెఱవేర్చఁగలుగును. ఆతడు పనిని చేయఁజాలనప్పుడు. నాకు శక్తి లేదని ఆతడు పలుకును. కావున శక్తియే కార్యము నొనర్పఁజేయు సామర్థ్యమును కలిగి యుండును. శక్తియే దేవి. శక్తియే దివ్యమాత మనస్సు, ప్రాణము మఱియు సంక-ల్పములు కూడా శక్తులే.

దేవీ భాగవతము ప్రకృతియొక్క రూపములనుఁగూర్చి వర్ణిం-చును. నూతన కల్పమునందు దేవి త్రిమూర్తులను తన స్థానమగు మణిద్వీపమునకు తీసుకొని వెళ్ళి వారికి సరస్వతి, లక్ష్మి మఱియు పార్వతీయనెడి పత్నులనొసంగి విశ్వ మునుపరి పాలించుటకై వారిని బయటికి పంపెను.

నారాయణుడు తన నాభి నుండి బ్రహ్మ దేవుని సృష్టించెను. బ్రహ్మకు ఏమి చేయవలయునో తెలియకుండెను. ప్రళ యా నం-తరము నూతన కల్పములోని నూతన విశ్వము నందు ప్రాణ సంచలనము నెట్లు కల్పింపవలయునో, విష్ణువు మఱియు శివునికి కూడా తెలియకుండెను. వారు ఒక విమానము నందు తీసుకొని

పోఁబడి, ఒక వింతయైన ప్రదేశమునకు చేర్చఁబడిరి అచ్చట వారు స్త్రీలుగా మారిపోయిరి. దేవి యొక్క అధీనము నందున్న స్త్రీల సా-మ్రాజ్యము నందు వారు ప్రవేశించిరి. అదియే సుధాసముద్రములోని మణిద్వీపము. క్రొత్తగా మార్పునొందిన స్త్రీ-లచ్చట ఒక వంద సంవత్సరములుండిరి. వారెవరో, వారచ్చట ఎందుకుండిరో, వారు చేయవలసినపని ఏమో వారికి తెలియకుం-డెను.

## *శివుడు - శివపూజ*

అప్పుడు వారు పురుషుల సాంగత్యమునందుంచబడిరి. అప్పుడు వారు స్వయముగా పురుషులైరి. బ్రహ్మసరస్వతితోను, వి-ష్ణువు లక్ష్మితోను మఱియు శివుడు పార్వతితోను కలిసి జంట లుగా మారిరి. వెంటనేవారు తమస్వస్థలము నందుంచఁబడిరి. అప్పుడు వారు చేయవలసినపనిని వారు గుర్తించిరి. తమ కార్య ములను వారు అర్థమొనర్చుకొనిరి. దేవియొక్క సాంగత్యముచే త్రిమూర్తు-లు శక్తి సమన్వితులైరి.

మనుజులకు జ్ఞానమును మఱియు ముక్తిని ప్రసాదించు నట్టి పార్వతియే శివునికి శక్తి. ప్రజలకు ఐశ్వర్యము నొసంగు నట్టి లక్ష్మి-యే విష్ణువుకు శక్తి. ప్రపంచమును సృష్టించునట్టి సరస్వతియే బ్రహ్మకు శక్తి. భక్తి ద్వారా మానవులకు ముక్తి నిచ్చు నట్టి రాధయే, శ్రీ కృష్ణునికి శక్తి .. శక్తి మీకందరికి శక్తి నొసంగి, ఆశీర్వదించునుఁగాక !

# గంగా మాత

భారత దేశములోని గంగానది మిక్కిలి పవిత్రమైనది. గీతయం-దు శ్రీ కృష్ణుడిట్లు పలికెను. "స్రోతసామస్మిజాహ్నవీ" "నదులలో నేను గంగానదిని." గంగాజలమునందు - ఏలాటి కీటకముకూడా నిలువజాలదు. అది క్రిమినాశ ఖనిజసంభరితమై యుండును. పాశ్చాత్య వైద్యులు చర్మవ్యాధులు నివారింపఁ బడుటకై గంగాజల-ముచే మర్దన యొనర్చుమని సలహాయొసం గుదురు. గంగ కేవలమొక నది కాదు.

## *శివుడు - శివపూజ*

అదిపవిత్రమైన తీర్థము ప్రపంచములోని ఏ యితర నదులలో కా-నరాని అద్భుతశక్తులు గంగా నదియందున్నవి. గంగాజల మహత్త్వమును విజ్ఞాన వేత్తలు కూడా అంగీకరించిరి.

కెనడా, మోగిల్ విశ్వ విద్యాలయమునందుండు Dr. F. C Harrison అనునాతడిట్లు వ్రాసెను. "మూడు, లేక ఐదు గంటలలో కలరా సూక్ష్మజీవులు గంగాజలము నందు నశించుట, వర్ణింపశక్య-ము కాని నగ్న సత్యము కలరాచే మరణించిన మనుజుల నానావిధ శవములొక మురికినీటి కాలువ ద్వారా ప్రవహించి గంగా నదియం-దు పడినను, ఆ నదిలో స్నానమాడి,ఆ జలమును త్రాగినను భయము లేదని పలుకు హిందువుల విశ్వాసమును బ్యాక్టీరియా పరిశోధకులున్నూ అంగీకరించిరి. Dr. D. Herelle అను ఒక సుప్రసి-ద్ధ ఫ్రెంచి దేశ వైద్యుడుకూడా గంగాజల మహిమనుఁగూర్చి ఇట్టి ఈ

పరిశోధననే జరిపెను. బంక విరోచనములు మఱియు కలరా

వ్యాధిచే మరణిం చిన నునుజుల శవములు కొట్టుకొనిపోవుచు-న్న ప్పుడా శవములకు దిగువ ఎన్ని యో లక్షల క్రిములుండుటకు బదులుగా ఒక్క క్రిమియు లేకుండుటనుఁగాంచి, ఆతడాశ్చర్య చకితుడయ్యెను. అప్పుడాతడు వ్యాధిగ్రస్తులై యున్న మనుజుల నుండి క్రిములను ప్రోగు చేసి, దానియందు గంగాజలమును కలి-పెను. ఆ మిశ్రమమును కొంత కాలముంచిన తర్వాత ఆ క్రిములు నిశ్శేషముగా నశించుటఁగాంచి, ఆతడాశ్చర్యచకితు డయ్యెను.

## ***శివుడు - శివపూజ***

Dr. C. E. Nelson, F. R. C. S. అను బ్రిటిష్ - వైద్యుడు మరియొక చమత్కారమైన మాటను ఇట్లు నుడివెను. "ఓడలలో ... పాయలలో ఒక టైన హుగ్లీ నది జలము, ఇంగ్లండును చేరువరకు కలకత్తా నుండి ఇంగ్లండుకు తీసుకొని పోఁబడిన గంగానది స్వచ్ఛముగా నుండును. ఇక ఇంగ్లండునుండి భారత దేశము నకు వచ్చు ఓడ-లలో తీసుకొనిరాఁబడిన ఇంగ్లండులోని జలము బొంబాయి చేరువరకైనను స్వచ్ఛముగా నుండదు. ఇంగ్లండునుండి వచ్చు పడవ కలకత్తాకంటే ఒక వారము రోజులు ముందుగా ఈ ఓడ రేవు-ను చేరును. వారు పోర్టు సైయద్లో గాని, లేక ఎఱ్ఱసముద్రములోని ఆదెన్లో గాని జలమును మరల నింపుకొనవలసియుండును. కావున భారతీయులు గంగా జలము ఆశ్చర్యకరమైన శక్తులను కలిగి యు-న్నదనుటలోను, దానిని పరమ పవిత్రమైనదిగా భావించుటలోను

చోద్యము లేదు.

హైందవుడు "గంగ" యనెడి శబ్దముపై ఒక ప్రత్యేకమైన పవిత్రభావమును కలిగియుండును. ప్రతిహిందువు గంగలో ఒక మునకనైన వేయుటకు మఱియు తన మరణకాలములో గంగయొక్క ఒక నీటిబిందువునైన త్రాగుటకు ఉబలాటపడును. ధ్యానము మఱియు తపస్సు నభ్యసించుటకై సాధువులు, మఱియు సాధకులు గంగాతీరములో తమ కుటీరములను నిర్మించు కొందురు. భీష్ముడు, మరణాసన్న కాలము నందు అంపశయ్యపై నున్నప్పుడు, పాండవులతో గంగయొక్క మహిమను(గూర్చి గొప్పగా నుడివెను.

## *శివుడు - శివపూజ*

శుద్ధమైన హిందువు ఎచ్చట స్నానమాడినను, నదిలో మునక వేయుటకుముందు గంగా దేవిని ఆవాహన మొనర్చుకొని, అజలమునందు గంగయొక్క ఉనికిని అనుభూత మొనర్చు కొనును. ఒక వేళ ఆతడు గంగకు సుదూరమునందు వసించు చుండినచో, జీవితము నందొక రోజు గంగనుదర్శించి, ఆ పవిత్రమైన జలములో స్నానమాడుటకు మిక్కిలి ఉత్కంఠను కలిగియుండును. ఆతడు గంగాజలమును తన ఇంటికి తీసుకొని వెళ్ళి, ఒక పాత్రలో భద్రపఱచి, దానిని పవిత్రీకరణకై ఉప యోగించుకొనును.

పవిత్రమైన గంగాజలములో మునక వేసినచో, తమ - పాపములన్నియు క్షాళనమైనట్లు హిందువులు విశ్వసింతురు.

సత్యయుగములో సమస్త స్థలములు పవిత్రములై యుం డె-ను. త్రేతాయుగములో పుష్కరము మిక్కిలి పవిత్రమైన స్థలముగా ఎంచఁబడెను, ద్వాపరయుగమునందు కురుక్షేత్రము మిక్కిలి పవిత్రమైన స్థలముగా భావింపఁబడెను. కలియుగమునందు గంగ-కు అట్టి మహత్త్వము కలదు. దేవీ భాగవతమిట్లు నుడువును. "వందలకొలది మైళ్ళదూరము నందున్నను ఎవడు గంగయొక్క నామమును చ్చరించునో, అతడు పాపవిముక్తుడై శ్రీ హరియొక్క స్థానమును పొందును.

గంగ పరమపురుషుని నుండి బయల్వెడలును ఆమె వైకుం-ఠమునకు చేరి శ్రీహరి పాదములలో ప్రవేశించును. ఆమె గోలోకమునుండి బయలు దేరి విష్ణు, బ్రహ్మ, శివ, ధ్రువ, చంద్ర, సూర్య,

***శివుడు - శివపూజ***

తప, జన, మహర్లోకములనుదాటి, ఇంద్రలోకమును చేరి మందాకి-నిగా ప్రవహించును.

కపిలముని శాపముచే భస్మమైన తనపూర్వీకులగు వేయి సగరనందనులనుద్ధరించుటకై ఘోరమైన తపస్సు నొనర్చి గంగ-ను పాతాళలోకమునకు తీసుకొనిరాఁదలంచిన భగీరథుని ప్రార్ధన ననుసరించి గంగాదేవి శివుని జటాజూటమునందు ప్రవే శించును.

అటుపిమ్మట గంగ శివుని జటాజూటమునుండి దిగువకు ప్ర-వహించెను. జహ్నుముని యజ్ఞశాల గంగాజల ప్రవాహముచే నిండిపోవుటచే, ఆతడా జలమును పానమొనర్చెను. తిరిగి గంగా-

నది జహ్ను మునియొక్క చెవి నుండి బయటికి వచ్చు టచే, ఆమె జాహ్నవియని చెప్పఁబడును. ఆమె భగీరథుని కూతురుగా భాగీర-థియను పేరుతో పాతాళలోకమునందు ప్రవ హించును. గంగ యొక్క పావనజలస్పర్శ చే భగీరథుని పూ ర్వీకులు స్వర్గలోకము-నకు ఉత్థాన మొనర్పఁబడిరి.

బ్రహ్మదేవుని సాన్నిధ్యమునందు తన తప్పుడు ప్రవర్తన కా-రణముచే గంగమానవరూపమును ధరింపవలసి వచ్చెను. ఆమె శంతనునికి భార్యయయ్యెను. శంతనుడు కూడా మహాభిషుడను పేరుగల దేవలోక భూపతియై యుండెను. అతడు కూడా బ్రహ్మదే-వుని సన్నిధిలో తన అహంకారమును ప్రదర్శించిన దోషకారణముచే ఈ ప్రపంచమునందు జన్మింపవలసి వచ్చెను. గంగాదేవికి చారిత్రక వీరుడును, తపస్సంపన్నుడునగు భీష్ముడు జన్మించెను.

## ***శివుడు - శివపూజ***

అగ్నిచే తనయందుంచబడిన శివుని వీర్యమును ధరించు టకు గంగాదేవి సమ్మతించెను. దుర్జేయుడైన తారకాసురుని సం-హరించిన దేవసేనాపతియగు సుబ్రహ్మణ్య స్వామిని గంగాదేవి ప్రపంచమునకు ప్రసాదించెను.

గంగ విష్ణువు యొక్క స్వరూపము. ఆమె యొక్క దృశ్యము మనోహరము మఱియు ఆత్మానందదాయకమై యుండును. ఆమె లోయలలో ప్రవహించి, హిమవంతుని పుత్రికయైన పార్వతి పా-ర్శ్వమునందువసించును. ఆమె ఋషీకేశములోని లోయలో

ప్రవహించునప్పుడెంతయో దేదీప్యమానముగా కన్పట్టును. ఆమె సముద్రమువంటి నీలవర్ణమును కలిగియుండును. జలము మి-క్కిలి మధురముగాను, శుద్ధముగాను ఉండును. సమతల దేశమునందుండు ధనవంతులు ఋషీకేశము నుండి జలమును తీసుకొని వెళ్ళుదురు. వారాజలమును పెద్ద రాగిచెంబులలో భార-తదేశములోని సుదూర స్థలములకు తీసుకొని వెళ్ళుదురు.

ఋషీ కేశ్ లోని గంగాదర్శనము మనోహరప్రదము. గంగా తీ-రమునందున్న ఒక రాతిఫలకముపై కొన్ని క్షణములు కూర్చుండుట వరప్రసాదమువంటిది. కొన్నినెలలు ఋషీ కేశము లోని గంగా తీరమునందుండి అనుష్ఠానము, లేక పురశ్చరణ నొన-ర్చుట గొప్పతపస్సువంటిది. దానిచే ముముక్షువు హరిధామమునకు తీసికొనిపోఁబడును. గంగాతీరమునందెల్ల కాల-ము నివసించి, తన జీవితమును ధ్యాననిష్ఠయందు గడుపుటయే శివా నందము.

***శివుడు - శివపూజ***

గంగామాత మిమ్మలనందరిని ఆశీర్వదించునుఁగాక ! తన తీరమునందు నివసింపఁజేసి, యోగాభ్యాసమును మఱియు తప-స్సునొనర్చునట్లు ఆమె నీకు సహకరించునుఁగాక !

## త్రిపురా రహస్యము

ఆణవమలము (అహంకారము), కర్మ (కర్మబంధము) మఱియు మాయ (జీవుని ఆవరించునట్టి శివుని మిథ్యాశక్తి) ఇవియే త్రిపుర-ములనఁబడును. శివునికి ఆత్మార్పణము నొనర్చుట ద్వారా ప్రథమపురమగు ఆణవమలమును నశింపఁజేసి, అతని అనుగ్ర-హమునొందుము. దేవునికి నీవొనర్చు కర్మయొక్క ఫలముల నర్పించుటచేతను మఱియు నీ వివిధావయవముల ద్వారా ఆ శి-వుడే పనిచేయుచున్నాడనెడి నిమిత్తభావమును వికసింపఁ జేసికొనుటచేతను. అతని చేతులలో నీవు కేవలమొక ఉపకరణ-ము మాత్రమని తలచి "నేను కర్త"ననెడి భానమును నశింపఁజేయుట చేతను రెండవ మలమగు కర్మను తొలగించు-ము. అప్పుడు వాకర్మలచే బంధింపఁబడవు. నీవు హృదయ పారిశుద్ధ్యమునొంది, దాని ద్వారా శాశ్వతమగు శివానందమునుఁ బడయగలుగుదువు. • పంచాక్షరి నుచ్చరించుట చేతను, గురువు-ను అర్చించుటచేతను, దేవుని నానావిధలీలలను శ్రవణమొనర్చి మననము చేయుట చేతను, అతని



సచ్చిదానంద స్వరూపమును గూర్చి ధ్యానించుట చేతను మాయ-యనెడి మూడవ మలమును తొలగించుము.

ఇదియే త్రిపురములను, లేక దుర్గత్రయమును నశింపఁ జే-యుట. ఇదియే త్రిపురా రహస్యము.

నానావిధ సద్గుణములనలవరచుకొనుట చేతను, సాత్త్వికా-హారమును సేవించుటచేతను, సత్సంగముచేతను, పంచాక్షరి

జపమునొనర్చుటచేతను మఱియు శివునిగూర్చి ధ్యానించుటచే-తను రజస్సుద్వారా తమస్సును నశింపఁ జేయుము. మఱియు రజస్సును సత్త్వముగా పరిణమింపఁజేయుము. తదనంతరము సత్త్వమును కూడా అతిక్రమించుము. అప్పుడు నీవు శివుని యం-దైక్యమగుదువు.

ఇదియే త్రిపురములను, లేక దుర్గ త్రయమును నశింప జే-యుట. ఇదియే త్రిపురారహస్యము.

జపము, ధ్యానము, స్వాధ్యాయము, కీర్తనలనెడి శుభవాసన-లచే మోహము, పేరాస, ద్వేషము, క్రోధము, అసూయ యనెడి అశుభవాసనలను తొలగించుము. అప్పుడు నీవు శాశ్వతమగు శివా-నందము ననుభవింతువు.

ఇదియే త్రిపురములను, లేక దుర్గత్రయమును నశింపఁ జే-యుట, ఇదియే త్రిపురా రహస్యము.

గురువును సేవించుము. శ్రద్ధాభక్తులతో ఆతనిని సేవించి నీ హృదయమును పరిశుద్ధమొనర్చుకొనుము. కుండలిని జాగృత



మొనర్చు యోగాభ్యాసమును ఆతని ద్వారా నేర్చుకొని, దానినను-ష్ఠింపుము. ఆతనివద్ద యోగశాస్త్రమునధ్యయన మొనర్చుము. బ్రహ్మచర్యము నవలంబించుము. ఆరుగురు శత్రువులు, లేక షడ్రిపులను సంహరించుము. అంతర్ముఖుడ వగుము. కుండలి-నిని సుషుమ్నానాడి ద్వారా తీసుకొని వెళ్ళి, చక్రముల ద్వారా గ్రంథులను భేదించి, సహస్రారచక్రమునందున్న సదాశివునిలో

ఆమెను ఐక్యమొందించి, శాశ్వతమగు శివానందమునను భవిం-
చుము.

ఇదియే త్రిపురములు, లేక దుర్గత్రయమును నశింపఁ చే-
యుట. ఇదియే త్రిపురా రహస్యము.

స్థూల, సూక్ష్మ కారణములనెడి త్రివిధ శరీరములను చంపు-
ము. అనగా అతిక్రమించుము. అన్నమయ, ప్రాణమయ
మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశములనెడి పంచకోశ-
ములను దాటి వెళ్లుము. శివునిపై ధ్యాననిష్ఠాగరిష్ఠుడవై
శివసాయుజ్యమునొందుము.

ఇదియే త్రిపురములు, లేక దుర్గత్రయమును నశింపఁ జేయుట.
ఇదియే త్రిపురా రహస్యము,

జాగ్రత్స్వప్నసుషుప్త్య వ్యవస్థలకు సాక్షివై యుండుము. చూప-
రిగా నిలఁబడియుండుము. విషయ చైతన్యమునుండి
విముఖుడవగుము. అంతర్ముఖుడవగుము. నాల్గవ భూమికయగు -
తురీయావస్థ, లేక శివపదమునొందుము.

ఇదియే త్రిపురములు, లేక దుర్గత్రయమును నశింపఁ జేయుట.
ఇదియే త్రిపురారహస్యము.

## *శివుడు - శివపూజ*

శరీరము, మనస్సు మఱియు చిత్తములకతీతుడవై నిర్వికల్ప,
లేక అసంప్రజ్ఞాతసమాధి నొందుము.

ఇదియే త్రిపురములు, లేక దుర్గత్రయమును నశింపఁ జేయుట.

ఇదియే త్రిపురారహస్యము.

సహజజ్ఞానము, బుద్ధి, తెలివికి అతీతుడవై శివుని మూడవ నేత్ర-మగు ఆత్మజ్ఞానమనెడి దివ్యచక్షువును తెరువుము. మఱియు శివుని పరమప్రకాశమునందు లయించుము. ఆలోచన, సంకల్ప-ము మఱియు అనుభవములకతీతుడవై పరమశాంతి, లేక నిస్సంకల్పావస్థ, లేక శివనిర్వాణమునందు ప్రవేశించుము.

ఇదియే త్రిపురములు, లేక దుర్గత్రయమును నశింపఁ జేయుట. ఇదియే త్రిపురారహస్యము. శివుని శక్తియే త్రిపురసుందరి. ఆమె మఱియు శివుడు, ఏకైకము. ఆమె మిక్కిలి అందగత్తె. ఆనందమ-యియగు తన వైపు భక్తులనాకర్షించి ఆమె వారిపై భక్తిని, విజ్ఞానమును దివ్యజ్యోతిని వెదజల్లును. కావున ఆమె త్రిపురసుం-దరియని చెప్పఁ బడును. ఆమె పైన పేర్కొనఁబడినట్టి త్రిపురములను లేక దుర్గ త్రయమును నశింపఁజేసి, ముముక్షువు-లకు సహకరించును.

ప్రపంచమంతయు ఆమెయొక్క స్వాధీనమునందున్నది. సమస్త విశ్వము ఆమె యొక్క త్రిగుణములు కట్టడియందున్నది. ఆమెను పూజించుటచేతను మఱియు ఆమెయొక్క దివ్యాను . గ్ర-హమునుఁ బడయుటచేత మాత్రమే సమస్త కర్మబంధనలు . త్రెంపఁబడును.

## శివుడు - శివపూజ

మఱియు జననమరణచక్రము చీల్చఁబడును. ఆమెను స్తుతించు-టచేతను మఱియు ఆమెయొక్క నామముల నుచ్చరించుటచేత

మాత్రమే సమస్త పాపములు నశించును. మరియు శాశ్వతమగు శివానందము లభించును.

ఆమె త్రిపురాయనియు చెప్పఁబడును. స్త్రీ లేక పురుషుని శరీరము ఆమెధరించిన రూపములయందొకటిగా చెప్పబడును. సమస్త, ప్రపంచము ఆమెయొక్క శరీరమే. సమస్త దేవతలు ఆమెయొక్క రూపములే. పవిత్ర గ్రంథములలోని త్రికములన్నియును ఆమెయందున్నవి. త్రిగుణములు, త్రివిధ చైతన్యావస్థలు, అగ్నిత్రయము, శరీరత్రయము, లోకత్రయము, శక్తిత్రయము (ఇచ్ఛాశక్తి - క్రియాశక్తి - జ్ఞానశక్తి), స్వరత్రయము (ఉదాత్త - అనుదాత్త - స్వరిత), త్రైవర్ణికములు, కర్మత్రయము (సంచిత - ఆగామి - పారబ్ధము), మూర్తిత్రయము, అ-ఉ-మ యను మూడక్షరములు మరియు ప్రమాత - ప్రమాణ - ప్రమేయములు, జ్ఞాత - జ్ఞాన - జ్ఞేయములు, ద్రష్ట - దృష్టి - దృశ్యములు మున్నగు సమస్త త్రికములు త్రిపురసుందరియందున్నవి.

ఈ శరీరమునందు దేవతలందఱును వసింతురు. వారు వివిధావయవములకు అధిష్ఠానదేవతలై యున్నారు. త్యాగరాజు మూలాధారమునందును, జంబుకేశ్వరుడు స్వాధిష్ఠానము నందును, అరుణాచలేశ్వరుడు మణిపూరమునందును, నటరాజు అనాహతమునందును, కాళహస్తీశ్వరుడు విశుద్ధమునందును, విశ్వేశ్వరుడు ఆజ్ఞాచక్రమునందును మఱియు శ్రీ కంఠేశ్వరుడు సహస్రారమునందును వసింతురు.

*శివుడు - శివపూజ*

సమస్త పవిత్ర క్షేత్రములీ శరీరమునందున్నవి. ఫాలభాగ-మునందు కేదారము, నాసికాగ్రహమునందు అమరా వతి, వక్షస్థలమునందు కురుక్షేత్రము మఱియు హృదయమునందు ప్రయాగయున్నది.

శరీరమునందు నవగ్రహములన్నియును తమకు ప్రత్యేక స్థా-నములను కలిగియున్నవి. సూర్యుడు నాదచక్రమునందును, చంద్రుడు బిందుచక్రమునందును, అంగారకుడు నేత్రము లం-దును, బుధుడు హృదయమునందును, బృహస్పతి మణిపూరము నందును, శుక్రుడు స్వాధిష్ఠానమునందును, శని నాభియందును, రాహువు ముఖమునందును మఱియు కేతువు ఉరమునందును వసించియున్నారు.

అసంఖ్యాకములగు నదులు మఱియు పర్వతములు కూడా శరీరమునందు ప్రత్యేకస్థానమునలంకరించి యున్నవి. భౌతిక - ప్రపంచమునందున్న వన్నియును శరీరమునందుకూడా మనకు లభించును. ఈ శరీరమొక సూక్ష్మ ప్రపంచమువంటిది. ఇది పిం-డాండమని చెప్పఁబడును.

ఇదియే త్రిపురారహస్యము. .

మీరు త్రిపురారహస్యము నర్థమొనర్చుకొని, త్రిపురసుందరి యొక్క అనుగ్రహముతో శివుని శాశ్వతానందమును లేక శివానంద-మును బడయుదురుఁగాక !

## *శివుడు - శివపూజ*

# కామాక్షి మఱియు మూగకవి

"మూక" అనగా మాటలు రానివాడని అర్థము. ఒక భక్తుడు దేవి-యొక్క అనుగ్రహమును( బడయుటకై కంచిలోని కామాక్షి దేవాలయములో ఘోరమైన తపస్సు నొనర్చుచుండెను. కామాక్షి ఆ భక్తుని ఆశీర్వదించుటకై ఒక అందమైన కన్యరూపమునందు కాన(బడెను. ఆ భక్తుడామెను ఒక సామాన్యమైన మానవకన్యగా తలంచి, ఆమె కేలాటి గౌరవమునొసంగకుండెను. అప్పుడామె ఆతనిని వదిలిపెట్టి, ఆ దేవాలయములో మరియొక మూలలో ని-ద్రించుచున్న ఒక వ్యక్తిని( గాంచెను. అతడు పుట్టుకతో మూగవాడై యుండెను. ఆమె అతనిని మేల్కొలిపెను. ఆ మెను( గాంచి ఆతడు మిక్కిలి సంతోషస్వాంతుడయ్యెను. దేవి ఆతని నాలుకపై బీజాక్ష-రమును వ్రాసి, అతనికి మాట్లాడుటకు శక్తి నొసంగెను. అతడొక సుప్రసిద్ధుడైన మూక కవియయ్యెను. ఆతడు "పంచశతి"యనెడి ఐదువందల శ్లోకములను పాడెను. అవి దేవీమాహాత్మ్యమును, దే-వియొక్క పాదపద్మములను, దేవియొక్క అనుగ్రహమును, దేవియొక్క దివ్యదృష్టిని మఱియు దేవియొక్క ప్రేమమయమగు మాతృక మందహాసమును(గూర్చి వర్ణించును. ఈ ఐదంశములలో ఒక్కొక్క అంశమునకు ఒక వందశ్లోకములు ప్రత్యేకింప(బడినవి. ఈ కారణముచే ఈ గ్రంథమునకు "మూక పంచశతి" యని పేరు వచ్చినది.

ఈ మూకకవి కుంభకోణములోని కామకోటి పీఠమునకు ఆచార్యుడయ్యెను. ఈ పదవిని అతడు ముప్పది తొమ్మిది సంవత్సరములు నిర్వహించెను.

నవరాత్ర్యుత్సవ సందర్భములో దక్షిణ దేశములోని ధార్మిక బుద్ధిఁగల ప్రజలు మిక్కిలి భక్తితో ఈ మూక పంచశతిని పఠింతురు.

కాళిదాసు ఒక నిరక్షరకుక్షియగు గొర్రెలకాపరియై యుండెను. ఆతడు కూడా కాళిమాతయొక్క దివ్యానుగ్రహముచే భారతదేశమునందొక సుప్రసిద్ధ కవియయ్యెను. కాళిదాసు త | ప్రఖ్యాతమగు శ్యామలా దండకమునందు దేవిని అత్యంత మనోహరముగా స్తుతించెను.

వాక్కు యొక్క శక్తినొసంగెడి దేవికి జయమగునుగాక !

## మాతృ క్షమాపణ స్తోత్రము

పసిబిడ్డకు తండ్రికంటే తల్లియే మిక్కిలి ప్రియమై యుండును. తల్లి సౌమ్యత్వము, సాధుత్వము, మధురత్వము, మృదుత్వము మఱియు ప్రియత్వమైన లక్షణములను కలిగి యుండును . ఆమె ఎల్లప్పుడు మందహాస మొనర్చుచుండును.

తండ్రి కఠినత్వము,



మొరటుతనము, పరుషత్వము, బిరుసుఁదనము మఱియు పాషా-ణమువంటి హృదయముకలవాడై యుండెను. కానుకలు, మధుర పదార్థములు, ఫలములు మఱియు ఇతర ద్రవ్యములనొందుటకై బిడ్డ తల్లివైపు పరుగెత్తును. బిడ్డ తన మనస్సులోని మాటలను తండ్రికంటె తల్లివద్ద స్వేచ్ఛగా విప్పి చెప్పును.

అదే విధముగా కవులు మఱియు సాధువులు కూడా జగత్పిత-కంటె జగజ్జననితో ఎక్కువ మచ్చికను కలిగియుందురు. వారు దివ్యజనని ఎదుట స్వేచ్ఛగా తమ హృదయమును విప్పి చెప్పు-దురు. వారు దేవుని తండ్రిగా పిలచుటకంటె, తల్లిగా భావించినప్పుడు తమ హృదయములోని ఆక్రందనలను వెళ్ళఁబోసికొందురు. శంకారాచార్యులవారిచే రచింపఁబడిన ఈ క్రింది మాతృస్తవమును పఠింపుము. పై నుడువఁబడిన సత్యము అప్పు-డు నీకు అర్థమై అనుభవగోచరమగును.

(1) నీ ఆజ్ఞలను నా అజ్ఞానము చేతను,
బీదరికము మఱియు సోమరిత నము చేతను,
నేను నెఱవేర్చఁజాలక పోయితినమ్మ,
నీపాదాలను పూజించలేని నన్ను తల్లి !
శుభదాయినియగు ఓ కల్పవల్లి!
వీటినన్నింటిని మన్నించుమో తల్లి!

కుపుత్రుడు పుట్టవచ్చు, కాని కుమాత ఉండబోదు తల్లి !

***శివుడు - శివపూజ***

(2) ఓ తల్లీ ! నీ కెందరో పిల్లలీపృథ్వియందు,
వారిలో నేనొక పనికిమాలిన పుత్రుడను,
ఐనను నీవు నన్ను వదలి పెట్టవద్దు తల్లి!
కుపుత్రుడు పుట్టవచ్చు, కాని కుమాత ఉండబోదు తల్లి!

(3) జగజ్జనని! తల్లి! ఓ కల్పవల్లి!
నేను నీ పాదాల నర్చింపలేదు తల్లి!
ఐశ్వర్యము నైన నీకు ఇవ్వజాలకుంటి తల్లి!
ఐనను నాపై నీకు ప్రేమ అపారమో తల్లి!
కుపుత్రుడు పుట్టవచ్చు, కాని కుమాత ఉండబోదు తల్లి!

# 7వ అధ్యాయము

# వీర శైవము - కాశ్మీర శైవము

## వీర శైవము

శక్తి విశిష్టాద్వైత దర్శనమే వీరశైవ దర్శనమనబడును. ఇది ఆగమంతలోని ఒక భాగము. ఇది శ్రీ బసవన్న మరియు ఆతని అనుయాయుల చేతులలో స్వాభావికమైన మార్పులకు పొందెను. గుల్బర్గకు అరువదిమైళ్ళ దూరమునందున్న నైజాం రాజ్యంలోని కళ్యాణ్ (1157-1167)ను పరిపాలించిన బిజ్జలుడను జైనరాజుకు బసవన్న ప్రధానమంత్రియైయుండెను.

బసవన్న అద్భుతమైన వ్యక్తిత్వమును కలిగియుండెను. అతడు ప్రజలను మిక్కిలి ప్రభావితులనుగావించెను. ఆతడొక ఆధ్యాత్మికసభను నిర్వహించెను. మూడువందల వీరశైవ సాధువులు గుమిగూడిరి. వారిలో అరువదిమంది సాధుమాతలు కూడా ఉండిరి. ఆ సందర్భమునందు సుప్రసిద్ధురాలై న అక్కమహా దేవియను సాధుమాత కూడా ఉండెను. బసవుని చేతులలో వీర శైవము లింగాయతమతముగా పరిణమించెను. కర్ణాటక శైవులకు లింగాయత మతముపై ప్రత్యేక శ్రద్ధకలదు. లింగాయత మతములోని సత్పురుషులు శరణులని చెప్పబడుదురు.

వీరశైవము, లేక లింగాయత మతము జీవితలక్ష్యమును, లేక శి-

వుని చేరుటకు మార్గమును చూపును. ఈ దర్శన సిద్ధాంతమును శివుడు,

### *శివుడు - శివపూజ*

సుబ్రహ్మణ్యుడు, ఋషభుడు, శాంతలింగుడు, కుమారదేవి, శివ-ప్రకాశుడు మున్నగు వారందఱు స్పష్టముగా వివరించిరి. ఈ దర్శన సిద్ధాంతమునకు వీరాగమము ముఖ్యమైన స్రోతస్సైయు-న్నది. ఈ మతమునవలంబించువారు కర్ణాటకమునందధిక సంఖ్యయందున్నారు.

సాధారణ శైవులు శివలింగమును ఒక పెట్టెయందుంచి, పూజ సమయమునందు దానినర్చింతును. ఇంక లింగాయతులు ఒక చిన్న వెండి, లేక బంగారు పెట్టెయందొక చిన్న శివలింగము నుం-చి, ఆ పెట్టెకొక గొలుసును అమర్చి, దానిని శరీరమునందు ధరింతురు. లింగమును శరీరమునందు ధరించుటచే, దేవుని ని-రంతరము స్మరించుటకు వీలుపడును. క్రైస్తవులు మెడయందు క్రాసును ధరింతురు. దీనికి కూడా పైన చెప్పఁబడిన అంశమే లక్ష్యమైయున్నది.

వీరశైవ దర్శనమునందుఁగల శక్తి, శివునితో తాదాత్మ్యము శ్రీ నొందును. శక్తి కార్యము నొనర్చును. శివుడు మౌనముగా నున్న సా-క్షి. శివుడు అనంతుడు, స్వయంప్రకాశుడు, శాశ్వతుడు, సర్వ వ్యాపి. అతడు శాంతికి సముద్రమువంటి వాడు. ఆతడు శ్రీమహా-మౌని. శివుడు సమస్తమును ప్రకాశింపఁజేయును. ఆతను శ్రీ పరిపూర్ణుడు మఱియు స్వయంభువు. ఆతడు నిత్యముక్తుడు

మఱియు అక్షతుడు. ప్రపంచమంతయు దివ్యసంకల్పముచే . జనించినది. వీరశైవ దర్శ నమునందు ప్రాపంచిక సంచలనము . మిథ్య కాదు. కాని ఒక సమగ్రమైన నాటకమువంటిది.



# కాశ్మీర శైవము

ఇది ప్రత్యభిజ్ఞ సిద్ధాంతమనియు చెప్పఁబడును. కాశ్మీర శైవ-మునకు ఆగమములు మూలాధారములు. కాశ్మీరమునందు సుప్రసిద్ధుడైన ఆగమంత ప్రత్యభిజ్ఞదర్శనుడని చెప్పఁబడును. ప్రతి వాడు అర్థమొనర్చుకొనుటకే సంస్కృత భాషలో ఇరువది ఎనిమిది ఆగమములు కాశ్మీర్ దేశములోని లోయలో వ్రాయఁబడె-ను. జైనమతము ప్రఖ్యాతినొందుటకు పూర్వమే ఈ యాగమంత ఉత్తర హిందూదేశమునందుద్భవించెను. అప్పుడది పశ్చిమము-నందును, దక్షిణమునందును పరివ్యాప్తమయ్యెను. పశ్చిమమునందది వీర మహేశ్వరదర్శనమనియు, దక్షిణదేశము-నందు శుద్ధ శైవ దర్శనమనియు చెప్పఁబడును.

శివుడే ఈ విశ్వమును సత్యస్వరూపుడు. శివుడే అనంత చైతన్య-ము. ఆతడు స్వతంత్రుడు, శాశ్వతుడు, నిర్వికారుడు, అద్వితీయుడు, సర్వవ్యాపకుడు. శివుడే కర్త, కర్మ, అనుభవజ్ఞుడు మఱియు బహుదర్శియై యున్నాడు. ప్రపంచము చైతన్యమునం-దు ఉనికిని కలిగియున్నది.

దేవుడు కేవలము తన సంకల్పశక్తిచే సృష్టించును. ఈ సిద్ధాం-తమునందు కర్మ మఱియు మిథ్యయైన రూపములను

సృష్టించునట్టి ప్రకృతి, మాయవంటి ఉపాదానకారణము అంగీక-రింపఁబడదు. ఒక దర్పణమునందు పదార్థములు కానఁబడునట్లు, దేవుడీ ప్రపంచమును తనలో కానఁబడునట్లొనర్చును.

### *శివుడు - శివపూజ*

అద్ధమునందు ప్రతిబింబింపఁబడిన పదార్థములచే అది ఎట్లు ప్రభావితము కాదో, అట్లే తాను సృష్టించిన పదార్థములచే ఆతడు ప్రభావితుడు కాడు. తన యందంతర్నిహితమైయున్న అద్భుత శక్తిచే ఆతడు జీవుల రూపమునందు కానఁబడును. దేవుడే ఈ ప్ర-పంచమునకు మూలాధారమైయున్నాడు. ఆతని స్పందనచే సమస్త విభిన్నతలు ఉత్పన్నములగును.

శివుడు నిర్వికారుడగు సత్యస్వరూపుడు. ఆతడీ సమస్త ప్ర-పంచమునకు ఆధారభూతుడైయున్నాడు. ఆతని శక్తి అనంతమైన అంశములను కలిగియున్నది. చిత్తు, ఆనందము, ఇచ్ఛ, జ్ఞానము మఱియు క్రియ ఆమె యొక్క ముఖ్యమైన అంశ-ములై యున్నవి.

శక్తి చిత్తుగా వ్యవహరించును. తదనంతరము పూర్ణత్వము, శి-వతత్త్వమను పేరుతో స్పష్టముగా అనుభూతమగును. శక్తి యొక్క ఆనందము క్రియాశీలమైనప్పుడు జీవితమేర్పడును. అప్పుడు శక్తి తత్త్వము యొక్క ద్వితీయ భూమిక ఏర్పడును. స్వయంప్రకట సంకల్పమే తృతీయ భూమిక. అప్పుడు ప్రపంచమును సృష్టించు సంకల్పము శక్తి సమన్వితమై ఈశ్వరతత్త్వమను పేరుతో నాల్గవ భూమిక ఏర్పడును. ఇదియే జ్ఞానభూమికయని చెప్పఁబడును.

ఐదవ భూమికయందు జ్ఞాత మరియు జ్ఞేయములుండును. ఇప్పు-
డు క్రియ ప్రారంభమగును. ఈ భూమిక శుద్ధవిద్యయనం బడును.
ఈ మతమునందు ముప్పదియారు తత్త్వములున్నవి.

## శివుడు - శివపూజ

అజ్ఞానమువలన బంధన మేర్పడును. "నేను అంతవంతు
డను." " నేను శరీరమును" అని జీవుడు తలంచును. శివునితో తా-
దాత్మ్యమునొందియున్న విషయమును మఱియు శివుడు
లేకుండా ప్రపంచమునకేలాటి ఉనికి లేదను విషయమును ఆత-
డు మరచిపోవును.

పరమపదమునొందుటకు ప్రత్యభిజ్ఞము, లేక సత్యజ్ఞానము
మాత్రము చాలును. జీవుడు తాను దేవుడనని గుర్తెరింగినప్పుడు,
అతడు దేవునియందైక్యమై శాశ్వతానందమునొందును. ద్వంద్వ-
భావము నశించినప్పుడు నీటిలో నీరు, పాలలో పాలు కలియునట్లు
ముక్తపురుషుడు శివునియందైక్యమగును.

వాసుగుప్తుడు (క్రీ.శ. 8వ శతాబ్దము) శివసూత్రమును రచించి, దా-
నిని కల్లటునికి నేర్పెను. తిరుమూలరుని "తిరు మందిరము"ను
పోలిన "శివదృష్టి" సోమనాథునిచే రచింపఁ బడెను. వాసుగుప్తుని
స్పందకారిక, సోమనాథుని శివదృష్టి (క్రీ.శ.930), అభినవగుప్తుని
పరమార్థసారము మఱియు ప్రత్యభిజ్ఞ విమర్శిని, క్షైమరాజుయొక్క
శివసూత్రవిమర్శిని ఈ మతములోని కొన్ని ముఖ్యమైన గ్రంథము-
లు.

వారు శివాగమములను మఱియు సిద్ధాంత గ్రంధములను ప్ర-మాణములుగా స్వీకరింతురు. వారు వాటిని శంకరుని అద్వైత విధానమునందు మార్పునొందింతురు. సోమనాథుని శివదృష్టి, ఉత్పలుని ప్రత్యభిజ్ఞసూత్రము మఱియు అభినవగుప్తుని గ్రంథ-ములు అద్వైతమును బలపఱచును.



# 8వ. అధ్యాయము

# శివుని ఆతని లీలలు

**శివుని ఆతని లీలలు**

కైలాస పర్వతమునకు ప్రభువగుటచే శివుడు "గిరీశుడ"ని చె-ప్పఁబడును.

జ్ఞానచక్షువనెడి మూడవనేత్రమును తన ఫాలభాగము నందు కలిగియుండుటచే శివుడు "త్ర్యంబకుడ"ని చెప్పఁబడును. ""హర" యను శబ్దము "హృ"యను ధాతువునుండి ఏర్పడినది. హృ+అతి- హరతి, అనగా సమస్త పాపములను హరించువాడని | అర్థము, ప్రళయ కాలమునందు ప్రపంచమును తన లోనికి తీసు-కొనువాడని కూడా "హర" యను పదమున కర్థము చెప్పవచ్చును.

శివుడు తన హస్తములలో పరశు (గొడ్డలి) మఱియు జింకను ధరించును. మిగిలిన రెండు చేతులతో ఆతడు వ మఱియు అభ-యముద్రల నొసంగును. ఇచ్చట జింకయనగా బ్రహ్మయని అర్థము. శివుడు మిక్కిలి శక్తిమంతుడు. బ్రహ్మదేవుడు కూడా ఆతని

వశమునందుండును.



## త్రిపురారి

త్రిపురములను, అసురులను శివుడు సంహరించెను. మయుని-ద్వారా సువర్ణ ము, వెండి మఱియు ఇనుముచే నిర్మిం పఁబడిన అసురులయొక్క త్రిపురములనాతడు నశింపఁజేసెను. త్రిపుర-ములచే రక్షింపఁబడినవారై అసురులు ఆస్తికులనందరిని హింసించిరి. శివుడు అసురులను, త్రిపురులను మఱియు త్రిపుర-ములను సంహరించుటచే ఆతనికి "త్రిపురారి" యను పేరు వచ్చెను.

## శివజ్యోతి

ఒక రోజు బ్రహ్మ మరియు విష్ణువు తమలో ఎవరు గొప్పవారని వా-దించుకొనుచుండిరి. వారి గర్వమునణచుటకే శివుడు ఒక అనంతమగు జ్యోతిర్లింగాకారముగా ప్రకటమయ్యేను. ఆ జ్యోతి యొక్క పరిమాణమును తెలిసికొనుటకై బహ్మ మఱియు విష్ణువు

బయలు దేరిరి. వారు తమ ప్రయత్నమునందు విఫలులైరి.



## నీలకంఠుడు

సముద్రము మథింపఁబడినప్పుడు భయంకరమైన విషము బయల్వెడలెను. ప్రపంచమును సంరక్షించుటకై శివుడు దానిని మ్రింగెను. దీనిచే అతని కంఠమునందు నీలవర్ణముఁగల మచ్చ ఏర్పడెను. ఈ కారణముచే ఆతనికి "నీలకంఠుడను పేరు వచ్చెను.

## రావణుడు - శివుడు

రావణుడు గొప్ప శివభక్తుడైయుండెను. శివుని పూజించుటకై ఆతడు ప్రతిరోజు కైలాసపర్వతమునకేగుచుండెను. ఇది అతనికి మిక్కిలి కష్టముగా తోచెను. ప్రతిరోజు కైలాసపర్వత ప్రయాణమును తప్పించుకొనుటకై ఆ పర్వతమునే తన స్థానమగు లంకకు తీసు-కొనివచ్చినచో బాగుండునని ఆతడు తలంచెను. ఆతడా పర్వతమును పెకిలించుటకు ప్రయత్నింపగా అది కదిలెను. శివు-

ని అర్ధాంగినియైన పార్వతి భయపడెను. ఆమె శివుని ఆలింగన-మొనర్చుకొనెను. శివుడు రావణుని తన బొటన వ్రేలుతో నొక్కి, అతనిని పాతాళలోకమునందు పడవేసెను.



## హరి – శివుడు

ఒక వేయి పద్మములతో హరి ప్రతిరోజు శివుని పూజించు చుండెను. ఒక రోజు ఒక పద్మము కొఱతపడెను. వేయి పద్మము లను పూర్తిచేయుటకై అతడు తన నేత్రపద్మమును పెరికి వేసెను. ఆతని భక్తిచే ప్రీతినొంది, శివుడు విష్ణువుకు సుదర్శన చక్రము నొసంగెను. ఈ సుదర్శనచక్రమును విష్ణువెల్లప్పుడు ధరించును. ఈ సుదర్శనచక్రము స్వయముగా భక్తి స్వరూపమైయున్నది.

## బ్రహ్మయొక్క వరము

ఒక రాక్షసుడు బ్రహ్మను పూజించి, ఈ సమస్త ప్రపంచ మును నశింపఁజేయు శక్తినొసంగుమని అతనిని ప్రార్థించెను. ఈ వరము-నొసంగుటకై బ్రహ్మదేవుడు సంకోచించు చుండెను. అతడు తన అర్ధాంగీకారమును సూచించి, వేచి యుండుమని పలికెను. దీనిని

విన్న దేవతలు మిక్కిలి భయ కంపితులై శివుని వద్దకి వెళ్ళి సమస్తమును నివేదించుకొనిరి. బ్రహ్మ ఈ వరము నొసంగుటలో ఆలస్యమగుటకై మఱియు ఆతనికి పరధ్యానము కలుగుటకై శివుడు నాట్యమొనర్చి, ప్రపంచమును రక్షించెను.



## సుబ్రహ్మణ్య జననము

తారకాసురుడు దేవతలనందరిని స్వర్గలోకమునుండి వెడలనంపెను. దేవతలు బ్రహ్మదేవుని వద్దకు వెళ్ళిరి. బ్రహ్మ దేవతలతో ఇట్లనెను, "నా అనుగ్రహముచే అసురుడు శక్తిని ఆర్జించెను. కావున ఆతనిని నేను సంహరింపఁజాలను, నేను మీకొక ఉపాయమును చెప్పెదను. శివుని వద్దకు వెళ్ళుఁడు. ఆతడు యోగసమాధియందున్నాడు. అతడు పార్వతితో ఐక్యమగుటకై ప్రేరేపింపఁబడవలయును అతనికొక శక్తిమంతుడగు కుమారుడు జన్మించును. ఆతడే ఈయసురుని సంహరించును."

అప్పుడు ఇంద్రుడు కామదేవుని తన భార్యయగు రతీ దేవితోను, తన తోటివాడగు వసంతునితోను కలిసి శివుని స్థానమైన కైలాస పర్వతమునకు వెళ్ళుమని చెప్పెను. వెంటనే ముగ్గురు కలిసి కైలాసపర్వతమునకు బయలుదేరిరి. అచ్చట వసంతఋతువు ఏర్పడెను. దీనినిఁ గాంచి ఋషులందలు ఆశ్చర్య చకితులైరి. కా-

ముడు ఒక వృక్షము చాటున నిలబడి, శివునిపై ఒక బాణమును వి-డిచెను. ఈ సమయమునందు పార్వతి శివుని పూజించుచు, ఆతని హస్తములలో పుష్పములను సమర్పించుచుం డెను. ఆమె చేతు-లు శివుని చేతులను స్పర్శించెను. అకస్మాత్తుగా శివుడు కామమోహితుడగుటచే, ఆతని బీజము బయటపడెను. అతని యోగసమాధికి కలిగిన ఈ విఘ్నముచే శివుడు ఆశ్చర్యము నొందె-ను. అతడు నలువై పుల పరికింపగా, చెట్టుచాటునందున్న కాముడు గానఁబడెను. అతడు తన



మూడవనేత్రమును తెఱచెను. ఒక అగ్నిజ్వాల బయల్వెడలి, కా-ముని బూడిద పాలొనర్చెను.

ఆ శివుని బీజము అగ్నియందు విసరివేయఁబడెను. అగ్ని దానిని భరింపఁజాలకపోయెను. అగ్నిదేవుడు దానిని గంగయందు గంగ దానిని వెదురుటరణ్యములో పడవేసెను. అచ్చటను, శరవ-ణభవుడు, లేక సుబ్రహ్మణ్యుడు జన్మించెను. సుబ్రహ్మణ్యుడు దేవసేనాపతియై, బ్రహ్మ తలంచినట్లుగా అసురుని సంహరించె-ను.

## శివుడు - దక్షుడు

ప్రపంచమునకు పూర్వీకులగు ఋషులొనర్చు యజ్ఞము

నందు పాల్గొనుటకై దక్షుడు వెళ్ళెను. తనకంటే పూర్వము వచ్చిన ని అతడు గౌరవింపఁబడకుండుటచే దక్షుడాతనిని దూషించుచు, ఆ స్థలమును వదలి వెళ్ళెను. అప్పుడు నందీశ్వరుడు దక్షుని మఱియు ఇతర బ్రాహ్మణులను శపించెను. రుద్రుడప్పుడు ఆ యజ్ఞవాటికను వదలివెళ్ళెను.

తన తండ్రియొనర్చు బృహస్పతి సవనమునందు పాల్గొను-టకై అనుమతినివ్వుమని దక్షుని పుత్రికయగు దాక్షాయణి శివుని అడిగెను. కాని శివుడు అది అనుచిత కార్యమని తెలిపెను.

## *శివుడు - శివపూజ*

తన ప్రభువు యొక్క సలహాను జవదాటి, దక్షుని యజ్ఞమున-కు వెళ్ళెను. ఆమె తన తండ్రిచే అగౌరవింపబడినదై రుద్రునికి యజ్ఞభాగ మొసంగబడనందుచే క్రోధపూరితురాలై, తన ప్రభువు-యొక్క మహిమను స్తుతించుచు, దక్షుని నిందించుచు, యోగాగ్నియందు తన తనువును త్యజించెను.

సతి తన శరీరమును త్యజించుటను విని, శంకరుడు. క్రోధ-ముచే తన జటనుండి వీరభద్రుని సృష్టించి, దక్షుని హతమార్చెను.

దక్షుని మరణమును గూర్చి దేవతలచే విన్నవాడై బ్రహ్మదే-వుడు రుద్రుని ఉపశమింపఁజేసి దక్షుని, ఇతరులను తిరిగి బ్రతికించెను.

శివుడు బ్రహ్మయొక్క స్తుతిచే సంతుష్టుడై, దేవతలతో కలిసి యజ్ఞవాటికను ప్రవేశించి దక్షుని, ఇతరులను పునర్జీవితులుగా నొ-నర్చెను. యజ్ఞాగ్నినుండి విష్ణువు ప్రకటింపఁబడగా దక్షుడు, ఇతరులు అతనిని స్తుతించిరి. ఆహుతులు అర్పించిన అనంత-రము దేవతలు తమతమ నెలవులకేగిరి. సతి పార్వతిగా జన్మించుట మఱియు స్కంద జననముఁ గూర్చిన ఈ వృత్తాంత-మును శ్రవణమొనర్చుటచే కలుగు ఫలితమునుఁగూర్చి మైత్రేయుడు వర్ణించెను.

***శివుడు - శివపూజ***

# దక్షిణామూర్తి

కైలాస శిఖరమునందు పార్వతీ సమేతుడై శివుడు విలువైన మణులచే పొదగబడిన ఒక అందమైన చావడియందు కూర్చొని యుండెను. ఆ సమయమునందు దేవి ప్రభువును పూజించి, దక్షు-ని పుత్రికయగు దాక్షాయణియను పేరును మార్చుమని అతని ప్రార్థించెను. అగౌరవము మఱియు అహంకార కారణముచే దక్షు-డు శివునిచే చంపఁబడెను. శివుడీ ప్రార్థనను విని, సంతానము కొరకై ఘోరమైన తపస్సునొనర్చుచున్న పర్వతరాజుకు పుత్రికయై

జన్మించుమని దేవిని ఆదేశించెను. ఆతడామె వద్దకి వచ్చి, ఆమెను వివాహమాడుదునని కూడా శివుడు పార్వతితో పలికెను. పార్వతీ దేవి ఇటు ఆజ్ఞాపింపఁబడినదై పర్వతరాజుకు కూతురై జన్మించి, తన ఐదవ ఏటనుండియే శివుని అర్ధాంగి యగుటకై ఘోరమైన తపస్సు నొనర్చుచుండెను.

దేవి లేనప్పుడు శివుడు ఒంటరిగానున్న సమయము చూచి బ్రహ్మమానసపుత్రులైన సనక, సనందన, సనాతన, సనత్కుమారులు శివుని దర్శించుటకై వచ్చి, అతనికి సాష్టాంగముగా ప్రణమిల్లిరి. అవిద్యను తొలగించి, మోక్షమును పొందుటెట్లో తెలుపుమని వారు శివుని ప్రార్థించిరి. అనేక శాస్త్రముల నధ్యయనమొనర్చినను వారికి అంతరిక శాంతి లభింపకుం డుటచే, మోక్షము నొందింపఁజేయు ఆంతరిక రహస్యములను తెలియఁ గోరుచున్నామనియును వారు పలికిరి.

### ***శివుడు - శివపూజ***

శివుడు మునులయొక్క మనవిని విన్నవాడై, పరమ గురువైన దక్షిణామూర్తి రూపమును ధరించి, మౌనమును _వహించి మఱియు చేతితో చిన్ముద్రను చూపుచు, ఆంతరిక రహస్యములను తెలుపుటకు ప్రారంభించెను. మునులు . శివుడాదేశించిన మార్గములో ధ్యానించి, అవర్ణనీయమైన మఱియు అనంతమైన ఆనందమునొందిరి. ఇట్లు శివుడు దక్షిణామూర్తిగా ప్రఖ్యాతినిఁబడసెను. దక్షిణామూర్తి యొక్క ఆశీస్సులు మనందఱిపై

ఉండునుగాక! ఆతని అనుగ్రహము ద్వారా మీరందఱు లోతుగా-మునిగి, నిత్యశాంతిని మఱియు శాశ్వతానందమును బడయుదురుగాక !

## త్రిపుర సంహారము

మహాభారతములోని కర్ణపర్వము నందీ విషయము వర్ణింపఁ-బడినది. చాలా కాలము క్రితము దేవాసుర యుద్ధము సంభవించెను. అసురులు యుద్ధములో ఓడిపోయిరి. తారకా సు-రుని ముగ్గురు కుమారులు దేవతలపై పగ తీర్చుకొనఁదలంచిరి. వారు ఘోరమైన తపస్సు నొనర్చి, సృష్టికర్తయైన బ్రహ్మదేవుని-నుండి ఒక వరమును పొందిరి. ఈ వరముయొక్క కారణముచే వారు ప్రతివారికి అజేయులై యుండిరి. కాని వారి మూడు దుర్గము-లను ఒకే బాణముచే ఎవరు పడగొట్టుదురో, అట్టివారు మాత్రమే వారిని జయించుటకు సమర్థులై యుండిరి.



వారు స్వర్గమునందు బంగారపుకోటను, గాలియందు వెండికో-టను మఱియు పృథ్వియందు ఇనుపకోటను నిర్మించిరి. వారు దేవతలను మఱియు ఋషులను హింసింపఁదొడగిరి. అప్పుడు దే-వతలందఱు బ్రహ్మదేవునికి ఫిర్యాదు చేసిరి. ప్రత్యేక తపస్సుచే యోగము మఱియు సాంఖ్యములను తెలిసికొన్నట్టి మహాదేవుని

వినా మరియొకరీ అసురులను జయింపజాలరని బ్రహ్మ దేవుడు సమాధానమొసంగెను. దేవతలందఱును మహాదేవుని సమీపించి, విశ్వములోని రూపములన్నింటిచే ఒక రథమును నిర్మించి ఇచ్చి-రి. విష్ణువు, సోముడు, అగ్ని యొక్క అంశములను కలిగిన విల్లమ్ములనుకూడా వారు ఆతనికొసంగిరి. మూడు దుర్గములకు బాణమును గుఱిపెట్టుమని వారు మహాదేవుని ప్రార్థించిరి. బ్రహ్మ-దేవుడు సారథి యయ్యెను. మహాదేవుడు బాణమును మూడుకోటల వైపు గుఱిపెట్టి వదలెను. తెప్పపాటు కాలములో మూడు దుర్గము-లు పడిపోయెను. అప్పుడు దేవతలందఱు మహాదేవుని స్తుతించి, స్వర్గలోకమునకు వెళ్ళిరి.

తాను స్వయముగా ఈ యసురులను నశింపఁజేయ లేననియు, వారు మిక్కిలి బలశాలురగుటచే తనయొక్క సగముబలము నూ-తగాఁగొని మీరే వారిని నశింపజేయవలయు ననియును మహాదేవుడు దేవతలతో పలికెను. మీయొక్క సగము బలమును భరించుటకు మాకు శక్తి లేదనియు, మీరే మా సగము బలముయొ-క్క సహాయముతో ఈ కార్యమును సాధింప వలయునని వారు సమాధాన మొసంగిరి. మహాదేవుడు దీని కంగీకరించెను. ఆతడు దేవతలందఱికంటె మిక్కిలి బలము గలవాడయ్యెను. కావున ఆత-డు మహాదేవుడయ్యెను.

శివుడు - శివపూజ

## శివుడు వర్కిరర్ను శపించి క్షమించుట

ఒకప్పుడు మధురై యొక్క పాండ్యరాజు, తన రాణియొక్క

వెంట్రుకలకు స్వాభావికమైన సుగంధమున్నట్లు అనుభూతి నొందెను. మానవుల వెంట్రుకలు స్వాభావికముగా సుగంధ పూరితములైయుండునా? లేక ఈ సుగంధము కేవలము పుష్పములు, లేక సుగంధద్రవ్యములచే కలిగినదా? యను సంశయమాతని కేర్పడెను. రెండవ రోజాతడు తమిల్ సంఘమునకు వెళ్ళి, ఏ కవి తన మనస్సులోని సంశయమును నివారించుచు ఒక పద్యమును వ్రాయునో, ఆతనికి బహుమానముగా ఒక వేయి బంగారునాణెములు(గల సంచిని ఇచ్చెదనని పలికెను. అనేక కవులు తమ కవనములనల్లిరి. కాని వాటియందేయొక్కటియు రాజునకు తృప్తి నొసంగకుండెను.

దేవాలయములోని దారుమియను ఒక బాహ్మణుడగు పూజారి మిక్కిలి బీదవాడైయుండెను. అతడు శివునితో ఇట్లు పార్థించెను. "ఓ దయామయా! నేను మిక్కిలి బీదవాడను. నేనిప్పుడు వివాహము చేసికొనదలంచితిని. నాబీదరికమును తొలగించుము. ఇప్పుడీ బంగారునాణెములను పొందునట్లు నాకు సహక రించుము. నేను నిన్ను మాత్రమే శరణు పొందుదును." శివుడొక పద్యమును అతనికొసంగి ఇట్లనెను. . ఈ పద్యమును సంఘమునకు తీసుకొని వెళ్ళుము, నీకు బంగారు నాణెములు లభించును.

తన సంశయమును నివారించుటచే ఆ పద్యముచే రాజు మిక్కిలి సంతుష్టుడయ్యెను. కాని సంఘములోని కవులు దానిని



అంగీకరింపకుండిరి ఆపద్యమునందొకదోషమున్నదని సర్కిరర్

అను కవి పలికెను. ఆ బీదబ్రాహ్మణునికి హృదయ ఘాతము కలిగెను. అతడు మందిరమునకు తిరిగివచ్చి, దేవుని ఎదుట నిలబడి ఇట్లు పలికెను "ఓ దేవా! దోషముఁగల పద్యమును నీవు నా కేల యొసంగితివి? నిన్ను దేవుడని ఎవ్వరు కూడా పలుకరు. దీనికై నేను మిక్కిలి వగచుచున్నాను" ఆ పద్యము యొక్క భావమేమనగా "ఓ అందమైన రెక్కలుఁగల తుమ్మెదా! నీవు పుష్పరాగమును ప్రోగుచేయుటలో కాలమును గడుపుదువు. ప్రేమగుఱించి మాట్లాడకుము. కాని సత్యమును గుఱించి మాట్లాడుము. నెమలివర్ణముగల మఱియు అందమైన పలువరుసలుఁగల ఈ యువతి యొక్క వెంద్రుకల యొక్క సుగంధమును మించిన సుగంధముఁగల ఏ పుష్పమైనను నీకు తెలియునా?

అప్పుడు శివుడొక కవియొక్క రూపమును ధరించి, సంఘమునకు వెళ్ళి "పద్యమునందు దోషమును పట్టిన కవి. ఎవరు?" అని అడిగెను. "దోషమున్నదని పలికి నది నేనే"యని నర్కిరర్ చెప్పెను. "ఆ దోషమేమి?" యని శివుడడిగెను. యువతి యొక్క వెంట్రుకలకు స్వాభావికమగు సుగంధము లేదు. వాటికి పుష్పసాంగత్యముచే సుగంధమేర్పడున"ని నర్కిరర్ పలికెను. "పద్మినియొక్క వెంట్రుకలకు కూడా పుష్పసాంగత్యముచే సుగంధ మేర్పడినదా?" యని శివుడడిగెను. "ఔన"ని నర్కిరర్ పలికెను. "ఈ దేవకన్యల వెంద్రుకలకు కూడా పుష్పసాంగత్యముచే సుగంధ మేర్పడినదా?" యని శివుడడిగెను. "ఔను. వారి వెంద్రుకలకు మందార పుష్పసాంగత్యముచే

సుగంధమేర్పడున"ని నర్కిరర్ బదులు పలికెను. "శివుని వామభా-
గమునందున్న నీవు పూజించునట్టి ఉమాదేవి వెంట్రుకలకు కూడా
పుష్పసాంగత్యముచే సౌగంధ్యమేర్పడునా?"యని శివుడడిగెను.
"ఔను, నిస్సంశయమ"ని నర్కిరర్ బదులు పలికెను.

శివుడు తన మూడవ నేత్రమును కొద్దిగా తెఱచెను. నర్కిరర్ ఇట్లనెను. "నేనీ మూడవ నేత్రముచే భయపడను. నీవు శివుడవైనను, నీవు నీ దేహమంతట నేత్రములను చూపించినను ఈ పద్యమునందు దోషమున్నది". శివుని మూడవ నేత్రములోని అగ్ని నర్కిరర్ పై పడెను. నర్కిరర్ వేడిని భరింపఁజాలకుండెను. తనను చల్లబఱచుకొనుటకై వెంటనే ఆతడు ప్రక్కనున్న పద్మపు కొలనులో దుమికెను.

అప్పుడు కవులందఱును శివుని సమీపించి "ఓ ప్రభూ! నర్కీరుని క్షమించుడ"ని పలికిరి. శివుడు నర్కిరరుని ఎదుట ప్రత్యక్షమయ్యెను. శివుని అనుగ్రహముచే ఆతని శరీరము చల్లబడెను. అతడు తన తప్పుకు వగచి ఇట్లనెను. "నేను ఉమా దేవియొక్క వెంట్రుకలకుకూడా దోషము పట్టితిని. దేవుడు తప్ప మరెవ్వరును నన్ను క్షమింపఁజాలరు." ఆతడు మిక్కిలి భక్తితో ఒక పాటను పాడెను. శివుడు కొలనులో ప్రవేశించి, అతనిని ఒడ్డుకు చేర్చెను.

అప్పుడు నర్కిరరుడు మఱియు ఇతర కవులు కలిసి దారుమికి బంగారు నాణెముల నొసంగిరి.

# నీ గురువును తెలిసికొనుము

ఫలాపేక్ష మఱియు అహంకారము, లేక కర్తృత్వభావము లేక తన పూర్వజన్మలలో ఎవ్వడు పుణ్యకర్మల నొనర్చెనో, అట్టివాని హృదయమునందు దైవభక్తి ప్రకాశించును. భక్తిచే ఆత్మజ్ఞానము కలుగును. మఱియు ఆత్మజ్ఞానముచే ఆతడు మోక్షమును, లేక పరమపదమునొందును.

పూర్వ కాలములో కళింగదేశమునకు వీరసింధువు రాజై యుండెను. అతడు తన పూర్వజన్మలో తీవ్రమైన తపోధ్యానము లను మఱియు యోగాభ్యాసమునొనర్చెను. కాని ఆతనికి మోక్షము కలుగకుండెను. చివరిదగు ఈ రాచజన్మయందు శేషించిన కర్మఫ- లములననుభవింపవలసి యుండుటచే ఆతడు యోగభ్రష్టు డయ్యెను. ఆతడొక రాజునకు కుమారుడుగా జన్మించెను. యువ- కుడై నప్పుడాతడు కళింగ దేశమునకు రాజుగా ఒనర్పఁ బడెను. అతడు పది సంవత్సరములు రాజ్యము నేలెను.

పూర్వజన్మలోని ఆధ్యాత్మిక సంస్కారములచేతను, దైవాను గ్రహముచేతను ఆతని హృదయమునందు వివేక వైరాగ్యములు ఉదయించెను. అతడు తనలో తాను ఇట్లు ఆలోచించెను. "నేను పునః పునః తినుట, త్రాగుట, నిద్రించుటలు నొనర్చుచున్నాను. ఈ రాజ్యమును పరిపాలించిన నా పూర్వీకులందఱును మట్టిపాలైరి. సమస్త ఐశ్వర్యము మఱియు సామ్రాజ్యములున్నను నాకు మన- శ్శాంతి లేదు. నేను ఆత్మజ్ఞానము నొంది, అమృతత్వమును

శాశ్వతానందమునుఁ బడయుటకై నేనొక గురువు ద్వారా దీక్షనుఁ-గైకొనవలసియున్నది."

వీరసింధువు సమస్త పండితులకు, సన్న్యాసులకు, సాధువు-లకు మఱియు మహాత్ములకు ఆహ్వానమునంపెను. ఆతడు ఈ క్రింది విధముగా ఉత్తరమును వ్రాసెను. "నాకు సరియైన ఉపదేశ-మునొసంగి నాకు ఆత్మసాక్షాత్కారమును కలుగఁజేయు పరమగురువునకు నేను నా రాజ్యములోని సగము భాగము నొసం-గుదును. అట్లు చేయఁజాలనివాడు కారాగారము నందుంచఁబడును. "

అనేక పండితులు మఱియు సాధువులు రాజును దర్శిం చిరి. ఒకడు తారక మంత్రమును, మరియొకడు పంచాక్షరిని,

వేరొకడు అష్టాక్షరి మంత్రములనొసంగిరి. కాని ఎవరుకూడా ఆ రా-జును సంతృప్తిపరుపఁజాలకుండిరి, వారి నందఱిని రాజు కారాగారమునందుంచెను. తన పూర్వజన్మలలో ఈ మంత్రో పదేశ-ముల నాతను పొందియుండెను.

గురువును పొందఁజాలకుండుటచే వీరసింధువు మిక్కిలి అశాంతచిత్తుడయ్యెను. శివుడొక సాధారణ కూలిమనుజుని రూప-మును ధరించెను. ఆతడు మిక్కిలి నలుపువర్ణమును కలిగి యుండెను. అతడు చింపిగుడ్డలను ధరించి, రాజు ఎదుట కానఁ బడెను. అతనిని ఆహ్వానించుటకై రాజు ముందుకేగెను. దైవానుగ్ర-

హముచే ఈ కూలివాడు, దేవుడేయను విషయము నాతడు గుర్తె-ఱుంగజాలెను.. కూలివాడు తన హస్తమును పైకెత్తి "ఆగుమ"ని పలికి, వెంటనే అదృశ్యుడయ్యెను. తన

### *శివుడు - శివపూజ*

మనస్సును మఱియు దాని చలనములను నిగ్రహించుమని గురువు ఆదేశించి నట్లు రాజు అర్థమొనర్చుకొనెను. రాజు నిలఁబడి యుండియే తన నేత్రములను మూసికొని, బాహ్య పదార్థములను చింతింప కుండునట్లు మనస్సును నిగ్రహించెను. ఆతడు మనోవృత్తుల నన్నింటిని తన అదుపునందుంచుకొనెను, తన పూర్వజన్మలో ఆతడు యోగమును మఱియు ధ్యానము నభ్యసించి యుండుటచే అది అతనికి సులభమై యుండెను. అతడు నిర్వికల్ప సమాధియందు ప్రవేశించుటచే ఒక విగ్రహమువంటి వాడయ్యెను. అతడు తన నేత్రములను తెఱువకుండెను,

మంత్రులు గంటల తరబడి దర్బారుహాలులో వేచి యుండిరి. వీరసింధువు దినముల తరబడి తన నేత్రములను తెఱువకుండెను. అప్పుడు మంత్రులిట్లు తలపోసిరి. "ఇప్పుడు రాజు సమాధియందున్నాడు. అతడు సమాధినుండి ఎప్పుడు తిరిగి వచ్చునో మనకు తెలియదు. కావున మనమే రాజ్యాంగమును నిర్వహింపవలసియున్నది." వారు రాజుయొక్క వ్రేలినుండి ఉంగరమును తొలగించి, దానితో రాజ్యసంబంధములగు పత్రములలో ముద్ర వేయుచుండిరి.

రాజు ఆరు సంవత్సరముల తర్వాత తన నేత్రములను తె-

అచి మంత్రులను "నా గురువెచ్చట?" అని అడిగెను. మంత్రు లి-ట్లు సమాధానము నొసంగిరి. "ఓ పూజ్యభూపతీ! గురువుగారు మీతో ఒక మాటను పలికి వెంటనే అదృశ్యు లైరి. గడచిన ఆరు సంవత్స-రములనుండి మీరొక విగ్రహమువలె ఇచ్చట నిలఁ



బడియున్నారు. మీ ఉంగరముయొక్క సహాయముతో మేము రా-జ్యభారమును నిర్వహించుచున్నాము. దస్తావేజులలోను, పత్రములలోనుఁగల మీ ఉంగరముయొక్క ముద్రను చూడుడు."

రాజు మహదాశ్చర్యచకితుడయ్యెను. ఆతడు తనలోనిట్లు తలంచెను. "ఆరు సంవత్సరములు ఒక్క క్షణమువలె గడచి పో-యెను. నేను పరమానందముననుభవించితిని. ఈ పరామా నందము చవిచూచిన తర్వాత నాకీరాజ్యమును పాలించు కోరిక లేదు." ఆతడు రాజభవనమును విడిచి, అరణ్యమునందు ప్రవే-శించి, సమాధి నిమగ్నుడయ్యెను.

పూర్వజన్మయందొనర్చిన యోగాభ్యాసజనితమగు సంస్కార బలముచే రాజు ఈ జన్మయందు మోక్షానందము నొందగలిగెను. కావున దైవభక్తి మఱియు ధార్మికనిష్ఠ ఎక్కువగాలేని వారీ జన్మ-యందు జపము, కీర్తన, ధ్యానము మఱియు ధార్మిక గ్రంథాధ్యయనముల నొనర్పవలయును. వారు సాధుసాంగత్యము నందుండవలయును. అప్పుడు వారు మంచి ధార్మిక సంస్కార-ముల నలవరచుకొనఁగలుగుదురు. వారికి మరుజన్మ యందిది యొక విలువైన పెన్నిధివంటిదగును. అట్టి వారు మరు జన్మయం-

దు బాల్యకాలములోనే యోగాభ్యాసమును ప్రారంభింతురు.

నీకు ఉపదేశము నొసంగుటకై గురువు, లేక ఈశ్వరుడు ఏ రూపమునందేతెంచునో చెప్పుట కష్టము. హనుమంతునివలె ఆతడొక కుష్ఠురోగి రూపముననో, శ్రీకృష్ణుని వలె ఒక అస్పృశ్యుని రూపముననో,

***శివుడు - శివపూజ***

లేక శివునివలె ఒక నరుని రూపమునందో రావచ్చును. దేవుడు ధరించునట్టి నానా విధరూపములలో ఆతని నెన్నుకొనుటయందు ముముక్షువులు మిక్కిలి జాగరూకులై, మెలకువఁగలవారై యుండవలయును.

## శివుడు విషపాన మొనర్చుట

ఒకప్పుడు చాలకాలము వరకు దేవతలకు, అసురులకు యుద్ధము సంభవించెను. యుద్ధమునందు అనేక దేవతలు మఱియు అసురులు మరణించిరి. అమృతపానమొనర్చి ఆయుష్యమును పెంపొందించుకొని, యుద్ధమును కొనసాగింప వలయునని దేవతలు తలంచిరి. ఈ కోరికను దృష్టి యందుంచుకొని వారు బ్రహ్మ దేవుని సమీపించిరి. బ్రహ్మ దేవుడిట్లనెను. "ఇది నాచే కానిపని. కేవలము విష్ణువే దీనిని ఒనర్పఁగలుగును." అటు పిమ్మట బ్రహ్మదేవుడు మఱియు దేవతలు కలిసి క్షీరసాగరము-

నందున్న శ్రీహరిని సమీపించిరి.

మందరగిరిని కవ్వముగాను, వాసుకియను సర్పమును త్రా- డుగాను చేసి సముద్రమును మథించుమని శ్రీహరి దేవత లకు మఱియు అసురులకు సలహానొసంగెను. అట్లు వారు మథించు- చుండగా, మొట్టమొదట సముద్రమునుండి హాలా హలము బయలు దేరెను. భయంకరమైన ఆ విషము ప్రజలను బూడిద పా- ల్గొనర్చుచుండెను.

## *శివుడు - శివపూజ*

దేవతలు, అసురులు మరియు ఋషులందఱును పారిపోసాగిరి. విష్ణువు ఈ విషమును నశింప చేయఁజాలకపోయెను. ఆతని శరీర- ముకూడా నల్లఁబడెను. ఆతడు శివుని దర్శించుటకై దేవతలు మఱియు బ్రహ్మదేవునితో కలిసి కైలాసమునకు పరుగెత్తెను. "జరి- గినదానినంతటిని ఆతడు శివునికి నివేదించెను. అటుపిమ్మట శివుడా విషమును ప్రోగుచేసి, తన అరచేతియందొక ముద్దగా చేసి, దానిని మ్రింగివేసెను. వారిని రక్షించినందుకు గుర్తుగా దానిని తన కంఠమునందు. ధరించుమని విష్ణువు మఱియు బ్రహ్మదేవుడు శి- వుని పార్థించిరి. శివుడట్లే యొనర్చెను. విషముయొక్క ప్రభావముచే ఆతని కంఠము | నీలవర్ణ మయ్యెను. ఆ రోజునుండి శివుడు "నీలకంఠుడు" లేక " "కాలకంఠమూర్తి" యని పిలువబడ- సాగెను. అప్పుడు శివుడు వారితో "మీరు మరల సముద్రమును మథింతురేని, మీకు అమృతము మఱియు అనేక ఇతర ద్రవ్య- ములు లభించునని పలికెను. వారందఱు మరల సముద్ర మథనమునారంభించి, అమృతము మఱియు ఇతర ద్రవ్యముల-

ను పొందిరి. దేవతలందరు అమృతమును పానమొనర్చి హృదయమునం దానందమునొందిరి.

## శివుడు ఎద్దుపై సవారి చేయుట

చాతుర్యుగము రెండు వేలమార్లు గడచినప్పుడు బ్రహ్మ దేవునికొక్క దినమగును. ఇట్టి ముప్పదిరోజులు అతనికొక నెలయగును. ఇట్టి

*శివుడు - శివపూజ*

పంద్రెండు మాసములు,ఆతనికొక సంవత్సర మగును. ఇట్టి నూరు సంవత్సరములు బ్రహ్మదేవునికి పూర్ణాయుష్యమగును. బ్రహ్మదేవుని జీవితకాలమంతయు విష్ణువుకొక దినమగును. నూరు సంవత్సరముల తర్వాత విష్ణు దేవుడు కూడా గతించిపోవును. లేక స్వయముగా పరబ్రహ్మము నందు లీనమగును. అండములన్నియు నశించును. బలమైన ప్రచండవాయు కారణముచే సప్తసముద్రములు ఉప్పొంగి, సమస్త ప్రపంచమును కప్పివేయును. శివుడు మాత్రమే ఉనికిని కలిగియుండును. అతడు మండుచున్న తన తృతీయ నేత్రముచే సమస్తమును దహింపఁజేసి, తుదకు నాట్యమాడును.

ధర్మదేవత తనలోతాను ఇట్లాలోచించెను. "నేను అమృతత్వము నెట్లు పొందగలుగుదును? నేను శివుని సమీపించిననేఁ గా-

ని దీనిని పొందలేను". అతడొక ఎద్దురూపమును ధరించి, శివుని సమీపించి ఇట్లనెను. "ఓ పూజ్య ప్రభూ! దయ చేసి నన్ను మీ వాహ-నముగా స్వీకరించి, నన్ను సంరక్షించుడు".

ధర్మదేవతయొక్క మనవిని శివుడంగీకరించి ఇట్లు పలికెను. "ధర్మమును కృతయుగమునందు నాలుగు పాదములతోను, త్రే-తాయుగము నందు మూడు పాదములతోను, ద్వాపరయుగము నందు రెండు పాదములతోను మఱియు కలియుగము నందు ఏక పాదముతోను నిర్వర్తించుము. నా అనుగ్రహము ద్వారా నీవు సమ-స్త శక్తిసమన్వితుడవు మఱియు ప్రకాశవంతుడవగుదువు. నీవు నా కెల్లప్పుడు వాహనముగా నుందువు. నీవు నాతో తాదాత్మ్యము నొం-దియుందువు".

***శివుడు - శివపూజ***

శివుడు త్రిపురసంహార మొనర్చినప్పుడు విష్ణువు ఒక వృషభ రూపమును ధరించి, శివునికి సహాయమొనర్చెను.

## శివుడు గంగను తలపై ధరించుట

ఒకప్పుడు కైలాసశిఖరమునందు పార్వతి తన చేతులతో శి-వుని నేత్రములను మూసెను. అప్పుడు సూర్యుడు, చంద్రుడు, అగ్ని ప్రకాశింపఁజాలకుండెను. దీనిచే ప్రపంచము మిక్కిలి అల్ల-కల్లోలమయ్యెను. చాలాకాలమువరకు సమస్తము అంధకారం

రముచే కప్పివేయఁబడెను. శివుడు తన మూడవ నేత్రమును కొం-
చెము తెఱచెను. అప్పుడు సూర్యుడు, చంద్రుడు, అగ్ని మరల ప్రకాశింపఁదొడగెను. ఇట్లు అంధకారము పటాపంచలయ్యేను.

పార్వతి భయకంపితురాలయ్యేను. ఆమె తన చేతులను తొ-
లగించి, తన వ్రేళ్ళయందున్న చెమటను క్రిందపడవేసెను. ఈ చెమటయే అసంఖ్యాకములగు పాయలుఁగల దశగంగగా మారెను. ఈ నదులు ప్రపంచమును అల్లకల్లోల మొనర్చెను. అప్పుడు బ్ర-
హ్మ, విష్ణువు మరియు ఇంద్రుడు శివుని వద్దకు పరుగెత్తి ఈ యుపద్రవమునుండి తప్పించుమని ప్రార్థించిరి.

శివుడు దయఁగలవాడై నీటినంతటిని తన జటలోని ఒకే వెం-
ట్రుకలోనికి తీసుకొనెను. తమ లోకములలోనికి కొద్దిగా



గంగాజలమును వదలుమని బ్రహ్మ, విష్ణువు మఱియు ఇంద్రుడు శివుని ప్రార్థించిరి. శివుడు కొద్ది జలమునొసంగెను. ఆ జలము వై-
కుంఠమునందు విరజానదియయ్యేను. సత్యలోకమునందు మానసతీర్థమయ్యేను. మఱియు ఇంద్రలోకమునందు దేవగంగ -
యయ్యేను. సగరుని అరుపదివేల పుత్రులను రక్షించుటకై భగీర-
థుడు బ్రహ్మలోకమునుండి గంగను భూలోకమునకు తీసుకొనివచ్చెను.

## శివుని భిక్షాటనలీల

శివుని ప్రేమించుటచేతను, పూజించుటచేతను లాభము లే-దనియు, యజ్ఞ నిర్వహణముచేత మాత్రమే మోక్షమునుఁబడయ వచ్చుననియును ఒకప్పుడు దారుకావనములోని ఋషులు తలంచిరి. వారు శివ పూజను త్యజించి, ముమ్మరముగా యజ్ఞము-ను జరిపిరి.

అప్పుడు శివుడు శ్రీహరితో ఇట్లనెను. "నీవు మోహిని వేషము-ను ధరించి, దారుకావనములోని ఋషుల స్థానమునందు ప్రవేశింపుము. ఇప్పుడు వారికి నా పైన గౌరవభావము లేదు. ఇప్పు-డు వారు తప్పుడు మార్గముననుసరించుచున్నారు. వారికి మనము మంచి గుణపాఠమును నేర్పవలసి యున్నది. వారి యందు కామమును రెచ్చగొట్టి, వారిని మోహింపఁజేయుము. వారి వ్రతములను భంగమొనర్చుము". ఆతడు కూడా ఒక భిక్షుక వేష-మును ధరించెను.

## *శివుడు - శివపూజ*

అప్పుడు శ్రీహరి మోహిని రూపమును ధరించి, దారుకా వన-ములోని ఋషుల నివాసస్థలములలో ప్రవేశించెను. ఋషులం దఱు తమ వివేక, విజ్ఞానములను గోల్పోయి, బలమైన, కామమున-కు వశీభూతులై మోహినిని వెంబడించిరి.

శివుడు ఋషిపత్నుల పర్ణకుటీరములలో ప్రవేశించి, మనో-హరమైన శ్రుతిగానముల నొనర్చుచు ఒక భిక్షుకునివలె సంచరించుచుండెను. ఋషిపత్నులు మోహపరవశులై శివుని

అనుసరించిరి. తమను తృప్తినొందించుటకై వారు అతనిని ఆనేక విధములుగా ప్రార్థించిరి. శివుడు నానావిధ రూపములను ధరించి, ప్రతి స్త్రీయొక్క మనస్సునందు ప్రత్యక్షమయ్యెను. ఋషిపత్నులందఱు హృదయానందమునను భవించిరి. ప్రాతః కాలమునందు వారందఱు జడలు, దండకమండలములుఁగల పదునెనిమిదివేల ఋషులను ప్రసవించిరి. వారందఱు శివుని ప్రార్థించిరి. అరణ్యమునందు తపస్సు నొనర్చుటకై శివుడు వారి నాశీర్వదించెను. ఋషులు అట్లే యొనర్చిరి.

ఋషులు తమ పత్నుల పరిస్థితినిఁగాంచి ఇట్లనిరి. "మేము మంత్రకత్తెయైన మోహినిచేత మోసగింపఁబడితిమి. భిక్షకుడు మన భార్యల పాతివ్రత్యమును భంగమొనర్చెను. మోహమెంత శక్తివంతమైనదో చూడుడు! మాయ అత్యద్భుతమైనది".

*శివుడు - శివపూజ*

## శివుడు త్రిశూలము, జింక ఇత్యాదులను ధరించుట

దారుకావనములోని ఋషులు శివుని హతమార్చుటకై ఒక యజ్ఞమును నెఱవేర్చిరి. అగ్నినుండి ఒక క్రూరమైన పులి ఏతెంచెను. శివుని చంపుటకై వారు పులిని ఆదేశించిరి. అప్పుడు శివుడే ఆ పులిని చంపి, దాని చర్మమును తన నడుము చుట్టు ధరించెను.

అప్పుడు శివుని చంపుటకై వారొక త్రిశూలమును సృష్టించిరి. శివుడు దానిని ఒక ఆయుధముగా తన చేతియందు ధరించెను. అప్పుడు వారు శివుని చంపుటకై వాడియైన కొమ్ములుఁ గల ఒక జింకను సృష్టించిరి. శివుడు దానిని తన ఎడమ చేతియందు ధరించెను.

తదనంతరము వారు శివుని చంపుటకై అసంఖ్యాకము లగు నల్లని త్రాచుబాములను సృష్టించిరి. శివుడు వాటిని తనకు ఆభరణములుగా ధరించెను. అప్పుడు వారు శివుని చంపుటకై అసంఖ్యాకములగు భూతగణములను సృష్టించిరి. శివుడు వారిని తనకు సైనికులుగా చేసికొనెను. అప్పుడు వారు శివుని చంపుటకై ఒక డమరును సృష్టించిరి. శివుడు దానిని తన హస్తమునందు ధరించెను. అప్పుడు వారు శివుని చంపుటకై మూయలకుడనెడి అసురుని సృష్టించిరి. మూయలకుడు శివుని సంహరించుటకై యజ్ఞాగ్నితో బయలుదేరెను. శివుడా అగ్నిని తన చేతిలోని మాలగా ధరించెను. మఱియు అసురుని తన పాదములక్రింద ఉంచుకొనెను.

*శివుడు - శివపూజ*

## శివుడు తన వామభాగములో ఉమను ధరించుట

ప్రళయానంతరము శివుని అనుగ్రహముచే జన్మించిన బ్ర-

హ్మదేవుడు సమస్త జీవులను సృష్టించుటకు సంకల్పించెను. అతడు సనక, సనందన, సనత్కుమార, సనత్సుజాతలను సృష్టించెను. వారు గృహస్థాశ్రమ జీవితమునందు ప్రవేశింప కుండిరి. వారు విజ్ఞానసమునార్జించి, మహా యోగిపుంగవులుగా వికసించిరి.

బ్రహ్మదేవుడు వైకుంఠమున కేగి, అచ్చట శ్రీహరినిఁ గాంచి ఇట్లు పలికెను. "ఓ పూజ్యప్రభూ! నేను సృష్టి కార్యమును కొనసాగింపఁజాలకున్నాను. సనక, సనందనాదులు యోగ మార్గమునవలంబించిరి. వారు గృహస్థులు కాఁగోరుటలేదు. దయచేసి నా సృష్టి కార్యమును కొనసాగు మార్గమును నాకు చూపుడు." విష్ణు దేవుడిట్లనెను. "ఇది నా చేతిలోని పనికాదు. కైలాసమునందు వసించు శివునివద్దకు మనము పోవుదము రమ్ము".

బ్రహ్మ దేవుడు మఱియు విష్ణువు కైలాసేశ్వరుని గాంచి ఇట్లనిరి. "ఓ దేవ దేవా! నలుగురు కుమారులు యోగులగుటచే బహ్మయొక్క సృష్టికార్యము నిలిచిపోయింది. దయచేసి ఆతని సృష్టికార్యము కొనసాగుటకై ఆతని నాశీర్వదింపుము".

శివుడు తన వక్షస్థలమునకు ఎడమ భాగమునందు తన దృష్టిని నిగిడెను. శివుని వామభాగమునుండి ఉమ జన్మించెను. . శివుడు వారితో ఇట్లనెను. "ఇప్పుడు సృష్టి కార్యమునందు కష్టముండదు. అది ఏలాటి ఆటంకము లేకుండా కొనసాగును". అప్పుడు బ్రహ్మ మఱియు విష్ణువు

***శివుడు - శివపూజ***

తమతమ నెలవుల కేగిరి. అప్పుడు శివుని అనుగ్రహముచే బ్రహ్మ-

దేవుడు లోకములను సృష్టించెను. స్త్రీ పురుషులు ఆనందముగా, అన్యోన్యముగా కలిసి నివసించి, సంతానమును కనిరి. ఈ కానఁబ-డునదంతయు శక్తిమయమే. శివుడు ప్రకృతి యొక్క కార్యకలాపములకు సాక్షియైయుండును.

## శివుడు ఏనుగు చర్మమును ధరించుట

చాలాకాలము క్రితము గజాసురుడు ఘోరమైన తపస్సు నొన-ర్చెను. బ్రహ్మ అతనికి ప్రత్యక్షమై “ఓ గజాసురా!

నీ తపస్సుకు నేను మెచ్చితిని. నీ కేమి వరము కావలయు నని అడిగెను. "ఓ పూజ్య ప్రభూ! నాకు బలపరాక్రమమును మఱి-యు అనంతమైన ఐశ్వర్వము నొసంగుమ"ని గజాసురుడు పలి కెను. “నీవు కోరినదానిని నీ కొసంగితిని. కాని నీవు శివునితో యుద్ధ మొనర్తు వేని, నీవు నీవరమును కోల్పోవుదు”వని బ్రహ్మ దేవుడు పలికి అదృశ్యుడయ్యెను.

అప్పుడు గజాసురుడు దిగ్విజయ మొనర్చి, దేవతలను మఱియు ఇంద్రుని ఓడించెను. అతడు మునులను మఱియు ఋషులనుకూడా కష్ట పెట్టెను. వారు కాశీకి వెళ్ళి, విశ్వనాథుని పా-దముల పై బడి ఇట్ల నిరి. "గజాసురుడు మమ్ములను చంపు టకు ప్రయత్నించుచున్నాడు. ఓ ప్రభూ! మమ్ములను రక్షింపుడు. మా-కు మరియొక శరణ్యము లేదు”.

గజాసురుడు విశ్వనాథునికూడా ఎదుర్కొనెను. శివుడు అసురుని చంపి, చర్మమును చీల్చి, తనకు దుస్తులుగా ధరించెను. అప్పుడు దేవతలు మఱియు మునులు శివుని స్తుతించి, ఆనందము నొందిరి.

## శివుడు కట్టెలమ్ముట

పాండ్య రాజ్యమునకు వరగుణపాండ్యుడు రాజుగా నుండెను. మధురై ఆతనికి ముఖ్య పట్టణమై యుండెను. అతడు ఇంద్రునివంటివాడై యుండెను. వీణావాద్యమునందు ప్రవీణుడై యున్న ఎమనాథుడు ఉత్తర భారతదేశమునుండి ఆతని దర్బారు కేతెంచెను. ఆతడు వీణపై మనోహరములగు పాటలు పాడెను. రాజు ఎమనాథుని సంగీతమును స్తుతించి, అతనికి అమూల్యము లగు బహుమానములనొసంగి, ఆతనిని ఒక ప్రత్యేకమగు బంగళాయందుంచెను. ఎమనాథుడు తన సంగీత కళాకౌశలము చే మిక్కిలి గర్వము కలవాడయ్యెను.

ఎమనాథుడు సంగీతజ్ఞానముచే గర్వము కలవాడైనాడని వరగుణపాండ్యుడు తెలిసికొనెను. అతడు తన దర్బారు సంగీత విద్వాంసుడైన భానభద్రుని పిలిచి ఇట్లనెను. "ఓ భద్రా! ఈ క్రొత్త సంగీతజ్ఞుడైన ఎమనాథుని నీవు ఓడించగలవా?" భానభద్రుడు ఇట్లు సమాధాన మొసంగెను. "మీ అనుగ్రహము చేతను మఱియు

మధురైలోని సోమసుందర దేవుని ఆశీస్సుల చేతను నేనాతనిని నిశ్చయముగా ఓడించగలను". రాజిట్లనెను "సరి, అట్లైనచో రేపటి రోజువచ్చి, నీ సంగీత కళాకౌశలమును ప్రదర్శించుము".

ఎమనాథుని శిష్యులు మధురై లోని సందుగొందులలో సంచరించి, వీణావాయిద్యమొనర్చుచు, తమ సంగీత కళాకౌశలమును(గూర్చి మిక్కిలిగా ప్రకటనలనొనర్చిరి. భానభద్రుడు దీనిని విని తనలో తాను ఇట్లాలోచించుకొనెను. "ఈ శిష్యులు వీణయందును, సంగీతమునందును మిక్కిలి నేర్పరులు. శిష్యులే ఇంతటి జ్ఞానమును కలిగియున్నచో, గురువుయొక్క ప్రతిభ మఱియు తేజస్సు ఎంతగొప్పదై యుండవచ్చును! ఈ మహా సంగీత విద్వాంసుని నేను జయించుట ఎట్లు?" అప్పుడతడు శివుని ఇట్లు ప్రార్థించెను "ఎమనాథుని ఓడించుటకై దయచేసి నాకు సహకరింపుము. నాకు నీయొక్క అనుగ్రహము అవసరమైయున్నది".

అప్పుడు శివుడు ఒక కట్టెలమ్ముువాని రూపమునుదాల్చి, ఒక చింపిగుడ్డను శరీరమునందు ధరించి, పాదములయందు పగిలిన పాదరక్షలను వేసికొనెను. అతడు తన చేతియందు వీణను మఱియు తన మస్తకమునందొక కట్టెల మూటను కలిగి యుండెను. అతడు ఎమనాథుని గృహమునకు వెళ్ళి, వసారా యందు కూర్చుండెను. అతడు తన వీణను తీసుకొని అత్యద్భుతముగా మ్రోగించెను. వీణతోపాటు ఆతడతి మనోహరముగా పాడెను.

ఈ యత్యద్భుతమైన సంగీతమును విని ఎమనాథుడు ఆశ్చ-ర్యచకితుడయ్యెను. ఆతడు బయటికివచ్చి కట్టెలమ్ము వానిని ఇట్లడిగెను." ఓ కట్టెలమ్మువాడా ! నీ వెవరవు?" కట్టెలమ్మువాడు ఇట్లు బదులు పలికెను. "వరగుణపాండ్యుని దర్బారుగాయకుడై న భానభద్రుని శిష్యులలో నేనొకడను. మఱియు అతని సేవకుడను. అతనికి అనేక శిష్యులున్నారు. నేను వృద్ధుడనగుట చే, పాడుటకు అసమర్థుడనని నా గురువు నన్ను త్యజించెను".

కట్టెలమ్మువానిని మరల పాడుమని ఎమనాథుడు ప్రార్థించె-ను. ఆతడు తిరిగి సతారి రాగమును పాడినప్పుడు ఎమనాథుని హృదయము ద్రవించెను. కట్టెలమ్ము వానిగా నటించిన శివుడు తనకట్టెల మూటను తలపై ధరించి, అదృశ్యుడయ్యెను.

"ఎమనాథుడు తనలో తానిట్లుతలపోసెను, "ఇంతవరకు నే-నిట్టి సతారిరాగమును వినలేదు. ఇది దేవరాగము. ఈ ముసలి వాడే ఈ రాగమును ఇంతమనోహరముగా పాడఁగలిగినచో, తన గురువు-గారి ప్రతిభ మఱియు ప్రజ్ఞ ఎట్టిదై యుండును! నిశ్చయముగా దేవుడే ఈతనికీ రాగమును నేర్పియుండవచ్చును. నేను భానభ-ద్రుని ఎదుట నిలువ లేను. నేనీ ప్రదేశమును వెంటనే త్యజింతునుఁగాక! ఎమనాథుని హృదయము సిగ్గు చేతను, భయ-ము చేతను నిండిపోయెను. అతడు అర్ధరాత్రి వేళ తన వస్తువుల నన్నింటిని వదలి, తన శిష్యులతో సహా ఆ గృహమును త్యజించె-

ను.

## *శివుడు - శివపూజ*

సోమసుందరుడు భానభద్రుని స్వప్నములో కానఁబడి ఇట్లు పలికెను. “భయపడకుము. నేను కట్టెలమ్ముౘవాని వేషమును ధరించి, ఎమనాథుని ఇంటి వసారాలో కూర్చొని వీణను వాయిం-చితిని. ఆతడాశ్చర్యచకితుడై అర్థరాత్రియందు పారి పోయెను. కావున ఇప్పుడు నీవు నిశ్చింతఁగల వాడవై యుండుము'.

భానభద్రుడు ఉదయమే లేచి, మధురై దేవాలయమునకు వెళ్ళి, సోమసుందరుని పూజించెను. అనంతరమాతడు వరగుణ-పాండ్యుని దర్బారుకు వెళ్ళెను. ఎమనాథుని పిలుచుటకై రాజు ఒక సేవకుని పంపెను. సేవకుడు అతనికొరకై అనేక స్థలములలో వె-దకెను. క్రొత్త సంగీత విద్వాంసుడు ఆతనికి ఇట్లనిరి. లభింపకుండెను. ఎమనాథుని పొరుగింటివారు అతనితో “ఒక కట్టెలమ్ముౘవాడు వచ్చి పాడెను. క్రొత్త గాయకుడీస్థలమును అర్థరా-త్రి యందు వదలి వెళ్ళెను. మాకు ఇంతమాత్రము తెలియును".

సేవకుడీవిషయమును రాజుకు నివేదించెను. రాజు భానభ-ద్రునితో ఇట్లనెను. “నన్ను వదలిన తర్వాత నీవేమి చేసితివో చెప్పఁగలవా?” భానభద్రుడు రాజుతో ఇట్లనెను. “ఓ పూజ్యప్రభూ! నేను ఇంటికి వెళ్ళి, సన్నాశీర్వదించుటకై సోమసుందరుని ప్రా-ర్థించితిని. ఆతడు నా స్వప్నమునందు కానఁబడి ఇట్లు పలికెను. నేను కట్టెలమ్ముౘవాని వేషమును ధరించి, ఎమనాథుని ఇంటిలో

సతారిరాగమును పాడితిని. నేనాతనిని తరిమి వేసితిని. నాకప్పు-డు వెంటనే మెలకువ వచ్చెను. జరిగిన సంగతి ఇదియే".

*శివుడు - శివపూజ*

ఇది శివుని లీలయేయని వరగుణపాండ్యుడు అర్థమొనర్చుకొనెను. భద్రుని భక్తినిగూర్చి స్తుతించి, అతనికి అమూల్యములైన బహుమానముల నొసంగెను. ఆతడు భద్రునితో ఇట్లనెను. "బ్రహ్మ మఱియు ఇతర దేవతలను తనకు సేవకులుగా చేసికొన్న దేవుడే నీకు సేవకుడై నిన్నాశీర్వదించెను. మేమందరము మీ సేవకుల-మే. నేను మీ సేవకుడను. భవిష్యత్తులో ఎల్లప్పుడు "సోమసుందరుని స్తుతినిమాత్రము పాడుడు".

భానభద్రుడు హృదయానందము నొందెను. అతడు శాశ్వత-ముగా సోమసుందరునికి భక్తుడయ్యెను.

## శివుని ఇరువదియైదు లీలలు

శివుడొనర్చిన ఇరువదియైదు లీలలు ఈ దిగువ వ్రాయ

బడుచున్నవి :-

(1) మస్తకముపై చంద్రుని ధరించుట (2) ఉమా దేవితో వసించుట (3) ఎద్దు పై సవారి చేయుట (4) కాళితో తాండవ నృత్యమొనర్చుట (5) పార్వతిని పరిణయమాడుట (6) భిక్షమెత్తుకొనుట

(7) మన్మథుని దహించుట (8). యముని జయించుట (9) త్రిపుర-ములను దహించుట (10) ఐలందరాసురుని సంహరించుట (11) గజాసుర సంహారము (12) వీరభద్రుడుగా అవతరించుట (13) హరిహరపుత్రుని జననము

### శివుడు - శివపూజ

(14) అర్ధనారీశ్వరుడగుట (15) కిరాతరూపమును ధరించుట (16) కంకాలరూపమును ధరించుట (17) చందూ శ్వరుని ఆశీర్వదించుట (18) విషపానమొనర్చుట (19) విష్ణువుకు చక్రము నొసంగుట (20) విఘ్న ములను నశింపఁ జేయుట (21) ఉమా దేవి పుత్రులను తానే కలిగియుండుట (22) ఏక పాద రుద్రుడగుట (23) సుఖాసన-మునందుండుట (24) దక్షిణామూర్తి రూపమును ధరించుట మఱియు (25) లింగాకారమును ధరించుట.

# 9వ అధ్యాయము

# శివ యోగ సాధన

# పంచాక్షర రహస్యము

"నమశ్శివాయ" యనెడి ఐదక్షరములచే కూర్పఁ బడిన దేపంచాక్షర మహామంత్ర మనఁబడును. మంత్రమును మనన మొనర్చువారికి సమస్త ఆటంకములు, దుఃఖములు తొలగింపం బడి, వారు శాశ్వతానందమును మఱియు అమృతత్వము నొందుదురు. ఏడు కోట్ల మంత్రములలో పంచాక్షరము సర్వ శ్రేష్ఠమైనది. యజుర్వేదము నందు ఏడుస్కంధములున్నవి. మధ్యస్కంధములోని మధ్యభాగమునందు రుద్రాధ్యాయి కలదు. ఈరుద్రాధ్యాయియందు ఒక వేయి రుద్రమంత్రములు కలవు. ఈయొక వేయి రుద్రమంత్రముల మధ్యభాగము నందు "నమః శ్శివాయ" యనెడి శివపంచాక్షర మంత్రము ప్రకా శించుచున్నది.

వేదపురుషుడైన పరమేశ్వరునికి యజుర్వేదము మస్తకము వంటిది. మధ్యభాగము నందున్న రుద్రము ముఖము వంటిది పంచాక్షరమే నేత్రము. "నమఃశివాయ"కు మధ్య నున్న శివుడు

కంటికి వంటివాడు. ఈ పంచాక్షర జపము నొనర్చువాడు. | జనన-మరణ విముక్తుడై శాశ్వతానందము నొందును. వేదములు దీనిని మాటికి ప్రతిపాదించును. ఈ పంచాక్షరము నటరాజుకు శరీరము-వంటిది. ఇదియే శివునికి స్థానము. "నమః శివాయ"కు మొదట "ఓమ్" ను

## *శివుడు - శివపూజ*

చేర్చినచో అది షడక్షర మంత్రమగును. "ఓం నమో మహాదే-వాయ" అనునది అష్టాక్షర మంత్రము.

పంచాక్షరము ఐదు రకములు. అవి ఏవనగా :- (1) స్థూలపం-చాక్షరము ( నమఃశివాయ), (2) సూక్ష్మ పంచాక్షరము (శివాయనమః ), (3) కారణపంచాక్షరము (శివాయ శివ), (4) మహా కారణ పంచాక్షర-ము (శివాయ), (5) మహామను, లేక ముక్తిపంచాక్షరము (శి).

"నమః" అనగా వందనమని అర్థము. "శివాయనమః" అనగా శివునికి సాష్టాంగ నమస్కారమని అర్థము, దేహదృష్టి ననుసరించి జీవుడు శివునికి సేవకుడు. "నమః" జీవాత్మను సూచించును. "శివ" పరమాత్మను సూచించును. "అయ" జీవాత్మ-పరమాత్మల ఐక్య-మును సూచించును. కావున జీవ 4. బ్రహ్మైక్యమును సూచించు "తత్త్వమసి" వలెనే "శివాయనమ:" అనునది ఒక మహావాక్యము.

ప్రణవము దేవుని యొక్క బాహ్యరూపమగు పొట్టును సూచిం-చును. పంచాక్షరము దేవుని ఆంతరిక స్వరూపమగు గింజను సూచించును. ప్రణవము మఱియు పంచాక్షరము ఎకు మే. ఐదక్ష-రములు దేవుని ఐదు క్రియలను సూచించును. ఆవి ఏమనగా (1)

సృష్టి (2) స్థితి (3) సంహారము (4) తిరోధానము (5) అనుగ్రహము.ఇ-వి పంచ భూతములను మఱియు పంచభూత కలయిక చే ఏర్పడు సమస్త సృష్టిని కూడా సూచించును.

"న" తిరోధానమును, "మ" మలమును, "శి" శివుని "వ" అరుళ్ శక్తిని మఱియు "య" జీవుని సూచించును.

## శివుడు - శివపూజ

స్నానమొనర్చుము. లేక నీ చేతులను, కాళ్ళను, ముఖమును కడుగుకొనుము. భస్మమును, రుద్రాక్షమాలను ధరించుము. ప్ర-శాంతస్థలమునందు, లేక గదియందు తూర్పు, లేక ఉత్తరముఖుడవై పద్మాసనము, లేక సుఖాసనము నందు కూ-ర్చుండుము. మౌనముగా పంచాక్షరము నుచ్చరించుచు, శివుని రూపమును ధ్యానించుము. ఊహాచిత్రమును నీ హృదయము నం-దు, లేక భ్రూమధ్యస్థానము నందుంచుకొనుము.

నీవు క్రమముతప్పక ధ్యానింతు వేని, నీ హృదయము శుద్ధ-మగును. సమస్త సంస్కారములు మఱియు పాపములన్ని యును దహింపఁబడును. నీకు శివ యోగనిష్ఠ, లేక నిర్వికల్ప సమాధి లభించును. నీవు మహిమాన్వితమగు శివపదమును, లేక శివగతి-నొంది, శివునితో తాదాత్మ్యమునఁ బడయుదువు. నీవు శాశ్వతమైన శివానందముననుభవించి అమరుడవగుదువు. మిమ్ములనందఱి-ని శివుడు ఆశీర్వదించునుఁగాక !

# శివుని( గూర్చి ధ్యానము

సగుణధ్యానము: - రూపమును(గూర్చి ధ్యానించుటయే సగుణ ధ్యానమన(బడును. ఒక విలుకాడు ప్రథమమునందు స్థూ-లమైన ఒక పెద్ద పదార్థముపై గుఱి పెట్టును. తర్వాత అతడు మధ్యరకమగు



పదార్థముపై గుఱిపెట్టును. తుట్టతుడు కాతడు మిక్కిలి చిన్నవగు, సూక్ష్మమైన పదార్థములపై గుఱిపెట్టును. అదేవిధముగా సాధకు-డు తన సాధనను సగుణ ధ్యానముతో ఆరంభింపవలయును. మన స్సు సుశిక్షితమైనప్పు డాతడు నిరాకారమగు నిర్గుణధ్యాన-ము నవలంబింపవచ్చును. ఒక స్థూలమైన పదార్థమును(గూర్చి ధ్యానించుటయే సగుణ ధ్యానమన(బడును. ప్రత్యేకమగు తన ఇష్ట దేవతయొక్క రూపము పై దృష్టిని కేంద్రీకరించి, సగుణధ్యానము నొనర్చు భక్తుడు అమితమగు ఆనందము నొందును. సగుణోపా-సన విక్షేపమును తొలగించును. శివుని పటము పై మూడు, లేక ఆరు నెలలవరకు త్రాటకము నభ్యసించుము.

త్రికూటి (కనుబొమల మధ్య భాగము) యందు ఊహా 2. చిత్ర-మును గూర్చి అరగంటనుండి రెండు గంటలవరకు ధ్యానించుము. విశ్వములోని సమస్త పదార్థములలో దేవుడు న్నా-డని భావించి, అనుభూతి నొందుము. నీవు ధ్యానించునప్పుడు మానసికముగా "ఓం నమఃశివాయ' మంత్రముసుచ్చరింపుము.

మఱియు దేవునియొక్క సర్వాంతర్యామిత్వము, స్వశక్తి మత్వము మఱియు సర్వజ్ఞత్వములను గూర్చి మననమొనర్చుము. ఇష్ట దే-వతనుండి సాత్విక గుణములు నీవైపు ప్రవహించుచున్నట్లు అనుభూతి నొందుము. నీవీ సాత్త్విక గుణ సంపన్నుడవై యున్న-ట్లు భావించుము. ఇదియే సాత్త్విక, లేక శుద్ధ భావన యనఁబడును. నీవు విశ్వసనీయుడవై సాధన మొనర్తు వేని ఒకటి, లేక రెండు సం-వత్సరములలో నీవు ఇష్టదైవమును దర్శించు కొనఁ గలుగుదువు. ఈ యుపాయము ననుసరించుము. ఇది ధారణకు

## *శివుడు - శివపూజ*

సహకరిం చును. శివుని నానావిధములైన అంగములలో నీ మన-స్సును త్రిప్పుచు, ధ్యానించుము. నీ వెల్లప్పుడు కూర్చుండు ఆసనము నందు ఆసీనుడవగుము. ఆతని నామము నుచ్చరించుచు, ఆతని పటముపై దృష్టిని నిలిపి ఆనందము, ప్రకాశము, ప్రేమ ఇత్యాది గుణములను ఁగూర్చి చింతించుము. అనంతర-ము నీ హృదయపద్మమునందు, లేక కనుబొమల మధ్య భాగము నందున్న జాజ్వల్యమానమగు ప్రకాశమునందాతనిని ప్రతిష్ఠించు కొనుము. ఇప్పుడు మానసికముగా భక్తిపూర్వకమైన ప్రణామముల నొనర్చుచు, అతని పాదపద్మములనుఁ గూర్చి ధ్యానించుము. క్ర-మముగా నీ మనస్సును ఏనుగు చర్మమును ధరించిన నడుము, రుద్రాక్ష మాలచే శోభితమగు వక్ష స్థలము, నీలవర్ణమైన కంఠము, ప్రశాంత మైన ముఖాకృతి, ధ్యాననిష్ఠచే కలిగిన తేజోవలయము, అంతర్ముఖత్వమును సూచించు అర్ధ నిమీలిత నేత్రములు, భ్రూ-మధ్యమునందున్న- తృతీయ నేత్రము మున్నగువాటి పైకి

పోవునట్లు చేయుము. అనంతరము మనస్సును అందమైన జట-లు, అర్ధచంద్రాకృతి, జటనుండి నిర్గతమగు పవిత్రమైన గంగా ప్రవాహము పై తీసుకొని వెళ్ళుము. ఒక చేతియందున్న త్రిశూల-ము మఱియు రెండవ చేతియందున్న డమరుపై నీ మనస్సును త్రిప్పుము. శరీరములోని అంగములు పూర్తియగు నంతవరకు నీ-మనస్సును పరుగెత్తించుము. ఇప్పుడు నీ మనస్సును నీ ముఖమునందుఁగాని, పాదములపై గాని కేంద్రీకరించుము. ఈ వి-ధానము నంటిని మరల మరల అనేక సార్లు చేయుచుండుము. నిరంతరాభ్యాసముచే

## ***శివుడు - శివపూజ***

తుట్టతుదకు నీవు ధ్యాననిష్ఠయందు ప్రతిష్ఠితుడవై, శివునియందైె-క్యమగుదువు.

నిర్గుణధ్యానము :- శివుని సర్వవ్యాపకమగు, అవ్యక్తమైన పర-బ్రహ్మ స్వరూపమునుగూర్చి ధ్యానించుటయే నిర్గుణ ధ్యానమనఁబడును. ఈ ధ్యాన విధానమునందు నీవు శివునియొక్క నిరాకార, నిర్గుణ, శాశ్వత, అనంత పరబ్రహ్మ రూపమును గూర్చి ధ్యానింపవలసియుండును. ఆతనిని నీవు శుద్ధ సచ్చిదానంద వ్యాపక ఆత్మగాను, శుద్ధ సిద్ధ బుద్ధ ముక్త నిత్యముక్త బ్రహ్మము గాను, శుద్ధ చైతన్యము యొక్క అనంత పరబ్రహ్మ రూపమును గూర్చి ధ్యానింపవలసియుండును. ఇప్పుడు నీవు శివుని ఈ భావాతీత స్వరూపముతో తాదాత్మ్యము నొందుము. నీవు చైతన్య, అఖండ,

పరిపూర్ణ, ఏకరస, శాంత, నిర్వికారమగు సత్తావై యున్నట్లు అను-భూతినొందుము.

ఈ భావములతో ప్రతి అణువు, ప్రతి పరమాణువు, ప్రతి నాడి, సిరా, ధమనియు శక్తివంతముగా పని చేయవలసి.. యుండును. కే-వలము పెదవులతో "శివోహమ్ " అని ఉచ్చరించుటచే ప్రయోజనము లేదు, అది హృదయము, మస్తకము మఱియు మనస్సుతో ఒనర్పఁబడవలయును. నిరంతరము ఈ భావమును కలిగియుండ వలయును. మానసికముగా "శివోహం"ను ఉచ్చరిం-చునప్పుడు దేహభావనను త్యజింపుము. "శివోహం "ను ఉచ్చరించునపుడు ఈ క్రింది విధముగా అనుభూతిని పొందుము.

## *శివుడు - శివపూజ*

| | | |
|---|---|---|
| అనంతత్వమును నేను | - | శివోహం శివోహం |
| ప్రకాశమును నేను | - | శివోహం శివోహం |
| సంతోషమే నేను | - | శివోహం శివోహం |
| ప్రతిభయంతయు నేను | - | శివోహం శివోహం. |
| శక్తియంతయు నేను | - | శివోహం శివోహం |
| జ్ఞానమంతయు నేను | - | శివోహం శివోహం |
| ఆనందమే నేను | - | శివోహం శివోహం |

పై భావములను(గూర్చి నిరంతరము ధ్యానించుము. ఉత్సా-హము, కుతూహలములతో కూడిన నిరంతర ప్రయత్నము అత్యావశ్యకమై యుండును. పై భావములను ఎల్లప్పుడు మానసిక-ముగా ఉచ్చరించుము. నీకు దైవ సాక్షాత్కారము కలుగును.

## శివ పూజ

సగుణోపాసనయందు శివుడు శివలింగాకారము నందు పూ-జింప(బడును. సామాన్యముగా శివభక్తులు పంచాయతన పూజ

### *శివుడు - శివపూజ*

నొనర్తురు. ఈ పూజయందు శివుడు, గణేశుడు, పార్వతి, సుబ్రహ్మ-ణ్యుడు మఱియు సాలిగ్రామములు పూజింప( బడును.

పంచాయతన మూర్తులను ఒక శుభమైన దినమునందు తీ-సుకొని రమ్ము. మిక్కిలి శ్రద్ధతో నీ స్వగృహమునందు వాటిని ప్రతిష్ఠించుము. ప్రత్యేక ప్రార్థన, పూజ, అభిషేక ముల నొనర్చి బ్రా-హ్మణులకు, మహాత్ములకు, బీదవారికి భోజన మొసంగి గొప్ప ఉత్సవమును జరుపుము. దేవతను ఒక ప్రత్యేక గదియందు ప్రతి-ష్ఠించుము. ప్రతిరోజు మిక్కిలి శ్రద్ధతోను, విశ్వాసముతోను దేవుని పూజించుము. నీకు ఐశ్వర్యము, మనశ్శాంతి కలుగుటతో పాటు నీ-వు ధర్మార్థ కామ మోక్షములను(బడయ(గలుగుదువు. ||నీవు

అభ్యుదయమైన జీవితమును గడుపుటయేఁగాక, మృత్యువ నంత-
రము అమరమైన స్థానమగు శివ సాయుజ్యము నొందుదువు.

శివ పూజకై ఎక్కువగా బిల్వపత్రములను ప్రోగు చేయుము. పూజను ప్రారంభించుటకు ముందు ధూపము, దీపము, కర్పూర-
ము, గంధపు చెక్కలు, శుభ్రమైన నీరు, పుష్కలమైన పుష్పములు, నైవేద్యము, ఆసనము, గంట, శంఖము, ఇతర ద్రవ్యములను సిద్ధ-
ము చేసికొనుము. ప్రాతః కాలమునందు సూర్యోదయమునకు పూర్వమే మేల్కొనుము. ముఖమును కడుగుకొనుము. స్నానము చేయుము. పూజ కై ప్రత్యేకముగా ఉంచఁబడి నట్టి నారవస్త్రముల-
ను కట్టుకొనుము, పూజాగదిని బాగుగా అలంకరించుము. భగవన్నామము నుచ్చరించుచు, ఆతనిని స్తుతించుచు, భక్తిగీత-
ములను పాడుచు, దేవునికి సమస్కరించుచు గదియందు ప్రవేశించుము. గదిలోనికి ప్రవే శించుటకు ముందు నీ



పాదములను ప్రక్షాళన మొనర్చుము. సుఖాసనమునందు కూ-
ర్చుండి నీ పూజను ప్రారంభించుము. పూజను ఆరంభించుటకుముందు సంకల్పమును చెప్పుము. తర్వాత నీవు క్రమముగా కలశమును, శంఖమును, ఆత్మను మ ఱియు పీఠము-
ను పూజించుము. తదనంతరము నీవు షోడ శోపచార పూజ యొనర్చి, మహామృత్యుంజయ మంత్రము, రుద్రిపాఠము, పురుష సూక్తము, గాయత్రీ మంత్రములు నుచ్చరించి, నీ శక్తి ననుసరించి శుద్ధమైన జలము, పాలు, చెఱుకు రసము, నెయ్యి మఱియు ఇతర ద్రవ్యములతో అభిషేక మొనర్చుము. రుద్రాభిషేకము మిక్కిలి

లాభము నొసంగును. నీవు రుద్రి జపమును మఱియు అభిషేకము నొనర్తు వేని నీ చింతలు మఱియు వేదనలన్నియును తొలగిపోవు-ను. మఱియు విశ్వనాథుని కృపచే మానవ జీవిత లక్ష్యమగు మోక్షానందము నొందగలుగుదువు. రుద్రి మిక్కిలి పవిత్రమైనది. రుద్రియందును, పురుష సూక్తము నందును అదృశ్య ముగా దాగి-యున్న ఒకానొక శక్తియున్నది. రుద్రియొక్కఉచ్చారణచే అద్భుతమైన ఆవేశము కలుగును. పూజను ప్రారంభించి, దాని మహిమను మఱియు తేజస్సును గుర్తెఱుంగుము.

అభిషేకానంతరము చందన గంధముతోను, పుష్పము లతో-ను దేవుని బాగుగా అలకరించుము. తర్వాత "ఓం శివాయనమః, ఓం మహేశ్వరాయ నమః "మున్నగు నామముల నుచ్చరించుచు అర్చన యొనర్పుము. సాధ్యమైనచో ప్రతిరోజు 108 లేక 1008 అర్చనలను చేయుము. అర్చనానంతరము ఏ కారతి, త్ర్యారతి, పంచారతి మఱియు కర్పూర హారతివంటి నానారకములగు దీప-ములతో హారతి



యొనర్చుము. హారతి సమయములో గంటలు, తాళములు, శంఖ-ము మున్నగువాటిని మ్రోగించుము. దేవునికి పవిత్రమైన ప్రసాదమును, లేక నైవేద్యమును సమర్పించుము.

హారతి తర్వాత చామరమును వీచుచు మహిమ్న స్తోత్రము, పంచాక్షరస్తోత్రము మున్నగువాటిచే దేవుని స్తుతించుము. తుట్ట-తుదకు "కాయేనవాచా" "ఆత్మాత్వం గిరిజా మతిః" "కర ||

చరణకృతమ్" వంటి ప్రార్థనల నుచ్చరించుము. దేవునికి సమస్త-మును అర్పించుము, నీవాతని చేతులలో కేవలము ఒక ఉపకరణమై యున్నావని భావించుము. దివ్యానుగ్రహము నొందు-టకు మాత్రమే సమస్తము నొనర్పుము. నిమిత్తభావమును వికసింపఁ జేసికొనుము. భక్తులను సేవించుము. తన భక్తులను సేవించుటచే దేవుడు మిక్కిలి ప్రీతినొందును. చివరికి భక్తులకు ప్రసాదమును వితరణ చేయుము. మిక్కిలి శ్రద్ధఁగలవాడవై ప్రసా-దమును స్వీకరించుము. దేవుని ప్రసాదముయొక్క మహిమ అవర్ణనీయము. విభూతిని ప్రసాదముగా స్వీకరించి నీ నొసట ధరించుము.

భౌతిక పదార్థములతోకూడిన సగుణోపాసనయందు నీవు ప్రా-వీణ్యతను గడించినప్పుడు మానస పూజను కూడా ప్రారంభించుము. నీకు దైవదర్శనము లభించుటతోపాటు, పర-మపద ప్రాప్తినిఁ బడయఁగలుగుదువు.

సోమవారము మఱియు త్రయోదశి (ప్రదోష) రోజులలో ప్ర-త్యేక పూజల నొనర్చుము. ఈ రోజులు మఱియు శివరాత్రి శివునికి మిక్కిలి



పవిత్రములు. శివరాత్రిని మహా మోపేతముగా జరుపుము. ఆ రో-జంతయు ఉపవసించుము. త్రికాలపూజ, ప్రత్యేక అభిషేకము, ఏకాదశ రుద్ర జపము, సహస్రనామార్చన, రాత్రి జాగరణ, శివస్తోత్ర పఠనము, శివపురాణాధ్యయనము, శివలీలలను శ్రవణ మొనర్చ-

టలను చేయుము. పూజానంతరము రెండవరోజు అభిషేక జల-ముతో ఉపవాసమును విరమించుము. నైవేద్యములను సమర్పించి, దివ్యమైన ప్రసాదమును స్వీకరిం చుము. నీకు గొప్ప మనశ్శాంతి మఱియు ఆధ్యాత్మిక పురోభివృద్ధి కలుగును. ఈ యవ-కాశమును జారవిడువకుము. సమస్త దురితములకు నిత్య పూజయే నిశ్చయమైన, చికిత్సయై యున్నది. అప్పుడు నీవు దారి-ద్ర్యముచే పీడింపఁబడవు. నా మాట ను పాటించి, ఈరోజు నుండియే శ్రద్ధాభక్తులతో పూజించుటను ప్రారంభించుము.

## శివ మానసపూజ

మనస్సులో పూజ యొనర్చుటయే మానసపూజ యనఁ బడు-ను. పుష్పగంధాదులచే యొనర్పఁబడు భౌతిక పూజ కంటె మానసపూజ మిక్కిలి శక్తివంతము మఱియు ప్రతిభావంతమై యు-న్నది. మానసపూజ యొనర్చునప్పుడు నీకు గొప్ప ధారణాశక్తి ఏర్పడును.

### *శివుడు - శివపూజ*

రత్నములు, ముత్యములు, మణులు ఇత్యాదులచే పొదగఁ బడిన సింహాసనము పై మానసికముగా దేవుని ప్రతిష్ఠించుము. ఆతనికొక ఆసనమును సమర్పించుము. అర్ఘ్యము, మధుపర్కము

మఱియు నానారకములగు పుష్పములు, వస్త్రములు ఇత్యాదులను సమర్పించుము. ఆతనినొసట మరియు శరీరము నందంతట చందన గంధమునలదుము. ధూపమును మఱియు ఊదు 5 వత్తులను వెలిగించుము. దీపములను వెలిగించుము. కర్పూరము వెలిగించి హారతి నొసంగుము. నానావిధములగు ఫలములను, మధుర పదార్థములను, టెంకాయను మఱియు మహా నైవేద్యమును సమర్పించుము. షోడశోపచార పూజ నొనర్చుము.

## పంచాక్షర మంత్రలేఖనము

అరగంట లేక ఎక్కువ కాలమువరకు "ఓం నమః | శివాయ" మంత్రమును ఒక అందమైన నోటుబుక్కుపై వ్రాయుము. ఈ సాధన ననుసరించుటచే నీకు అధికమైన ధారణా శక్తి అలవడును. మంత్రమును సిరాతో స్పష్టముగా వ్రాయుము. మంత్రమును వ్రాయునప్పుడు మౌనము నవలంబించుము. నీవు మంత్రమును ఏ భాషయందైనను వ్రాయవచ్చును. అటునిటు చూచుటను త్యజించుము. మంత్రమును వ్రాయునప్పుడు మానసి కముగా కూడా మంత్రము నుచ్చరించుము. పూర్తి మంత్రమును ఒకేసారి వ్రాయుము.

***శివుడు - శివపూజ***

మంత్రమును లిఖించు నోటుబుక్కు పూర్తి యైన తర్వాత దానిని

నీ ధ్యానగదిలోని ఒక పెట్టెయందుంచుము. ఈయభ్యాసమును క్ర-
మము తప్పక ఒనర్పుము.

ఒక చిన్న నోటుబుక్కును నీ జేబునందుంచుకొని, నీ ఆఫీసు-
లో సమయము దొరికి నప్పుడెల్ల మంత్రమును వ్రాయుము. . నీ
జేబులో భగవద్గీత, మంత్రమును వాయు నోటుబుక్కు మఱియు
నీకు మిక్కిలి శ్రేయస్సు కలుగును.

## శివ జ్ఞానము

శివుని పవిత్రమైన నామములను జపించుట మఱియు ధ్యా-
నించుటచే సమస్త పాపములనుండి విముక్తుడవై, నీవు
శివజ్ఞానమును, లేక శాశ్వతానందము మఱియు అమృతత్వము
నొందుదువు. శివనామము మంత్రములన్నింటికి ఆత్మవంటిది. శి-
వుడు ప్రపంచమునందు వివిధములగు అరువది అంశములలో
వ్యక్తమయ్యెను. వృషభారూఢ, హరిహర, నటరాజు, భైరవ, దక్షిణా
మూర్తి, అర్ధ నారీశ్వర, భిక్షాటన, సోమశేఖరమూర్తి, ఊర్ధ్వ నటన, కా-
లసంహార, జాలంధర, శూరసంహార, లింగోద్భవ మనునవి అతని
రూపములు.

శివుడనగా శాశ్వతానందమును, శ్రేయస్సును, లేక పరమ
మంగళము నొసంగునాడని అర్థము. ఓమ్ మఱియు శివుడు ఏక
మే.

“శాంతం, శివం, అద్వైతమ్" అని మాండూక్యోపనిషత్తు నుడువును. నిమ్న జాతివాడు కూడా శివ నామమును ఉపాసించవచ్చును.

శివుడు గాయత్రి మంత్రమునందు, అగ్నియందు మఱియు _ నుచ్చరించినప్పుడు మఱియు అగ్నిని, సూర్యుని ఉపాసించినప్పుడు సూర్యునియందు వ్యక్తమగును. నీవు గాయత్రి మంత్రము శివుని గూర్చి కూడా ధ్యానింపవలసి యుండును.

పంచాక్షర జపము మఱియు శివధ్యానమును ప్రత్యేక ముగా ప్రదోష కాలమునందు, లేక సూర్యాస్తమయ సమయము నందొనర్పవలయును. పౌర్ణమి, లేక అమావాస్య తర్వాత వచ్చు త్రయోదశినాటి ప్రదోషము మహాప్రదోషమని చెప్పఁబడును. ఈ సమయమునందు దేవతలు శివుని పూజించుటకై శివాలయ ములను దర్శింతురు. కావున మహాప్రదోష కాలమునందు నీవు దేవాలయమునకేగినప్పుడు దేవతలను కూడా పూజింపవచ్చును. మహాప్రదోష దినములలో శివభక్తులు పూర్తిగా ఉపవాస వ్రతము నవలంబింతురు.

` శివభక్తుడు తన నొసట మఱియు శరీరమునందు విభూతిని పూసుకొనవలయును. ఆతడు రుద్రాక్షమాలను కూడా ధరించవలయును. బిల్వదళములతో ఆతడు శివలింగము నర్చింపవలయును. “ఓం నమఃశివాయ” యనెడి పంచాక్షరమును ఆతడు జపించి, ధ్యానింపవలయును. ఇట్టి క్రియలచే శివుడు ప్రసన్నుడగును. విభూతి, లేక భస్మము మిక్కిలి పవిత్రమైనది. దీనిని స్వయముగా శివుడు ధరించును. రుద్రాక్షమాలలోని పూస శివుని

నొసటయుండు తృతీయనేత్రమును సూచించును. ధన దేవత-యైన మహాలక్ష్మి వసించు ఐదు స్థానములలో బిల్వదళ మొకటియై యున్నది.

శివుడే జీవులకు బంధమోక్షముల నొసంగును. శివుడే జీవులకు తమ దివ్యస్వరూపమును సాక్షాత్కరింపఁజేయును. శివుడు మాయచే శరీరము, ఇంద్రియములు మఱియు విశ్వమును నిర్మించి జీవులను మాయయందు పడద్రోయును. వారి యందాతడు అహంకార, మమకారములను సృష్టించెను. ఆతడు వారిని కర్మయందు బంధించి, తమతమ పుణ్యాపాపకర్మ ఫలములగు సుఖదుఃఖముల ననుభవింపఁజేయును. ఇది జీవబంధ భూమిక-యనఁబడును.

క్రమముగా శివుడు మాత్రమే జీవులయొక్క అహంకారము, కర్మ మఱియు మాయయనెడి సంకెళ్ళనుండి విడివడజేసి, వారిని శివునివలె ప్రకాశింపఁజేయును. ఇది మోక్షము, లేక స్వాతంత్ర్య భూమిక యనఁబడును. కేవలము శివుని అనుగ్రహము చేతనే వారు పరమపదమును ప్రాప్తింపఁగలుగుదురు.

ఆణవ, కర్మ, మాయయనెడి త్రివిధ మలములచే ప్రభావితు-లైనప్పుడు జీవులకు స్వాతంత్ర్యముండదు. అప్పుడు వారు అల్పజ్ఞానమును కలిగియుందురు.

జీవుడు శివుని అనుగ్రహము నొందుటకై ఆతడు మొదట తన స్వరూపమును మఱియు శివునితో తనకుఁగల సంబంధము ను

గుర్తెఱుంగవలసియుండును. ప్రాణము శరీరము నందుం డును. శి-
వుడు

## *శివుడు - శివపూజ*

ప్రాణము నందుండును. ఆతడు ప్రాణము లకు ప్రాణమైయున్నా-డు. ఐనను ఆతడు ప్రాణములు మఱియు శరీరమునకు భిన్నుడై యున్నాడు. శరీరమునందు ప్రాణము లేకున్నచో, అది శవముగా మారును. అది ఏలాటి కార్యము నొనర్పఁజాలదు. శివుడు ఈ శరీర-ము, ప్రాణము మరియు జీవునికి ఆధారమైయున్నాడు. శివుడు లేకుండా జీవుడు ఏలాటి కార్యము నొనర్పఁజాలడు. శివుడే బుద్ధిని ప్రకాశవంత మొనర్చును. నేత్రమునకు చూచెడి శక్తియున్నను సూర్యప్రకాశము ఐనా అది చూడఁజాలనట్లు, బుద్ధి శివప్రకాశము లేకుండా కార్యము నొనర్పఁజాలదు.

చర్య, క్రియ, యోగము, జ్ఞానములనెడి చతుస్సాధనలు ము-క్తినొందుటకు నాలుగు సోపానములై యున్నవి. అవి మొగ్గ, పుష్పము, కాయ మఱియు ఫలములవంటివి.

శివుడు జీవులను క్రమముగా అహంకారము, కర్మ మఱియు మాయనుండి ముక్తినొందించును. క్రమముగా జీవులకు విషయ-సుఖములయందు విరక్తి కలుగును. వారు సుఖదుః ములను సమానముగా తలంతురు. కర్మయే జనన మరణములకు కారణ-మని దైవానుగ్రహము ద్వారా వారు గుర్తెఱుంగుదురు. వారు దైవకార్యముల నొనర్చుచు, దైవభక్తులను సేవించుచు, మనశ్శు-ద్ధిని పొందుదురు. ఆత్మ లేక శివుడు శరీరము, ఇంద్రియములు

మఱియు మనస్సునకు భిన్నమైనదనియు, అది మనస్సు మఱి-
యు వాక్కునకతీతమై యున్నదనియును వారు గుర్తెఱుంగుదురు.
వారు పంచాక్షర



మంత్రమైన "ఓం నమః శివాయ" యొక్క భావార్థమును గుర్తెఱింగి,
శివునిఁ గూర్చి ధ్యానింతురు.

వారు శివయోగమును అభ్యసింతురు. వారి హృదయ ములు
ద్రవించును. ద్రష్ట, దృశ్యము, దృక్కులు నశించును. ఇంద్రియ-
ములు, మనస్సు మఱియు బుద్ధియొక్క సమస్త కార్యకలాపములు
ఉడిగిపోవును. వారు తమ హృదయము నందు ఉత్పన్నమైన ది-
వ్య ప్రేమ యనెడి ప్రవాహము నందు శివునికి అభిషేక స్నానము
చేయింతురు. మఱియు తమ హృదయ పుష్పమును దేవునిక-
ర్పింతురు.

వారు "చిలంబోసై" యను శబ్దమును విని, ఆ శబ్దము యొక్క
మార్గము గుండా పయనించి, చిదాకాశములో నటరాజును దర్శిం-
చి, శివానందమనెడి సాగరము నందు తన్మయులగుదురు.
కర్పూరము అగ్ని యందు కరగిపోవునట్లు వారు దేవుని యందైక్య-
మగుదురు.

## శివలింగ పూజ

శివలింగము వుంస్త్వ చిహ్నమని సామాన్యముగా ప్రజలు వి-శ్వసింతురు. ఇది మహాపరాధమే కాకుండా గొప్ప పొరపాటు. వైదిక కాలానంతరము శివుని సృష్టి శక్తి లింగముగా పరిణమిం చెను. లిం-గము అన్యధాకరించు చిహ్నము. ఇది నిశ్చయముగా పుంస్త్వచిహ్నము కాదు. లింగ పురాణము నందీ క్రింది శ్లోకము కల-దు. "ప్రధానం ప్రకృతిర్యదా

## శివుడు - శివపూజ

హుర్లింగ ముత్తమం, గంధవర్ణ రసైర్హీనం శబ్దస్పర్శాది వర్జితమ్". ఆదియందున్న ప్రకృతియే ప్రథమ లింగమని చెప్పఁబడును. అది గంధ, వర్ణ, రస, శబ్ద, స్పర్శాది రహితమై యున్నది.

సంస్కృతములో లింగమనగా చిహ్నమని అర్థము. అది ఒక ఊహను సూచించు చిహ్నము. ఒక నదియందొక పెద్ద ప్రవాహము-ను నీవుఁ గాంచినప్పుడు పూర్వ దినమునందొక పెద్ద వర్షము కురిసినదని నీవు ఊహింతువు. పొగను చూసినప్పుడు అగ్ని ఉన్నదని నీవు ఊహింతువు. అసంఖ్యాక రూపములను కలిగియు-న్న ఈ విశాల ప్రపంచము సర్వశక్తి మంతుడగు దేవునికి చిహ్నమైయున్నది. శివలింగము శివునికి చిహ్నమై యున్నది. నీవు లింగమునుఁగాంచినప్పుడు నీ మనస్సు వికసించి, నీవు దేవునిఁ-గూర్చి చింతించుటకు ప్రారంభింతువు.

శివుడు నిజమునకు నిరాకారుడు. అతనికి తన స్వంత రూప-ము లేదు. కాని సమస్త రూపములు ఆతనివే. రూపము లన్నింటియందు శివుడున్నాడు. ప్రతి రూపము శివుని రూపమే నై-

యున్నది.

మానసిక ఏకాగ్రతకు దోహద మొసంగునట్టి ఒక అద్భుతమైన, అవర్ణనీయమైన శక్తి లింగమునందున్నది. ఒక స్పటికమును గాంచినప్పుడు మనస్సు సులభముగా ఏకాగ్రమగు నట్లు, లింగమును గాంచినప్పుడు కూడా మనస్సు ఏకాగ్రత నొందును. ఈ కారణము చేతనే పూర్వీక ఋషులు మఱియు ద్రష్టలు శివాలయములలో శివలింగమును ప్రతిష్ఠించుటకై విధించిరి.

## *శివుడు - శివపూజ*

శివలింగము మౌనభాషయందు నీతో "నేను అద్వితీయుడను, నేను నిరాకారుడన"ని పలుకును. పరిశుద్ధులైన, పవిత్ర లైన జీవులు మాత్రమే ఈభాషను అర్థమొనర్చుకొందురు. మోహపరవశుడును, అపరిశుద్ధుడును, అల్ప జ్ఞానము కలవాడు నగు పరదేశీయుడు పరిహాసముతో ఇట్లు పలుకును. "ఓహో! హిందువులు పురుషచిహ్నమును పూజింతురు. వారు అజ్ఞానులు. వారికి వేదాంతము తెలియదు". విదేశీయుడు తమిల్ లేక హిందూస్థానీ భాషను నేర్చుకొనుటకు ప్రయత్నించునప్పుడు మొదట మోశైన మాటలను నేర్చుకొనుటకు యత్నించును. ఇదియే - ఆతనియందుండు ఆతురత. అదేవిధముగా ఆతురతం గల యుడు లింగమును పూజించుటలో దోషము నెన్నుటకు యత్నించును. శివుని నిరాకారత్వమును సూచించు బాహ్యచిహ్నమే లింగము. శివుడు అఖండుడు, సర్వ వ్యాపకుడు, శాశ్వతుడు, శుభప్రదుడు, నిత్యశుద్ధుడు, అమరుడు మఱియు ఈ విశాలమైన ప్రపంచమునకు సార స్వరూపుడు. ఆతడు నీ హృదయ కుహరములో

అమృతాత్మ స్వరూపుడై ఆసీనుడై యున్నాడు, అతడు హృద-యాంతర్వాసి, అంతరాత్మ స్వరూపుడు. మఱియు పరబ్రహ్మమునకు అభిన్ను డునైయున్నాడు.

శివలింగమునందు మూడు భాగములుండును. దిగువ భాగము బహ్మపీఠమనఁబడును. మధ్యభాగము విష్ణుపీఠమన బడును. ఇక ఉపరితల భాగము శివ పీఠమనఁబడును.

కొన్ని లింగములు స్వయంభూలింగములు, మరికొన్ని నర్మదేశ్వరులు. భారత దేశములో పంఢ్రెండు జ్యోతిర్లింగములు



మరియు "ఐదు పంచ భూతలింగములున్నవి. పంఢ్రెండు జ్యోతిర్లింగము లేవనగా - (1) కేదారనాథ్, (2) కాశీ విశ్వనాథ్. (3) సోమనాథ్, (4) వైద్యనాథ్, (5) రామేశ్వర్, (6) ఘృష్ణేశ్వర్, (7) భీమాశంకర్, (8) మహా కాళేశ్వర్, (9) మల్లికార్జున, (10) అమలేశ్వర్, (11) నాగేశ్వర్, (12) త్ర్యంబకేశ్వర్, ఇక ఐదు పంచభూతలింగము లేవనగా: (1) కాళహస్తీశ్వర్, (2) జంబు కేశ్వర్, (3) అరుణా చలేశ్వర్, (4) కంచిలోని ఏకాంబరేశ్వర్, (5) చిదంబరము లోని నటరాజు. దక్షిణ భారతదేశములోని తిరువిడైమరుదూర్ నందున్న గొప్ప శివలింగముకూడా మధ్యార్జున యను పేరుతో సుప్రసిద్ధమైయున్నది.

స్ఫటిక లింగము కూడా శివునికి చిహ్నమే. ఇది శివుని ఆరాధన కై విధింపఁబడినది. ఇది శిలాస్ఫటికముచే చేయఁ బడును. దానికి స్వంత వర్ణము లేదు. కాని దాని సమీపము నందే పదార్థముండునో, ఆ పదార్థము యొక్క వర్ణమునే అది కలిగియుండును.

అది నిర్గుణ బ్రహ్మమును, లేక నిరాకారమగు పరమాత్మను, లేక రూపరహితుడగు మఱియు నిర్గుణుడగు శివుని సూచించును.

విశ్వసనీయుడగు భ క్తునికి లింగమొక రాతిముక్క కాదు. అతని కదియంతయు తేజస్వంతము, లేక చిన్మయమై భాసించును. లింగము ఆతనితో మాట్లాడును. విస్తారముగా కన్నీటిని కార్పించును. గగుర్పాటును కలిగించును. హృదయమును ద్రవింపఁజేయును. అతనిని శరీర ధ్యాసకు అతీతునిగా నొనర్చును. తుదకు దేవునియందైక్య మొందించి, నిర్వికల్ప సమాధినిఁ బడయఁజేయును. రామేశ్వరమునందు శ్రీరాముడు శివ లింగమును పూజించెను.

***శివుడు - శివపూజ***

మహావిద్వాంసుడైన రావణుడు సువర్ణ లింగమును పూజించెను. లింగము నందెంతటి అత్యద్భుత శక్తియున్నదో గ్రహింపుము.

ప్రారంభ సాధకుల మనస్సు నిశ్చలమగుటకు సహక రించునట్టి మఱియు మానసిక ఏకాగ్రతకు ఆధారభూతమై యున్నట్టి శివలింగోపాసన ద్వారా మీరందఱు నిరాకారుడగు శివుని సాక్షాత్కరించుకొందురుఁగాక !

# శివలింగము చిన్మయము

నిజమునకు సదాశివునినుండి వ్యక్తమగు చైతన్య ప్రకా శమే

శివలింగమనఁబడును. ఆతనినుండియే సమస్త చరాచర సృష్టి ఉద్భవించినది. అతడు ప్రతిపదార్థమునకు లింగము, లేక కారణ-మైయున్నాడు. తుట్టతుద కాతనియందీ సమస్త ప్రపంచము లయించును. శివపురాణమిట్లు నుడువును. "పీఠం అంబ మయం సర్వం శివలింగశ్చ చిన్మయమ్" అందఱికి అధారమైయున్న పీఠ-మే ప్రకృతి, లేక పార్వతి. ఇక లింగము స్వయం ప్రకాశమానుడై యున్న చిన్మయ పురుషుడు. ప్రకృతి పురుషులు, లేక పార్వతీ శి-వలింగముల కలయికయే ఈ ప్రపంచమునకు కారణమై యున్నది. శివ పురాణములోని సనత్కుమార సంహిత యందు శి-వుడిట్లనును. "ఓ పర్వతరాజ పుత్రికయగు పార్వతీ! లింగమే సమస్తమునకు మూల



కారణమనియు, ఈ ప్రపంచము లింగమయము, లేక చైతన్య మయమనియు ఎవడు గుర్తెఱింగి ఏ మానవుడు నన్ను లింగరూప-ము నందు ఉపాసించునో, ఆతనికంటే నాకు ప్రియమైన వాడు మరియొకడు లేడు".

లింగ మొక గ్రుడ్డును పోలియుండును. అది బ్రహ్మాండ ము-ను సూచించును. బ్రహ్మాండము నందున్నదంతయు లింగ మునందున్నది. ప్రపంచమంతయు శివుని రూపమే. ప్రపంచమే లింగము. లింగము శివుని రూపము కూడా నైయున్నది.

ప్రకృతి పురుషుల కలయిక చేతనే సృష్టి ఏర్పడినదని లింగ-ము సూచించును. అనగా లయము, జ్ఞానము, వ్యాప్యము,

ప్రకాశము, అర్ధ ప్రకాశము, సామర్ధ్యము, వీటిని సూచించు చిహ్న-ము. ప్రపంచము మఱియు సర్వజీవులు సమాప్తినొందు స్థలమే లింగమనఁబడును. అది సత్యము, జ్ఞానము మఱియు అనంత-మును కూడా సూచించును. శివుడు సర్వవ్యాపకుడు మఱియు స్వయం ప్రకాశమానుడను విషయమునది సూచిం చును. పైన పేర్కొనఁబడిన నానావిధములగు అర్థముల నర్థమొనర్చుకొనుటకై లింగము చిహ్నమువంటిది. అండలింగము, పిండలింగము, సదాశివలింగము, ఆత్మ లింగము, జ్ఞానలింగము మఱియు శివ-లింగములనెడి ఆరు లింగ "ములున్నవి. అండము (విశ్వము), పిండము (శరీరము), సదా శివుడు ఇత్యాది లక్షణములను అర్థ-మొనర్చుకొనుటకై ఈ లింగములు సూచింపఁబడినవి.

## శివుడు - శివపూజ

లింగము యోనితో ఐక్యమొందుట పరబ్రహ్మము యొక్క శా-శ్వతమైన నిశ్చలత్వము మఱియు క్రియాశీలత యొక్క అంశములను సూచించును. ఏ పితృఅంశము మఱియు మాతృ-అంశము నుండి ఈ నానావిధ సృష్టి ఏర్పడినదో అట్టి శాశ్వత ఆధ్యాత్మిక సంయోగమును ఇది సూచించును. ఇది నిర్వికారుడగు పురుషుడు మఱియు క్రియాశీలమైయున్న శక్తి యొక్క శాశ్వత సం-యోగము. దీనినుండియే మార్పులన్నియును ఉత్పన్నమగును.

ఇంతేకాదు, ఈ పవిత్రమైన ఊహచే సాధకుల యందున్న ని-మ్నమగు లైంగిక వాంఛలు ఉడిగిపోవును. లింగము మఱియు

యోనియందున్న ఆధ్యాత్మిక దివ్యభావముచే సాధకులు లైంగిక వాంఛావిరహితులగుదురు. ఈ ఉన్నతమైన భావమును ప్రవేశ పెట్టుటచే దుష్టభావనలన్నియును క్రమముగా నశించును. ఈ ప్రపంచములోని సమస్త లైంగిక సంబంధములన్నియును శివుడు మఱియు అతని శక్తియొక్క ఆత్మానందము మఱియు ఆత్మవిభజనమగు శాశ్వత సృష్టి సిద్ధాంత పరిణామములుగా తలపఁబడును.

లింగము మరియు యోని యొక్క సంయోగము శివుడు తన శక్తితో కలిసి ఈ విశ్వమును సృష్టించుటను సూచించును. ఆధునిక యుగములోని విద్యావంతులనబడు వారికి ఆధ్యాత్మిక అంతర్దృష్టిఁగాని, వేదాంత గ్రహణ సమర్థ్యముఁగాని లేదు. ఈ కారణముచే వారు అజ్ఞాన భూయిష్ఠులై సత్సంగము, విచారము, వివేకము లేనివారై లింగయోని సంయోగము అవినీతి యనియు, అశ్లీలమనియును ఆక్షేపింతురు. ఇది నిశ్చయముగా మిక్కిలి దుఃఖకరము మఱియు శోచనీయము! ఈ

*శివుడు - శివపూజ*

దీనులైన అజ్ఞానజీవులకు పరమేశ్వరుడు సద్బుద్ధిని ప్రసాదించునుఁగాక!

## శివుని పొందుటకు మార్గము

తిరుమూలర్ యొక్క తిరుమంత్రము మూడు వేల సంవత్స

రములకు పూర్వము కూర్పఁబడిన కావ్యము. శైవమతాను ష్ఠానము మఱియు దార్శనిక సిద్ధాంతము లిందుకలవు. ఈ గ్రంథము నం-దు పతి (శివుడు). పశు (జీవుడు), పాశ (సంబం ధము) పురాతన శైలిలో వివరింపఁబడినవి. తిరు మంత్రము నందు తిరుమూలర్ యొక్క వివరణ ఈక్రింది విధముగా నున్నది.

దేవుడు మాత్రమే గురువు, లేక ఆచార్యుడు. ఆతడు శివుని, లేక సత్పదార్థమును దర్శింపఁ జేయును. సద్గురువే అంబలం, లేక చిదాకాశ శివుడు. గురువును నీ హృదయము నందే నీవు అన్వే-షింపవలసియున్నది. గురువుయొక్క అనుగ్రహము ద్వారా జ్ఞానము, భక్తి, పవిత్రత మఱియు సిద్ధులు పొందఁబడును. పవి-త్రత, వైరాగ్యము మున్నగు లక్షణములను కలిగియున్న ముముక్షువులకు దైవానుగ్రహము కలుగును.

మిక్కిలి ఆతురతగల ముముక్షువులు గురుపరంనుండి సహా-యమును పొందవలయును. సాధకునికి గురుపరం ఆధ్యా త్మిక



సూచనల నొసంగును. అప్పుడు శుద్ధగురువు ఆతనిపై దివ్యానుగ్ర-హమును ప్రసరింపఁజేయును. ముముక్షువు దివ్యాను గ్రహము నొందినప్పుడు అతడు నానావిధ శక్తులను, పారి శుద్ధ్యమును, మంత్రజ్ఞానమును, ఉన్నత సిద్ధులు మున్నగు వాటిని పొందును. అప్పుడు చిదాకాశము నందు స్వయముగా సద్గురువు వ్యక్తమై ఆణవ, కర్మ, మాయయనెడి త్రివిధ బంధములను తెగద్రుంచి, ముముక్షువును మోక్ష సామ్రాజ్యము నందు, లేక శాశ్వతానంద ధా-

మమునందు ప్రవేశ పెట్టును. తదనంతరము శివగురువు సత్, అసత్ మఱియు సదసత్తుగా వ్యక్తమగును. జీవుడీ పరమజ్ఞానము-నుఁ బడసినప్పుడు అతడు స్వయముగా శివుడగును. స్వయముగా శివుడే ప్రారంభమునందును, అంత్యమునందును గురురూపము-గా వ్యక్తమగును.

హృదయ గహ్వరము నందును, భ్రూమధ్యమునందును, మస్తకమునందును శివుని ధ్యానించు భక్తునికి దైవానుగ్రహము కలుగును. దేవుని పాదపద్మములు మిక్కిలిగా స్తుతింపఁబడినవి. "దేవుని పవిత్రమైన పాదములే నాకు మంత్రము, అందము మఱి-యు సత్యమ"ని తిరుమూలర్ పలికెను.

శివుడు మఱియు అతని అనుగ్రహమైన శక్తిచే ఉత్పన్న నగు శివానందమే జేయ మనఁబడును. జీవుడే జ్ఞాత. ఆతడు శివానంద-ము నందు నిలకడ కలవాడై, శివునిగుర్తెఱింగి, జ్ఞానము నొందును.

శివానందము నొందుటయే మోక్షము. మోక్షము నొందువాడు శివుని పరమజ్ఞానము నొందును. శివానందము నందు ప్రతిష్ఠితుడై యున్న



వాడు జ్ఞానమును మఱియు మోక్షము నొందును. శివానందమును గుర్తెఱింగిన జీవుడు దానియందే శాశ్వతముగా వసించును. శివా-నందమునందాతడు శివశక్తులను పొందును. శివశక్తి సంయోగము యొక్క సత్యమైన జ్ఞానము నాతడు కలిగియుండును. వైరాగ్యము, విరక్తి, విషయ వైముఖ్యములను కలిగియుండి తనను నిరంతర

మెవ్వఁడు పూజించి, స్తుతించునో అట్టి ముముక్షువుకు శివుడు మో-
క్ష మార్గమును దర్శింపఁజేయును.

శివభక్తుడు తన తపశ్చర్య ద్వారా ప్రాపంచిక వ్యామో హము మఱియు ఇంద్రజాలము నందు తగుల్కొననంతటి శక్తిమంతుడై యుండును. ఇంద్రునిచే ఒసంగఁబడిన ఇంద్ర లోక సుఖముల నాతడు లక్ష్యము చేయడు. శివసాయుజ్యముచే కలుగు పరమా-
నందముచే అతడు మిక్కిలి సంతృప్తుడై యుండును.

సాధకుడు ఘోరమైన తపస్సును మఱియు తీవ్రమైన ధారణ నభ్యసించినప్పుడు అతనికి వివిధ సిద్ధులు కలుగును. ఇంద్రుడు మరియు ఇతర దేవతలు తమ పదవులకు ముప్పు కలుగునని భయకంపితులగుదురు. కావున వారాతని మార్గము నందు నానావి-
ధములగు విఘ్నములను కలిగింతురు. మఱియు విమా నమును, కన్యలను, అనేక రకములగు దేవలోక సుఖముల నొసంగి ఆతనిని మోహపరవశ మొనర్తురు. కాని ధీరుడైన సాధకుడు దృఢ నిశ్చ-
యుడై యుండును. అతడు వాటికి లోబడక నేరుగా తన జీవిత ధ్యేయమైయున్న శివపదము, లేక నిత్యానంద పదవి నొందుటకై



ముందడుగిడును. వాటికి లోఁబడువాడు పతనము నొందును. వి-
శ్వామిత్రుడు పతనము నొందవలసి వచ్చెను.

సాధువైన తిరుమూలర్ ఇట్లు పలికెను. "విద్యావంతు డనను గర్వమును విడనాడుము. అంతఃపరీక్ష చేసికొనుము. అంతర్దృష్టి-
ని కలిగియుండుము. నీవు శివునియందు దృఢ ప్రతిష్ఠి

తుడవగుదువు. ఏదియు నిన్ను చలింపఁజేయ నేరదు. జనన మరణ బంధమునుండి నీవు విముక్తుడవగుదువు".

శైవసిద్ధాంతము అద్వైతమునే ప్రబోధించును. ఇది శివా ద్వై-తమనఁబడును.

## ప్రసాదము యొక్క మహిమ

ప్రసాదము శాంతినొసంగును. కీర్తన, పూజ, ఉపాసన, హవన-ము, హారతి సమయములో దేవునికి బాదాము, కిస్మిస్, పాలు, పండ్లు, మధుర పదార్థములు సమర్పింపఁబడును. బిల్వపత్రము-లు, పుష్పములు, తులసి, విభూతి చే పూజ ఒనర్స బడును. ఇవి దేవునియొక్క ప్రసాదముగా ఒసంగఁబడను. పూర్తి మఱియు హవ-నము నొనర్చు సమయములో మంత్రోచ్చారణ ద్వారా అవి అద్భుతమైన శక్తులచే నింపఁబడును.

### *శివుడు - శివపూజ*

ప్రసాదము మిక్కిలి పవిత్రపఱచును. ప్రసాదము చింతామ-ణి వంటిది. ప్రసాదము ఆధ్యాత్మికమైన అమృతము. దైవానుగ్రహమే ప్రసాదము. శక్తి యొక్క స్వరూపమే ప్రసాదము. వ్యక్తమైన దివ్యత్వమే ప్రసాదము. కేవలము ప్రసాదము చేతనే వి-శ్వసనీయులగు సాధకులు ఆశ్చర్యకరమైన అనుభవముల

నొందుదురు. నివారింపబడని అనేక వ్యాధులు నయమగును. ప్ర-సాదము శక్తినొసంగును, జీవనము నొసంగును, బలమును కలుగం జేయును . మఱియు భక్తిని పెంపొందించును. దానిని మిక్కిలి శ్ర-ద్ధతో స్వీకరించవలయును.

బృందావనము, పండరిపురము, లేక కాశీలో ఒక వారము రో-జులవరకు వాసము చేయుము. ప్రసాదముయొక్క మహిమ మఱియు ప్రభావము నీకు గోచరమగును, ప్రసాదము ప్రజలందరి-కి ఆయురారోగ్యములను, శాంతి సౌఖ్యములను మఱియు ఐశ్వర్యము నొసగును. శాంత్యానందములను ప్రసా దించు ప్రసా-దమునకు జయమగునుంగాక! అమృతత్వమును మఱియు అమరానందము నొసంగు నట్టి ప్రసాదమునకు అధీ శ్వరుడైన ప్ర-భువుకు జయమగునుంగాక !

విభూతి నొసట ధరించుకొనునట్టి శివుని ప్రసాదము. కొద్ది అంశమును నోటిలోకూడా వేసికొనవచ్చును.

కుంకుమ భ్రూమధ్యమునందు ధరించుట కనుకూలమగు శ్రీ దేవి, లేక శక్తి యొక్క ప్రసాదము.

## *శివుడు - శివపూజ*

తులసి విష్ణువు, శ్రీరాముడు, లేక శ్రీకృష్ణుని ప్రసాదము. దీని-ని తినకూడదు . బాదాము, కిస్మిస్, మధుర పదార్థములు, ఫలములు మున్నగు వాటిని భుజింపవచ్చును.

ఈ ప్రసాదము లన్నియును ప్రముఖమైన సమస్త ధార్మిక ఉత్సవములలో ఒసంగఁబడును.

## యాత్రా ఫలము

కొన్ని ప్రత్యేక హృద్రోగములకు వైద్య గ్రంథములలో “ఒర్టెల్" చికిత్స వ్రాయబడియుండును. రోగి మెల్ల మెల్లగా పర్వతముల నె-క్క వలయునని అది నుడువును. కావున కైలాస యాత్ర ఆధ్యాత్మిక లాభమును కలిగించుటయేఁగాక, సూక్ష్మమైన హృద్రోగములను-కూడా నివారించును . హృదయము వికసించి, బలపడును. హృదయకోశము, నాడీకోశము, శ్వాసకోశము, జీర్ణ కోశము, చర్మకోశ-ములన్నియును పరిశోధింపఁబడి, పరిశుద్ధ మొనర్పఁబడును. "కుహ్నె " యొక్క నీటియావిరి స్నానముతో పని లేదు. నీవు నడ-చునప్పుడు మిక్కిలి చెమటపట్టును. శరీరములోని రక్తమంతయు శుభ్రమైన పాణవాయువుచే పరిశుద్ధ మొనర్పఁబడును. దారియం-దంతయు పొడుగైన దేవదారు వృక్షములనుండి వీచు పిల్ల వాయువు చేతను, దానియం దంతర్ని హితమైయున్న దేవదారు తైలము చేతను ఆతడు తిరిగి వచ్చు నప్పటికి



ఊపిరితిత్తుల యందున్న దుర్వాయువులు దూరమై, క్షయరోగము నివారింపఁబడును. అధికముగానున్న కొవ్వు తగ్గిపోవును. స్థూల

శరీరులయొక్క లావుఁదనము తగ్గుటకై కైలాసయాత్ర అత్యుత్తమ చికిత్సయైయున్నది. అనేకరకములైన ఉదర వ్యాధులు, యూరిక్ ఆసిడ్ వ్యాధులు మఱియు చర్మ వ్యాధులన్నియు నయమగును. నీవు నూతనమైన విద్యుత్కణముల చేతను, నూతన అణువుల చేతను, నూతన కణముల చేతను, నూతన పరమాణువుల చేతను, నూతన బీజములచేతను, నూతన జీవ నాధారపదార్థము చేతను నింపఁబడుటచే నీవు 12 సంవత్సర ములవరకు వ్యాధిగ్రస్తుడవు కాకుందువు. ఇది కేవలము స్తుతి యని భావింపరాదు. ఒకేరాయిని విసరుటచే నీకు రెండు పక్షులు లభించును. కైలాసయాత్రచే ఆధ్యాత్మిక లాభముతో పాటు స్వాస్థ్యముకూడా చేకూరును. కైలాసపర్వతమునందు తన శక్తి యగు పార్వతితో వసించు శంభునికి నమస్కారము! నమస్కారము! తన భక్తులకు ముక్తినొసంగెడి మఱియు హర, సదాశివ, మహాదేవ, నటరాజ, శంకరాది నామములచే పేర్కొనఁ బడు శివునికి జయము! జయము!

భగవత్సాక్షాత్కారమే జీవితలక్ష్యము. దానిచే సంసార దుఃఖ విముక్తి మఱియు జననమరణ రాహిత్యము కలుగును. నిస్వార్థమగు నిత్య నైమిత్తిక కర్మానుష్ఠానము చేతను, తీర్థయాత్రల తన పుణ్యము ప్రాప్తించును. దీనిచే పాపము క్షయించి మనస్సు పరిశుద్ధమగును. మానసిక శుద్ధిచే సంసారముయొక్క మిథ్యాత్వము మఱియు నైజస్వభావము తెలియఁబడును. దీనిచే వైరాగ్య ముప్పతిల్లును. దీనిచే



మోక్షవాంఛ జనించును. ఈ కోరికచే మోక్ష సాధనాన్వేషణ ప్రారం-

భమగును. దానిచే సమస్త కర్మ సన్న్యాసము సిద్ధించును. అప్పు-డుయోగాభ్యాసము ద్వారా మనస్సు ఆత్మ, లేక బ్రహ్మము నందు స్థిరపడును. దీనిచే అవిద్యను నశింపచేయు 'తత్త్వమసి' యనెడి శ్రుతివాక్యముయొక్క భావా రము తెలియఁబడును. ఇట్లు ఆత్మ-యందు నిలుకడ ఏర్పడును. చిత్తశుద్ధి మఱియు నిదిధ్యాసనకు కారణమగుటచే కైలాస యాత్రాదులు దైవ సాక్షాత్కారమునకుఁ గొ-నిపోవు పరంపర సాధనలై యున్నవి. ధ్యానము సూటియైన సాధనయగును. ప్రపంచ మందు నానావిధములగు చీకుచింతల-చే సతమతమగు గృహస్థులు యాత్ర చేయుటచే గొప్ప ఉపశమనమునునుభ వింతురు, యాత్రవలన వారి మనస్సులు సేదఁదీరును. ఇంతే కాకుండా ప్రయాణ కాలములో వారు అనేక సాధుసన్న్యాసులను కలియుదురు. వారికి మంచి సత్సంగము లభించును. వారు తమ సంశయములను పోగొట్టుకొందురు. ఆధ్యాత్మిక సాధనయందు వారు అనేక విధములగు సహాయము-ను పొందు దురు. అదియే యాత్రయొక్క ముఖ్యలక్ష్యము.

ఓ ప్రియమైన పాఠకులారా! వేదములు మఱియు ఉప నిష-త్తులయొక్క చివరిమాటయగు 'తత్త్వమసి'నిఁగూర్చి మరియొక సారి నేను మీకు జ్ఞాపక మొనర్చుచున్నాను. ఓం తత్సత్. ఓం శాం-తిః సర్వజీవులు శాంతి ననుభవింతురుఁగాక !



# పరిక్రమ యొక్క ప్రయోజనములు

ఒక పవిత్రమైన మరియు పావనమైన స్థలముచుట్టు భక్తితో ప్రదక్షిణ మొనర్చుటయే పరిక్రమ యనఁబడును. ఇదియొక పరక శిఖరము, పవిత్ర తీర్థము, యాత్రాస్థలము, లేక తరతరముల నుండి పవిత్రమైన స్థలముగా, ఎన్నఁబడు ప్రదేశమైనను కావచ్చును. ఈ పరిక్రమ సామాన్యముగా ఏ కాలమందైనను చేయవచ్చును. ఇది సంవత్సరములోని ఒక ప్రత్యేక సమయములో సామూహికముగాకూడా ఒనర్పబడును.

ఒక మందిరమునందు ప్రతిష్ఠింపఁబడిన మూర్తి, తులసీ చెట్టు, లేక పిప్పల వృక్షముచుట్టు తిరుగుట సామాన్యముగా "ప్రదక్షిణ"యనఁబడును. కాని ఒక పెద్దస్థలము చుట్టు తిరిగినప్పుడు అదియే "పరిక్రమ"యనఁబడును.

అనేక కష్టప్రదములగు పరిక్రమలు వ్యవహారమునం దున్నవి. కొందఱు పరిక్రమయందు ప్రయత్న పూర్వకముగా అమితమైన ప్రయాసను మఱియు భౌతిక పరిశ్రమను చేర్చు కొందురు. కొందఱు భూమిపై సాష్టాంగపడి మార్గమంతయు శ్రీ పొరలుదురు. కొందఱు ప్రతి మూడడుగులు, లేక పది అడుగులకు సాష్టాంగ ప్రణామ మొనర్చుచు మెల్లగా పరిక్రమను కొనసాగింతురు. మరికొందఱు ఒక పాదము తర్వాత మరియొక పాదమును పెట్టుచు, క్రమ క్రమముగా పరిక్రమయంతయు నిదానముగా పూర్తి చేయుదురు. ఇంకను కొందఱు తమచుట్టు తాము గిఱ్ఱున తిరుగుచు, ఆత్మ ప్రదక్షణయొనర్చుచు, పరిక్రమను పూర్తి

చేయుదురు. ప్రత్యేక తపస్సు కాలమునందును, లేక పూర్వ మొన-ర్చిన ప్రతిజ్ఞ ననుసరించియు, దేవునిపై వారికిఁగల ఔత్సుక్యమును ప్రదర్శించుటకున్నూ ఇట్టి కష్టప్రదమైన కార్యములను భక్తులొనర్తురు. నీయొక్క మానసిక భావముననుసరించి ఉన్నతమైన, అతిశయమైన ఆధ్యాత్మిక శ్రేయస్సు నీకు కలుగును.

నిర్భయులైన యాత్రికులు మంచుచే నిండిన హిమా లయ-ములలో కైలాస శిఖరముచుట్టు, లేక ఇంకను ఎక్కువ దూరముఁగల మానస సరోవరము చుట్టు పరిక్రమనొనర్తురు. మరి-కొందఱు యాత్రికులు కేదార్-బదరీ యాత్రలకై ఒక మార్గము గుండా వెళ్ళి మఱియొక మార్గముగుండా తిరిగివచ్చి, నాలుగు ధా-ములుఁగల ఉత్తరాఖండ్ చుట్టు పూర్ణ పరిక్రమ నొనర్తురు.

దక్షిణ దేశములోని భక్తులు తిరువణ్ణామలైలోని పవిత్రమైన అరుణాచల ప్రదక్షిణ యొనర్తురు. శ్రీరామభక్తులు మఱియు శ్రీ-కృష్ణ భక్తులు చిత్రకూట పర్వతము, అయోధ్య, వ్రజభూమి, బృందా వనము, గోవర్ధనము మఱియు బదరీనాథ్ ల చుట్టు పరి-క్రమ యొనర్తురు.

పరిక్రమ యొక్క గంభీర భావమేమనగా భక్తుడు ఒక స్థలము, పర్వ-తము, లేక తీర్థము యొక్క భౌతికమైన అంశమునుఁ గాంచడు. కాని దానియందున్న ఆధ్యాత్మిక శక్తిని మఱియు దివ్యత్వమునుఁగాం-చి, దివ్యానుభూతి నొందును. భగవద్గీతలోని దశమాధ్యాయము నందు శ్రీకృష్ణుడు నుడివిన విభూతుల ద్వారా నీవు ఆయా ప్రత్యేక స్థలములలోని దివ్య సత్తాను గుర్తెఱుంగఁ జాలుదువు. నీ శ్రద్ధా భక్తుల

ఆధిక్యతననుసరించి, ఆ పవిత్ర స్థలము యొక్క ఆధ్యాత్మిక స్పం-దనములు నీయందు ప్రవహించుట కారంభించును. ఈ శక్తివంతములగు ఆధ్యాత్మిక స్పందనములు మానవునియందు ప్రవేశించి, సమస్త స్థూల సూక్ష్మ కోశములను పవిత్రపరచి, దుష్ట వాసనలను మఱియు సంస్కారములను నశింపఁ జేయును. తమ-స్సు, రజస్సులు నాశమగును. సత్త్వగుణ వికాసముచే అణగియున్న ఆధ్యాత్మిక వృత్తులు మేల్కొనును. పరిక్రమచే భక్తు-డు ఆ ప్రదేశము నందు పరివ్యాప్తమైయున్న దివ్యత్వమును పానమొనర్చి, సాత్త్విక సంపన్నమైయున్న ఆధ్యాత్మిక పథముం-దడుగిడును. పరిక్రమయందిట్టి అంతఃకరణ శుద్ధియొనర్చు అంతరార్థ మిమిడియున్నది.

పవిత్రీకరించునదగుటచే పరిక్రమ ఒక తపశ్చర్య పరిగణిం-పఁబడి, భక్తుల కిదియొక సాంప్రదాయముగా విధింప బడినది. దీనిచే గొప్ప ఆధ్యాత్మిక లాభము మఱియు ధార్మిక ఫలము చేకూ-రును. భక్తుడు స్నానమొనర్చి, శుభ్రమైన వస్త్రములను ధరించి తిలకమును, లేక విభూతిని అలంకరించు కొని తులసి, లేక రు-ద్రాక్షమాలను మెడలో వేసికొని, భగవన్నా మమును స్మరించుచు బయలు దేరును. పరిక్రమ మార్గము నందు వసించు సాధుస-న్న్యాసుల దర్శనము మఱియు సాంగత్యము నీకు లభించును. పెద్ద పరిక్రమ యొక్క దారి యందువచ్చు కొలనులు, సరస్సులు మఱియు నదులలో స్నాన మొనర్చుటచే - నీవొనర్చిన పాపము-లు పరిహారమగును. మార్గము నందున్న పవిత్రమైన

ధన్యమగును. వేడి లోను, వర్షములోను, చలి యందును కలుగు అనేక అసౌకర్యముల వలన నీయందు ఓర్పు గుణము పెంపొం-దును. మనస్సు కోరునట్టి ప్రియమైన పదార్థములను త్యజించుటయే కష్టప్రదమైన పరిక్రమ యొక్క ఉద్దేశ్యము. నీ మనస్సు సర్వసంకల్ప విముక్తమై ఏకైక దైవ భావము నందు ని-యుక్తమై యుండును. భక్తితో ఒనర్పఁబడిన పరిక్రమయనెడి ఏకైక క్రియయందు శరీరము, మనస్సు, ఆత్మలను వికసింపఁజేయు మూడు క్రియలు ఇమిడియున్నవి. యాత్రా స్థములలోని పవిత్ర స్థ-లములు మఱియు మందిర ములయందున్న ఆధ్యాత్మిక స్పందనములచే నీయందున్న ఆసురిక వృత్తులు నశించి, నీ-యందు సత్త్వగుణము మఱియు పారిశుద్ధ్యము నింపఁబడును. నీవు సత్సంగమునకు వెళ్ళవలసిన ఆవశ్యకత యుండదు. మహా-పురుషులు స్వయముగా నీవద్దికే తెంతురు. వారెల్లప్పుడు నిజమైన, విశ్వసనీయమైన సాధకులను అన్వేషించుచుందురు. కావున వారు బదరీ, కేదార్, కైలాస్, హరిద్వార్, బృందావన్, మధు-రవంటి పవిత్ర స్థలములలో కూడా నివసించుచుందురు.

పరిక్రమ నొనర్చు వారు నిజముగా ధన్యజీవులు. ఏల ననగా వారు శీఘ్రముగా శాంతి, ఆనందము మఱియు అమర త్వముల నొందుదురు. అయోధ్యాధిపతియైన శ్రీరామునికి జయము! సర్వ-జీవ హృదయాంతర్వాసియు, ప్రత్యేకముగా బృందావనము నందు వసించువాడునగు శ్రీకృష్ణునికి జయము! భక్తులందఱికి జయము!

వారి ఆశీస్సులు మీ అందఱియందుండును గాక!

*శివుడు - శివపూజ*

## నిజమైన పుష్పము మఱియు హారతి

దేవాలయ శిఖరము బ్రహ్మరంధ్రమును సూచించును. బలి-పీఠము నాభిస్థానమును, లేక మణిపూర చక్రమును సూచించును. నంది ఆజ్ఞా చక్రమును సూచించును. ధ్వజ స్తంభము మూలాధా-రము నుండి బ్రహ్మరంధ్రము వరకేగు సుషుమ్న నాడిని సూచించును.

దిగ్దేవతశ్రోత్రమునందును, వాయువు చర్మమునందును, సూర్యుడు నేత్రమునందును, వరుణుడు జిహ్వయందును, అశ్వి-నులు నాసిక యందును, విష్ణువు పాదములయందును, ఇంద్రుడు హస్తమునందును, అగ్ని వాక్కు నందును, ప్రజాపతి గుహ్యమునందును, యముడు గుదస్థానమునందును, సూత్రాత్మ _చంద్రుడు మనస్సు నందును, బ్రహ్మ బుద్ధియందును, రుద్రుడు ప్రాణము నందును, హిరణ్యగర్భుడు అంతఃకరణమునందును, అహంకారమునందును, శివుడు చిత్తము నందును, సరస్వతి జి-హ్వాగ్రము నందును, పార్వతి అనాహత చక్రమునందును, లక్ష్మి మణి పూర చక్రమునందును, గణేశుడు మూలాధారము నందును మఱియు మస్తకములోని బ్రహ్మరంధ్రమునందు సచ్చిదానంద బ్రహ్మమున్నూ వసించును.

సత్యము, అహింస, తపస్సు, దయ, ప్రేమ, ఆత్మ నియంత్రణము, తృప్తి, క్షమ, జ్ఞానము, సమదృష్టి, శాంతము ఇవి పూజయొనర్చుటకు నిజమైన పుష్పములు. నాదములన్ని యును అభిషేకము నొనర్చుటకు జలములు. పుణ్యకర్మలే ధూపము. వేదాంతమే పీతాంబరము. జ్ఞానము మఱియు యోగములే కుండలములు. తపస్సు మఱియు ధ్యానమే

## *శివుడు - శివపూజ*

జ్యోతులు. జపమే చామరము. ఆనాహతమే సంగీతము. కీర్తనమే గొడుగు. ప్రాణాయామమే విసనకఱ్ఱ.

తత్త్వములే దేవునికి సేవకులు. జ్ఞానశక్తియే దేవి. ఆగమమే అధికారి. అష్టసిద్ధులే దేవుని ద్వారపాలకులు. తురీయమే భస్మము. వేదమే వృషభము, లేక నంది. చేతి యందున్న త్రిశూలము కళ్యాణగుణములను సూచించును. పంచాక్షరమే యజ్ఞోప వీతము. శుద్ధ జీవుడే ఆభరణము. వృత్తులే పూజోపకరణములు. పంచభూతములు మఱియు పంచతన్మాత్రలు శివునికి రుద్రాక్ష మాలలు. పులి చర్మము అహంకారమును సూచించును..

క్రియా శక్తి మఱియు పుణ్యకర్మలు దేవునికి ధూపము వంటివి. జ్ఞానమును ఉత్పన్న మొనర్చు చిచ్ఛక్తికూడా ధూపమే. అహంకారమును మఱియు మనస్సును దేవుని చర ణార విందముల యందు సమర్పించుటయే నిజమైన నైవేద్య మనఁ బడును. కర్పూరము కరిగి అగ్నితో ఐక్యమగునట్లు, సత్పురుషుని యొక్క మనస్సు కరిగి జీవాత్మ పరమాత్మయందు లయించును, ఇదియే

నిజమైన కర్పూరహారతి యనఁబడును.



# 10వ అధ్యాయము

# శైవోపనిషత్తులు

## ఉపనిషత్తులలోని రుద్రుడు

రుద్రుడు వినాశమునుకోరు భయంకరమైన దేవుడని కొంద-ఱు అజ్ఞానులు తలంతురు. రుద్రుడు శిక్షించు దేవుడని వారు విశ్వసింతురు. కాని అట్లు కాదు. రుద్రుడు ఐశ్వర్యము నొసంగి దుః-ఖమును నశింపఁ జేయు దేవుడు. ఆతడు శ్రేయ స్సును, సంతానమును మఱియు పశుసంపద నొసంగు దయఁ గల దేవుడు. ఆతడు ఐశ్వర్యమునకు మూలాధారము వంటి వాడు.

పాపమును, లేక దుఃఖమును పోగొట్టువాడు శివుడు, లేక రు-ద్రుడనఁబడును. భవుడు, శర్వుడు, పశుపతి, ఉగ్రుడు, మహా దేవుడు, ఈశానుడు మఱియు అశనియను పేర్లు రుద్రుని కన్వ-యించును. పశుపతియనగా పశువులకు అధిపతి, లేక వాటిని సంరక్షించువాడని అర్థము.

వేదములలో ఈ క్రింది విధములగు ప్రార్థనలుండును. "ఓ రుద్రా! మా సంతానము వృద్ధినొందునుఁగాక !" "ఓ రుద్రా! నీవు పు-రుషశ్రేష్ఠుడవు, బలవంతుల కెల్ల బలవంతుడవు. పిడుగును సంబాళించువాడవు. మమ్ములను రక్షించుము. మా దుఃఖము యొక్క గట్టు నుండి మమ్ములను కడ తేర్చుము. మా దుర్గుణము-లన్నింటిని పారద్రోలుము". "మే మొనర్చిన పాపములన్నింటిని మానుండి తొలిగించుము." కావున

## ***శివుడు - శివపూజ***

రుద్రుడు భయమును పుట్టించు దేవుడు కాడు. కాని శుభమును, సంపద నొసంగు దేవుడు. ఆతడీ విశ్వమునకు మహా దేవుడు.

రుద్రుడు పరివ్రాజకులకు ఆదర్శమైన దేవుడు. ఏలననగా దేవతలందరిలో రుద్రుడు మాత్రమే భిక్షాటన యొనర్చు దేవుడు-గా శ్రుతులలో చెప్పబడినది. అతడు కమండలమును ధరించినట్లు ఋగ్వేద సంహితలో చెప్పఁబడినది.

శ్వేతాశ్వత రోపనిషత్తులోని 3వ అధ్యాయము నందీ క్రింది వి-షయము కలదు. "తన శక్తిచే సమస్త లోకముల నేలు రుద్రుడొ క్కడే కలడు. అతనిని ద్వితీయునిగా చేయువాడు మరియొకడు లేడు. ఆతడు సర్వజీవ హృదయాంతర్వాసియై యున్నాడు. అత-డు సమస్త లోకములను సృష్టించి, పోషించి, తుట్టతుదకు వాటిని తనయందు లయింపఁ జేసికొనును."

రుద్రుడిచ్చట అనంత పరబ్రహ్మము, లేక పూర్ణ పరమాత్మగా చెప్పఁబడెను.

రుద్రుడు పదార్థములన్నింటిని సృష్టించిన అనంతరము విశ్వప్రళయ సమయములో వాటినన్నింటిని చేర్చి తనయందు లీన మొనర్చుకొనును.

శివుని సంహారక అంశమే రుద్రుడు. ఈ విశ్వమునం దేకాదశ-రుద్రులు కలరు. ఏకాదశ రుద్రులు దశేంద్రియములను మఱియు మనస్సును సూచించును. రుద్రునియొక్క అవతారమే, లేక అం-శమే హనుమంతుడు.

### *శివుడు - శివపూజ*

శివునికి మరియొక పేరే రుద్రు డని శివపురాణమునందు చె-ప్పఁబడినది. రుద్రుడు తన భక్తులయొక్క పాపములను, కష్టములను నశింపఁ జేసి, జ్ఞానానందములను ప్రసాదించును. రుద్రుడు సర్వ జీవులలో అంతర్యామియై వసించియున్నాడు. అతడు మనుజులయొక్క ఆలోచనలకు, కర్మలకు సాక్షియై యుం-డి వారికి కర్మఫలముల నొసంగును.

"ఆ ఏకైక దేవుడు భూలోకమును మఱియు స్వర్గలోక మును సృష్టించునప్పుడు అన్ని స్థలములలో నేత్రములను, ముఖము-ను, బాహువులను మఱియు పాదములను కలిగి _యుండి, తన బాహువులతోను మఱియు లెక్కలతోను వాటిని సాగదీసి, రూపము-నొసంగెను.

దేవతలను సృష్టించి, వారి కాధారమైయున్న రుద్రుడు, మహాద్రష్ట, మొదట హిరణ్యగర్భుని సృష్టించిన మహా ప్రభువు మనకు మంచి ఆలోచనలను కలిగించుఁగాక !

"ఓ పర్వతములలో వసించు రుద్రుడా! భయంకరము కాని నీ శుభంకరమైన రూపముతోను, పవిత్రతను వ్యక్తమొనర్చు | గంభీరమైన రూపముతోను మాకు దర్శనమిమ్ము"

*శివుడు - శివపూజ*

## రుద్రాక్ష జాబాలోపనిషత్తు

హరిఃఓమ్, రుద్రజాబాలోపనిషత్తు ద్వారా తెలియబడు శ్రీ మహోరుద్రుని ప్రకాశమానమగు పరమశాంతమగు రూపమును నేను స్తుతించుచున్నాను.

భుశంగుడు కాలాగ్ని రుద్రుని ఇట్లు ప్రశ్నించెను. "రుద్రాక్షకు పూసలు ఎచ్చట ఉత్పన్న మగును? వాటిని శరీరము నందు ధరించుటచే కలుగు ప్రయోజనమేమి?"

కాలాగ్నిరుద్రుడు అతనికిట్లు సమాధాన మొసంగెను. "త్రిపురాసురులను సంహరించుటకై నేను నా నేత్రములను మూసి కొంటిని. ఇట్లు మూయఁబడిన కన్నులనుండి నీటి బిందువులు భూమిపై cబడెను. ఈ కన్నీటిబిందువులే రుద్రాక్షలయ్యేను. "

"రుద్రాక్షయను నామము నుచ్చరించినంత మాత్రముచే మానవుడు పది గోవులను దాన మొసంగిన ఫలము నొందును. దా-

నిని దర్శించి, స్పర్శించినచో ద్విగుణీకృత ఫలము కలుగును ఇంకను దానిని స్తుతించుటకు నేను అశక్తుడను.”

ఒక వేయి దేవలోక సంవత్సరముల వరకు నేను నా నేత్ర-ములను మూసికొనియుంటిని. అప్పుడునా కను రెప్పల నుండి నీటి బిందువులు నేలఁబడి, భక్తుల నాశీర్వదించుటకై స్థిరత్వము నొందెను.

ఈ రుద్రాక్షను ధరించిన భక్తునికి ఆతడు రాత్రింబగళ్ళ నర్చిన పాపములు క్షయించును.

### *శివుడు - శివపూజ*

కేవలము రుద్రాక్షను దర్శించిన దాని ఫలము లక్ష. కాని దా-నిని ధరించుటచే ఒక కోటి యగును. ఇంతఏల? నూరుకోట్లు కూడా అగును.

కాని రుద్రాక్షతో జప మొనర్చి, దానిని అన్ని వేళలలో ధరిం-చువానికి అది నూరులక్షలకోట్లు మఱియు వెయ్యిలక్షల కోట్ల ఫలమునొసంగును.

రుద్రాక్షలలో అమలకము (ఉసిరిక పండు) వంటి పరి "మా-ణము కలది ఉత్తమమై నదిగా తలంపఁబడును. బదరిక బడును. కాని శనగగింజ పరిమాణముకలది అధమముగా ఫలమువంటి పరిమాణముకలది మధ్యమముగా తలంపఁ తలంపబడును. ఇది రుద్రాక్ష పూసల పరిమాణముఁ గూర్చిన నా అభిప్రాయము.

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రుల నేడి చతుర్విధ ప్రజలు కే-

వలము భూమిపై భారభూతులై జన్మించిరి. తెల్లని రుద్రాక్షయే ని-జమైన బ్రాహ్మణుడు. ఎఱ్ఱని రుద్రాక్ష క్షత్రియుడు. పసుపుపచ్చని రుద్రాక్ష వైశ్యుడు. నల్లని రుద్రాక్ష శూద్రుడు.

కావున బ్రాహ్మణుడు తెల్లని రుద్రాక్షను, క్షత్రియుడు ఎఱ్ఱని రుద్రాక్షను, వైశ్యుడు పసుపుపచ్చని రుద్రాక్షను, శూద్రుడు నల్లని రుద్రాక్షను ధరింపవలయును.

మానవుడు అందమైన, మనోహరమైన, బలమైన, పెద్దవైన, శుభంకరమైన మఱియు గీతలుకల రుద్రాక్షలను ధరింప వల-యును. కాని క్రిములు భుజించిన, పగిలిన, గీతలు లేని, బొటిమలుఁగల వాటిని త్యజింపవలయును.

## *శివుడు - శివపూజ*

స్వతఃసిద్ధముగా రంధ్రములుఁగల రుద్రాక్ష ఉత్తమమైనది. కాని మానవ ప్రయత్నముచే రంధ్రము చేయబడిన రుద్రాక్ష అధ-మముగా తలంపఁబడును. ఆ ఉత్తమమైన రుద్రాక్షలు తెల్లని దారము నందు గుచ్చఁబడవలయును, శివుని ఉపాసించువాడు తన శరీరమందంతట రుద్రాక్షలను ధరింపవలయును. ఆతడు శిఖయందొక పూసను, తలచుట్టు నూరువందల పూసలను, ము-ప్పదియారు మెడచుట్టును, పదునారు ప్రతి బాహువునందును, పంద్రెండు వక్ష స్థలము నందును, ఐదువందలు నడుము చుట్టు-ను ధరింపవలయును. నూటెనిమిది రుద్రాక్ష పూసలుఁగల యజ్ఞోపవీతము నాతడు ధరింపవలసి యుండును. ఆతడు మెడ-చుట్టు రెండు, మూడు, ఐదు, లేక ఏడు రుద్రాక్ష మాలలను

ధరింపవలసియుండును.

శివభక్తుడు రుద్రాక్షలను కిరీటము, చెవిపోగు, గొలుసు, చెవి-చుట్టు, బాహుకవచము చుట్టును అన్ని వేళలలో ధరింప వలయును. నిద్రించుట, త్రాగుట ఇత్యాదులను చేయుచున్నను ఆతడు ముఖ్యముగా ఉదరము చుట్టు వాటిని ధరింప వలయును.

భక్తుడు మూడువందల పూసలను ధరించినచో అది నికృష్ట-ము. ఐదువందల పూసలను ధరించినచో మధ్యమము. మఱియు ఒక వేయి పూసలను ధరించినచో ఉత్తమమని చెప్పఁబడును.

భక్తుడు మస్తకమునందు రుద్రాక్షను ధరించునప్పుడు తన ఇష్టమంత్రమును, మెడచుట్టు ధరించునప్పుడు తత్పురుష మం-త్రమును మఱియు కంఠము చుట్టు ధరించునప్పుడు అఘోర



మంత్రమును ఉచ్చరింపవలయును. వక్షస్థలమునందు ధరించు నప్పుడు కూడా అఘోరమంత్రమునే ఉచ్చరింపవలయును.

అఘోరబీజమంత్రము నుచ్చరించుచు అతడు వాటిని తన బాహువుల చుట్టు ధరింపవలయును.

మరల భుశుండుడు కాలాగ్ని రుద్రుని ఇట్లు ప్రశ్నించెను. వా "రుద్రాక్ష పూసలయొక్క వివిధ రూపములు మఱియు వాటి ప్రభా-వము లెట్టివి! సర్వ దుష్కృతములనుండి విడి వడ జేయు నట్టి నానావిధ ముఖములుఁగల ఈ రుద్రాక్షలు రహస్యమునుఁ గూర్చి దయచేసి నాకు తెలుపుడు."

కాలాగ్ని రుద్రుడిట్లు పలి కెను:- ఒకే ముఖము(గల పూస పరమ సత్యము యొక్క రూపము. ఇంద్రియ నిగ్రహ పరుడీ రుద్రా-క్షలను ధరించినప్పుడు శాశ్వత సత్యము నంద్రై క్యమగును. ఈ దిగువ నానారకముల ముఖములు(గల రుద్రాక్షలు మరియు వాటి ప్రయోజనముయొక్క జాబితా ఒసంగబడినది.

***శివుడు - శివపూజ***

| **ముఖము – రూపము** | **ప్రయోజనము** |
|---|---|
| 1. పరమ సత్యము | శాశ్వత పద ప్రాప్తి |
| 2. అర్ధనారీశ్వర | అర్ధనారీశ్వరుని అనుగ్రహము |
| 3. త్రేతాగ్ని | అగ్ని యొక్క అనుగ్రహము |
| 4. బ్రహ్మ | బ్రహ్మయొక్క అనుగ్రహము |
| 5. పంచబ్రహ్మలు | నరహత్య పాపనివారణము |
| 6. కార్తికేయ, లేక గణేశ్ | చిత్తశుద్ధి మఱియుజ్ఞాన సముపార్జ-నము. |
| 7. సప్తమాల | ఆరోగ్యైశ్వర్య ప్రాప్తి |
| 8. అష్టమాత్రలు (అష్ట | ఈ దేవతల అనుగ్రహముచ |

| | | |
|---|---|---|
| | వస్తువులు, లేక గంగ) | సత్యసంధుడగును. |
| 9. | నవశక్తులు | నవశక్తుల అనుగ్రహము |
| 10. | యమ | శాంతిప్రాప్తి |
| 11. | ఏకాదశ రుద్రులు | సమస్తైశ్వర్యములు వృద్ధినొందును |
| 12. | మహావిష్ణువు, లేక ద్వాదశాదిత్యులు | మోక్షప్రాప్తి |
| 13. | కామ దేవుడు | కామదేవుని అనుగ్రహము మఱియు సమస్త వాంఛపరిపూర్తి. |
| 14. | రుద్రుడు | సమస్తవ్యాధి వినాశము |

## ***శివుడు - శివపూజ***

రుద్రాక్షలను ధరించువాడు మాంసము, వెల్లుల్లి, నీరుల్లి, క్యారెట్ వంటి నిషేధ్యములగు మాదకద్రవ్యములను సృజింపవలయును. గ్రహణ కాలములోను, విషు సంక్రాంతి (మీనమాసాంతము మఱియు మేష మాసారంభము) యందును, అమావాస్య, పౌర్ణమి రోజులలోను, ఇతర శుభ దినములలోను రుద్రాక్షలను ధరించువాడు సర్వపాప విముక్తు డగును.

రుద్రాక్ష పూసయొక్క మూలమునందు బ్రహ్మ, దాని నాభిస్థా-

నము నందు విష్ణువు, దాని ముఖమునందు రుద్రుడు, మఱియు దాని రంధ్రమునందు సమస్త దేవతలుందురు.

ఒక రోజు సనత్కుమారుడు కాలాగ్ని రుద్రుని ఇట్లు. "ఓ దేవా! రుద్రాక్షలను ధరించు విధులను గూర్చి నాకు తెలియ జేయుడు." ఆ సమయమునందు నిదాఘుడు, జడభరతుడు, దత్తాత్రేయుడు, కాత్యాయనుడు, భరద్వాజుడు, కపిలుడు, వసిష్ఠుడు, పిప్పలాదుడు మున్నగువారు కాలాగ్ని రుద్రుని వద్దకు వచ్చియుండిరి. అప్పుడు "మీరందఱు కలిసి ఒక సమూహముగా ఇచ్చటి కేల వచ్చితిర"ని కాలాగ్ని రుద్రుడు వారిని ప్రశ్నించెను. రుద్రాక్షలను ధరించు విధానమును తెలిసికొనుటకై వచ్చితిమని వారు సమాధాన మొసంగిరి.

కాలాగ్ని రుద్రుడిట్లు పలికెను:- రుద్రుని నేత్రముల నుండి జన్మించిన వాటిని రుద్రాక్షలందురు. ఈ పూసలను చేతితో స్పర్శించిన మాత్రముచే ఒ కేపర్యాయము రెండు వేల గోవులను దానమొసంగిన ఫలితము కలుగును. వాటిని చెవులలో ధరించినప్పుడతనికి



పదనొకండు వేల గోవులను దాన మొసంగిన ఫలితము కలుగును. ఆతడు పదునొకండు రుద్రుల పదవిని కూడా పొందును. పూసలను మస్తకమునందు ధరించి నప్పుడతడు కోటి గోవులను దాన మొనర్చిన ఫలితము నొందును. అన్ని స్థలములకంటే చెవులలో ధరించిన దాని ఫలితమును(గూర్చి చెప్పుటకు నేనశక్యుడనై

యున్నాను.

ఈ రుద్రాక్ష జాబాలోపనిషత్తును బాలుడుఁ గాని, యువకుడుఁగాని అధ్యయనము చేసినచో, ఆతడు మహాపురుషు డగును. ఆతడు అందరికి గురువు మఱియు అన్ని మంత్రములకు ఆచార్యుడగును. ఈ యుపనిషత్తులోని మంత్రములతో హవ నము మఱియు అర్చన ఒనర్పఁబడవలయును.

ఈ యుపనిషత్తును సాయంకాలము ఉచ్చరించు బ్రాహ్మణుడు దినమునందొనర్చిన పాపములను నశింప జేయును. మధ్యాహ్నము నందుచ్చరించువాడు ఆరు జన్మల యందొనర్చిన పాపములను నశింపఁ జేయును. ఉదయ సాయం కాలములలో ఉచ్చరించువాడు అనేక జన్మల పాపములను నశింపఁ జేయును. ఆరు వేల లక్షల గాయత్రీ జపమును చేసిన ఫలితమును ఆతడు పొందును.

ఆతడు బ్రాహ్మణహత్య, సురాపానము, సువర్ణ చౌర్యము, గురుపత్నీ గమనము, దుష్టసహవాసము మున్నగు సమస్త పాపములనుండి విముక్తుడగును.

### *శివుడు - శివపూజ*

సకల తీర్థములను సేవించిన ఫలమును మఱియు అన్ని నదులలో స్నాన మొనర్చిన ఫలితమును ఆతడు పొందును.

అతడు శివసాయుజ్యము నొందును. అతడు తిరిగి జన్మింపడు.

## భస్మ జాబాలోపనిషత్తు

నేను ఆపూర్ణ పరబ్రహ్మమును. అది ఈ యాత్మతో తాదాత్మ్య-
ము నొందియున్న ది. ఈ జగత్తు సత్యమనెడి అజ్ఞాన మును అది
భస్మమొనర్చును. పరమజ్ఞానమనెడి అగ్నిచే జగత్తు ఆత్మకు భి-
న్నము కాదను విషయము తెలియఁబడును.

ఒకప్పుడు జాబాలి వంశీయుడగు భుశుండుడు కైలాస శిఖర-
మున కేగి ఓంకార స్వరూపుడును, బ్రహ్మ-విష్ణు-రుద్రుల
కతీతుడును, మహా దేవుడునగు శివునిఎదుట సాష్టాంగముగా ప్రణ-
మిల్లెను.

భుశుండుడు ఫలపుష్పములతోను, బిల్వ దళములతోను
మహాభక్తితో శివుని మరల మరల పూజించెను. అప్పుడాతడు శివుని
ఇట్లు ప్రశ్నించెను. "ఓ దేవా! సమస్త వేదములలోని భస్మమును
ధరించు విధానమును, పద్ధతిని నాకు దయతో తెలియఁ జేయుడు.
ఏలననగా మోక్షము నొందుటకు కేవల మిదియే సాధనమైయు-
న్నది. భస్మమెట్లు చేయఁబడును? దానిని ఎచ్చట
ధరింపవలయును? ఏ మంత్రముల నుచ్చరింపవల యును? దీ-
నికి తగిన వ్యక్తులెవరు? దీనికి

సంబంధించిన నియమము లెట్టివి? నిమ్న జాతికి చెందిన నాకు దయ చేసి ప్రబోధింపుడు."

దయఁగల పర మేశ్వరుడిట్లు పలికెను. "భక్తుడు మొదట శుభ ముహూర్తములో దేవతలయొక్క ప్రభావమును తెలిసికొన్న వాడై, ప్రాతః కాల సమయములో పవిత్రమైన ఆవు పేడను తీసుకొనివచ్చి, దానిని పలాసవృక్షము యొక్క ఆకునందుంచి, "త్ర్యంబకం" మున్నగు వేద మంత్రములచే దానిని సూర్యుని ఎండలో ఆరఁ బెట్టవలయును.

అప్పుడుఆతడా ఆవు పేడను ఒక అనుకూలమైన స్థలము నందుంచి, తన తెగకు సంబంధించిన గృహ్యాసూత్ర విధుల ననుసరించి ఏదోఒక అగ్నితో దానిని కాల్చవలయును. తద నంతరము "సోమాయస్వాహా" అను మంత్రముచే నేయి కలిపిన వడ్లు మఱియు నువ్వుల ద్వారా ఆహుతుల నొసంగవల యును. ఆహుతులసంఖ్య 1008 గాని దానికి 11/2 రెట్లు అధికముగాఁ గాని ఉండవలయును. నేయిని పోయు సాధనము ఒక పత్రమై యుండవలయును. దానిచే మానవుడు ఏలాటి పాప మొనర్పఁజాలడు.

తదనంతరము చిట్టచివరకు భక్తుడు పూర్ణాహుతి నొసంగునప్పుడు "త్ర్యంబక" మంత్రాదులతో స్వేష్టకృతాహుతుల నొసంగ వలయును. అదే మంత్రముతో అగ్ని యొక్క అష్టదిశలలో బలిని ప్రతిష్ఠింపలయును.

ఆ భస్మముపై గాయత్రి మంత్రముతో జలమును ప్రోక్షింపవలయును. అప్పుడాభస్మమును సువర్ణ, రజిత, తామ్ర, లేక

మట్టిపాత్రయందుంచి రుద్రమంత్రములతో మరల దానిపై నీటిని చల్లవలెను. అప్పుడుదానిని ఒక శుభ్రమైన మఱియు ఉచితమైన స్థలమునందుంచవలయును.

తదనంతరమా భక్తుడు బ్రాహ్మణులకు గొప్ప విందు నొసంగి సన్మానింపవలయును.

అప్పుడుమాత్రమే అతడు పరిశుద్ధుడగును. తదనంత రమా-భస్మమును ఆతడు పాత్రనుండి "మానస్తోక" సద్యోజాతం" ఇత్యాది పంచ బ్రహ్మమంత్రములతో తీసికొనవలయును. అప్పుడిట్లు భా-వింపవలయును. "భస్మమే అగ్ని, భస్మమే వాయువు, భస్మమే జలము, భస్మమే పృథ్వి, భస్మమే ఆకాశము, భస్మమే | దేవతలు, భస్మమే ఋషులు, ఈ విశ్వమంతయు, అస్తిత్వ మంతయు భస్మ-మే. నా సమస్త పాపములను నశింపఁ జేయు ఈ పవిత్రమైన, శుద్ధమైన భస్మమునకు నేను ప్రణమిల్లుచున్నాను."

ఇట్లు భక్తుడు "వామ దేవాయ" యని పలుకుచు ఉచిత మైన ఎడమ చేతితో కొంతభస్మమును తీసికొని "త్ర్యంబకం" ఇత్యాది మంత్రములతో జలమును ప్రోక్షించి "శుద్ధం శుద్ధేన" ఇత్యాది మంత్రములతో దానిని శుభ్ర మొనర్చవలయును. అప్పుడు దాని నాతడు బాగుగా వడపోయవలయును. తదనంతరము దానినాత-డు పంచబ్రహ్మ మంత్రములతో అపాదమస్తకము అలంకరించుకొనవలయును. అప్పుడు బొటనవ్రేలు, మధ్యవ్రేలు, చూపుడు వ్రేలుతో భస్మమును తీసుకొని "ఓ భస్మమా! నీవు అగ్ని నుండి

వచ్చి నా మస్తకము నలంకరించితి" వని పలుకుచు నొసట ధరిం-
పవలయును.

| భస్మధారణ స్థలములు | వాడవలసిన మంత్రములు |
|---|---|
| 1. నుదురు | త్ర్యంబక ఇత్యాదులు |
| 2. మెడ | నీలగ్రీవ ఇత్యాదులు |
| 3. మెడయొక్క కుడి భాగము | త్రాయుషం ఇత్యాదులు |
| 4. చెంపలు | వామ ఇత్యాదులు |
| 5. నేత్రములు | కాలాయ ఇత్యాదులు |
| 6. చెవులు | త్రిలోచనాయ ఇత్యాదులు |
| 7. ముఖము | శ్రీనవమ ఇత్యాదులు |
| 8. వక్షఃస్థలము | ప్రబ్రవమ ఇత్యాదులు |
| 9. నాభి | ఆత్మనే ఇత్యాదులు |
| 10. కుడిభుజమునకు దిగువ | నాభిఃఇత్యాదులు |
| 11. కుడిభుజము మధ్య | భవాయ ఇత్యాదులు |
| 12. వక్షస్థలమునకు కుడి వైపు | రుద్రాయ ఇత్యాదులు |
| 13. కుడి చేతికి వెనుక | శర్వాయ ఇత్యాదులు |
| 14. ఎడమభుజమునకు దిగువ | పశుపతయే ఇత్యాదులు |
| 15. ఎడమభుజమునకు మధ్య | ఉగ్రాయ ఇత్యాదులు |
| 16. ఎడమ చేతికి మధ్య | అగ్రేవధాయ ఇత్యాదులు |
| 17. ఎడమ చేతికి వెనుక | దూరేవధాయఇత్యాదులు |

| భస్మధారణ స్థలములు | వాడవలసిన మంత్రములు |
| --- | --- |
| 18. బాహుమూలములు | నమోహంత్రేఇత్యాదులు |
| 19. అన్ని భాగములు | శంకరాయ ఇత్యాదులు |

అనంతరము భక్తుడు “సోమాయ” ఇత్యాది మంత్రములతో శివునికి సాష్టాంగ ప్రణామమొనర్పవలయును. ఆతడు చేతులను కడుగుకొని, ఆ భస్మ జలమును "ఆపఃపునంతు" ఇత్యాది .. మంత్ర-ములతో త్రాగవలయును. ఆ జలమును ఏ కారణము . చేతనైనను పార వేయకూడదు.

ఈ విధముగా ఈ భస్మధారణను, ఉదయ, మధ్యాహ్న, సా-యంకాలములలో అభ్యసింపవలయును. ఇట్లొర్పనిచో ఆతడు పతితుడగును. ఇది బ్రాహ్మణులందరికి విధ్యుక్త ధర్మమై యున్న-ది. ఈ ప్రకారముగా భస్మధారణ నొనర్పకుండా అతను ఆహారమును( గాని, జలమును(గాని, ఇతర పదార్థమును(గాని స్వీ-కరింపరాదు. అకస్మాత్తుగా ఇట్లు చేయుట మరచిపోయినచో, ఆ రోజు గాయత్రిని ఉచ్చరింప రాదు. ఆ రోజు యజ్ఞము నొనర్పరాదు. దేవతలకు గాని, ఋషులకు(గాని, పితృ దేవతలకు గాని తర్పణ-మును వదల కూడదు. ఇది సమస్త పాపములను నశింప( జేసి, మోక్ష ధామమును చేర్చునట్టి శాశ్వత ధర్మమైయున్నది.

ఇది బ్రాహ్మణులకు, బ్రహ్మచారులకు, గృహస్థులకు, వాన ప్ర-స్థులకు మఱియు సన్న్యాసులకు నిత్యకృత్యమై యున్నది. దీనిని

ఒక సారియైనను మరచిపోయినచో అతడు కంఠము వరకు నీటిలో నిలబడి,



108 మార్లు గాయత్రి నుచ్చరించుచు, ఆ దినమంతయు ఉపవసింపవలయును. ఒక వేళ సన్న్యాసి ఒక రోజైనను భస్మమును ధరింపనిచో, ఆతడు దినమంతయు ఉప వసించి, మరల పవిత్రత నొందుటకై 1000 మార్లు ప్రణవమును జపింపవలయును. అట్లోనర్పనిచో దేవుడీ సన్న్యాసులను కుక్కలకు మఱియు తోడేళ్ళకు వశమొనర్చును.

ఒక వేళ ఇట్టి రకమగు భస్మము లభ్యము కాకున్నచో, ఆ సమయమునందున్న ఇతర భస్మమును మంత్రయుక్తముగా ధరింపవలయును. ఇట్టి రకమగు అభ్యాసముచే మానవుడొన ర్చిన ఏలాటి పాపమై నను నశించును.

అప్పుడు భుశుండుడు శివుని మరల ఇట్లు ప్రశ్నించెను. "వీటిని ఒనర్పనప్పుడు కలుగు పాపము నశించుటకై బ్రాహ్మ ణుడు చేయవలసిన నిత్యకర్మలేవి? అప్పుడు ఎవరిని ధ్యానింప వలయును? ఎవరిని స్మరింపవలయును? ఎట్లు ధ్యానింపవల యును? దీనిని ఎచ్చట అభ్యసింపవలయును? దయచేసి వివరించి చెప్పుడు."

కాలాగ్ని రుద్రుడు వీటన్నింటికి సూక్ష్మముగా ఇట్లు సమాధాన మొసంగెను. "మొట్ట మొదట భక్తుడు సూర్యోదయ మునకు పూర్వమే ప్రాతఃకాలము నందు లేవ వలయును. కాల కృత్యానంతరము

స్నాన మొనర్ప వలయును. రుద్ర సూక్తములతో తన శరీరమును శుభ్ర మొనర్పవలయును. అప్పుడు శుభ్రమైన వస్త్రమును ధరింపవలయును. తదనంతరమాతడు సూర్యుని స్మరించుచు,



శరీరములో విధింపబడిన భాగము లన్నింటిని భస్మముతో అలంకరింపవలయును. అప్పడాతడు తెల్లని రుద్రాక్షను ధరింపవలయును. కొందఱు ఈ క్రింది విధముగా భస్మమును ధరింతురు.

| | **స్థలములు** | **చారలు** |
|---|---|---|
| 1. | మస్తకము | 40 |
| 2. | వక్షస్థలము | 1 లేక 3 |
| 3. | చెవులు | 11 |
| 4. | మెడ | 32 |
| 5. | చేతులు | ఒక్కొక్కటి 16 |
| 6. | కంఠము | ప్రతివైపు 12 |
| 7. | బొటనవ్రేళ్ళు | ఒక్కొక్కటి 6 |

అప్పుడా భక్తులు చేతియందు కుశగ్రాసమును ధరించి, సంధ్య నొనర్పవలయును. ఆతడు "ఓం నమః శివాయ" యనెడి శివ షడక్షరమునుగాని, లేక "ఓం నమో మహాదేవాయ" యనెడి శివ

అష్టాక్షరమును(గాని జపించవలయును. ఇదియే పరమ సత్యము మఱియు మహా ప్రబోధమై యున్నది. "నేనే సమస్త లోక నియామకుడును, దేవ దేవుడును, మహా దేవుడునైన శివుడను. నేనే అవ్యక్త బ్రహ్మమును, ఓం కారమును. నేనే అందఱిని సృష్టించి,



పోషించి, లయింప(జేయు వాడను. నా భయము చేతనే సర్వులు సవ్యముగా పని చేయుచున్నారు. నేనే ఈ ప్రపంచమును మఱియు పంచ భూతములు నేనే. నేనే పరమ సత్యమును, ఉపనిషత్తులలోని బ్రహ్మమును." ఇదియే మహావిద్య యన(బడును.

నేనే మోక్ష ప్రదాతను. కావున ప్రజలందఱు సహాయార్థము నావద్దకే రావలసియుండును. ఈ కారణము చేతనే నా త్రిశూలముపై నిల(బడియున్న కాశీలో ప్రాణములను వదలిన - జీవులను నేను నాలో లయింప(జేసికొందును. కావున ప్రతి యొకడు కాశీయందే తపస్సు నొనర్పవలయును. ఏ పరిస్థితియం దైనను కాశీ పట్టణము త్యజింప(బడ రాదు. ప్రతి యొక్కడు సాధ్యమైనంత వరకు కాశీలోనే నివసించుటకు యత్నింప వలయును. కాశీకంటే శ్రేష్ఠమైన స్థలము మరియొకటి లేదు.

కాశీలో కూడా శివాలయము సుప్రసిద్ధమైనది. దానికి తూర్పుభాగమునందు ఐశ్వర్యస్థానమున్నది. దక్షిణమునందు విచార స్థానమున్నది. పశ్చిమము నందు వైరాగ్యస్థానమున్నది. ఉత్తర దిశయందు జ్ఞానమునకు స్థానమున్నది. మధ్యభాగము నందు

శాశ్వతాత్మ్రయైన నేను పూజింపఁబడ వలయును. కాశీ యందున్న లింగము సూర్యుని చేతను, చంద్రుని చేతను, నక్ష త్రముల చేత-ను ప్రకాశింపఁబడదు. ఆ స్వయం ప్రకాశమాన మగు "విశ్వేశ్వర లింగముయొక్క మూలము పాతాళము నందున్నది. అదియే నే-ను. శాస్త్రోక్తముగా పవిత్రమైన భస్మమును మఱియు రుద్రాక్షలను ధరించిన వానిచే నేను పూజింపఁ బడవలయును. నేను ఆతని యొక్క సమస్త పాపము లను, చింతలను తొలగింతును.

### *శివుడు - శివపూజ*

నాకు అభి షేకము నొనర్చినవాడు నా సాయుజ్యస్థితిని బొం-దును. నాకువినా మరియొక దానికి ఉనికి లేదు. నేను అందఱికి తారక మంత్రమును ఉపదేశింతును. ముక్తిని కోరువారు కాశీవాస మొనర్పవలయును. నేను వారిని సంరక్షింతును. నేను బ్రహ్మ, వి-ష్ణు, రుద్రులకు ప్రభువును. మిక్కిలి భ్రష్టత్వమునొందిన స్త్రీ, పురుషుడు గాని కాశీలో మరణించినచో నేను వారికి మోక్షము నొ-సంగుదును. ఇతరులగు పాపులు మరణానంతరము మండుచున్న బొగ్గులుఁగల గోతులలో వ్రేల్చఁబడుదురు. కావున ప్రాణలింగమై యున్న కాశీలో వసించుటకు ప్రతివాడు నా యత్నింపవలయును.

## త్రిపురతాపిన్యుపనిషత్

త్రిపుర తాపిన్యుపనిషద్విద్య ద్వారా తెలియఁబడు నట్టి పూర్ణ జ్ఞానమగు పరమ సత్యమును నేను స్తుతించుచున్నాను.

దేవుడు భయంకరమైన సంహార రూపమును ధరించి, భూ-ర్భువస్సువః యనెడి లోకములలో అదృశ్యుడయ్యెను. అప్పుడాతని హృదయమునుండి ఆదిశక్తి ఉద్భవించెను. ఇది శివ-మాయ యనెడి శక్తి. ఆమె "హ్రీం" అనెడి బీజాక్షర ముచే తెలియఁబడును. అప్పుడు సమస్త విశ్వము ఈ శక్తిచే నింపఁ బడె-ను. ఆమెచే త్రిపురములు కప్పి వేయఁబడుటచే ఆమె "త్రిపురా!" యని పిలువబడును.

## ***శివుడు - శివపూజ***

ఈ త్రిపురాశక్తి ఈ క్రింది వైదిక మంత్రములచే తెలియఁబడు "శ్రీవిద్య" యనెడి విద్యను కలిగియున్నది.

"తత్సవితుర్వ రేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియో యోనః ప్ర-చోదయాత్। పరోరజ సేసావదోమ్|"

జాతవేదసే సునవామ సోమమరాతీయతో నిరహాతి

వేదః|

సనః పర్షదతి దుర్గాణి విశ్వానావేవ సింధుం దురితాత్యగ్ని

త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనమ్॥

ఉర్వా రుకమివ బంధనాన్మృత్యోర్ముక్షీ యమామృతాత్।।

ఒక వంద అక్షరములుఁగల ఈ విద్య పరమ విద్యయని చె-

ప్పఁబడును. ఈమె యే స్వయముగా త్రిపురా, లేక పరమే శ్వరి యని చెప్పబడును.

పై మంత్రములలోని మొదటి నాలుగు వాక్యములు పర బ్ర-హ్మమునుఁగూర్చి స్తుతించును. రెండవ మంత్రము శక్తి యొక్క మహిమనుఁగూర్చి వర్ణించును. మూడవ మంత్రము స్వయముగా శివునిఁ గూర్చి స్తుతించును.

ఈ విద్యయందు సమస్త లోకములు, సమస్త వేదములు, సమస్త శాస్త్రములు, సమస్త పురాణములు మఱియు సమస్త ధర్మ-ములు

## *శివుడు - శివపూజ*

ఉల్లేఖింపఁబడి నవి. ఇది శివశక్తి సమైక్య సంజనితమగు ప్రకాశమై యున్నది.

ఇప్పుడీ శ్లోకములలో దాగియున్న మిక్కిలి ముఖ్యమైన అం-తరార్థమునుఁ గూర్చి విచారింతము. ఇచ్చట "తత్ " అనగా స్వయముగా శాశ్వతమైన పరబ్రహ్మమే. సమస్త నిర్వచనములకు మఱియు నానావివాదముల కతీతుడైయున్న దేవునికై ఈ చిహ్న-ము వాడఁబడును. ఈ దేవుడు స్వయముగా పరమజ్ఞానస్వరూపుడు. అనగా అతడు పూర్ణజ్ఞాన రూపము నం-దుండ గోరును. ఆతడు మాత్రమే యజ్ఞములలో ఎల్లప్పుడు యోగులు, మునులచే కోరఁ బడునట్టి మహాశివుడై యున్నాడు. కా-వుననే కోరికలు ఉత్పన్నమగును.

ఇట్లు సమస్త కోరికల కతీతుడైయున్న ఈ దేవుడు ఇంకను కో-రును. మఱియు కోరఁబడును. ఆతడు అక్షర సమామ్నాయ మగు భాషను సృష్టించును. కావున దేవుడు “కాముడు” లేక కోరిక యని చెప్పఁబడును. కాముని సూచించు అక్షరము “క”. కావున "తత్" అను శబ్దము "క" యను అక్షరమును సూచించును. ఇదియే "తత్" అను శబ్దమున కర్థము.

“సవితుః” అనునది “సుఇ ప్రణిప్రసవే” యను సంస్కృత ధా-తువు నుండి వచ్చును. సర్వజీవులను ఉత్పన్న మొనర్చు వాడని దీనికర్థము. ఆతడే మహాశక్తి. త్రిపురాయనెడి ఈ మహాశక్తి, లేక దేవి మహా కుండలి (యంత్రము) స్వరూపమునుఁ దాల్చును. ఇట్లు అగ్ని గోళమైన సూర్యుడు బుద్ధిమంతుల చేతనే తెలియఁ బడును. త్రికోణాకారముగల

## ***శివుడు - శివపూజ***

ఈ శక్తి “ఇ" యను అక్షరమును ధరించును. కావున "సవితుః" శబ్ద-ము ద్వారా "ఇ" యను అక్షరమును మనము తెలిసికొనవలసి యున్నది.

""వరేణ్యమ్" అనగా అవినాశియు, స్తుతిపాత్రమునై యున్న దానిని పూజించుట, లేక ఆరాధించుటయని అర్థము. కావున “వరే-ణ్యమ్” అను శబ్దము నుండి 'ఇ' యను అక్షరము స్వీకరింపఁ బడినదని మనము గ్రహింపవలయును. "భర్గో” మఱియు “ధీమ-హి” ఇప్పుడు వివరింపఁబడును. “ధ” యనగా ధారణ “ధీ”, లేక

బుద్ధిచే దేవుడెల్లప్పుడు ధారణ యొనర్పబడును. నాల్గవ భూమిక-ను చేరిన తర్వాత తెలియఁబడు దేవుడే 'భర్గ'. ఈతడు సర్వవ్యాపకుడగు పురుషుడు. “నేను” అనునది ఈ నాల్గవ భూమిక-ను సూచించును. మంత్రములోని పై పేర్కొనఁబడిన శబ్దములయొక్క నిజమైన అర్థమిదియే. ఇప్పుడు మనము “మహి” శబ్దముయొక్క అర్థమును గమనింతము, 'మహి' అనగా గొప్పదని-యు, నిర్వ్యాపారత్వము, బలము, హరము మున్నగు లక్షణముఁ గల పదార్థము. అనగా 'ల' యను శబ్దముచే సూచింపఁబడు పృ-థ్వి. ఇదియే పరమోన్నతమైన భూమిక. ఇట్లే లకారము సముద్రములు, అరణ్యములు, పర్వతములు మఱియు నవద్వీప-ములతో కూడిన పృథ్వియొక్క స్వరూపమును తెలుపును. కావున దేవి యొక్క రూపమైన పృథ్వియే “మహి” యను శబ్దముచే చెప్పఁ-బడినది.

ఇప్పుడు "ధియోయోనః ప్రచోదయాత్” గురించి _చర్చింత-ము. స్వయముగా అవినాశియు, శాశ్వతాత్మయునగు శివుడే శ్రేష్ఠుడని

## శివుడు - శివపూజ

చెప్పఁబడును. దీనియొక్క అంతరార్థమిది సర్వ వ్యాపించియు-న్న సర్వోత్తముడైన లకారము జ్యోతిర్లింగము, డైన శివునిఁ గూర్చి మనము ధ్యానింపవలయును. ఇచ్చట ధ్యానముఁ గూర్చిన కోరిక లేదు. ఇది ధ్యానము లన్నింటి కతీతమైనది. కావున నిర్విచారమైన నిర్వికల్ప స్థితియందు మన మనస్సులు త్రిప్పఁబడుటకై మన-ము దేవుని ప్రార్థించుచున్నాము. ఈ ప్రార్థన నోటి ద్వారా

చేయఁబడ రాదు. అది కేవలము మనస్సు ద్వారా చింతింపఁబడ-వలయును.

ఇక "పరోరజ సేసా వదోమ్" గురించి విచారింతము. పరమ సత్యస్వరూపమును గురించి ధ్యానించిన అనంతరము హృద-యమునందు పరిశుద్ధమైన ఆనందదాయకమైన జ్ఞాన ప్రకాశ మేర్పడును. ఇదియే సమస్త వాక్కు- మఱియు జ్ఞానము యొక్క సారము. ఇదియే నిజమైన శక్తి. పంచభూతములను సృష్టించుట-చే ఇది పంచాక్షరమని చెప్పఁబడును. దీనిని బుద్ధిమంతులు సవ్యముగా అర్థమొనర్చుకొనవలయును.

ఈ విద్య భక్తుని సమస్త కోరికలను తీర్చును. ముప్పది రెండ-క్షరములతో కూడిన ఈ విద్యను బాగుగా అర్థమొనర్చు కొన్న తర్వాత అవినాశియు, శుద్ధ భూమికయు, శివస్వరూ పమునగు 'హ' యను అక్షరమునుఁగూర్చి ధ్యానింపవలయును. సూర్య చంద్రు-లు లేక శివశక్తులయొక్క ఐక్యమే "హ" లేక || "హంస" యని చెప్పఁబడును. ఇది కామము యొక్క బీజము. ఈ విద్య ద్వారా మనకు పరమశివుడు తెలియఁ బడును.

## ***శివుడు - శివపూజ***

ఈ సమైక్యత జీవాత్మ పరమాత్మయందు లయించుటను కూ-డా తెలుపును. ఇట్లు 'హ' యనగా శాశ్వత భూమిక, లేక పరమపద ప్రాప్తి యగును.

ఇదియే శ్రీ విద్యయొక్క వ్యుత్పత్తి. దీనిని తెలియువాడు రు-ద్రస్వరూపుడగును. ఆతడు విష్ణులోకమును భేదించి,

పరబ్రహ్మమును పొందును.

ఇక రెండవ మంత్రమునుఁ గూర్చి చర్చింతము. ఈ మంత్రము త్రిపురాదేవియొక్క మహిమనుఁగూర్చి స్తుతించును.

"జాత శబ్దముచే శివుడు సూచింపఁబడును. ఆది యందు ఓం కారము యొక్క బిందురూపమగు "వర్ణమాతృక"ను సృష్టించిన వాడు "జాత" యనఁబడును. లేక తాను జన్మించినప్పుడు తన మొదటి కోరిక నెఱవేరుటకై కోరినందుచే ఆతడు "జాత" యని చెప్పఁబడెననియు నుడువవచ్చును. మంత్ర శాస్త్రానుసారముగా త్రిపురాదేవియొక్క జ్ఞానము జాగరూకతతో వివేచింపఁ బడపలయును. అప్పుడీ మంత్రమునుండి అన్ని రకములగు "రక్ష"లు పొందఁబడును. ప్రకాశమానుడగు పురుషుడే "జాత" యని ప్రప్రథమముగా మన మర్థమొనర్చుకొన వలయును. త్రిపురా విద్యలన్నింటికి ఇది పునాది వంటిది. "సా" యన అక్షరము శక్తిని సూచించుననియు "సోమమ్" శివత్వ మును సూచించుననియును ఇచ్చట మన మర మొనర్చుకొన వలయును. దీనిని తెలియు వారు సుప్రసిద్ధులు మఱియు ప్రాముఖ్యము కలవారగుదురు.

## *శివుడు - శివపూజ*

ఈ విద్య త్రిపురా దేవి ఎల్లప్పుడు వచించు విద్యలన్నిం టికీ మూలమై యున్నదని గ్రహింపవలయును. భక్తుడెల్లప్పుడు ఈ విద్యను అధ్యయనమొనర్చుచు, ఉచ్చరించుచుండవలయును. ఈ విద్య శివశక్తుల యొక్క స్వరూపమైయున్నది. ఈ విద్య స్వయముగా శ్రీ త్రిపురాంబయొక్క అంగముగా చెప్పఁబడును. అదే విద్య

ఉపాసింపఁబడినప్పుడు "సర్వతోభీర" యని చెప్పఁ బడును.

త్రిపురాదేవి యొక్క శ్రీవిద్య చక్రము చక్ర రాజమని చెప్పఁబడును. ఇది మానవుని సమస్త కోరికలను నెఱవేర్చును. ఇది నిరాటంకముగా అందఱి చేతను ఉపాసింపఁబడవచ్చును. ఈ చక్రము మోక్షమునకు ద్వారమువంటిది. ఈ విద్య ద్వారా యోగులు బ్రహ్మముసు భేదించి, శాశ్వతానందము నొందుదురు. ఈ చక్రము త్రిపురాదేవికి గృహమువంటిది.

ఇప్పుడు మృత్యుంజయ అనుష్టుప్ మంత్రమునుఁ గూర్చి చరితము. త్ర్యంబకం" (త్రయాణాం అంబకం) అనగా త్రిలోకాధిపతియని అర్ధము. 'త్రయాణం' మూడు లోకముల క్క "అంబకం" అధిపతి. "యజామహే" అనగా "సేవామ హే" అనగా సేవింతుమని అర్ధము. ఇంతేకాకుండా "మహే" అనగా "మృత్యుంజయ" అనగా మృత్యువును జయించినవాడని అర్ధము. కావున "యజామహే" యను శబ్ధమిచ్చట మిక్కిలి ముఖ్యమైయున్నది.

సమస్త దిశలలో కీర్తి వ్యాపించుటయే "సుగంధిం" యను శబ్ధమున కర్ధము. ఇక "పుష్టివర్ధనం" అనగా సమస్త లోకములను సృష్టించువాడు,

## ***శివుడు - శివపూజ***

సమస్త లోకములను పోషించు వాడు, సమస్త లోకములలో వ్యాపించియున్న వాడు మరియు సమస్త లోకములకు ముక్తి నొసంగువాడని అర్ధము.

"ఉర్వారుకమ"నగా దోసకాయ యని అర్ధము. "ఉర్వారు కమివ

బంధనాన్మృత్యోర్ముక్షీయ మామృతాత్" ఒక దోసకాయ ఒక త్రాటిచే కట్టఁబడినది. అదే విధముగా మానవులు మఱియు ఇతర జీవులు సంసార బంధనము నందు బంధింపఁబడి యున్నారు. ఒక దోస-కాయ తీగ నుండి విడివడునట్లు పృధ్విలోని జీవులు కూడా మాయాబంధనమునుండి విడివడి శాశ్వతా నందము నొందుదుర-ని దీని భావము.

మృత్యువును జయింపఁ గోరు మానవుడు "మృత్యుం జయా"ది మంత్రములను ఉచ్చరింపవలయును. రుద్రుడు వాడు "ఓం నమః" అను మంత్రము నుచ్చరింప వలయును. అప్పుడతడు నిశ్చయముగా దానిచే ప్రయోజనము నొందఁగలడు.

"తద్విష్ణోః పరమంపదమ్" అనెడి మరియొక మంత్ర మున్నది. విశ్వమంతయు వ్యాపించియున్న వాడు విష్ణువు. ఆకాశమువలెనున్న ఆతని మహోన్నత స్థితియే "పరమం పద-మ్" అని చెప్పఁబడును. సత్యస్వరూపమైయున్న బ్రహ్మమునుఁ గూర్చి తెలిసికొన్న విద్వాంసులు. 'సూరయః' అని చెప్పఁబడుదు-రు. ప్రతి జీవునియందును విష్ణువుయొక్క ఆ పరమపదము ఉనికిని కలిగియున్నది. "వసతి" అనగా ఉనికిని కలిగి యుండుట-యని అర్థము. కావున ఆతడు "వాసుదేవుడని



చెప్పఁబడును. "ఓం నమోభగవతే వాసు దేవాయ" యనెడి శక్తిమం-తమైన ద్వాదశాక్షరీ మంత్రమే సర్వస్వమై యున్నది. మానవుని సమస్త పాపపరిహారమునకు ఈ ద్వాదశాక్షరములు చాలును. ఈ

మంత్ర ద్రష్ట "అ-ఉ-మ" యనెడి త్ర్యక్షర స్వరూపుడగు బ్రహ్మపు-రుషుని చేరఁగలుగును.

"హంసశుచిషత్" యనెడి మరియొక శక్తివంతమగు మంత్ర-మున్నది. ఇది సూర్యుని ఉపాసించు మహామంత్రము. "గణానాంత్వా" యనెడి మరియొక మంత్రమున్నది. ఇది గణపతి యొక్క మంత్రము. శివుడు, విష్ణువు, సూర్యుడు మఱియు గణపతి-యొక్క ఈ మంత్రముల నెవ్వడుచ్చరించునో, ఆతడు త్రిపురాదేవియొక్క ప్రత్యక్ష దర్శనము నొందును.

గాయత్రియందు నాలుగు రూపములున్నవి. ప్రాతః కాలము నందామె గాయత్రియని చెప్పఁబడును. మధ్యాహ్న మునందామె సావిత్రియని చెప్పఁబడును. సాయంకాల మునందామె సరస్వతీ-యని చెప్పఁబడును. ఆమె నాల్గవ పాదము నందు న్నప్పుడెల్లప్పుడామె అజపాయని చెప్పఁబడును. ఈ దేవి .." నుం-డి "క" వరకు గల ఏబది అక్షరముల రూపము . నందున్నది. సమస్త శాస్త్రములు మఱియు ప్రపంచ మంతయు దేవి ఈ రూప-ముచే కప్పఁబడియున్నది. ఆమెకు మరల మరల ప్రణామములు.

## ***శివుడు - శివపూజ***

కావున ఈ మంత్రములతో త్రిపురాదేవిని ఉపాసించు ఏ భక్తు-డైనను సత్యద్రష్ట యగును. అప్పుడు మోక్షము నొందును. ఈ విషయము ప్రతివానిచే సవ్యముగా తెలిసికొనఁబడవలయును,

ఇప్పుడు త్రిపురా పూజ యొక్క కర్మకాండను(గూర్చి మనము విచారింతము. ఈ శక్తి, లేక ఆదిమాయ పరబ్రహ్మ మును దర్శింప(జేయును. ఆ బ్రహ్మమే పూర్ణ జ్ఞానమగుటచే పరమాత్మ యని చెప్ప(బడును. ఈ పరమపురుషుడే శ్రోత, జ్ఞాత, గ్రహీతయై సమస్త జీవులలో ఆత్మయై యున్నాడు. ఇది యే తెలియ(బడవలయును. ప్రపంచముయొక్క అస్తిత్వ- నాస్తిత్వములు(గాని, దేవునియొక్క అస్తిత్వ-నాస్తిత్వములు( గాని, పురుషునియొక్క అస్తిత్వ-నాస్తిత్వములు గాని, బ్రాహ్మణునియొక్క అస్తిత్వ-నాస్తిత్వములు గాని ఏమాత్రము లేవు. పరబ్రహ్మమనెడి నిర్మాణము ఈ విధముగా భాసించును.

ఏదో యొక దానిని(గూర్చి చింతించు మనస్సు బద్ధమని చెప్ప(బడును. దేనినైనను చింతించినప్పుడు అది "ముక్తమ"ని చెప్ప(బడును. అప్పుడు మాత్రమే బ్రహ్మము సాక్షాత్కరింప( బడును. కావున ప్రతియొక్కరు తన మనస్సును విషయచింతనా రహితముగా నొనర్పవలయును.

మనస్సు ఆలోచనా రహితమగు నంత వరకు ప్రాణము లను అదుపు నందుంచుకొనవలయును. ఇదియే శాశ్వత జ్ఞాన మన(బడును. ఇతరములన్నియు కేవలము వ్యర్థమైన పుక్కిటి పురాణములవంటివి. పరబ్రహ్మము నందు సంకల్పము మఱియు నిస్సంకల్పమునకు



భేదము లేదు. అచ్చట సమస్తము ఏకమే. అచ్చట ఆలోచించువా-

డు(గాని, ఆలోచింప(బడు పదార్థము( గాని లేదు.

ఇట్లు క్రమముగా తుట్టతుదకాభ క్తుడు తానే స్వయముగా, బ్ర-హ్మమని అర్థమొనర్చుకొని, ఆనందప్రదమగు మోక్ష పదవి నొందును.

ఇప్పుడు పరమ సత్యము వ్యక్త మొనర్ప(బడినది. మోక్షము-ను కోరువాడు(గాని, మోక్షము నొందిన వాడు(గాని, వైరాగ్యము( గాని, సాధన గాని, నాశము(గాని లేదు.

శబ్ద బ్రహ్మము, పరబ్రహ్మమనెడి రెండు విధములగు శ్రీ బ్ర-హ్మములున్నవి. శబ్ద బ్రహ్మము నధిగమించినవాడు పర బ్రహ్మము నొందును. ధాన్యములోని బియ్యపుగింజను కోరువాడు దాని పొట్టు-ను పారవేయునట్లు, గ్రంథములద్వారా జ్ఞానము నార్జించిన అనంతరము ఆ గ్రంథములను త్యజింపవలయును.

ఇట్లు పరబ్రహ్మ పదవి వర్ణింప(బడి నది. ఈ మహా విద్యను గుర్తెఱింగినవాడు ఇతరులచే పూజింప(బడును. ఇది నిస్సంశయ-ము. ఇది మహెూపనిషత్తు.

*శివుడు - శివపూజ*

# రుద్రోపనిషత్తు

ఇప్పుడు రుద్రహృదయోపనిషద్విద్య ద్వారా తెలియబడు పరిశుద్ధ పరబ్రహ్మమును నేను శరణుపొందుచున్నాను.

శ్రీ శుకుడు తన హృదయమునందు మహా దేవ రుద్రుని రూ-పమునకు సాష్టాంగముగా ప్రణమిల్లి, పవిత్రమైన భస్మమును మఱియు రుద్రాక్షలను ధరించి, తారసారమనెడి మహా వాక్యమం-త్రము నుచ్చరించుచు తన తండ్రియగు శ్రీవ్యాస మహర్షిని ఇట్లడిగెను:

దేవతల కెల్ల నిజమైన దేవుడెవరు? ఈ సమస్త పదార్థ ములు దేనియందు ప్రతిష్ఠితమై యున్నవి? ఎవరిని పూజించు టచే దేవ-తలందఱు తృప్తి నొందుదురు?

ఈ మాటలను విని శ్రీ వేద వ్యాసుల వారు ఇట్లు సమాధాన మొసంగిరి :

రుద్రుడు సమస్త దేవతాస్వరూపుడు. దేవతలందఱు స్వయ-ముగా రుద్రునియొక్క నానావిధ రూపములు. రుద్రునికి కుడి ప్రక్కన సూర్యుడు, చతుర్ముఖ బ్రహ్మ మఱియు అగ్నిత్రయము కలదు. ఎడమ వైపు ఉమాదేవి, విష్ణువు మఱియు చంద్రుడు కలరు.

ఉమ స్వయముగా విష్ణువు యొక్క రూపము. విష్ణువు స్వయ-ముగా చంద్రునియొక్క రూపము. కావున విష్ణువును ఉపాసించువారు స్వయముగా శివుని ఉపాసించువారే యగు దు-రు. శివుని పూజించు వారు నిజమునకు విష్ణువును పూజించు వారే యగుదురు. రుద్రుని పై

అసూయ పడి ద్వేషించువారు నిజమునకు విష్ణువును ద్వేషించు-వారే యగుదురు. శివుని నిందించు వారు స్వయముగా విష్ణువును నిందించువారే యగు దురు.

రుద్రుడు బీజమును సృష్టించును. విష్ణువు ఆ బీజమునకు పిండమువంటి వాడు. శివుడు స్వయముగా బ్రహ్మ మఱియు బ్రహ్మ స్వయముగా అగ్ని రుద్రుడు బ్రహ్మ మఱియు విష్ణు మయుడు. ప్ర-పంచమంతయు అగ్ని మఱియు సోమునిచే నిండి యున్నది. శివుడు పుంలింగము. భవానీ దేవి స్త్రీ లింగము. ఈ విశ్వములోని సకల చరాచర సృష్టియంతయు ఉమ మఱియు రుద్రులచే నిం-డియున్నది. వ్యక్తమే ఉమ, అవ్యక్తమే శివుడు. ఉమాశంకరుల ఐక్యమే విష్ణువు.

కావున ప్రతి యొక్కడు మహావిష్ణువుకు గొప్ప భక్తితో ప్రణామ-ము నొనర్పవలయును. అతడే ఆత్మ. అతడే పరమాత్మ అంతరాత్మ బ్రహ్మమే అంతరాత్మ. శివుడే పరమాత్మ, విష్ణువీ విశ్వ-మంతటికి శాశ్వతమైన ఆత్మ. స్వర్గ, మర్త్య, పాతాళ లోకములతో కూడిన ఈ సృష్టి యంతయు ఒక మహావృక్షము వంటిది. విష్ణువీ వృక్షమునందున్న అగ్ర శాఖలవంటి వాడు. బ్రహ్మ బోదెవంటి వా-డు. శివుడు వేరు వంటి వాడు.

ఫలితమే విష్ణువు, కర్మయే బ్రహ్మ. కారణమే శివుడు. ప్రపంచ శ్రేయస్సుకై రుద్రుడీ మూడు రూపములను ధరించును.

రుద్రుడే ధర్మము. విష్ణువే లోకము. బ్రహ్మయే జ్ఞానము. కావున

'రుద్ర, రుద్ర' యని కీర్తన చేయుము. ఈ మహా దేవుని యొక్క పవి-
త్ర నామమును కీర్తించుటచే నీ పాపములన్నియును నశించును.

### శివుడు - శివపూజ

రుద్రుడే పురుషుడు. ఉమయే స్త్రీ. ఉమా రుద్రులకు ప్రణామ-
ములు.

రుద్రుడే బ్రహ్మ, ఉమయే సరస్వతి. ఉమారుద్రులకు ప్రణా-
మములు.

రుద్రుడే విష్ణువు. ఉమయే లక్ష్మి. ఉమా ప్రణామములు.

రుద్రుడే సూర్యుడు. ఉమయే నీడ. ఉమారుద్రులకు ప్రణా-
మములు.

రుద్రుడే చంద్రుడు. ఉమ యే నక్షత్రము. ఉమారుద్రులకు
ప్రణామములు.

రుద్రుడే పగలు. ఉమయే రాత్రి. ఉమారుద్రులకు ప్రణామ-
ములు.

రుద్రుడే యజ్ఞము. ఉమయే వేది. ఉమారుద్రులకు ప్రణామ-
ములు.

రుద్రుడే అగ్ని. ఉమయే స్వాహా. ఉమారుద్రులకు ప్రణామ-
ములు.

రుద్రుడే వేదము. ఉమయే శాస్త్రము. ఉమారుద్రులకు ప్రణా-
మములు.

రుద్రుడే వృక్షము. ఉమయే లత. ఉమారుద్రులకు ప్రణామ-
ములు.

రుద్రుడే సుగంధము. ఉమయే పుష్పము. ఉమారుద్రులకు ప్రణామములు.

## శివుడు - శివపూజ

రుద్రుడే అర్థము. ఉమయే శబ్దము. ఉమారుద్రులకు ప్రణా-
మములు.

రుద్రుడే లింగము. ఉమయే పీఠము. ఉమారుద్రులకు ప్రణా-
మములు.

పైన తెలుపఁబడిన మంత్రములతో భక్తుడు ఉమా రుద్రుల-
ను పూజింపవలయును. ఓ కుమారా ! శుకా ! ఈ మంత్రములతో నీవు శాశ్వతమైన పరబ్రహ్మమును ఉపా సింపవలయును. అది ఇంద్రియములకు అగోచరమైనది. అది సచ్చిదానంద స్వరూప-
ము. అది మనస్సు చేతను మఱియు వాక్కు చేతను గ్రహింపఁబడదు. దీనిని ప్రతియొక్కటియు తర్వాత మరియొక దానిని తెలిసికొనవలసిన పని లేదు. ఏలననగా ప్రతియొక్కటియు దాని రూపమే నైయున్నది. మఱియు దానికి భిన్నముగా మరియొ-
కటి లేదు.

రెండు విద్యలు తెలిసికొనబడవలసి యున్నవి. అవియే పరా విద్య మఱియు అపరావిద్యలు. నాలుగు వేదములు మఱియు

షడంగములు కలిసి అపరావిద్య యనఁబడును. అవి ఆత్మ స్వ-రూపమును వర్ణింపవు. కాని పరావిద్య మోక్ష శాస్త్రమని చెప్పఁబడును. అది పరమ సత్యమునుఁ గూర్చిన ఉన్నతమైన వేదాంత-మును చర్చించును. ఆ పరమ సత్యము అగ్రాహ్యము అవ్యక్తము, నిర్గుణము, నిరాకారము, అశ్రోత్రము, అచక్షువు, అపాణిపాదము, శాశ్వతము, సర్వ వ్యాపకము, అవినాశము మఱియు బుద్ధిమంతు-లును, సాహసులునగు సత్పురుషులచే మాత్రము. తెలియఁబడునదై యున్నది.

## *శివుడు - శివపూజ*

పరమ జ్ఞానమార్గ రూపము నందు ఘోరమైన తపస్సు నొన-ర్చెడి శివునినుండి ఈ సమస్త ప్రపంచము సృష్టింపబడును. అది మర్త్యులకు ఆహారము వంటిది. ఈ ప్రపంచమే మాయ. అదియొక స్వప్నమువలె కానఁబడును. త్రాటియందు పాము వలె దేవుని యందారోపింపఁబడినది. ఇది శాశ్వత సత్యము. నిజమునకు సృ-ష్టియనునది లేదు. అంతయు పరిపూర్ణము. అంతయు పరమసత్యము. దీనిని తెలిసికొన్న వెంటనే మానవుడు ముక్తి నొం-దును.

జ్ఞానము చేత మాత్రమే నీవీ సత్తాను గుర్తెఱుంగఁగలు గుదువు. కాని కర్మ చేత కాదు. దీనిని బ్రహ్మనిష్ఠుడును, శ్రోత్రి యుడునగు గురువు యొక్క మార్గ దర్శకత్వముచే తెలిసికొనుము. గురువు శి-ష్యునికి పూర్తి బ్రహ్మజ్ఞానము నుపదేశించును. అజ్ఞానము, లేక అవిద్యాబంధమును తెగద్రుంచి మానవుడు సదాశివుని శరణు పొందవలయును. సత్యాన్వేషకుడగు సాధకుడు గ్రహింపవలసిన

నిజమైన జ్ఞానమిదియేనై యున్నది.

ప్రణవమే విల్లు. ఆత్మయే బాణము. పరబ్రహ్మమే లక్ష్యము. బాణమువలె ఆత్మ బ్రహ్మమునందైక్యమగును.

కాని విల్లు, బాణము మఱియు లక్ష్యము ఆ సదా శివునికి భిన్నమై లేవు. అచ్చట సూర్య, చంద్ర, నక్షత్రములు ప్రకాశింపవు. వాయువు వీయదు, అచ్చట అనేక దేవతలుండరు. ఆ ఏకైక దేవుడు మాత్రమే ఉనికిని కలిగి యుండును పవిత్రాతి పవిత్రుడైన ఆతడు మాత్రమే ఎల్లప్పుడు ప్రకాశించుచుండును.

## *శివుడు - శివపూజ*

ఈ శరీరమునందు జీవుడు మరియు పరమాత్మయనెడి రెండు పక్షులున్నవి. జీవుడు తన కర్మఫలములను భుజించును. కాని పరమాత్ముడు దేనిచేతను అంటుబడడు. అతడు కేవలము సాక్షి మాత్రుడు మఱియు నిష్క్రియుడు. ఒక కుండలోని ఆకారము కుండ యొక్క రూపమును ధరించి, బాహ్యమైన ఆకారమునకు భిన్నముగా కానఁబడునట్లు, అతడు తన మాయాశక్తిచే జీవుని రూపమును ధరించును. నిజమునకు అంతయు శివము, అద్వైతము, పూర్ణము, భేద మేమాత్రమున్నూ లేదు.

సమస్తము పూర్ణము, ఏకైకము, ఓంకారమయమని గ్రహించినప్పుడు చింతఁగాని, మాయగాని ఉండదు. అప్పుడు అద్వైత పరమానంద ప్రాప్తి మిక్కిలి సులభమగును. నీవీ విశ్వ మంతటికి మూలాధారమనియు, ఏకైక కేవల సచ్చిదనుడవని యును తలంపుము. జనులఁదరు ఈ సత్యమును గుర్తెఱుగఁ జాలరు. మాయా

విరహితులు మాత్రమే ఈ రహస్యమునర్థ మొనర్చు కొనఁగలుగు-దురు. దీనిని గుర్తెరింగిన అనంతరము ఆత్మ ఏ సమమునందైనను, ఏ స్థలమునకుఁగాని చలింపదు. మటాకాశము పరమాకాశము నందైక్యమగునట్లు, అది పూర్ణత్వముతో ఏకత్వము-నొందును. ఆకాశము ఎచ్చటికినీ కదలనట్లు, ఈ యాత్మకు ఏలాటి చలనము లేదు. అది ఓంకారముతో తాదాత్మ్యమునొందు-ను.

## శివుడు - శివపూజ

ఈ పరమ రహస్యమైన సత్యమును గుర్తెఱింగినవాడే నిజమైన ముని యనఁబడును, అతడు స్వయముగా పరబ్రహ్మ రూపము నొందును. అతడు సచ్చిదానంద స్వరూపుడగును. అతడు - శా-శ్వత శాంతినిఁబడయును.

# 11వ అధ్యాయము

## శైవాచార్యులు

## అప్పర్, లేక తిరునవుకరసర్

## I

నలుగురు తమిళ్ సమయాచార్యులలో అప్పర్ ఒకడు. ఆతడు సంబంధర్కు సమకాలికుడు. అతడు తమిళనాడులోని కడలూరు జిల్లాలో ఒక వెల్లాలుడు, లేక తిరు అమూరైయుండెను. ఆతడు పుగలేనర్ మరియు మధినియార్కు జన్మించెను. తల్లి దండ్రులు అప్పర్కు మరుల్నీక్కియర్ (అంధకారము లేక అజ్ఞానమును పోగొట్టువాడు) అను. 'నామకరణము - నొసంగిరి అప్పర్ అనగా తండ్రియని అర్థము. సంబంధర్ మరుల్నీక్కియర్కు ఈ నామము నొసంగెను. అనేక సమావేశములలో కలిసికొ-

న్నప్పుడు ఒకప్పుడు సంబంధర్ ఆతనిని, అప్పర్ అని సంబోధించెను. అప్పర్ యొక్క ప్రేరణాత్మకములును పవిత్రము లునగు గేయ గీతికలచే అతనికి తిరునవు కరసర్ (వాగేశుడు) అనెడి బిరుదు ఒసంగఁబడెను. అతడు దైవప్రేరితుడైన జీవుడు. అతడనేక మందిరములను దర్శించినప్పుడు భక్తి పూరితములగు పద్యములను పాడెను, సప్తమ శతాబ్ధి మధ్యమందాతడు ప్రఖ్యాతిని వహించెను. అతడొక రహస్యకవియై యుండెను.

తిలక వదియర్ అప్పర్క పెద్దక్క, ఆమె పల్లవరాజు మిలిటరీ సేనాధిపతిగానున్న కప్పహయ్యర్ను వివాహ మాడుటకు వాగ్దత్త మొనర్పఁబడెను. ఉత్తరదేశమునుండి దండెత్తి వచ్చిన ఒక యోధునితో



కలిప్పహయ్యర్ పోరాడవలసివచ్చెను. ఆతడు రణరంగమునందు మరణించెను. తిలక వదియర్ యొక్క తల్లిదండ్రులు కూడా మరణించిరి. కలిస్పహయ్యర్ యొక్క మరణ వార్త తిలకవదియర్ చెవులలో పడెను. ఆమె అగ్ని గుండములో పడి మరణించుటకు నిశ్చయించుకొనెను. మరుల్ నిక్కియర్కు తన అక్కగారి మనోనిశ్చయము తెలిసెను. ఆతడు తన అక్క వద్దకి పరుగెత్తుకొనివచ్చి, ఆమెకు ప్రణమిల్లి ఇట్లు పలికెను "మన తల్లి దండ్రుల మరణాంతరము మీయొక్క ఆధారము పైననే నేను జీవించియున్నాను. మీరు ప్రాణత్యాగ మొనర్పఁదలంచినచో, అంతకు పూర్వమే నేను నా ప్రాణమును త్యజింతును." తిలక్ వదియర్ యొక్క హృదయము ద్రవించెను. ఆమె తన నిశ్చ యమును మార్చుకొని, తాపసిక

జీవితమును గడుపుచు | నిస్సహాయుడైన తన తమ్ముని పోషించుటకై ప్రతిజ్ఞనొనర్చెను.

అప్పర్ జైన మతమును చేపట్టెను. అతడు సమస్త జైన శాస్త్రములను అధ్యయన మొనర్చెను. అతడు జైన శాస్త్ర ట, పాటలీపుత్రమునందే ఆధ్యాత్మిక అధినేతల యందొకడయ్యెను.

తన సోదరుడు జైనమతమును చేపట్టినందుకు అపర్ అక్క గారు హృదయ క్లేశమునొందెను, ఆమె తన స్వగ్రామమును వదలి, దాపుననున్న పట్టణమగు తిరుఅతి కైకి వెళ్ళెను. ఆమె శివాలయమునందు ధ్యాన ప్రార్థనాదులతో తన కాలమును గడిపెను. తన తమ్ముడు తిరిగి వచ్చుటకై ఆమె దేవుని ప్రార్ధించెను.

## *శివుడు - శివపూజ*

అప్పర్ తీవ్రమైన కడుపునొప్పికి గుఱియయ్యెను. అతడు తన జైనమత దుస్తులను మఱియు గిన్నెను పారవైచి, తన అక్కగారి వద్దకి వెళ్ళెను. ఆమె అప్పర్ నొసట పవిత్రమైన భస్మమును అలది, ఆతనిని శివాలయమునకు తీసుకొని వెళ్ళి దేవునికి సాష్టాంగ పరిణామమొనర్చి పూజించుమని అతనితో పలికెను. అప్పర్ అట్లే యొనర్చెను వెంటనే తీవ్రమైన కడుపునొప్పి మాయమయ్యెను అతడు శివుని మిక్కిలి స్తుతించెను.

అప్పర్ పారిపోయిన విషయమును పాటలీపుత్రములోని జైన మత నాయకుడు జైన రాజైన “కాదవ”కు విన్నవించెను. కడలూర్ జిల్లా పల్లవరాజైన కాదవ యొక్క పాలన యందుండెను. అప్పర్ను

పీడించుమని జైన మతనాయకుడు రాజును పురికొల్పెను.

అప్పర్ పల్లవ పట్టణమున కేగి రాజు ఎదుట నిలబడెను. అప్పర్ నానా విధములుగా హింసింపఁబడెను. అతడు మండు చున్న బట్టీలో త్రోయఁబడెను. విషయుక్తమగు పాలను త్రాగుటకు ' నిర్బంధింపఁబడెను. అతనిని చంపుటకై ఒక ఏనుగు విడువఁ బడె-ను. ఒక బరువైన రాయి ఆతని మెడకు కట్టబడి, అతడు సముద్రమునందు త్రోయఁబడెను, దేవుడు అతనిని రక్షించెను. ఆతడు ప్రాణముతో తేలివచ్చి, తిరుప్పటిరుపులియూర్ ఒడ్డుకు చేరెను.

పల్లవ రాజు అప్పర్ యొక్క మహిమను గుర్తెఱింగి ఆతని పా-దములకు సాష్టాంగముగా ప్రణమిల్లెను. అతడు జైన మతమును

## శివుడు - శివపూజ

వదలి శైవమతమును చేపట్టెను. అతడు తిరునాధికై వద్ద "గుణా-ధారవిచారం" అనెడి ఒక పెద్ద శివాలయమును నిర్మించెను.

అనంతరము అప్పర్ అనేక పుణ్యస్థలములను సేవించుటకై యాత్రకు బయలు దేరెను. అతడుచిదంబరం, శి యా లిమున్నగు స్థలములను దర్శించి అచ్చట శివస్తుతియగు తేవారమును పాడె-ను.

అప్పర్ తింగలూర్ లో అప్పూది అడిగల్ అను మహాపురు ముని దర్శించెను. ఒక నాగుబాము చే కరువఁబడిన అప్పూది కు-

మారుని అప్పర్ బ్రతికించెను.

అటు పిమ్మట అప్పర్ తిరువనై నల్లూర్, తిరువమాధురు తి-రు కోయిలూరు, తిరు పెన్న కాటం వంటి పుణ్య స్థలములను దర్శించి శివుని పూజించెను. తుట్టతుద కాతడు తిరుతుంగనాయి మఠమును చేరి, శివునితో ఇట్లు ప్రార్థించెను. "ఓశివశంకరా! ఓ అర్థ-నారీశ్వరా ! ఓ సర్వజీవుల అద్యంతములకు హేతువైన వాడా! జైన స్పర్శను పొందినట్టి ఈ శరీరమును ధరించుటకు నాకు ఇష్టము లేదు, నా శరీరము పై నీ త్రిశూలము మరియు నంది యొక్క ము-ద్ర వేయఁబడునుఁగాక !" ఆతడొక పద్యమును పాడెను. వెంటనే శివగణమునందొకడు అప్పర్ను సమీపించి, శివుని అనుగ్రహముచే అప్పరు యొక్క భుజము పై త్రిశూలము మఱియు నంది యొక్క ముద్రను వేసెను.

అప్పుడు అప్పర్ సంబంధర్ను కలసి కొనుటకై శియా లికి వె-ళ్ళెను. అతడు సంబంధర్ యొక్క పాదముల పైఁబడెను.

### *శివుడు - శివపూజ*

"ఓ నా ప్రియమైన అప్పర్" అని సంబంధర్ వల్లాల మహాపు-రుషుని సంబోధించెను.

ఒకప్పుడు అప్పర్ను కలిసికొనుటకై సంబంధర్ తజాజ్ వూర్ జిల్లాలోని తిరుప్పంతిరూటికి పల్లకీ పై వెళ్లెను. అప్పర్ ముందుగా వెళ్ళి ఆ పల్లకీని మోసెను. "అప్పర్ ఎక్కడ?" అని సంబంధర్ అడిగెను "ఇచ్చట నేను పల్లకీని మోయుచున్నాన"ని అప్పర్ బదులు పలికెను, సంబంధర్ వెంటనే పల్లకీ నుండి దిగి, అప్ప-

ర్న ఆలింగన మొనర్చుకొని, ప్రేమ బాష్పములను రాళ్చెను.

అప్పర్ తిరుచ్చట్టిముత్రంకు వెళ్ళెను. అతడొక పద్యమును పాడి ఇట్లు పలికెను. "ఓదేవా! ఈ భౌతిక శరీరమును వదలుటకు పూర్వము నీ పాదపద్మమును నా తల పైయుంచుము. "తిరున-ల్లూర్కు రమ్ము" అనెడి ఆకాశ వాణిని అతడు వినెను. అప్పర్ అదే విధముగా తిరునల్లూర్కు వెళ్ళెను. శివుడు అప్పర్ తలపై తన పా-దమునుంచెను. అప్పర్ భూమి పై సాష్టాంగముగా ప్రణమిల్లెను. అతని హృదయము అవర్ణ నీయమగు ఆనందముతో నిండిపోయె-ను.

అప్పుడు అప్పరు తిరవంభర్, తిరుకడవూరు, మిలాలైకి వె-ళ్ళెను. మిలాలైలో గొప్ప కాటకము సంభవించెను శివభక్తులు వుండుటచే అప్పర్ మఱియు సంబంధర్ మిక్కిలి హృదయ క్లేశ-మునొందిరి. శివుడు వారిద్దరికి స్వప్నము నందు కానఁబడి ఇట్లు పలికెను. 'మీరు బాధపడకుడు, నేను మీకు బంగారు నాణెముల నొసంగుదును" వారికి

## శివుడు - శివపూజ

ప్రతిదినము దేవాలయము నందు బంగారు నాణెములు కానఁబ-డెను. వారు ప్రజలకు పుష్కలంగా భోజనము నొసఁగిరి.

తంజావూరు జిల్లాలోని వేదారణ్యమునందున్న ఆలయము-ను అప్పర్ మఱియు సంబంధర్ సందర్శించిరి. ఇచ్చట పురాతనమైన ఒక శివాలయము చాలా కాలము నుండి తలుపులు

మూయఁబడియుండెను వేదములు స్వయముగా వచ్చి ఆలయ-
ము లోని శివుని పూజించెను. కాని జైన మత ప్రభావముచే ప్రజలు
వేదాధ్యయనమును మానుకొన్న కారణముచే పూజించుటకై వేద-
ములిప్పుడు దేవాలయమునకు వచ్చుట మానుకొనెను.
సంబంధర్ అప్పర్ తో ఇట్లననెను. "రమ్ము. ఈ ద్వారములు తెఱు-
వఁబడునట్లు పాడుము" అప్పర్ పాడగా ఆ ద్వారములు
తెఱువఁబడెను. సంబంధర్ పాడగా ద్వారములు మూసికొనెను.

ఒకప్పుడు యాత్రా సమయములో అప్పర్ మిక్కిలి ఆకలిఁ గొ-
నియుండెను. దారియందు శివుడు ఒక చెఱువును మఱియు
తోటను నిర్మించి అతనికి ఆహారము నొసంగెను.

అప్పర్ మౌంట్ కైలాస్ను దర్శించుటకై బయలు దేరెను.
అతడలసిపోయెను. అతని పాదములు పొక్కి

పోయెను. అతనికి ఆకాశమునందొక శబ్దము వినఁబడెను. అది
శివుని ధ్వనియైయుండెను. అది ఏమనగా : "ఓ అప్పర్ ! మేల్కొను-
ము. ఈ చెఱువులో స్నానమొనర్చుము. నీవు తిరు వయ్యారులోనే
సన్ను మఱియు కైలాస శిఖరమునుఁగాంతువు" అప్పర్ చెఱువులో



స్నానమొనర్చి, కావేరీ తీరమునందున్న తిరువయ్యార్ దేవాల-
యమునకు వెళ్ళెను. అతడు చెఱువు నుండి బయటికి రాగానే
సర్వత్ర అతడు శివుడు మఱియు ఆతని శక్తినిఁ గాంచెను. అతడు
ఆలయమునందు ప్రవేశించి, కైలాస శిఖరమును మఱియు కైలా-
సశిఖరమునందున్న శివునిఁగాంచెను. ఈయద్భుతమైన

దృశ్యమును( గాంచి అప్పర్ హృదయానంద మునొంది, పద్యములను పాడెను.

తుట్టతుదకు అప్పర్ తిరువల్లూర్ సమీపమునందున్న పంపుకలర్ నందుండి తన జీవిత శేషమును గడిపెను. అతని గొప్పదనమును ప్రజలకు చాటి చెప్పుటకై దేవుడాతనిని పరీక్షించెను. అతడు దేవాలయములో సేవ చేయుచున్నప్పుడతని పాముల బంగారము మఱియు రత్నములు కాన(బడెను. | అప్పర్ వాటిని రాళ్ళుగా భావించి పారవేసెను. మరియొక సమయములో దేవకన్యలు అతని ఎదుట కాన(బడి, నానా విధ ములుగా మోహింప(జేసిరి. కాని అప్పర్ తన ధ్యాననిష్ఠయందు చంచలుడైయుండెను. అతడు తన వృద్ధావస్థయందు జ్యోత లకు జ్యోతియైన శివునియందైక్యమయ్యెను.

## *శివుడు - శివపూజ*

## II

అప్పర్ తన పద్యముల ద్వారా శైవ సిద్ధాంత దర్శనమునకు పునాది వేసెను. అప్పర్ యొక్క పద్యములు ఊహాశక్తిని, ఆధ్యాత్మిక తేజస్సును, ధార్మిక ప్రేరణాశక్తిని కలిగి ఆత్మ సాక్షాత్కారద్యోతకము

లై యుండును.

సంబంధర్ కంటే అప్పర్ మహావిద్వాంసుడు. అతడు మిక్కి-లి శక్తి వంతమగు వ్యక్తిత్వము కలవాడైయుండెను. అతడు అదర్శవంతమైన శివభక్తుని జీవితమును గడిపెను. జైన మత ప్ర-భావమునాతడు నశింపఁజేసెను. అతడెల్లప్పుడు పంచాక్షర మును స్తుతించెను. అతడిట్లు పలికెను. 'షడంగములతో కూడిన వేదము బ్రాహ్మణులకు మాణిక్యమువంటిది. అదే విధముగా శైవు-లకు పంచాక్షరము మాణిక్యము వంటిది" అతని ఆదర్శ జీవితము, మధురమైన కవిత్వము. మహా పాండిత్యము మఱియు గాఢమగు ధార్మిక నిష్ఠచే అసంఖ్యాక ప్రజలు ఆకర్షింపఁబడిరి, అతనికి అసంఖ్యాకులగు అనుయాయులు మఱియు శిష్యులుం-డిరి. అతడు గొప్ప ప్రతిభావంతుడు. అప్పర్ యొక్క మూడువందల పద్యములుగల మూడుపుస్తకములు 'తిరుమురై' యన పేరుతో సుప్రసిద్ధములై యున్నవి. ఇవి పంద్రెండు తమిళ శైవ పద్యాత్మక గ్రంధములలో ప్రముఖ స్థానమును వహించును.

అప్పర్ నును 'సమస్తము శివుని స్వరూపమే. శివుడే నారాయ-ణుడు, బ్రహ్మ, చతుర్వేదములు, పవిత్రాతిపవిత్రము'. పురాతనము, పూర్ణమునైయున్నాడు. ఇవన్నియును శివుడై యు-న్నను, శివుడు

## శివుడు - శివపూజ

వీటియందేదియును కాడు. ఆతడు జనన మరణరహితుడు, వ్యా-ధిరహితుడు మరియు నామ రహితుడు అతడు సర్వాతీతుడు

మఱియు సర్వవ్యాపకుడునై యున్నాడు."

"శివుని ప్రేమను అనుభవించి వ్యక్త మొనర్చుకొనవల యును. పాడుము, ప్రార్థించుము, పూజించుము. విలసింపుము నృత్యమొనర్చుము, శివుడే పాటలోని శ్రావ్యమైన సంగీతము, ఫలములోని తీయదనము, మనస్సులోని ఆలోచన మఱియు నేత్రములోని ప్రకాశమైయున్నాడు. అతడు స్త్రీగాని, పురుషుడుగాని కాడు. అతడు పరిమాణరహితుడు"

ఇంద్రియములనరికట్టుము. సక్రమ ధ్యానమునభ్య సించుము చర్య, క్రియ, యోగము మరియు జ్ఞానము నభ్యసించుము. క్రమము తప్పక ధ్యానము చేయుము. వైరాగ్య మును పెంపొందించుకొనుము, దేహత్రయము నతిక్రమించుము. జీవాత్మను పరమాత్మ, లేక శివునితో తాదాత్మ్యమునొందించుము నీవు శాశ్వతానందమును మరియు అమృతత్వము నొందుదువు. నీ శరీరమనెడి గృహమునందు, ధ్యానమనెడి నేయితో, జీవిత మనెడి వత్తితో, మనస్సనెడి అగ్గిపుల్లతో జ్ఞానమనెడి దీపమును వెలుగింతువేని నీవు శివుని దర్శింపగలుగుదువు"

"సత్యమనెడి నాగలితో దున్నుము, జ్ఞాన వాంఛయనెడి బీజమును నాటుము. అప్పుడు పనులనెడి కలుపు మొక్కలను తీసి వేయుము. ఓర్పనెడి జలముతో మనస్సనెడి భూమిని సాగు చేయుము. లోచూపు, అంతఃశోధనలచే నీవొనర్చు కార్యమును తణికీ చేయుము. యమ,

నియమములచే కంచె వేయుము. నీవు శీఘ్రముగా శాశ్వతమగు శి-వానందము నొందుదువు."

"నీ శరీరమును శివాలయముగాను, నీ మనస్సు పూజారి గాను, సత్యమును పూజకు ఉపకరించు పవిత్రతగాను, మానసిక రత్న-మును లింగము గాను, ప్రేమను నేయి మరియు పాలు మున్నగు పూజాద్రవ్యములుగాను భావించుము. ఇట్లు శివపూజ నొనర్చుము. మానసిక ఏకాగ్రత మఱియు పంచాక్షర ధ్యానము వినా-శివుడు లభ్యము కానేరడు."

అప్పర్ యొక్క నీతి సూత్రములను మరియు ప్రబోధముము మీరు అనుసరించి, అమరమైన శాశ్వతానంద పదవియుగు శివప-దమును(బడయుదురు(గాక !

## తిరుజ్ఞాన సంబంధర్

తంజావూర్ జిల్లాలో బ్రహ్మపురి యను మారు పేరు(గల శి-యాలి యను గ్రామములోని బ్రాహ్మణ కుటుంబములో సంబంధర్ జన్మించెను. భగవతి మరియు శివపాద హృదయు లకాతడు జన్మించెను.

భగవతి మరియు శివపాద హృదయుడు స్నానమొన ర్చుటకై ఒక చెఱువుకు వెళ్ళిరి. బాలుడు కూడా తల్లిదండ్రులను అనుస-రించెను. వారా బాలుని ఒడ్డుపై విడిచి, స్నానము చేయసాగిరి. ఆ బాలునికి

తల్లిదండ్రులు కానరాకుండుటచే "ఓ తండ్రీ! యని బిగ్గరగా అఱిచెను. తల్లి దండ్రులాబాలుని ఏడ్పుని వినలేదు కాని శివపార్వతులు ఆ ఏడ్పును వినిరి. వారిద్దరు ఈ బాలుని ఎదుట కానఁబడిరి. పార్వతి ఆ బాలునికి పాల నొసంగెను. పాలతోపాటు ఆ బాలుడు దివ్యజ్ఞానమనెడి పాలను కూడా పానమొనర్చెను. ఆ క్షణము నుండి అనేక దేవాలయములలో అతడు శివస్తుతులను పాడనారంభించెను. పవిత్రమైన, ప్రేరణాత్మకములగు తేవారములను అతడు పాడెను. మూడు సంవత్సరముల వయస్సుఁగల బాలునికి ఈ సంఘటన సంభవించెను.

తల్లిదండ్రులు తమ స్నానమును ముగించుకొని బాలుని సమీపించిరి. అతని నోటినుండి పాలుపొంగివచ్చెను మరియు బాలుని నేత్రముల నుండి కన్నీరు కారెను. "ఓ ముద్దుబిడ్డా! నీకు ఎవరు పాలిచ్చిరి?" అని తల్లిదండ్రులడిగిరి. ఆ బాలుడొక పద్యమును పాడి, తల్లి దండ్రులకు సమస్తమును వివరించెను. తల్లిదండ్రులు మిక్కిలి సంతోషించి, శివపార్వతుల అనుగ్రహముచే దివ్యజ్ఞానమును పొందిన వాడగుటచే ఆ బాలునికి "తిరుజ్ఞాన సంబంధర్" అను నామకరణము నొసంగిరి. అతనికి "పిల్లయార్" అను మరియొక నామము కూడా ఉండెను.

అటు పిమ్మట సంబంధర్ తిరుక్కొలక్కకు బయలు దేరెను, అతడు దేవాలయమునందొక పాటను పాడెను. శివుడాతనికి వాయించెడు బంగారు తాళములనొసంగెను.

తిరుఎరుక్కట్టం పులియూర్ ఒక శివభక్తుడుండెనుయాల్ అనెడి వాద్యపరికరమును అతడు నేర్పుతో వాయించు . తిరునీల-కంఠయాల్ పనార్ అని అతనికి పేరు అతడు సంబంధార్ను సన్మానించుటకై శియాలికి వెళ్ళాను సంబంధర్ అతనిని శివాల-యమునకు తీసుకొనివెళ్ళి, ఆతని సంగీతమును వినెను, యాల్ పనార్ సంబంధర్ తో ఇట్లు విన్న వించుకొనెను. "నేను మీ పాటల-కు యాల్ను వాయించుచు ఎల్లప్పుడు మీ వద్దనే ఉందునుగాక! నా ఈ విన్నపమును అంగీకరించుడు" సంబంధర్ అందుకు సమ్మ-తించెను. అటు పిమ్మట సంబంధర్ ఆతని తల్లిదండ్రులు మరియు యాల్పనార్ చిదంబరమునకు వెళ్ళి, నటరాజును పూ-జించిరి. ఒక రోజు సంబంధర్ చిదంబరములోని మూడువేల బ్రాహ్మణులను మూడువేల శివ గణములుగాఁగాంచెను.

సంబంధర్ అరత్తురైలోని దేవుని పూజింపఁదలంచెను. ఆత-డు పాదములతో నడచివెళ్ళాను. అలసిపోయిన కారణముచే ఆతడు మార్గమధ్యములో రాత్రియందు మరంపడిలో విశ్రమించె-ను. చిన్న బాలుడగుటచే, దీర్ఘమైన నడక కారణముచే ఆతని మృదువైన పాదములు కందిపోయెను. అరత్తురై దేవుడు పూజా-రుల స్వప్నములో కానఁబడి ఇట్లు పలికెను. “సంబంధర్ నా దర్శనమునకై వచ్చుచున్నాడు. ఆలయము నందున్న ముత్యాల గొడుగును మఱియు ముత్యాలపల్లకీని తీసుకొని వెళ్ళి అతనికి ఇచ్చి రండి” పూజారులు మేల్కొని మందిరమునకు వెళ్ళిరి. వారు తమ స్వప్నములో చూచిన

పదార్థములను అచ్చుటఁగాంచిరి వారు మరంపడికి వాటిని తీసు-కొని వెళ్ళి, సంబంధర్కు ఇచ్చిరి. దేవుని ఆజ్ఞనుఁ గూర్చి వారు సంబంధర్కు తెలిపి ఈ విషయమై దేవుడు సంబంధర్ కూడా కల-లో తెలిపి యుండుటచే, ఆతని సంశయము దూరమయ్యెను.

అటు పిమ్మట సంబంధర్ యొక్క యజ్ఞోపవీత సంస్కారము ఁబడెను. సంబంధర్ వేదములను మఱియు వేదాంగములను అధ్యయన మొనర్పకున్నను, అతడు వాటిని ఉచ్చరించి, వాటి యొక్క అర్థమును పూజారులకు వివరించి చెప్పెను. పూజారులు ఆశ్చర్యచకితులైరి.

అప్పర్ సంబంధర్ యొక్క కీర్తినిఁగూర్చి వినెను. ఆతడు సం-బంధర్ను సన్మానించుటకై చిదంబరము నుండి శియాలికి వచ్చెను. సంబంధర్ ముందు కేగి అప్పర్కు స్వాగతమిచ్చెను. వా-రిద్దఱును ప్రేమ, వాత్సల్యములతో పరస్పరము మాట్లాడు కొనిరి. అప్పర్ సంబంధర్ ఇంటిలో కొన్ని రోజులుండెను.

మలయా దేశపురాజు యొక్క కూతురు ఒక తీవ్రమైన వ్యాధిచే బాధపడుచుండెను. రాజు అన్ని రకములగు ఔషధము లనొసంగె-ను. తుట్టతుదకు ఆతడామెను తిరుప్పక్కిల్ అక్కిరామమ్ అను దేవాలయమునకు తీసుకొని వెళ్ళి అచ్చుట దేవుని ఎదుట వదలి పెట్టెను. సంబంధర్ ఆ దేవాలయమును దర్శించినప్పుడు, అచ్చుట యువరాణి మూర్ఛపడియుండుట చూచెను.

అతని హృదయము ద్రవించెను. అతడొక పద్యమును పాడి శివుని పూజించెను. ప్రతి పద్యములోని చివరి పాదము యొక్క మకుటము ఈ క్రింది అర్థము నొసంగున దైయుండెను. "ఈ యమ్మాయిని బాధ పెట్టుట దేవుడవైన నీకు తగునా?" వెంటనే యువరాణికి స్వాస్థ్యము చేకూరెను ఆమె లేచి సంబంధర్ యొక్క పాదపద్మములకు ప్రణమిల్లెను

అప్పుడు సంబంధర్ తిరుప్పత్తీశ్వరం దేవాలయమునకు బయలుదేరెను. ఆ రోజు మిక్కిలి వేడిగానుండెను. సూర్యుని వేడి-ని తొలగించుటకై తిరుప్పత్తీశ్వరం దేవాలయములోని శివుడు తన గణములద్వారా ఒక ముత్యాల పల్లకీ పంపెను.

సంబంధర్ ఒక పాటను పాడి అవదుత్తురై దేవునినుండి ఒక వేయి బంగారు నాణెములను పొందెను. ఆ పాటలోని ప్రతి ముకు-టము యొక్క అర్థమిట్లుండెను "నీవు నన్ను కాపాడు పద్ధతి ఇదియేనా? నీవు నాకేమియు ఇవ్వకున్నచో. అది నీ కారుణ్యమా?" అతడా బంగారు నాణెములను తన తండ్రి కిచ్చెను.

సంబంధర్ తిరుమురుగల్ కు బయలు దేరెను అచ్చట ఒక యాత్రికునికి పాము కాటు వేసెను. అతని భార్య తన భర్త యొక్క మరణమును(గూర్చి ప్రలపించుచుండెను. సంబంధర్ ఒక పాట-పాడెను. ఆ యాత్రికుడు పునర్జీవితుడయ్యెను.

తిరువిలిమిలాలలో గొప్ప కాటకము సంభవించెను. బందర్

నాణెములను పొందుచుండెను. ఈ ధనముతో అతడు సామగ్రిని- కొని, శివ భక్తులకు భోజనమొసంగెను,

పాండ్య రాజు యొక్క మంత్రియగు కులక్కిరై సంబంధరు తన స్థలమునకాహ్వానించెను. అతడొక శివభక్తుడై యుండెను . రా- ణియగు మంగయార్క్కర్సి కూడా శివభక్తురాలై యుండెను. సంబంధర్ మధురైకి వెళ్ళి అచ్చట దేవుని పూజించెను.

సంబంధర్ యొక్క విడిదికి జైనులు నిప్పు ముట్టించిరి. సం- బంధర్ ఒకపాటపాడెను, అగ్ని చల్లారిపోయెను. కాని పాండ్య రాజుకు తీవ్రమైన జ్వరమేర్పడెను . డాక్టర్లుఁగాని, జైనులుఁగాని ఆ వ్యాధిని నివారింపలేకపోయిరి. చికిత్స చేయుమని రాజు సంబం- ధర్ను బ్రతిమా లెను. సంబంధర్ పవిత్రమైన భస్మమును స్తుతించుచు పాటనుపాడి దానిని రాజుయొక్క శరీరముపై రుద్దెను. వెంటనే రాజు స్వస్థుడయ్యెను.

అటు పిమ్మట జైనులు మఱియు సంబంధర్ తమ తమ గ్రం- థములను అగ్నియందుంచినప్పుడు, ఎవరి మతగ్రంథమును అగ్ని దహింపదో, ఆ మతము శ్రేష్ఠమను నిశ్చయమునకు వారు వచ్చిరి. సంబంధర్ ఈ యగ్ని పరీక్షయందు విజయమునొందెను.

తదనంతరము మరియొక పరీక్ష చేయఁబడెను. నిజమైన

గ్రంథము వైగైనది యొక్క ప్రవాహమునకెదురుగా వెళ్ళవలయున-ని జైనులు పలికిరి, మంత్రి "ఈ పరీక్షలో ఓడి పోయిన వారికి ఏ శిక్షను విధింపవలయున"ని అడిగెను. "ఓడి పోయిన వారికి ఉరిశి-క్షను విధింపవలయున"ని జైనులు పలికిరి. జైనులు తమ తాళపత్రమును

## *శివుడు - శివపూజ*

నదియందుంచిరి. అది నదీప్రవాహ ముతోపాటు వెళ్ళిపోయెను. సంబంధర్ ఒక పాటను వ్రాసి, దానిని వైగై నదియందు పడవేసె-ను. అది ప్రవాహమున కెదు రుగా వెళ్ళి తిరువేదంగం అను స్థలమును చేరెను. ఆ తాళపత్రము నిలిచిపోవునట్లు సంబంధర్ ఒక పాటను పాడెను. అది నిలిచి పోయెను. మంత్రి పరుగెత్తి వెళ్ళి, ఆ పత్రమును తీసుకొని రాజుకు చూపించెను.

అప్పుడు కొందరు జైనులు ఉరితీయబడిరి. శేషించిన వారు శైవ మతమును చేపట్టిరి. సంబంధర్ రాజు మరియు రాణితో మధురై దేవాలయమునకు వెళ్ళి, దేవుని స్తుతించెను.

సంబంధర్ తిరుకొల్లంపుదూర్ దేవుని దర్శింపగోరెను. కాని నది పొంగిపోవుచుండెను. నావవాడు నదిని దాటుటకు నిరాకరిం-చెను. అతడు నావను ఒక చోట కటి వేసి నదీతీరమును వదలి వెళ్ళెను. సంబంధర్ ఆ బోటులో పాటను పాడుచు, తన సహచరు-లతో కలిసి అవతలి ఒడ్డుకు చేరెను.

సంబంధర్ యొక్క భక్తులు పయనించుచు తమ విజయ మునుగూర్చి బాకా వాయించిరి. దీనిచే బౌద్ధులు అసూయ నొంది-

రి. వారు ఈ విషయమును గూర్చి తమ నాయకుడైన బుద్ధానందికి విన్నవించిరి. బుద్ధానంది తర్కమునకై సంబంధను పిలిచెను.

తన గురువు గారి పాటలన్నింటిని ప్రోగుచేయుచున్న సంబంధర్ శిష్యుడగు సంబంధర్ రానలయర్ తన గురువుగారి పాటను పాడి ఇట్లు పలికెను. "ఈ బుద్ధానంది యొక్క తలపై ఒక పిడుగుపడనున్న ది."

## *శివుడు - శివపూజ*

వెంటనే బుద్ధానంది యొక్క తలపై పిడుగుపడెను. అతడు వెంటనే మరణించెను. కొందరు భక్తులు పరుగెత్తి పారిపోయిరి. మరికొందఱు శైవ మతమును చేపట్టి తమ నొసట భస్మమును ధరించిరి.

తదనంతరము సంబంధర్ తిరువొట్టూర్ను దర్శించెను. ఒక మనుజుడు సంబంధర్ వద్దకి వచ్చి ఇట్లుపలి కెను, "ఓస్వామీ! చెట్ల బీజములన్నియును మొగతాటి చెట్లయ్యెను. జనులందరు నన్ను ఎగతాళిచేయుచున్నారు, దయచేసి నన్ను ఆశీర్వదించుడు" సంబంధర్ ఒక పాటను పాడెను. మొగతాటి చెట్లన్నియు తాటిచెట్లుగా మారిపోయెను.

మైలాపూర్ శివనేశ శెట్టియార్ అనెడి ఒక శివభక్తు డుండెను. తపశ్చర్యానంతరము అతనికి ఒక కూతురు కలిగెను. అతడామెకు పుంపావైయని పేరుపెట్టెను. శివనేశుడు సంబంధర్ యొక్క కీర్తిని విని. తన ఐశ్వర్యమును మరియు కూతురును ఆ మహాపురుషునికి సమర్పించెను. ఒక రోజు పుంపావై తోటలో పుష్పములను కోయు-

చుండగా, ఒక త్రాచుపాము ఆమెను కరిచెను. ఆమె వెంటనే మరణించెను. శివనేశుడు ఆమె యొక్క ఎముకలను ఒక కుండయందుంచి, ఆ కుండను, కన్నికై మఠమునందుంచెను. అతడా కుండను ఒక సిల్కుగుడ్డతో అలంకరించెను. శివనేశుడు సంబంధర్ను ఆ స్థలమున కాహ్వానించెను. సంబంధర్ మైలాపూర్కు వచ్చి, కపిలేశ్వరుని దర్శించెను. శివనేశుని కూతురు యొక్క మరణమును(గూర్చి భక్తులు సంబంధర్ కు తెలిపిరి. తన కూతురు యొక్క ఎముకలు( గల కుండను తీసుకొని రమ్మని సంబంధర్



శివనేశుని అడిగెను. వెంటనే శివనేశుడు ఆ కుండను తీసుకొనివచ్చెను. సంబంధర్ ఒక పాటను పాడెను. లక్ష్మీదేవి ఒక పద్మము నుండి ఉద్భవించినట్లు, పుంపావై ఆ కుండనుండి బయటికివచ్చెను. శివనేశుని హృదయము ఆనందసంభరితమయ్యెను. దేవలోకము నుండి పుష్పవర్షము కురిసెను. అప్పుడు సంబంధర్ శియాలీకి వెళ్ళెను.

బ్రాహ్మణులు సంబంధర్ ను సమీపించి ఇట్లు పలికిరి. "ఓ స్వామి ! వేదవిహితములగు యజ్ఞముల నొనర్చుటకై మీరిప్పుడు ఒక అమ్మాయిని వివాహమాడవలసియున్నది. సంబంధర్ అందులకంగీకరించెను. బ్రాహ్మణులు మఱియు సంబంధర్ యొక్క తండ్రి నంబందర్ నంబి యొక్క కూతురును వధువుగా నిశ్చయించిరి. నల్లూర్ పెరుమానంలో వివాహ మహోత్సవము ఏర్పాటు చేయ(బడెను. సంబంధర్ తనకు నిర్ణీతమైన వధువుతో సహా దేవాలయములోనికేగెను. అతడు దేవుని సమీపించునప్పు-

డు తాను, తన వధువు మఱియు తన అనుచరులు కలిసి దేవుని జ్యోతియందైక్యమైరి.

సంబంధర్ ఒకానొక పాటయందిట్లునుడివెను. "ఓ బుద్ధి హీ-నుడా! దినములను వెళ్ళబుచ్చకుము, నీలకంఠుడైన శివుని సేవించుము. అతని మహిమను శ్రవణమొనర్చుము. అతని రూప-మును ధ్యానించుము. ఎల్లప్పుడు పంచాక్షరమును ఉచ్చరించుము. శివభక్తుల సాంగత్యమునందుండుము. వారిని సేవించుము, ఆతని నామస్మరణచే నీ పై, నీ సంతానముపై సంభ-వింపనున్న అపాయములు మఱియు



దుష్కర్మలు నివారింపఁ బడును. శివుని పూజించుము. అతడు నీ-కు శాశ్వతానందమును మఱియు అమృతత్వమును ప్రసాదించును"

# సుందరమూర్తి

తమిళనాడులోని నవలూర్ లో సదయనార్ అను పేరుగల బ్రాహ్మణుడుండెను. అతడు పవిత్రుడు మరియు శివభక్తుడై యుండెను. అతనికి నంబియరూరర్, లేక అలాలసుందరుడనెడి ఒక దైవభక్తిగల కుమారుడుండెను. ఆతడు యౌవనవంతు డయ్యె-ను ఆతడు సుందరమూర్తి నాయనార్ అని కూడా

పిలువఁబడుచుండెను.

సుందరమూర్తి నాయనార్ ఒక గొప్ప శివభక్తుడైయుండెను. తడు నలుగురు శైవాచార్యులలో ఒకడు. అతని వివాహమునకు ముందు రాత్రి తిరువెన్నై నల్లూర్లోని శివుడు ఒక వృద్ధ బ్రాహ్మణుని రూపమునందు సుందరమూర్తి ఎదుట కానఁబడెను. సుందరర్ తనకు ఒడంబడిక చేసుకొన్న దాసుడగుటచే, అతడు తన ఇంటి-లో చాకిరీ చేయవలయునని శివుడు పలికెను. ఆ దేవుని పేరు దడుత్తట్కొండ ఈశ్వరుడు. అతడే సుందరుడు. సంసార బంధ-ములో పడిపోకుండా ఆటంకము కలిగించి రక్షించిన ఈశ్వరుడు.

సుందరమూర్తి అనేక దేవాలయములను దర్శించెను. ఆత-డు అడిగైవిరట్టనంకు వెళ్ళను. శివుడాతని ఎదుట ప్రత్యక్షమై, తన



పవిత్రమైన పాదములను అతని తలపై నుంచెను. అనంతరము సుందరర్ తిరువారూర్ కు వెళ్ళను. శివుడు సుందరర్ను తనకు స్నేహితునిగా నొనర్చుకొనెను.

కైలాస శిఖరములో ఉమాదేవికి కమలినియనెడి ఒక పరిచా-రిక యుండెను. ఆమె యొక్క మనస్సులో అలాలసుందరుని వివాహమాడుటకు కోరిక జనించెను. కావున భూలోకము నందున్న తిరువారూర్లో ఆమె జన్మింపవలసివచ్చెను. ఆమె పరవై పేరుతో పి-లువఁబడుచుండెను. ఆమె యుక్తవయస్కురాలయ్యెను. తిరువారూర్లోని శివుడు భక్తులయొక్క స్వప్నమునందు కానఁ బడి ఇట్లు పలికెను. "పరవై మఱియు సుందరమూర్తి యొక్క వివాహ-

మునకై ఏర్పాటుచేయుడు." శివుడు పరవై మఱియు సుందరర్కు కూడా ఈ విషయమును తెలిపెను. సుందరర్ | పాణిగ్రహణమొనర్చి, ఉభయులున్నూ సంతోషముతో, కాలము గడుపుచుండిరి.

తిరువారూర్ లో ఒక కాటకము సంభవించెను. శివుడు సుందరమూర్తికి ప్రత్యక్షమై, ఆతనికి ధాన్యరాసులనొసంగెను. ఈ గొప్ప ధాన్యరాశిని తొలగించుట అసాధ్యమయ్యెను. సుందరమూర్తి సహాయము చేయుమని శివుని కోరెను. ధాన్యము శివగణముల ద్వారా పరవై ఇంటికిఁగొంపోఁబడెను.

సుందరర్ తిరుప్పుగలూర్ నందున్నప్పుడు అతడు తన భార్య కొరకు సువర్ణమునడిగెను. అతడు తన తలను ఇటుకలపై పెట్టి పరుండెను. అతడు లేచి చూడగా, ఆ ఇటికలు సువర్ణముగా



మారిపోయెను. అతడు వృద్ధాచలమునకు వెళ్ళునప్పుడు మరల సువర్ణమును పొందెను. దేవుని ఆజ్ఞానుసారముగా అతడా సువర్ణమును మణియుక్త యనెడి నదియందు పడవేసెను. అతడు మరల తిరువారూర్లోని చెఱువులో దానిని తీసుకొనెను. శివుడాతనికి తిరుక్కుడలైయ్యరూరు వెళ్ళు దారిని చూపించెను.

సుందరర్ తిరుక్కురుకవూర్కు వెళ్ళుచుండగా శివుడాతనికి ఆహారము నొసంగెను. మరియొక సందర్భములో శివుడు సుందరర్ కొఱకై ఆహారమును భిక్షమెత్తెను.

సుందర మూర్తి తిరువట్టియూర్కు వెళ్ళెను. శివుని అనుగ్రహము అతడు ఒక గొప్ప శివభక్తురాలైన సంగిలిని వివాహమాడెను.

కైలాసశిఖరములోని ఉమాదేవియొక్క పరిచారిక యగు అంది సంగిలియను పేరుతో జన్మించెను.

సంగిలిని విడువనని ప్రమాణము చేయునప్పుడు మగిలి చెట్టు క్రింద నివసింపుమని సుందరమూర్తి శివుని ప్రార్థించెను. సంగిలి దేవాలయములోనికి వెళ్ళవలయునని సుందరర్ కోరెను కాని శివుడు "నేను చెట్టు క్రింద ఉన్నాను. దేవాలయములో లేన"ని సంగిలికి ఇతఃపూర్వమే చెప్పియుండెను. కావున సంగిలి ప్రమాణము చేయుటకై దేవాలయమునకు కాదు, చెట్టు వద్దకి రమ్మని సుందమూర్తిని అడిగెను. సుందరమూర్తి సంగిలియొక్క విన్నపమును అంగీకరించెను. తదనంతరము ఆతడు సంగిలిని విడిచి తిరువారూర్ ఉత్సవమును

## శివుడు - శివపూజ

చూచుటకు వెళ్ళి ప్రమాణ భంగ మొనర్చుటచే, ఆతడు గ్రుడ్డివాడయ్యెను.

సుందరమూర్తి దేవునితో ఇట్లు పలికెను. "నీవు నన్ను గ్రుడ్డివానిగా చేయుట న్యాయమైనచో, దయచేసి నాకొక కణ్ణినొసంగుము" తిరువెంపక్కంలో శివుడాతనికి కణ్ణినొసంగెను. సుందరర్ కంచికి వచ్చినప్పుడు అతని ఎడమ కన్ను బాగుపడెను, తిరువారూర్లో శివుని స్తుతించినప్పుడు అతని కుడి కన్ను కూడా బాగుపడెను.

తిరుప్పులియూర్ లో సుందరమూర్తి ఒక వీధిగుండా వెళుళ్ళన-

ప్పుడు ప్రజలు ఒక ఇంటిలో ఏడ్చుటను, దానికి ఎదురుగానున్న ఇంటిలోనివారు వేడుక చేసుకొనుటనుఁగాంచెను. "ఆ రెండు ఇండ్లలోఁగల విశేషమేమి?"యని అతడువారినడిగెను. వాట్లు పలికిరి. "ఐదు సంవత్సరముల వయసుఁగల ఇద్ధఱు బాలురు ఒక చెఱువులో స్నానము చేయుచుండిరి. ఒక బాలుని ఒక మొసలి మ్రింగి వేసెను. రెండవ బాలుడు తప్పించుకొనెను. మొసలి మ్రింగిన బాలుని తల్లిదంద్రులు మిక్కిలి దుఃఖించు చున్నారు. మొసలి నుండి తప్పించుకొన్న బాలుని తల్లిదంద్రు లాతని యజ్ఞోపవీత సంస్కారమును చేయుచుండుటచే వారు ఆనందించుచున్నారు."

సుందరర్ యొక్క హృదయము ద్రవించెను. అతడు "శివ-అవినాశి" యను స్తోత్రమును పాడెను. యముని ఆజ్ఞచే మొసలి ఆ బాలుని చెఱువు గట్టునకు తీసుకొనివచ్చెను. ఆ బాలుని తల్లిదంద్రులు మిక్కిలి సంతుష్టులై సుందరర్కు సాష్టాంగ ప్రణామమొనర్చిరి.

## శివుడు - శివపూజ

యాత్రాసమయములో సుందరర్ కావేరీ తీరమునకు వచ్చెను. నదిలో వరదయుండెను. అతడు తిరువాయూర్ శివుని దర్శింపగోరెను. అతడొక పాటను పాడెను. సుందరన్కు నది దారి యొసంగెను. అతడు తిరువాయూరన్ను చేరి శివుని పూజించెను.

తిరు పెరుమంగళంలో కాలికామర్ యనెడి ఒక గొప్ప శివభక్తుడుండెను. అతడు పిళ్ళైవంశములో జన్మించెను. సుందరర్

పరవైకి దూతగా శివుని పంపెనని విని అతడిట్లనెను. "ఒక భక్తుడు ఒక కార్యమునొనర్చుటకై శివుని ఆజ్ఞాపించెను. అతడు దేవుని తనకు సేవకునిగా చేసికొనెను. అది కూడా ఒక ఆడదాని గుఱించి ఇట్లు పవర్తించిన మానవుడు భక్తుడగునా? నేను మహాపాపిని. ఇట్టి వార్తను విన్న నేను నా ప్రాణమును ఇంకను కోల్పోలేదు. ఇట్టి వంచకుడగు భక్తుని వార్తను విన్న నా చెవులను నేను ఇనుప పట్టకారుతో పెరికి వేయలేదు."

కాలికామర్ నాయనార్ యొక్క పరిస్థితి సుందరర్కు అర్థమయ్యెను. తాను చేసినది గొప్ప తప్పిదమను విషయము అతనికి తెలియును. తన్ను క్షమించుమని అతడు దేవుని ప్రార్థించెను. శివుడు ఈ యిద్దఱు భక్తులను ఐక్య మొనర్పగోరెను. అతడు కాలికామర్కు ఉదరశూలయనెడి వ్యాధిని కల్పించి, అతని స్వప్నమునందు కానఁబడి ఇట్లు పలికెను. "ఈ వ్యాధి కేవలము సుందరర్ చేత మాత్రమే నయమగును". కాలికామర్ ఇ తలంచెను. "సుందరర్ చేతచికిత్సపొందుటకంటే ఈ వ్యాధియొక్క బాధను అనుభవించుటయే

## ***శివుడు - శివపూజ***

శ్రేష్ఠము." దేవుడు సుందరరు జ్ఞాపించెను. "నీవు వెళ్ళి కాలికామర్ యొక్క వ్యాధిని నయము చేయుము."

సుందరర్ తాను వచ్చుచున్నట్లు కాలికామర్కు వర్త మానమునంపెను. కాలికామర్ ఇట్లాలోచించెను, "సుందరర్ నాకు చికిత్స చేయుటకు రాక పూర్వమే నేను నా ప్రాణమును త్యజింతు-

నుఁగాక!" అతడు తన పేగులను కోసివేసి, తన జీవితమును త్య-జించెను. కాలికామర్ యొక్క భార్య సుందరర్కు గొప్ప మర్యాదతో స్వాగతమొసంగెను.

సుందరర్ కాలిమర్ యొక్క భార్యతో ఇట్లు పలికెను. "నేను నీ భర్త యొక్క వ్యాధిని నయము చేసి, ఆతని కొంత కాలము జీవిం-పఁదలంచితిని." ఆమె ఏమియు పలుకక, తన భర్తకు ఏలాటి వ్యాధియు లేదనియు, ఆతడు నిద్రించుచున్నాడనియును చె-ప్పుమని తన చుట్టునున్న వారితో పలికెను. కాలికాపుర్ను చూచుటకు తీవ్రమైన కోరికయున్నదని సుందరర్ అచ్చటి ప్రజ-లతో పలికెను. అప్పుడు వారు కాలికామర్ను చూపించిరి. సుందరర్ కాలికామర్ యొక్క మృతకళేబరమునుఁ గాంచెను. అతడు కూడా ఖడ్గముతో తన్ను తాను చంపుకొనఁగోరెను. శివుని అనుగ్రహముచే కాలికామర్ పునర్జీవితుడయ్యెను. అతడు వెంటనే సుందరర్ యొక్క చేతులను పట్టుకొనెను. సుందరర్ కాలికామర్ యొక్క పాదముల పైఁబడెను. కాలికామర్ కూడా సుందరర్ యొక్క పాదపద్మములకు ప్రణామమొనర్చెను, వారిరువురు పరస్పరము ఆలింగన



మొనర్చుకొనిరి. వారిద్దరు శివాలయము నకేగి ఆతనిని పూజించిరి. తదనంతరము వారు తిరువారూర్కు వెళ్ళిరి.

తన్ను విడచి పెట్టి సంగిలిని వివాహమాడినందుకు పరవై సుందరర్ పై మిక్కిలి కోపోద్రిక్తురాలయ్యెను. పరవైని ఓదార్చుమ-

ని సుందరర్ శివుని అర్థించెను. శివుడు పరవై ఇంటికి రెండు మార్లు వెళ్ళి, ఆమెను ఓదార్చి, వారిద్దతిని ఐక్యమొనర్చెను. దేవుడు తన భక్తుని కొఱకు ఒక దూతగా పనిచేసెను. తన విశ్వసనీయులగు భక్తులకు దేవుడు పూర్తిగా సేవకుడగును.

ఈ ప్రాపంచిక జీవితముచే సుందరమూర్తికి మిక్కిలి విసుగు జనించెను. తనను కైలాసమునకు తిరిగి తీసుకొని వెళ్ళుమని ఆతడు శివుని పార్థించెను. అప్పుడు శివుడు ఆతని | కొరకు ఒక తెల్లని ఏనుగును పంపెను.

సుందరమూర్తి వివిధములగు పుణ్యస్థలములలో స్తుతించుచు పాడెను. ఈ పాటలు "తేవారమ్" అని చెప్పఁబడును. అవి యొక గ్రంథరూపమునందు కూర్పఁబడెను. ఇప్పటికిని భక్తు లందరు ఈ తేవారమును పాడుదురు. సుందరమూర్తి, అప్పర్, లేక తిరునవుకరసర్ మఱియు తిరుజ్ఞాన సంబంధర్ కలిసి పాడిన పాటలు "తేవారం" అని చెప్పఁబడును. మాణిక్యవాచకర్ పాడిన పాటలు "తిరువాచకమ్" అని చెప్పఁబడును.

సుందరమూర్తి శివునితో సఖ్యభావమును కలిగియుండెను. కావున ఆతడు దేవునితో మిక్కిలి స్నేహితముగా నుండి స్వతంత్రముగా తనకు



కావలసినట్టి బంగారము, ముత్యాల హారము, కస్తూరి, విలువైన రత్నహారము, కండ్లజోడు, దుస్తులు, ధూపము, మణులు, వాయువేగముతో పరుగెత్తు గుఱ్ఱములు, బంగారు పుష్పములు, పల్లకీలు,

తిరువారూర్కు వచ్చు ఐశ్వర్యములో మూడవవంతు మున్నగువా-
టినడిగెను. తనకు సుఖభోగములు కావలయునను కోరికతో
అతడు వీటినడుగ లేదు. అతనికి స్వార్థపూరితమగు కోరికలు లే-
కుండెను. అతడు వాటిని తన వద్ధ ఉంచుకొనలేదు. తనపై
ఆధారపడియున్న వారికై ఆతడు వాటిని వినియోగించెను.

భక్తి యందు సఖామార్గమును, లేక సఖ్య భావమును గూర్చి
సుందరమూర్తి ప్రపంచమునకు ఉపదేశించెను.

## మాణిక్య వాచకర్

మాణిక్యవాచకర్ పుట్టుకతో బ్రాహ్మణుడైయుండెను . అతడు
మధురైకి ఏడుమైళ్ళ దూరమునందు వైగై నదీతీరమునందున్న
తిరువడవూర్లో జన్మించెను. అతడు క్రీ.శ.650 మఱియు క్రీ.శ.692ల
మధ్య నివసించియుండవచ్చును. ఆతడు పదియన, లేక పదునొ-
కండవ శతాబ్దిలో వర్ధిల్లెనని మరికొందఱందురు. అతడు మధురై
రాజగు అరిమర్ధనపాండ్యన్" యొక్క స్నేహమును పొంది అతనికి



ముఖ్యమంత్రియయ్యెను. అతడు వడవురర్ అని కూడా పిలువఁ-
బడుచుండెను.

తన రాజ్యమునకు గుఱ్ఱములను కొనితెమ్మని పెద్ద మొత్త-మునిచ్చి పాండ్యరాజు మాణిక్యవాచకర్ను పంపెను. మాణిక్యవాచకర్ బయలుదేరి వెళ్ళెను. దారియందాతడు తిరు పెందురైలోని ఒక తోటలో శివుని కీర్తనను వినెను. శివుడు స్వయ-ముగా శివయోగిరూపమును ధరించి, ఒక చెట్టుక్రింద శివగణములనే శిష్యులనుగా చేసుకొని కూర్చొనియుండెను. _మా-ణిక్యవాచకర్ కు శివజ్ఞానోపదేశము నొసంగుటకై ఆతడిచ్చటికి వచ్చి యుండెను.

మాణిక్యవాచకర్, దేవుని పాదములపైపడి అతని శరణు పొం-దెను. శివుడు మాణిక్యవాచకర్కు శివజ్ఞాన రహస్యముల నుపదేశించెను. దేవాలయనిర్మాణ మఱియు భక్తులకు భోజన మొసంగుట కై మాణిక్యవాచకర్ ధనమంతటిని వినియోగించెను. అతడు సమస్తమును పరిత్యజించి, కౌపీనమును ధరించి, సన్న్యా-సియయ్యెను. ఈ విషయము రాజుకు సూచింపఁబడెను.

రాజు మాణిక్యవాచకర్కు ఒక ఉత్తరమునంపి, తనను వెంటనే చూడుమని ఆజ్ఞనొసంగెను. కాని మాణిక్యవాచకర్ పెడ చెవినిఁబె-ట్టెను. శివుడు మాణిక్యవాచకర్ తో ఇట్లు పలికెను "నేను గుఱ్ఱములను అవనిమూలంరోజు తీసుకొనివచ్చెదను. నీవు ముం-దుగా వెళ్ళుము, ఈ రత్నమును రాజుగారికివ్వుము." మాణిక్యవాచకర్ మధురైకి బయలుదేరి, రాజుకు రత్నము నొసంగి ఇట్లు పలికెను "గుఱ్ఱములు

అవనిమూలంరోజు ఇచ్చుటికి వచ్చును." రాజుకు ఓపిక లేకుండెను, అవనిమూలంకు రెండు రోజులు ముందుగా కూడా గుర్రములను గూర్చిన సమాచార మాతనికి తెలియకుండెను. మాణిక్యవాచకర్ తనను మోసగిం చెనని ఆతడు తలంచెను. కావున అతడు మాణి-క్య వాచకర్ను కారాగారమునందుంచి, అతనిని మిక్కిలి బాధింపసాగెను.

అవని మూలంరోజు ఉదయము గుర్రములు వచ్చెను. శివుడు నరుని రూపమును ధరించివచ్చెను. దేవుడు తన భక్తుల కరుణఁగ-లవాడో చూడుడు! రాజుమిక్కిలి సంతృప్తుడయ్యెను. అతడు మాణిక్యవాచకరు కారాగారము నుండి విడిపించి, తనను క్షమిం-చుమని కోరెను. దేవుని యొక్క లీలననుసరించి నక్కలు గుఱ్ఱముల రూపమును ధరించివచ్చెను. గుఱ్ఱములన్నియును నక్కలుగా మారిపోయెను. రాజు మిక్కిలి కోపోద్రిక్తుడయ్యెను. అత-డు మరల మాణిక్యవాచకరు బాధించెను. వైగై నదిలోని వేడియైన ఇసుకతిన్నెలో మధ్యాహ్నము. 12 గంటలకు ఆతడు మాణిక్యవాచ-కర్ను నిలఁబెట్టెను. వెంటనే తన భక్తుని పాదములు చల్లఁబడుటకై దేవుడు నదిని పొంగింపం జేసెను. పట్టణమంత-యు వెల్లువలో మునిగిపోయెను.

ఒక గొప్ప మహాత్ముని బాధించిన కారణముచే ఈ కష్టము సం-భవించినదని మంత్రులు రాజునకు విన్నవించిరి. రాజు వెంటనే మాణిక్యవాచకర్ను బంధవిముక్తునిఁగావించెను. అతడు మాణిక్య-వాచకరు సాష్టాంగముగా ప్రణమిల్లి, వెల్లువను అపుమని అర్థించెను. మాణిక్యవాచకర్ నదీతీరమునకు వెళ్ళిన వెంటనే వె-ల్లువ ఆగిపోయెను. నదీతీరమునందు ఒక్కొక్క తట్టతో మట్టిని

రాజు ప్రజలందరిని ఆజ్ఞాపించెను. వందియనెడి ముసలి స్త్రీకి ఒసంగఁబడిన పగులుతప్ప తక్కిన పగుళ్ళన్నియును చేయఁబడెను. ఆమె దుఃఖమునందుండెను. శివుడు దయం|| గలవాడై స్వయముగా ఆ ముసలి స్త్రీ ఎదుట ఒక కూలివాని రూపమునందు కానఁబడి, ఒక పిడికెడు బియ్యపు పిండిని తీసుకొని సేవ యొనర్చెను. అతడు కేవలము ఆడుచుండెను. అతడు మట్టిని తన చేతులయందుంచుకొనెను. వందియొక్క కూలివాడు ఏమియు పనిచేయలేదను విషయము రాజుకు తెలిసెను. ఆతడు మిక్కిలి కోపముగలవాడై కఱ్ఱతో అతనిని మోదెను. ఆ దెబ్బ రాజుతోపాటు ఆ పట్టణములోని ప్రజలందఱికి తగిలెను. ఆ కూలివాడు అదృశ్యుడయ్యెను, ఇది శివుని లీలయని రాజు తెలిసికొనెను. అతడు మాణిక్యవాచకర్ యొక్క మహిమను కూడా తెలిసికొనెను.

అటు పిమ్మట మాణిక్యవాచకర్ శివుని కలిసికొనెను. ప్రస్తుత యాత్రాస్థలములను దర్శించిన అనంతరము చిదంబర మునకు వెళ్ళుమని దేవుడు అతనిని ఆజ్ఞాపించెను. మాణిక్యవాచకర్ తిరువణ్ణామలై, కంచి ఇతర స్థలములను దర్శించి తిరువాచకరు పాడి, చివరికి చిదంబరమునకు వెళ్ళెను. ఇచ్చట అతడు "తిరుకూవై"ని రచించెను.

అనంతరము మాణిక్యవాచకర్ ఒక బౌద్ధాచార్యునితో వాదించి, అతనిని ఓడించెను. సరస్వతీదేవి బౌద్ధాచార్యుని మఱియు

అతని శిష్యులను మూగవారిగా ఒనర్చెను. అప్పుడు శ్రీ నాగురువు-
ను మఱియు

## *శివుడు - శివపూజ*

అతని శిష్యులందరిని మూగవారిగా బౌద్ధరాజు మాణిక్యవాచకర్ను సమీపించి ఇట్లు పలికెను. "నీవు నొనర్చితివి. ఒక వేళ నీవు మూగ-రాలైన నా కూతురును మాట్లాడనను వేని, నేను మరియు నా ప్రజలందరము శైవమతమును చేపట్టుదుము. అప్పుడు మాణిక్య-వాచకర్ రాజు యొక్క కూతురును కొన్ని ప్రశ్నలనడిగెను. ఆమె మాట్లాడుట ప్రారంభించెను. అప్పుడు బౌద్ధరాజు మరియు ప్రజ-లందరును శెవులైరి. అటు పిమ్మట మాణిక్యవాచకర్ బౌద్ధాచార్యుని మఱియు ఆతని శిష్యులను మాట్లాడునట్లొనర్చెను.

అప్పుడు శివుడు మాణిక్యవాచకర్ కు ఒక బ్రాహ్మణుని రూప-మునందు కానఁబడెను. మాణిక్యవాచకర్ తిరువాచకము నంతటిని బ్రాహ్మణునికి వినిపించెను. ఆ బ్రాహ్మణుడు దానినంత టిని తాళ-పత్రములపై వాసి, అంత్యమునందిట్లు వ్రాసెను, "మాణిక్యవాచకర్ దీనినుచ్చరించెను. తిరు చిత్తంబల అడయార్ దీనిని వ్రాసెను. "బ్రాహ్మణుడీగ్రంథమును చిత్సభయొక్కపంచా క్షరసోపానమునందుంచెను. అప్పుడు చిదంబరములోని బ్రాహ్మ ణులు దీనిని మాణిక్యవాచకర్కు చూపించి, ఆ శ్లోకములలోని అర్థ-మును తెలుపుమనికోరిరి. "ఈతిల్లై నటరాజే ఈ శ్లోకముల లోని ముఖ్యార్థమ"ని మాణిక్యవాచకర్ పలికెను. అతడు వెంటనే ముప్ప-ది రెండు సం॥ల వయస్సులో నటరాజు యొక్క పాదముల యందు లీనమయ్యెను.

మాణిక్యవాచకర్ ఏబది రెండు పద్యములను రచించెను. అవి యన్నియును "తిరువాచకం" అను పేరుతో కూర్పఁబడినవి అవి మిక్కిలి రమ్యములు, పవిత్రములు మఱియు ప్రేరణదాయక



ములునైయున్నవి. దానియందు శృంగారకవిత్వమున దాక్షిణాత్యులు తిరువాచక మును ప్రతిరోజు పఠింతురు. ఈపద్య ములను విన్న వారి హృదయములు వెంటనే ద్రవించును.

ఓ ప్రియమైన పాఠకులారా! శివుడు తన భక్తులకు బానిసయగునను విషయమును మీరు మాణిక్యవాచకర్ యొక్క జీవితము ద్వారా నేర్చుకొనవచ్చును.

## తిరు మూలర్

మిక్కిలి ప్రామాణికములగు శైవ సిద్ధాంత గ్రంథముల యందొకటియగు “తిరుమందిరము”ను తిరుమూలనాయనార్ రచించెను.

అతడొక గొప్ప శివయోగియైయుండెను. అతడు శివుని ద్వారపాలకుడగు నందియొక్క అనుగ్రహమునుఁబడసెను. ఆతడు | కైలాసము నుండి దక్షిణ హిందూదేశమునకు వచ్చెను. దక్షిణదేశములోని పొదియ పర్వతములయందున్న అగస్త్య ఋషిని దర్శించుట కానికి మిక్కిలి కోరిక యుండెను. అతడు కేదార్ నాథ్,

నేపాల్, అవిముక్తము, వింధ్య, కాశి, కాళహస్తి, తిరువలంగాడు, కం-చి, తిరువడిగై, చిదంబరము మరియు రుంబప్పులియూర్ లకు వెళ్ళెను. తదనంతరమాతడు అవదు. తురైకి వచ్చి అచ్చట దేవు-ని పూజించెను.

## *శివుడు - శివపూజ*

అతడీ స్థలమును వదలి కావేరీతీరము నందు సంచరించు చుండెను. అచ్చట సత్తనూర్ నివాసియగు మూల యనెడి పశు-వుల కాపరి మరణించుటచే గోవులు శోకించుచుండెను. గోవుల స్థితిని చూచి శివయోగికి మిక్కిలి కనికరము కలిగెను. అతడా పశు-వులు కాపరి శరీరమునందు ప్రవేశించి గోవులను ఇంటి వైపు తోలుకొని పోయెను. అతడా పశువుల కాపరి ఇంటికి చేరినప్పుడు మూల యొక్క భార్య అతనిని సమీపించెను. కాని తనను స్పృశిం-చుటకు అతడామెకు అనుమతినొసంగకుండెను. అతడామెతో మాట్లాడ లేదు కూడా. దీనిచే ఆమె హృదయ క్లేశమునొంది రాత్రి-యంతయు నిద్రలేకుండా గడిపెను. అప్పుడు అతనిని చూచినవారందఱు అతడొక గొప్ప యోగియని పలికిరి. మూల శరీ-రమునందు ప్రవేశించిన శివ యోగి ధ్యాననిష్ఠుడై సమాధి యందు ప్రవేశించెను. అతడు సమాధి స్థితి నుండి దిగి వచ్చిన తర్వాత, తన పురాతన శరీరములో ప్రవేశించుటకు బయలు దేరెను కాని అతడు తన శరీరమును ఆ స్థలమునందుఁగాంచకుండెను. దాక్షి ణాలకు ఉపయోగకరమైన శైవదర్శన గ్రంథమును తనచే వ్రా-యించు ఉద్దేశ్యముచే శివుడు తన శరీరమును దాచి యుంచినట్లాతడు తన యోగదృష్టిచే తెలిసికొనెను.

అనంతరమూతడు అవదూతురైకి వెళ్ళి, శివుని( గూర్చి ధ్యా-
నించి, సంవత్సరమునకొక్క శ్లోకము చొప్పున శైవ సిద్ధాంత
దర్శనము గూర్చి మూడు వేల శ్లోకములను రచించెను. సంస్కృత
శైవాగమములయందున్న శైవసిద్ధాంతము నాతడు తమిళ భాష-
లోని కనువదించెను. తదనంతర శైవసిద్ధాంత దర్శన భవనము



నిర్మింప(బడుటకై అతని గ్రంథము పునాది యయ్యెను. ఈ మహా-
కార్యమును సమాప్తమొనర్చి, అతడు తిరిగి కైలాసమునకు
వెళ్ళెను.

రాజయోగములోని అష్టాంగయోగము నభ్యసించిన తర్వాత
కలుగు ఫలములను గూర్చి తిరుమూలర్ వివరించెను. యమము-
నభ్యసించిన యోగి ఉమ యొక్క ఆశీర్వాదముతో అమరపతి
యగును. నియమము నభ్యసించుటచే ఆతడు శివ పామునొందు-
ను. అసనము నభ్యసించుటచే ఆతడు నాదమును వినును.
ప్రాణాయామము నభ్యసించిన వాడు దేవతలందఱును స్తుతిం-
చునట్టి పదవిని పొందును ప్రత్యాహారము నభ్యసించుట ఆతడు
శివరూపమునొందును. అప్పుడు శివుని నుండి ఆతనిని వేలు చే-
యజాలకుండుటచే దేవతలు దిగ్భ్రాంతినొందుదురు. ధారణ
నభ్యసించుటచే ఆతడు బ్రహ్మలోకము, విష్ణు లోకముతో సహా ఏ
లోకముకై నను వెళ్ళ(గలుగును. మానవుడు భూలోకమునందు
సంచరించునట్లాతడే స్థలమునందైనను సంచ రింప(గలుగును.
ధ్యానము నభ్యసించుటచే ఆతడు బ్రహ్మ, విష్ణు, రుద్ర మఱియు
ఇంద్ర పదవిని పొందగలుగును. సమాధి నభ్యసించుటచే అతడు

సమస్త ఉపాధుల నుండి విముక్తుడై శివుని యందైక్యమగును. లేక తత్పదమునొందును.

*శివుడు - శివపూజ*

## బసవన్న

బసవన్న ఒక గొప్ప వీర శైవ సాంఘిక, ధార్మిక ఆచార్యుడు. అతడు బసవ రాజ, బసవేశ్వరుడని కూడా చెప్పబడును. అతడు గొప్ప ఆలోచనాపరుడు. సాంఘిక సమస్య మరియు సమాలోచన-మునందాతడు గొప్ప మార్పులను తీసుకొనివచ్చెను.

అతడు కర్ణాటక దేశములోని శైవ సంస్కర్త. ప్రస్తుత పూజావి-ధానమునకాతడు శివాచారమను నామమునొసంగెను.

పంద్రెండవ శతాబ్దియందాతడు విఖ్యాతినొందెను అతడు బ్రాహ్మణ వంశమునందు జన్మించెను. వ్యావహారికమగుట చేతను బంధించినవగుటచేతను అతడు తన వంశా చారములను త్య-జించెను. ఆ సమయమునందు సువిఖ్యాతమై యున్న వీర శైవమతము నందాతడు ప్రవేశించెను.

కళ్యాణములోని బిజ్జల రాజు యొక్క కోర్టునందాతడు ముఖ్య-మంత్రియైయుండెను. ఆతడు మిక్కిలి సుప్రసిద్ధుడైన మంత్రి.

ఆతడు మిక్కిలి దయఁగలవాడు, సౌమ్య స్వభావుడు, నమ్రతఁగల వాడు, ప్రేమపాత్రుడు మఱియు సాహసవంతుడునై యుండెను. అతడు దేవునిపై ఆధారపడియుండెను. ప్రజలాతనిని దైవ భావ-ముతో పూజించుచుండిరి. అతడు సామాన్య ప్రజలతో కలిసి మెలసి తిరుగుచుండెను. వారి కష్టములనాతడు నివారించుచుం-డెను, ఆతడు వారితో సన్నిహితత్వమును కలిగి యుండెను. తన విశ్వాసమును పరివ్యాప్త మొనర్చుటకై ఆతడు మిక్కిలి శ్రమపడె-ను. ఈ మతవ్యాప్తి

## *శివుడు - శివపూజ*

కారణముచే అతనికి అనేక శత్రువు లేర్పడిరి. దేశమునందంత కలహము లేర్పడెను. ఈ కలహమునందు బిజ్జలుని జీవితము అంతమయ్యెను. విధముగా మరణించెనోసరిగా తెలియకున్నను, బసవన్న, జీవితము కూడా ఈ కలహమునందే అంతమయ్యెను.

అతడొక సాంఘిక సంస్కర్త. వీర శైవ సంచలమునకా తడు నాయకుడయ్యెను. ఆతడు స్థాపించిన మతమును నేటి కాలపు ప్ర-జలనేకులు అనుసరించుచున్నారు. దానిచే బీద పరుల మతమొకటి ఏర్పడెను. పురాతన పూజారుల వర్గమును రద్దుపర-చెను. ప్రజలలో పరమ సత్యమును చొప్పింపఁజే యుటకై అది మాతృభాషను మాధ్యమముగా స్వీకరించెను. ధార్మిక మఱియు సాంఘిక జీవితమందది స్త్రీలకు ప్రాధాన్యము నొసంగెను, నిమ్నో-న్నత వర్గములోని ప్రతివ్యక్తికది ఒకే ఆదర్శవంతమగు సాక్షాత్కారము నొసంగెను.

సత్యము కొఱకై బసవన్న మహాత్యాగము నొనర్చెను. ప్రజలాతనిని ఒక ఆచార్యునిగా అంగీకరించిరి. అతని మాటలు నేరుగా తన హృదయము నుండి వచ్చెను. అవి నేరుగా మన హృదయమునందు హత్తుకొనును. అవి సామాన్యములు, ప్రత్యక్షములు మరియు శక్తివంతములైయుండును. ఆతని ఆచార నియమములు విశాలములు మఱియు స్తుతిపాత్రములై యుండును. ఆతడు నిజమైన సత్యాన్వేషకుడు మఱియు సత్య పథము నొందుటకై మహాత్యాగమునొనర్చెను. అతడు ప్రేమ మయుడు మఱియు దయామయుడు. సర్వప్రాణులను ప్రేమించు విశ్వ ప్రేమయే బసవన్న యొక్క ముఖ్య ప్రబోధమై యుండెను.



# 12వ అధ్యాయము

# శివ భక్తులు

# సాధువులు - సత్పురుషులు

సాధు వెవడు? దేవుడు, లేక శాశ్వతత్వమునందు వసించు వాడెవ్వడో; అహంకారము, రాగ ద్వేషములు, స్వార్థపరత్వము, గర్వము, మమ కారము, మోహము, పేరాస, క్రోధములు లేని వాడెవ్వడో? సమదృష్టి, మానసిక సంతులనము, దయ, ఓర్పు ధార్మికత, విశ్వ ప్రేమను కలిగియున్న వాడెవ్వడో మఱియు దివ్యజ్ఞాన సమన్వితుడెవ్వడో, అతడే, సాధువని చెప్పఁబడును.

సాధు సత్పురుషులు ఈ ప్రపంచమునకు వరప్రసాదము

వంటివారు. వారు శ్రేష్ఠమైన దివ్యజ్ఞానమునకు, ఆధ్యాత్మిక శక్తుల-
కు మఱియు తరుగు లేని ఆధ్యాత్మిక కథనమునకు పెన్నిధి
వంటివారు. రాజులు కూడా వారి పాదపద్మములయందు తమ
తలలను వంచుదురు. జనక చక్రవర్తి యాజ్ఞవల్క్యునితో ఇట్లనెను.
"ఓ మునిశ్వరా! మీ విశాలమైన మరియు పవిత్రమైన ప్రబోధము
ద్వారా సనాతనమగు ఉపనిషదానమును పొందినందుకు నేను
మీకు కృతజ్ఞుడనై యున్నాను. నేను నా సమస్త రాజ్యమును మీ పా-
దములయందు సమర్పింతును. ఇంతేకాదు, నేను మీ
సేవకుడను. నేనొక బానిసవలె మీ కొఱకై వేచియుందును"

## *శివుడు - శివపూజ*

సాధుసత్పురుషుల స్వరూపమిట్లు అద్భుతమైయుండును. కేవలము వారి అస్తిత్వము ఇతరులకు ప్రేరణనొసంగును. మఱి-యు వారివలె అగుటకు పురికొల్పి, వారు పొందిన ఆనంద భూమికననుభవించునట్లొనర్చును. అట్టివారు లేకుండినచో మీ-కందఱికి ఆధ్యాత్మిక పురోభివృద్ధికిఁగాని, మోక్షమునకుఁగాని అవకాశము లేకుండెడిది. వారి మహిమ అవర్ణనీయము. వారి జ్ఞాన-ము అగాధమైనది. వారు సముద్రమువంటి లోతును, హిమాలయముల వంటి పూనికను, హిమాలయములో మంచువం-టి పవిత్రతను, సూర్యునివంటి ప్రకాశమును కలిగియుందురు. అట్టి వారి అనుగ్రహము మఱియు సత్సంగము ద్వారా మానవుడీ ఘోరమైన సంసార సాగరమును దాటఁ గలుగును. వారి సాంగత్య-మునందుండుటయే ఉన్నతమైన విద్య, వారిని ప్రేమించుటయే

ఉన్నతమైన ఆనందము. వారి సామీప్యమునందుండుటయే నిజమైన విద్య.

వారు గ్రామ గ్రామమునకు తిరిగి తమ దివ్యజ్ఞానమును ప్రసార మొనర్తురు. వారు ప్రతి ద్వారమునకు వెళ్ళి విజ్ఞానమును వెదజల్లుదురు. వారు తమ శరీర పోషణకై ఏకొద్దియో తీసుకొని, ప్రజలకు ఉన్నత విద్యను, సంస్కృతిని మరియు జ్ఞాన ప్రకాశము నొసంగుదురు. వారి జీవితమే ఆదర్శ ప్రాయమైయుండును. వారు ఉపన్యాసములనొసంగినను, ఒసంగకున్నను, వారు భాషించినను, భాషింపకున్నను అది గణింపదగినది కాదు.

## శివుడు - శివపూజ

నిస్వార్థపరులగుట చేతను మఱియు ఉన్నత జ్ఞాన సమసితులగుట చేతను సాధుసత్పురుషులు రాజులకు నిజమైన సలహా నొసంగఁజాలుదురు. వారు మాత్రమే ప్రజానీకము యొక్క నైతికతను పెంపొందింపఁజాలుదురు. వారు మాత్రమే శాశ్వతా నందము మరియు అమృతత్వమునకు మార్గమును నిర్దేశింపం గలుగుదురు. శివాజీకి స్వామి రామదాస్ సలహాదారుడుగా నుండెను. దశరథ మహారాజుకు వసిష్ఠమహర్షి సలహాదారుడై యుండెను.

సాధువుల జీవితములను అధ్యయన మొనర్తు వేని, వెంటనే నీయందు ప్రేరణ కలుగును. వారి వచనములను జ్ఞప్తి యంచుకొందు వేని, వెంటనే నీయందు వికాసము కలుగును. వారి అడుగుజాడలలో నడుతు వేని, నీవు దు:ఖ మరియు చింత నుండి

విముక్తుడవగుదువు. కావున "సాధువుల జీవితచరిత్ర" అను పుస్తక-ము ఎల్లప్పుడు నీకు తోడుగానుండవలయును, అది నీ జేబునందుండవలయును. అది నీ తలగడ క్రింద యుండు వల-యును.

నీలోని దోషదృష్టి కారణముచే వారియందు దోషములు పింప-కుము. వారి యోగ్యతలను నీవు గుర్తెఱుంగఁజాలవు. వినయముతో వారి పాదసన్నిధి యందు కూర్చుండి, వారిని మనః పూర్వకముగ-ను, హృదయపూర్వకముగను సేవింతు వేని నీ సంశయములన్నియును నివారణయగును. వారి ప్రబోధమును వి-ని, శ్రద్ధతో దానినభ్యసించుము. నీవు నిశ్చయముగా ధన్యుడవగుదువు.

## *శివుడు - శివపూజ*

ప్రతి పాఠశాలకు, ప్రతి కళాశాలకు, ప్రతి పూటకూళ్ళిం టికి, ప్రతి కారాగారమునకు, ప్రతిసంస్థకు, ప్రతి ఇంటికి సలహా నొసం-గుటకు ఒక సాధువుండవలయును. సాధువులు కొల్లలుగానున్నారు. కాని నీవు వారిని కోరుట లేదు. నీవు వారిని సమీపించుట కిచ్ఛగింపకున్నావు. నీవు వారిని సేవించుట కిష్టపడ కున్నావు. నీకు ఉన్నత విషయములకై ఉబలాట లేదు నీవు గాజు ముక్కలతోను, కంచు పెంకులతోను సంపూర్ణముగా సంతృప్తి నొం-దియున్నావు. ఉన్నతమైన దివ్యజ్ఞానమును మఱియు ఆంతరిక శాంతి నొందుటకై నీకు దాహముఁగాని, ఆకలిఁగాని లేదు.

సాధుసత్పురుషులలో జాతి విచక్షణ లేదు. వారి జాతిని గమనింపకుము. దానిచే నీకు ప్రయోజనము లేదు. వారి సద్గుణములను నీవు అలవరచు కొనఁజాలవు. ఉన్నతమైన మతమునందు జాతిఁగాని, తెగఁ గాని లేదు. మాదిగ వారు, సాలె వారు మఱియు హరిజనులు గొప్పసాధువులైరి. విజ్ఞానము, ఆత్మజ్ఞానము, కేవలము బ్రాహ్మణుల స్వంతసొత్తు కాదు. దక్షిణహిందూదేశములోని బ్రాహ్మణులు కేవలము బ్రాహ్మణులగు దండి సన్న్యాసులను మాత్రమే గౌరవించి, వారికి ఆహారము నొసంగుదురు. ఇది గొప్ప పొరపాటు మఱియు మహానేరము, ఇది ఎంతయో శోచనీయమైనస్థితి. ఈ కారణము చేతనే సాధువులు దక్షిణదేశమును సందర్శింపరు. పంజాబు, సింధు మఱియు గుజరాత్ ప్రాంతములోని ప్రజలు సమస్త సాధువులు యందు భక్తిని కలిగియుందురు. కావున వారీ ప్రదేశములలో సంచరింతురు. మరియు ప్రజలు వారినుండి గొప్ప ఆధ్యాత్మిక ప్రయోజనమునుఁబడయుదురు, ఈ ప్రపంచము మంచి సాధుసత్పురుషులచే నిండి యుండునుఁగాక!

***శివుడు - శివపూజ***

వారి సత్సంగము మరియు సలహాద్వారా మీరందరు పరమజీవిత లక్ష్యము నొందుదురుఁగాక! సాధుసత్పురుషుల ఆశీస్సులు మీయందెల్లప్పుడుండునుఁగాక!

## మార్కండేయుడు

మార్కండేయుడొక గొప్ప శివ భక్తుడైయుండెను. పుత్ర సంతానము కొరకై ఆతని తండ్రియైన మృకండుడు గొప్ప తపస్సు నను శివుడాతనికి ప్రత్యక్షమై ఇట్లు పలికెను. "ఓఋషి! తన పదునారవ ఏట మరణించు మంచి పుత్రుడు నీకు కావలయునా? లేక ఎక్కువ కాలము జీవించునట్టి దుష్టుడు మరియు మూర్ఖుడైన పుత్రుడు కావలయునా?" మృకండుడిట్లు పలికెను. "ఓ నా ఆరాధ్యదైవమా! నాకు మంచి పుత్రుడినే ఒసంగుము.

బాలుడు తన విధి లిఖితమును గుర్తెఱంగినవాడై, శ్రద్ధా భక్తులతో హృదయపూర్వకముగా శివుని పూజింపసాగెను. తన మరణము నిర్ణయింపఁబడిన రోజు ఆ బాలుడు తీవ్రమైన ధ్యాన నిష్ఠ మఱియు సమాధిస్థితి యందు ప్రవేశించెను. యమదూతలు ఆతనిని సమీపింపఁజాలకపోయిరి. కావున అతని జీవితమును హరించుటకై యముడు స్వయముగా వచ్చెను. బాలుడు తన సంరక్షణకై శివుని ప్రార్థించి, లింగమును ఆలింగన మొనర్చు కొనెను. యముడు శివలింగము మఱియు బాలుని చుట్టు తన పామును విసరెను. వెంటనే

***శివుడు - శివపూజ***

బాలుని రక్షించుటకై లింగము నుండి శివుడు బయల్వెడలి యముని చంపెను. ఆ రోజు నుండి శివుడు మృత్యుంజయుడు మఱియు కాలకాలుడనీ పిలువఁబడు చుండెను.

అపుడు దేవతలు శివుని సమీపించి ఇట్లు పలికిరి. "ఓం ఆరా-

ధ్య దైవమా! నీకు నమస్కారములు. యముడొనర్చిన దోషమునకై అతనిని క్షమింపుడు. ఓ దయాసాగరుడా! ఆతనిని తిరిగి బ్రతికింపుడు" దేవతల విన్నపము నాలకించి శివుడు తిరిగి యముని బ్రతికించెను. మార్కండేయుడు పదునారు సం॥ల వయస్సుఁగల నిత్య చిరంజీవిగా నుండునట్లు శివుడాతనికి వరము నొసంగెను. దక్షిణ దేశములో బాలుడు నమస్కరించి నప్పుడు స్త్రీ పురుషులు "మార్కండేయునివలె చిరంజీవిగా బ్రతుకుమ"ని ఆశీర్వదింతురు.

తపోధ్యానముల ద్వారా నీవు ముల్లోకములలో దేనినైనను సాధింపఁగలుగుదువు.

## ఋషభయోగి కథ

ఈ కథ స్కంధపురాణములోని బ్రహ్మోత్తరకాండము నందున్న ఏడధ్యాయములలో వివరింపఁబడినది.

మందరుడనెడి అవంతి బ్రాహ్మణుడు మహాపండితుడై యుండెను. కాని అతడు పింగళయనెడి వేశ్యతో వసించెను. ఒకరోజు ఋషభుడనెడి



మహాశివయోగి మందరునికి అతిథిగా వచ్చెను. మందరుడు మఱియు పింగళ ఆ యోగిని మిక్కిలి శ్రద్ధాభక్తులతో సేవించి ఆతని అనుగ్రహము బడసిరి.

కొంతకాలమునకు వారిద్దఱును మరణించిరి. మందరుడు దశార్ణరాజైన వజ్రబాహువుకు కుమారుడై జన్మించెను. అతడు తన తల్లియైన సుమతి గర్భమునందునప్పుడు, ద్వేషకారణముచే ఆ రాజు యొక్క ఇతర భార్యలు సుమతికి విషము పెట్టిరి. ఆ బాలుడు మఱియు సుమతి మిక్కిలి జబ్బుపడిరి. వారాజబ్బు నుండి చికి-త్సపొందజాలకుండిరి. రాజుయొక్క ఆజ్ఞచే వారొక అడవియందు విడిచి పెట్టబడిరి.

దేవుని అనుగ్రహముచే వారొకధనవంతుడైన వ్యాపారస్థుని చేఁగొంపోఁబడి బాగుగా సంరక్షింపఁబడిరి. కాని బాలునికి దినదిన-ము జబ్బు అధికమైన కారణముచే, అతడు మరణించెను. తల్లి తన కుమారుని మరణ కారణముచే మిక్కిలిగా శోకించు . అప్పుడు ఋషభుడు ప్రత్యక్షమై, తల్లిని ఓదార్చి, ఆమెకు ఆధ్యాత్మిక ప్రబో-ధము నొసంగెను. ఐనను ఆమె ఓదార్పు అప్పడాయోగి శివుని భస్మముతో ఆ మరణించిన బాలుని స్పృశించెను. ఆబిడ్డ తిరిగి బ్రతికెను. అతడు తన యోగశక్తుల ద్వారా తల్లి బిడ్డలను అరోగ్య-వంతులుగను, అందముకల వారిగను ఒనర్చెను. అతడాబాలునికి భద్రాయువును పేరునొసంగి, ఆతనికి శివకవచమును నేర్చెను. అతనికి ఒక ఖడ్గమును, శంఖమును మరియు పది వేల ఏనుగుల బలము . అతనికి శివుని భస్మమును కూడా ఒసంగెను. అప్పుడా యోగి ఆ స్థలమును వదలి వెళ్ళెను.

### *శివుడు - శివపూజ*

భద్రాయువు మరియు వ్యాపారస్థుని కుమారుడైన సునయు-డు సంతోషముగా కలిసిమెలసి నివసించిరి. తన తండ్రి

మగధరాజైన హేమరథునిచే స్థానభ్రష్టమొనర్పఁబడి, కారాగారము నందుంచఁబడినట్లు భద్రాయువు వినెను. అతడు సునయునితో వెళ్ళి, శత్రువులను ఓడించి, మగధరాజుచే కారాగారము నందుం-చఁబడినట్టి తన తండ్రిని, మంత్రులను మరియు రాణులను విడిపించెను. అతడు మగధరాజును మఱియు ఆతని పరివారము-ను తన తండ్రి అధీనమునందు ఖైదీలుగా ఉంచి, ఇంటికి తిరిగివచ్చెను. తానెవరో అతడు తన తండ్రికి తెలుపలేదు. తండ్రి ఆ బాలుని యొక్క శక్తి సామర్థ్యములను స్తుతించి ఆ బాలునికి తా-ను ఋణపడియున్న విషయమును వ్యక్త మొనర్చెను. భద్రాయువు మందరుడై యున్నప్పుడు దుర్నీతిగా జీవించినను, అతడు ఋషభుని శ్రద్ధాభక్తులతో సేవించిన కారణముచే, గొప్ప శి-వయోగియైన ఋషభుని అనుగ్రహము అతనిపై ఇట్లు ప్రసరింపబడెను.

ఆర్యావర్తమునకు రాజైన చిత్రవర్మకు సీమంతిని - యనెడి రండెను. నలదమయంతుల కుమారుడైన ఇంద్రసేనుని కొడుకు చంద్రాంగదుడు సీమంతినిని వివాహమాడెను. చంద్రాంగదుడు వివాహమైన వెంటనే ఒక చోట ఆటాడుచుండగా యమునానదిలో మునిగిపోయెను. నాగలోక కన్యలు చంద్రాంగదుని నాగలోకాధిప-తియైన తక్షకునివద్దని తీసుకొని వెళ్ళిరి.

తన పదునాల్గవయేట తాను విధవయగునని సీమంతిని ఆస్థాన జ్యోతిష్కుని ద్వారా తెలిసికొనెను. కావున ఆమె యజ్ఞవ-ల్క్యుని

***శివుడు - శివపూజ***

భార్యయైన మైత్రేయి ద్వారా సోమవారము రోజు మరియు ప్రదోష-దినమునందు శివుని పూజించు విధానముఁ గూర్చి ఉపదేశము నొందెను. ఆమె విధవయైన తర్వాత కూడా ఈ పూజను కొనసాగిం-చుచుండెను.

చంద్రాంగదుడు తన భార్యతో జీవింపఁగోరుటచే, తక్షకుడు | అతనిని తిరిగి యమునాతీరమునకు పంపెను. ఒక సోమవారము రోజు సాయంకాలము సీమంతిని స్నానమొనర్చుటకై నదీ తీరము-నకు వెళ్ళగా, అచ్చట ఆమె తన భర్తను కలిసికొనెను.

తాను లేనప్పుడు తన తండ్రిని రాజ్యభ్రష్టునిగా చేసిన శత్రు-వును చంద్రాంగదుడు ఓడించి, తిరిగి తన తండ్రిని పట్టాభిషిక్తునిగానొనర్చెను. శివుని అనుగ్రహముచే చంద్రాంగదు-డు మరియు సీమంతిని తిరిగి కలిసికొనిరి.

శివపార్వతులను తృప్తి పరచుటకై సీమంతిని ప్రతి సోమవా-రము రోజు బ్రాహ్మణులను, వారి భార్యలను స్తుతించుచు, వారికి కానుకలనొసంగుచుండెను. ఇద్దఱు బ్రాహ్మణ బాలురు విదర్భరా-జును సమీపించి, తమ వివాహము కొరకై ద్రవ్యమునడిగిరి. భార్యా భర్తలుగా వేషము ధరించి, సీమఁతిని వద్దకి వెళ్ళుమని ఆబాలుర-కు రాజు సలహా నొసంగెను. సీమంతిని యొక్క భక్తిని పరీక్షించుటకై అతడిట్లొనర్చెను, బాలురు అదే విధముగా నొనర్చి-రి. సీమంతిని నవ్వి, వారిని శివపార్వతులవలె ఆరాధించెను. వారియందొక బాలుడు స్త్రీయయ్యెను. సీమంతిని యొక్క శక్తిచే స్త్రీగా మారిన బాలుని తండ్రి, ఈకష్టమును

నివారించుటకు సహాయము చేయుమని రాజును ప్రార్థించెను. రాజు పార్వతిని ప్రార్థించెను. తన భక్తురాలు చేసిన కార్యమునందు జోక్యము కలుగఁజేసికొనుటకు పార్వతి నిరాకరించెను కాని ఆ బాలుని తండ్రికి మరియొక కుమారుడు కలుగునట్లు వరము నొసంగెను. ఇద్దరు బాలురు వివాహమాడి భార్యాభర్తలుగా నివసింపవలసివచ్చెను.

సీమంతినికి కీర్తిమాలిని యనెడి ఒక కూతురుండెను. నిజమునకీ కీర్తి మాలిని శివ యోగియైన ఋషభ దేవుని గొప్ప భక్తితో సేవించినట్టి పింగళయనెడి వేశ్యయేనై యుండెను. ఋషభుడు చంద్రాంగదుని వద్దకి వెళ్ళి, కీర్తి మాలినిని భద్రాయువుకు వివాహమొనర్చుమని చెప్పెను. శివయోగి _చంద్రాంగదునికి భద్రాయువు యొక్క వృత్తాంతమంతటిని తెలిపెను. చంద్రాంగదుడు తన కూతురైన కీర్తి మాలినిని భద్రాయువు కొసంగి వివాహ మొనర్చెను. ఆతడీ వివాహమునకు భద్రాయువు యొక్క తండ్రిని ఆహ్వానించెను. వజ్రబాహువు చంద్రాంగదుని అల్లునిఁగాంచినప్పుడు మగధరాజును ఓడించి, తనకు రాజ్యమునిప్పించిన బాలుడే ఆతడను విషయమును గుర్తించెను. తల్లి తనయులైన సుమతి మఱియు భద్రాయువు యొక్క వృత్తాంతము వజ్రబాహువుకు తెలుపఁబడెను. వజ్ర బాహువు తన రాణిని, కొడుకును, కోడలును తన రాజ్యమునకు తీసుకొని వెళ్ళెను.

మహా శివయోగియైన ఋషభుడు తనను భక్తితో పూజించిన సుందర మరియు పింగళలను తిరిగి ఐక్య మొనర్చెను. వారు దుశ్శీలమగు జీవితమును గడిపినను, శివ యోగియైన కుమారుని

ఒసర్పఁబడిరి. ఒకరోజు భద్రాయువు అరణ్యమునకు | వెళ్ళెను. ఒక బ్రాహ్మణుని భార్య ఒక పులిచే తీసుకొనిపోయి తడామె ఏడ్పును వి-నెను. ఆ స్త్రీని రక్షించుటకై రాజు తనకు సాధ్యమైనంత ప్రయత్నమునొనర్చెను. కాని ఆ పులిని చంపలేకపోయెను. బ్రా-హ్మణుడా రాజును దూషించుచు ఇట్లు పలికెను. "ఓ పిరికి రాజా! నీకు పులిని చంపు సామర్ధ్యము లేదు. నీ వేలాటిరాజువు!" ఆ బ్రా-హ్మణునికి తన భార్యతో సహా దేనినైనను ఒసంగుదునని భద్రాయువు ప్రతిజ్ఞ చేసెను. బ్రాహ్మణుడు రాణిని కోరెను. భద్రా-యువు రాణిని బ్రాహ్మణుని కొసంగి, తదనంతరము జీవించు కోరిక లేనివాడై అగ్నియందు ప్రవేశించి, ప్రాణమును త్యజించుటకు సంసిద్ధుడయ్యెను.

అప్పుడు మహాశివభక్తుడైన రాజు ఎదుట శివపార్వతులు ప్ర-త్యక్షమై ఇట్లు పలికిరి. "నీ యొక్క బలమును మరియు ధర్మమును పరీక్షించుటకై మేమే ఇట్లొనర్చితిమి." తదనంతరము శివుడు భద్రాయువుకు, కీర్తి మాలినికి, వారి తల్లిదండ్రులకు, భద్రాయువు మఱియు అతని భార్య యొక్క ప్రార్థనననుసరించి వైశ్యునికి, అత-ని కుమారునికి శివసాయుజ్యము నొసంగెను. బ్రాహ్మణుని భార్య తిరిగి బ్రతికింపఁబడెను. మఱియు వారిద్దఱ శివుని అనుగ్రహము-నొందిరి.

ఈ కథనము మనకు శివభక్తి యొక్క మహిమను, శివ భక్తుల

యొక్క మహాత్మ్యమును, అన్ని రోజులలోను ప్రత్యేకముగా సోమవా-రము మరియు సూర్యుడస్తమించునట్టి ప్రదోష సమయమునందును ఒనర్చు శివపూజ యొక్క ప్రాముఖ్యతనుఁ గూర్చియు వెల్లడించుచున్నది.

***శివుడు - శివపూజ***

# పుష్పదంతుడు

పుష్పదంతుడు ఒక శివభక్తుడైయుండెను. అతడు గంధర్వు లకు నాయకుడైయుండెను. అతని దంతములు మల్లెపువ్వు రేకు-లవలెనుండెను. కావున అతడు "పుష్పదంతుడ"ని చెప్పబడు చుండెను.

పుష్పదంతునికి గాలిలో సంచరించు శక్తి యుండెను. ఆతడు శివుని పూజించుటకై కాశీలోని వాహురాజు యొక్క తోటనుండి పు-ష్పములను సేకరించుచుండెను. అతడు గాలిలో సంచరించు శక్తిని కలిగియుండుటచే, తోటకాపరులు అతనిని లేకపోయిరి. అద్భుతమైన శక్తులుఁగల ఒకానొక ఆశ్చర్యకరుడైన వ్యక్తిచే తోట-లోని పుష్పములు దొంగిలింపఁబడు చున్నవని తోటమాలులు అనుమానించిరి. ఆతనిని పట్టుకొనుటకై వారొక యుక్తిని పన్నిరి.

శివునికి అర్పింపఁబడిన పుష్పములను వారు తోటలోని వివిధ స్థలములలో వెదజల్లిరి, ఆ యద్భుతమైన వ్యక్తి ఈ పుష్పములను త్రొక్కునని వారు భావించిరి.

యథాప్రకారముగా పుష్పములను కోయుటకై పుష్ప దంతుడు

తోటలోనికివచ్చెను, భూమి పై వెదజల్లబడిన పుష్పములపై ఆత-డు నడిచెను. తనకు తెలియకుండానే అతడు శివుని అవమానపరచిన కారణముచే, అతడు గాలియం(దెగురు శక్తిని కో-ల్పోయెను. ఆతడు తోటమాలులచే పట్టుబడి, రాజు వద్దకి తీసుకొనిపోఁబడెను.

### *శివుడు - శివపూజ*

శివుని సంతుష్టినొందించుటకు మరియు తాను పుష్పముల-ను దొంగిలించిన కారణముచే రాజును బాధించిన భయము నుండి విడివడుటకున్నూ పుష్పదంతుడు శివస్తోత్రమును ఉచ్చ-రించెను. అతడు శివుని అనుగ్రహముచే మరల గాలి యందు సంచరించుశక్తిని సంపాదించెను.

ఈ సుప్రసిద్ధమైన స్తోత్రము "మహిమ్నస్తవమ"ని చెప్పఁబడు-ను. ఇది పవిత్రములును, ఆత్మ ప్రేరణదాయకములునగు భావములచే నిండియున్నది. ఉత్తరహిందూదేశములోని శివాల-యములలో సాయంకాల ప్రార్థన మఱియు హారతి సమయములలో ఈ స్తోత్రము ప్రతినిత్యము పాడఁబడును.

ఈ స్తోత్రము అందఱి హృదయములను రంజింప జేయును. ఇది సుస్వర సంయుక్తము, తాళసంయుతము, సంగీత సమన్వీత-ము మరియు ప్రగాఢమగు భక్తి పరిపూర్ణమైయున్నది. దీనిని నీవు కంఠస్థ మొనర్చుకొని, ప్రతినిత్యము ఉచ్చరింప వలయును. నీకు ఉన్నతము, అమృతము ఆనందమయమునగు శివస్థానము లభించును.

# కన్నప్ప నాయనార్

దక్షిణదేశములోని ఉడుప్పూర్ నందున్న వ్యాధరాజగు నాగన్నకు కన్నప్పయని ప్రసిద్ధినొందిన తిన్నడు జన్మించెను. రాజగునాగన్న గొప్ప

***శివుడు - శివపూజ***

సుబ్రహ్మణ్య భక్తుడు. తిన్నడు చిన్న తనము నుండియు వేటయందును, విలువిద్యయందును నేర్పరియై యుండెను. యుక్త వయస్సు నందు తన తండ్రిచే ఒసంగఁ బడిన రాజ్యము నాతడు పాలింపవలసివచ్చెను. ఒకరోజు తిన్నడు తన అనుచరులతో కలిసి వేటకు వెళ్ళెను. అరణ్యము నందు సంచరించుచుండగా వలనుండి తప్పించుకున్న ఒక పంది వారి కెదురయ్యెను. వెంటనే వారాపందిని చాలా కాలము వరకు పర్వతములలో పైకి, క్రిందికి వెంబడించిరి. చాలాకాలము తర్వాత నందిని చంపఁగలిగెను. వారు మిక్కిలి అలసి పోయిన కారణముచే వారాజంతువు యొక్క మాంసమును వండుటకై దానిని కాళహస్తి పర్వతప్రాంతమునకు తీసుకొనిపోయిరి. పర్వతప్రాంతమునకు వెళ్ళుచుండగా ఆ పర్వత దేవతయగు కుదుమితేవారు దర్శించు ఇచ్చ వారికి కలిగెను.

తిన్నడు పర్వతము నెక్కుచుండగా అతని భారము తొలగు-

చున్నట్లు స్ఫురించుటచే, ఆ దేవతను దర్శించిన అనంతరమే ఆహారమును స్వీకరించుటకు నిర్ణయించుకొనెను. అతడా దేవాల-యమునందొక శివలింగమును సందర్శించెను. ఈశ్వర దర్శనాంతరము ఆతడు ప్రేమ, భక్తి, ఆనంద స్వరూపుడయ్యెను. తన బిడ్డను చాలాకాలము తర్వాత చూచిన తల్లి వలె తిన్నడు ది-వ్యమైన ప్రేమయందు తన్మయుడయ్యెను. ఆహా! శివ సందర్శనానంతరము అతనికి కలిగిన అనిర్వచనీయ మగు ఆనందమునుఁ గూర్చి వర్ణింపతరమగునా? అతడు శివునిఁ గూర్చి ఏడ్చి, విలపించి,

## శివుడు - శివపూజ

ఆనందబాష్పములను రాల్చసాగెను. అతడు తన భోజనమును. అనుచరులను మఱియు స్వశరీరమును, సమస్తమును మరచిపో-యెను.

శివుడు కొండచరియలలో ఏకాంతమునందేలాటి సంరక్షణ లేక యుండుటచే క్రూరమృగముల చేతను, తదితరముల చేత-ను హాని కలుగునని అతడు బాధపడసాగెను. కావున క్రూర మృగములు మఱియు దుండగీండ్రచే శివుని రక్షించుటకై ఆతడు రాత్రియంతయు కాపలాకాయుటకు నిర్ణయించుకొనెను. శివుడు ఆకలిఁగొన్నాడని తెలిసికొని ఆతడు వెంటనే పంది మాంసమును వండుటకై పరుగెత్తెను. అతడు మాంసమును రుచిచూచి, రుచికర-ములగు మాంసఖండములను ఏర్చెను. బాగు లేని భాగమును

పారవేసెను. అప్పుడాతడు నదికి వెళ్ళి అభిషేకమునకై నీటిని తన నోటియందు తెచ్చెను. దారియందాతడు కొన్ని పుష్పములను కోసి, వాటిని తన జటాకేశమునందుంచుకొనెను. ఈ సామ్రాగితో అతడు దేవాలయమునందు ప్రవేశించి, అచ్చట పడియున్న పురాతన పుష్పములను తన పాదరక్షతో తొలగించి, తన నోటియందున్న నీటితో అభిషేక మొనర్చి, తన జటా కేశమునందున్న పుష్పములతో అలంకరించెను. అప్పుడాతడు మాంసమును ప్రసాదముగా దేవుని కర్పించెను. వీటినన్నింటిని ముగించిన అనంతరము విల్లమ్ములను చేతియందు ధరించి, రాత్రియంతయు దేవాలయమున కెదురుగా నిలబడి, కావలి యుండెను. దేవునికి ప్రసాదము తెచ్చుటకై ప్రాతఃకాలము నందాతడు వేటకు వెళ్ళాను.

## *శివుడు - శివపూజ*

తిన్నడు వేటకు వెళ్ళినప్పుడు పూజారియు, విశ్వసనీ యుడగు శివభక్తుడునగు శివకాసరియర్ దేవాలయమునకు వచ్చె . దేవుని చుట్టుముట్టు ఎముకలను, మాంసమును మఱియు తానొ అలంకారములు పాడుచేయఁబడుటనుఁగాంచెను. కాని ఇట్టి కార్యము నొనర్చి, ఆ స్థలము యొక్క పవిత్రతను పాడు చేసినట్టి వ్యక్తిని అతడు కనుఁగొన లేకపోయెను. కావున అవశ్యకములగు మంత్రములను పఠించి, అతడాస్థలమును శుద్ధి చేసి, దేవుని దైవికపూజను నేఱవేర్చి, ప్రార్థనలనుచ్చరించెను. పూజానంతరము దేవాలయమును మూసి, బయటికి వెళ్ళాను.

అప్పుడు మత్స్యమాంసములతో కూడిన ప్రసాదముతో తిన్నడు తిరిగి వచ్చి, పూజారిచే చేయఁబడిన అలంకారమును తొలగించి, ఇతఃపూర్వమువలె తనకు తోచిన విధముగా, అలంకరించి, ప్రసాదమును అర్పించెను. రాత్రియందు జాగరణ యుండి దేవాలయమునకు కావలియుండెను. ప్రాతఃకాలము నందు ప్రసాదమును తెచ్చుటకై బయటికి వెళ్ళెను. ఇట్లు దేవుని సేవించుచు ఐదురోజులు గడిచెను. ఇంటికి రమ్మని అతని తల్లి దండ్రులు బ్రతిమాలుకొన్నను, దేవునివద్దనే ఉందునని అతడు పట్టు పట్టెను.

ఇట్టి కార్యము మరల మరల ఒనర్పఁబడుటచే కోపోద్రిక్తు డైన శివ కాసరియర్ దేవునితో ఫిర్యాదు చేసి, ఇట్టి అపచారములను అంతమొందించుమని విన్నవించుకొనెను. శివుడు పూజారి యొక్క స్వప్నమునందు కానఁబడి, పూజారి లేని సనుయమునందేమి జరుగుచున్నదో అతనికి చెప్పి, తిన్నడు ఒనర్చునదంతయు తిన్ననికి

## శివుడు - శివపూజ

దేవుని పైంగల శుద్ధమైన, అవ్యక్తమైన ప్రేమను వ్యక్తమొ నర్చుచున్నదనియును పలికెను. ఇంకను దేవుడిట్లు పలికెను "అతడు నోటిలోని నీటితో చేయు అభిషేకము నాకు మిక్కిలి ప్రీతిని కలిగించుచున్నది. నేను దీనిని గంగా జలము కంటె మిక్కిలి విలువైనదిగా భావింతును. వైదిక విధులనను సరించి చేయు కర్మకాండ మఱియు తపస్సుకంటె శుద్ధమైన శ్రద్ధ మఱియు ప్రేమచే ఒనర్పఁబడు కార్యమే నాకు మిక్కిలి ప్రీతిని కలిగించును". అప్పు-

డు రెండవరోజు దేవాలయమునకు వచ్చి, మూర్తి వెనుక దాగి యుండి తిన్నడొనర్చుదానిని తిలకిం చుమని గంగాధరుడు పూ-జారితో పలికెను.

తిన్నడు ప్రసాదము తెచ్చిన అనంతరము తన ఇచ్చాను సారముగా అభిషేకమునొనర్చి, దేవుని అలంకరించెను. తిన్ననికి తనపై ఎంతటి భక్తి శ్రద్ధలున్నవో పూజారియగు శివ కారియర్ తె-లుసుకొనవలయునని శివుడు సంకల్పించెను. కావున తిన్నడు పూజ యొనర్చుచు, మాంసమును నైవేద్యముగా ఆర్పించుచుం-డగా దేవుని కుడికన్ను నుండి రక్తపు కన్నీరు కారు తడు(గాంచెను. అతడు కలవరమునొంది, ఏమియు చేయుటకు తోచనివాడయ్యె-ను. రక్తమునిలుపుటకై అతడు ఇటు నటు పరుగెత్తి కొన్ని ఆకులను తీసుకొనివచ్చెను. కాని ప్రయోజనము లేకపోయెను, కంటి నుండి వచ్చు రక్తము నాపజాలనందుకై ఆతడు బిగ్గరగా ఏడ్చి, తన్ను తా-ను నిందించు చిట్టచివరికి అతనికి ఒక ఉపాయము గోచరించెను. ఆతడు వెంటనే తన కుడికంటిని బాణముతో పెరికి వేసి, దానిని దేవుని కుడికంటి యందమర్చెను. రక్తము కారుట ఆగిపోయి నం-దుకాతడు మిక్కిలి



ఆనందమును, సంతుష్టిని పొందెను. దేవుని కంటికి చికిత్స చే-య(గలిగినందుకాతడు ఆనందముతో నాట్య మాడుచుండగా అకస్మాత్తుగా ఎడమ కన్ను నుండి కూడా రక్తము కారుచుండుటను అతడు(గాంచెను. అతడు మిక్కిలి చింతాక్రాంతుడైనను, మును-పటి ఆలోచన అతనికి తట్టెను. అతడు తన ఎడమకంటిని

బాణముతో పెరికి, శివుని ఎడమ కంటికి అమర్చుటకై నిశ్చయించుకొనెను. కాని అతని రెండు కన్నులు పోయినప్పుడు, రక్తము కారుచున్న శివుని ఎడమ కన్నును అతడెట్లు చూడఁగలుగును? కావున దానిని తెలుసుకొనుటకై తన కుడిపాదము యొక్క చెప్పుతో శివుని ఎడమ కంటినదిమి పట్టి, తన ఎడమకంటిని బాణముతో పెకిలింపసాగెను. కాని తన భక్తులు ఇంతటి కష్టముననుభవించుచుండగా ఈశ్వరుడు చూచుచుండునంతటి క్రూరుడు కాడు. అదే స్థలము నందు ఈశ్వరుడు ప్రత్యక్షమై తిన్నడిని "కన్నప్పా" యని సంబోధించి, అతడు ఎడమకన్నును పెరికి వేయుటను నివారించెను. కన్నప్ప యొక్క అచంచల భక్తి మఱియు తీవ్రమైన శ్రద్ధకు సంతోషించి ఈశ్వరుడాతనిని తన కుడి వైపు నందుంచు కొనెను.

ఒక వేటకాడైనను, దేవునికై ఒనర్పవలసిన కర్మకాండ, తపస్సులను సరకుఁగొనక శివునికై గొప్పభక్తిని, మిక్కిలి శ్రద్ధను దర్శించిన కన్నప్ప యొక్క కథ ఆదర్శప్రాయమైయున్నది. కేవలము శుద్ధమైన ప్రేమ మఱియు అనన్యమైన భక్తి చేతనే దేవుడాతనికి మహనీయమైన ఆత్మసాక్షాత్కార వరమును ప్రసాదించెను. కన్నప్ప కేవలము ఆరురోజులు తన ఇచ్చానుసారముగా పూజయొనర్చి నను,



అతడు కలిగియున్న భక్తి మరియు ప్రేమ యొక్క విలువ అనంతమైయుండెను.

కన్నప్ప యొక్క ఆశీస్సులు మీ అందరి యందుండును౧ గాక! దక్షిణ దేశములోని మహాశివభక్తుడైన కన్నప్ప నాయనార్ను మార్గదర్శిగా స్వీకరించి, మీరందరును మానవ జీవిత పరమ లక్ష్యమును౧బడయుదురు౧గాక !

# సిరుతొండ నాయనార్

తిరుచెట్టంగూడి నివాసియైన పరంజ్యోతి చోళరాజుకు సేనా-ధిపతియై యుండెను. అతడు యుద్ధమొనర్చుటలో అన్ని రకములగు నేర్పులను కలిగియుండెను. మఱియు చోళ రాజు కొర-కై అనేక యుద్ధములలో గెలుపొందెను. అతడు సేనాది పతియైయున్నను, శివుడు మఱియు శివభక్తులయందాతనికి భక్తి దినదినాభివృద్ధి యగుచుండెను. శివభక్తుడగుటచే ఆతడు వి-నయ విధేయతలకు పేరుగాంచెను. కావున "శిరుతొండనాయనార్"" అను పేరుతో ఆతడు ప్రసిద్ధి కెక్కెను. ఆతడు తన సేనానాయక పదవిని వదలి పెట్టి శివుని పూజించుట మఱియు శివభక్తులను భుజింప౧జేసి సేవించుటయందు తన జీ-వితశేషమును గడిపెను. శివభక్తులకు భోజనమొసంగకుండా తాను భుజించిన దినమే లేకుండెను. అతని భక్తి యొక్క తీవ్రత ఇట్టిదై



యుండెను. ఈ విధముగా అతడు తన భార్య మరియు సిరియాల-

యనెడి కుమారునితో సుఖముగా జీవించుచుండెను.

ఒక రోజు శివుడు చర్మాంబరధారియై భిక్ష కొరకు అతని ద్వా-
రము కడకేతెంచెను. అదే సమయము నందు భోజనమిడుటకై శివ
భక్తులను తెచ్చుటకై సిరుతొండర్ బయటికి వెళ్ళెను. ఆ చర్మాం-
బరధారి కొంత కాలము వరకు వేచియుండగా, భోజన మిడుటకు
శివభక్తులు దొరక లేదని నిరాశతో సిరుతొండర్ తిరిగి వచ్చెను. ఒక
చర్మాంబరధారి తన ద్వారముపై వేచి యుండుట అతనికి సంతో-
షమును కలిగించెను. సిరుతొండర్ తన ఇచ్ఛకు అనుగుణముగా
వర్తించినచో, అతని ఇంటిలో భుజింతునని చర్మాంబర ధారి పలి-
కెను. అతడు అంగీకరించిన అనంతరము అంగవైకల్యము
మనోవైకల్యము లేని ఆరోగ్యముఁగల ఐదేండ్ల బాలుని మాంసము-
ను వండి తెమ్మని ఆ చర్మాంబర ధారి పలికెను. మొట్టమొదట
అతడు కోరిన పదార్థమును పొందుటకై దిగ్భ్రాంతి నొందినను,
తర్వాత సంతోషముతో తన కొడుకైన సిరియాలను సమర్పించి
చర్మాంబరధారికి విందొనర్చుటకు అతడు నిశ్చయించుకొనెను.

భార్యాభర్తలు భోజనమును తయారు చేయుటకై వేగిర పడు-
చు తల్లి తన ఒడిలో కొడుకును పరుండఁబెట్టి, తండ్రి కొడుకు
గొంతునుకోసి, తల తప్ప శేషించిన అవయవములన్నింటిని వం-
డి పెట్టిరి. చర్మాంబరధారి యొక్క అనుమతిని తీసుకొని తలను
కూడా రుచికరమైన పదార్థముగావండి అంతయు సిద్ధమైన
తర్వాత సిరుతొండర్ మరియు చర్మాంబరధారి భోజన మొనర్ప-
సాగిరి. కాని ఆ సమయములో

చర్మాంబరధారి భోజన మొనర్చుటను మానుకొని, సిరుతొండర్ ప్రక్కన అతని కొడుకు కూర్చొని తింటేతప్ప, తాను భోజనము చే-యనని పట్టుబట్టెను. ఆ సమయములో తన కొడుకు రాలేదని సిరుతొండర్ పలికినను, ఆ చర్మాంబరధారి వినకుండెను. సిరు-తొండర్ లేచి మిక్కిలి దైవభక్తితో సిరియాలను పిలిచెను. కాని ఆశ్చర్యమేమనగా పాఠశాల నుండి వచ్చుచున్న వానివలె తన కు-మారుడు వీధి చివరినుండి వచ్చుచు "ఓ" యని పలికెను. అతడు తన కుమారునితో గృహమునందు ప్రవేశించెను. కాని ఇప్పుడు పండిన మాంసముఁగాని, చర్మాంబరధారిఁగాని కానరాదయ్యెను. ఇదిఏమి చోద్యము! అప్పుడు మహాదేవుడు తన అర్ధాంగినియైన పార్వతితోను, సుబ్రహ్మణ్యునితోను దర్శనమొసంగి, భార్యా భర్తల భక్తి భావమునకు సంతోషించి, శిరుతొండర్ మఱియు ఆతని కు-టుంబ సభ్యులను తనతో తీసుకొని వెళ్ళెను. సాధువును భుజింపఁజేయుటకై తన కొడుకు యొక్క మాంసమునర్పించిన దాని ఫలితమిట్టిదైయున్నది.

మీరందఱు దేవునికై తీవ్రమైన భక్తి, ప్రేమలనలవరచు కొం-దురుఁగాక! సిరుతొండర్ యొక్క ఆశీస్సులు మనందఱిపై ఉండునుగాక !

# శివుని తల్లి

పూర్వకాలములో దక్షిణ దేశములోని కరికల్ ప్రదేశము నందు ధనదత్తుడనెడి ఒక వర్తకుడు నివసించుచుండెను. అతనికి సంతానము లేకుండెను. అతడు శివుని పూజించెను. శివుని అనుగ్రహముచే ఆతనికొక కుమార్తె కలిగెను. ఆబిడ్డకు "పునీతవతి" యనెడి నామకరణ మొసంగఁబడెను. తదనంతరము ఆమె కరికల్ అమ్మయార్ అని కూడా పిలువబడు చుండెను. దక్షిణ దేశములోని సుప్రసిద్ధ శివభక్తులైన నాయనార్లలో ఆమెకూడా ఒకరుగా పరిగణింపఁబడుదురు.

పునీతవతి మిక్కిలి అందగత్తె, బుద్ధిమంతురాలు మరియు పరిశుద్ధురాలు. ఆమె శివుని స్తుతించుచు పాటలను పాడెను. ఆమె తన నొసట భస్మమును ధరించెను.

నాగపట్టణములోని గొప్ప వ్యాపారస్థుడగు పరమదత్తుని ఆమె వివాహమాడెను. పరమదత్తుడు కూడా అందగాడు మఱియు బుద్ధిమంతుడు, సదాచారవంతుడు. అతడు తన తండ్రి అనుజ్ఞనుఁ సి, తన అత్త వారింటియందు వసించెను.

పునీతవతి భక్తులకు రాత్రింబగళ్ళు భోజనమొసంగి, వారొనర్చు శివస్తుతులను శ్రవణ మొనర్చుచుండెను. "అతిథి దేవోభవ" యనెడి వేదవాక్కును ఆమె ఎల్లప్పుడు స్మరించు చుండెను. భక్తులకు భోజన మొసంగిన అనంతరము శేషించిన దానిని భార్యా భర్తలు అమృతమువలె భుజించుచుండిరి.

***శివుడు - శివపూజ***

ఒక రోజు ఒక పరివాజక సన్న్యాసి వచ్చి పరమదత్తునికి రెండు మగ్గిన మామిడిపండ్ల నొసంగెను. వాటిని పరమదత్తుడు తన భార్య కొసంగి, తన పనిని తాను చూచుకొనెను. ఒక భక్తుడు పునీతవతి వద్దకివచ్చి ఆకలిగొనియుండుటచే తినుటకేమైన ఇవ్వమని అడిగెను. అప్పుడు భోజనము సిద్ధముగా లేకుండెను. కావున ఒక మామిడిపండును మరియు కొంత పాలను ఆతని కొసంగెను.

పరమదత్తుడు ఇంటికివచ్చి ఆహారమును తీసికొనెను. పునీతవతి మిగిలిన మామిడిపండును అతనికి వడ్డించెను. పరమ దత్తునికి అది మిక్కిలి రుచికరము గానుండెను. రెండవఫలమును కూడా ఇవ్వమని అతడామెను అడిగెను. ఆమె శివుని ప్రార్థించెను. వెంటనే ఒక మామిడిపండు ఆమె చేతియందుపడెను. అది కచ్చితముగా ఇదివరకు వడ్డించిన పండువలెనే గోచరించెను. దానిని ఆమె తన భర్త కొసంగెను. మొదటి దానికంటే ఈ పండు వెయ్యి రెట్లు రుచికరముగానుండెను. "ఓ ప్రియమైన పునీతవతీ! ఈ పండు నీకెట్లు లభించినదని అతడు పునీతవతిని అడిగెను. ఆమె సమస్త వృత్తాంతమును తెలిపెను. “నాకు మరియొక దానినొసంగుమ’ని పరమదత్తుడు పలికెను. కనురెప్పపాటు కాలములో పునీతవతి మరియొక మామిడి పండును పొందెను.

పరమదత్తుడు మిక్కిలి ఆశ్చర్యచకితుడయ్యెను. తన భార్య శివునికి ప్రియమైన భక్తురాలని ఆతడు గ్రహించెను, ఆతడు తనలో తాను ఇట్లాలో చించుకొనెను. 'నేను మహాపాపిని నేను ఒక శివ భక్తురాలిని నా సేవకురాలుగా వినియోగించుకొంటిని, ఇప్పుడు నేనెంత మాత్రమున్నా

ఆమెను నా భార్యగా తలంపఁజాలను. ఆమెను ఒంటరిగా విడిచి పెట్టుట కూడా మహా పాపము, కాని ఇప్పుడు నేనేమి చేయవలయును?"

అతడు సందిగ్ధావస్థయందు పడెను. తుట్టతుదకు ఆతడామెను త్యజించుటకే నిశ్చయించు కొనెను. తాను వ్యాపారము చేయుటకు వెళ్ళుచున్నట్లు అతడు తన భార్యకు చెప్పెను. అతడు ఆమె యొక్క అనుమతిని పొంది మధురైకి బయలు దేరెను. ఆతడచ్చటనే స్థిరపడి మరియొక భార్యను వివాహ . రెండవ భార్యకు ఒక కూతురు జన్మించెను. పరమ దత్తుడామెకు పునీతవతియని పేరుపెట్టెను.

పునీతవతి నిశ్చిత సమయమునకు తన భర్త యొక్క పునరాగమనమును గూర్చి మిక్కిలి ఆతురతతో ఎదురు చూచు చుండెను. అతనిఁ గూర్చి ఆమెకు ఏ వార్తయు తెలియ కుండెను. ఆమె శోకాతురయు, దుఃఖ పూరితయునయ్యెను. కొంత కాలమునకు తన భర్త యొక్క సమాచారము ఆమెకు తెలిసెను. ఆమె మధురైకి బయలుదేరి తన భర్తను కలిసికొనెను.

పరమదత్తుడు ఆమెను మిక్కిలి సంతోషముతో ఆహ్వానించి, ఆమె పాదములకు నమస్కరించెను. అతడు తన భార్యతో ఇట్లు పలికెను. "నేనొక ప్రాపంచిక మనుజుడను" నేను మోహగ్రస్తుడను మఱియు పేరాసఁగల వాడను. నీవు దేవివి. ఇప్పుడు నేను నిన్ను నా భార్యగా గ్రహింపజాలను. దయచేసి నన్ను క్షమించుమని కో-

రుచున్నాను."

## *శివుడు - శివపూజ*

పునీతపతి ఇట్లు సమాధానమొసంగెను "ఓ దేవా! నేను నా యౌవనమును, అందమును మీ కొరకే సేకరించి యుంచితిని. మీరు నన్ను కోరకుండుటచే ఇప్పుడు నేను శివుని గూర్చి యత్నింతును."

ఆమె తన ఆభరణములన్నింటిని తన చుట్టు నున్న వారికి పంచి పెట్టెను. ఆమె బ్రహ్మనిష్ఠులైన బ్రాహ్మణులను పూజించి, యోగశక్తిచే మాంసమునంతటిని తొలగించి కేవలమొక అస్థిపంజరమువలె గోచరించెను. ఆమె ఉత్తరదేశము వైపు పయనించెను.

ఆమె కైలాస శిఖరమును జేరెను. పవిత్రమైన హిమా లయములలో పాదములతో నడచుట ఆమె పాపముగా భావించెను. ఆమె తన తపశ్శక్తి ద్వారా తలపై నడిచెను.

పార్వతి శివుని ఇట్లు పశ్నించెను. "ఓ ప్రభూ! మన వైపు వచ్చుచున్న ఆవ్యక్తి ఎవరు? శివుడిట్లు సమాధాన మొసంగెను. "ఆ పవిత్రమైన స్త్రీ నా భక్తులను పోషించినట్టి నా తల్లి".

శివుడు లేచి, కొన్ని అడుగులు ముందుకు వేసి, పునీతవతిని ఆహ్వానించుచు ఇట్లు పలికెను. "ఓ ప్రియమైన తల్లీ ! మీరు బాగున్నారా?"

పునీతవతి భక్తులకు తల్లివలె అహారమొసంగెను, దేవుడు మందును, తన భక్తులయందును భేదమును పాటింపడు. అతడి-ట్లు పలికెను. “భక్తులు నా హృదయమునందు వసింతురు. నేను వారి హృదయములలో వసింతును. వారు నన్ను వినా మరియొక దానిని తలంపరు. నేను వారికంటే ఇంకొకరిని తలంపను.

***శివుడు - శివపూజ***

పరమాత్ముడు సమస్త జీవుల హృదయములలో వసించును. కావున అతిథులు పూజింపఁబడవలయును. "అతిథి దేవో భవ” యని శ్రుతినుడువుచున్నది.

## అరువది ముగ్గురు నాయనారు సాధువులు

నాయనారులు శివునియొక్క విశ్వసనీయులైన భక్తులై యుండిరి. కొందరు అప్పర్ మఱియు సంబంధర్కు సమకాలికులై యుండిరి. కొందరు మాత్రమే ఆగమములను అధ్యయన మొన-ర్చిరి. శేషించిన వారు శుద్ధమైన మరియు సామాన్యమైన భక్తులైయుండిరి. వారు శివ భక్తులను సేవించి, శివునికి పూర్ణముగా అత్మ సమర్పణము నొనర్చిరి వారికి వేదాంతమనగా నేమి తెలి-యకుండెను. వారు చర్యను అభ్యసించిరి. వారు దేవాలయ ప్రాంగణములను శుభ్రమొనర్చిరి. దేవునికై పుష్ప హారములను సమకూర్చిరి. దేవాలయములలో దీపములను వెలిగించిరి. పూదో-

టలను పెంచిరి. మఱియు శివ భక్తులకు భోజనము నొసంగి, వారి-
ని సేవించిరి. శివ భక్తులను సేవించుట స్వయముగా శివుని
సేవించుటకంటె మిన్నగా తలంపఁబడు చుండెను.

నిజమైన భక్తియే ఆవశ్యకమైయున్నది. కన్నప్పకు శైవ సి-
ద్ధాంతముఁగూర్చి గాని, పూజా విధానముఁ గూర్చి గాని
తెలియకుండెను. అతడొక వేటకాడైనను, తన తీవ్రమైన భక్తి కార-
ణముచే

## *శివుడు - శివపూజ*

ఆరు రోజులలో శివ భక్తులు పొందు మహోన్నత స్థానము నొందె-
ను. సామాన్యముగా శివపూజ నొనర్చు వారి కంటె, కన్నప్ప యొక్క
భక్తి విధానము పూర్తిగా విభిన్నమై యుండెను.

కొందఱు నాయనారుల పేర్లు ఈ దిగువ పేర్కొనఁబడు చు-
న్నవి. నెడుమర నాయనార్, కన్నప్ప నాయనార్, సిరుతొండార్,
అప్పూడి అదిగళ్, మురుగనాయనార్, తిరునీలనక్క నాయనార్,
లి నాయనార్, గణనాథా నాయనార్, సెర్మన్ పెరుమాళ్ నాయనా-
ర్, సోమసి మార నాయనార్ మున్నగువారు.

తిరునీలకంఠ నాయనార్ చిరంబములో ఒక కుమ్మరి వాడై
యుండెను. ఎనాది నాయనార్ ఒక గౌండ్లవాడైయుండెను. తిక్కపు-
తొండర్ ఒక చాకలివాడైయుండెంను. అది పట్ట నాయనార్ ఒక
బెస్తవాడైయుండెను. నేననాయనార్ ఒక సాలెవాడై ఉన్నత కుల-
ములోని శివభక్తులు ఇతర కులముల లోని భక్తులతో కలసి
భుజించిరి. వారికి పర్ణవిభేదము లేకుండెను. క్షుద్రమైన వర్ణ విభే-

దాదులకంటె, శివభక్తి గల జీవితమే మిక్కిలి ప్రాముఖ్యమైనదని వారు తలంచిరి.

తిరునీలనక్క నాయనార్ ఒక రోజు పూజయొనర్చు చుండెను శివలింగముపై ఒక సాలెపురుగు పడెను. అతని భార్య వెంటనే దా-నిని పారద్రోలి, అది పడిన స్థలముపై ఉమ్మి వేసెను. ఆ సాధువు మిక్కిలి క్రోధపూరితుడయ్యెను. లింగము అపవిత్ర మైనదని అత-డు భావిం చెను. అతడు తన భార్యను త్యజింప దలచెను. కాని శివుడాతని కలలో



కనఁబడి, ఉమిసిన స్థలము మిగిలిన శరీరమంతయు సాలెపురుగు పతనముచే ఎట్లు పొంగిపోయినదో, ఆ సాధువుకు చూపించెను. దీ-నిచే ఆ సాధువు యొక్క నేత్రములు తెరువఁబడెను. శాస్త్ర జ్ఞానము కంటే భక్తి మిక్కిలి ప్రాముఖ్యమైనదని అతడిప్పుడు గ్రహించెను.

శివ భక్తుని ప్రీతినొందించుటకై సిరుతొండర్ తన స్వంత బి-డ్డను చంపి, తన స్వంత చేతులతో మాంసమును వండి పెట్టెను. తాను శైవధర్మముగా భావించిన దానిననుష్ఠించుటకై అతడు శాస్త్ర కూడ ఉల్లంఘించుటకు సమకట్టెను. అతడొక గొప్ప విద్వాంసుడు కాకుండెను. అతడొక వేదాంతి గాని, యోగిగాని, కాకుండెను. కాని అతడు శివ భక్తులపై మిక్కిలి భక్తిని కలిగి యుండెను. ఒక భక్తుని సేవించుటకై ఆతడెంతటి మహా త్యాగమొనర్చెనో చూచితిరా! శి-వుడు, పార్వతి మఱియు సుబ్రహ్మణ్య సమేతుడై దర్శనమొసంగి, సిరుతొండర్ను ఆశీర్వదించెను. భక్తుడు మఱియు మాంసపు

పళ్ళెరము మాయ మయ్యెను. సిరుతొండర్ బయటకు వెళ్ళి తన కుమారుని పిలిచెను. తనకొడుకు పరుగెత్తుచు అతని వైపు వచ్చె-ను. దేవుడు తన భక్తునికొరకై ఏదియైనను చేయుటకు సంసిద్ధుడై యుండెను.

కుంగిలిక్కలైయ నాయనారు, తిరుక్కదేవూర్ దేవాలయము లోని దేవునికి అగర్బత్తీలను సరఫరా చేయుచుండెను. అతడు తన ధనమంతయు పోగొట్టుకొనెను. ఇంటి యందేమియు లేకుం-డెను. అప్పుడు అతని భార్య అతనికి ఒక పళ్ళెము నొసంగి, దానికి బదులుగా బియ్యముకొని తెమ్మని చెప్పెను. నాయనార్ అగర్ బత్తీలను కొని దేవాలయమునకు తీసుకొనిపోయెను. ఆ రాత్రి దేవు-డు అతని భార్యకు



అమితమైన ఐశ్వర్యము నొసంగి, నాయనారున్ను ఇంటికి వెళ్ళి భోజ-నము చేయుమని చెప్పెను. తిరుప్పనందల్ దేవాలయములోని శివ లింగమును రాజు తిన్నగా నిలుపలేకపోయెనని నాయనార్ తె-లుసు కొనెను. లింగమునకు కట్టబడియున్న త్రాటిని తన మెడకు కట్టుకొని, అతడాలింగమును నిలబెట్టుటకై దానిని లాగెను లింగ-ము తిన్నగా నిలబడిపోయెను. ఇప్పుడు ప్రతియొక్కరికి నాయనార్ యొక్క తీవ్రమైన భక్తినిఁ గూర్చిన ప్రమాణము లభిం-చెను. నాయనార్కు వేదజ్ఞానముఁ గాని, ఆగమజ్ఞానము గాని లేకుండెను. కాని అతడు దేవుని నిజమైన భక్తుడైయుండెను. విశ్వా-సనీయమైన భక్తియే మన కావశ్యకమైయున్నది. శాస్త్రాధ్యయనముచే మానవునికి గర్వమేర్పడి, అతనిని దేవునికి

దూరమొనర్చును.

కన్నప్పనాయనార్ తన స్వంత నేత్రమును పెఱికి, రక్తము కారుచున్న శివుని నేత్రమునకు బదులుగా దానినమర్చెను. అతడు తన రెండవ నేత్రమును కూడ ఇవ్వఁదలంచెను. కాని శివుడు అరకుండా అతనిని అడ్డగించెను. కన్నప్ప తిరిగి తన నేత్ర దృష్టిని పొందినవాడై, ఆ క్షణము నుండి స్వయముగా దేవుడై, శివుని ప్రక్కన కూర్చుండు పదవిని పొందెను. ఆతడు రుద్రిని గాని, చనకమునుఁగాని ఉచ్చరింపలేదు. అతడు బ్రాహ్మణుడు తడొక వేటకాడై యుండెను. అతడు తన నోటిలోని జలముచే శివునికి అభిషేక మొనర్చి, తన జటయందున్న పుష్పములను క్రింద పడ వేసి, తన పండ్లచే పరీక్షించిన మంచి పంది మాంసమును శివుని కర్పించి, తన ఇచ్చానుసారముగా అతనిని పూజించెను. పండితులు శాస్త్రులు

## ***శివుడు - శివపూజ***

నెయ్యిన్నొక్క రుద్రి పాఠముల నొనర్చినను, వారియందు అణుమాత్రమైనను నిజమైన భక్తి లేని కారణముచే వారు దేవునికి సుదూరము నందుందురు. వారు పాషాణమువంటి నిష్ఫలమగు మరియు పాప భూయిష్టమైన కఠిన హృదయమును కలిగి యుందురు.

శివ భక్తులు కోరిన సమస్త పదార్థములను ఇచ్చు వ్రత మును ఐయర్పగై నాయనార్ కలిగియుండెను. శివుడాతనిని పరీక్షింపగోరెను. ఆతడొక దుర్నీతిపరుడైన బ్రాహ్మణ శివ భక్తుని వేషమును

ధరించి వచ్చెను. భక్తుడు నాయనార్ ను "నీ భార్యను నాకి-వ్వుమ"ని అడిగెను. నాయనార్ బుద్ధిపూర్వకముగా తన భార్యను అతని బంధువులు దీనిని నిరోధించి, అతనితో .. - పోరాడిరి. నా-యనార్ ఆ కపట యోగిని కాపాడుటకై అరణ్యము వరకు వెంబడించెను. అప్పుడా కపట యోగి మాయమై తన . నిజమైన రూపమగు వృషభారూఢుడై శివునిగా ప్రత్యక్షమయ్యెను.

దేవుని పూజకై శివకామ అండర్ స్వాధీనమునందున్న పుష్ప-ములను నశింపఁజేసినట్టి ఒక ఏనుగు మఱియు ఐదుగురు మనుష్యులను ఎరిపట్టనాయనార్ చంపివేసెను. శివుడు ప్రత్యక్ష-మై రాజును, నాయనార్ ను మరియు చచ్చి పడియున్న ఏనుగును, ఐదుగురు మనుష్యులను రక్షించెను.

శివునికి దైనిక సేవయగు ఎఱ్ఱని అన్నము నొసంగజాల కుం-డుటచే అరివట్టయ నాయనార్ తన గొంతు కోసికొనుట ప్రారంభించెను. శివుడు

### *శివుడు - శివపూజ*

అతడు తన గొంతు కోసికొనుటను నివారించి, తన స్థానమునకు గొంపోయెను.

మధురైలో మూర్తి నాయనార్ శివునికి చందన గంధమును సమర్పించుచుండెను చందనపు చెక్క దొరకనప్పుడతడు తన మోచేతిని ఇసుకరాయిపై కఠినముగా రుద్దుట ప్రారంభించెను. శి-వుడు దయాహృదయుడయ్యెను. నాయనార్ రాజుగా చేయఁ

బడెను. అతడు శివుని స్థానమును చేరెను.

హరిజనుడైన నందుడనెడి సత్పురుషుడు అగ్నియందు ప్ర-వేశించి, శివుని అనుగ్రహముచే తన భుజస్కంధము పై యజ్ఞోపవీతమును ధరించి, పవిత్రుడైన తపస్విగా బయటికి వచ్చెను.

తిరుక్కుప్పుతొండర్ చాకలివాడై యుండెను. అతడు శివ భక్తుల గుడ్డలను ఉతుకుచుండెను. శివుడు ఆతనిని పరీక్షింపఁగో-రెను. అతడు మిక్కిలి మురికియైన చింపిగుడ్డఁగల ఒక బీదవాని వలె కానఁబడెను. ఈ సాధువు ఆ చింపిగుడ్డను ఉతికెను ఆరోజు మి-క్కిలి వర్షముండుటచే, ఆ చింపిగుడ్డను ఆరవేయలేక పోయెను. ఆతడు హృదయమునందు మిక్కిలి బాధపడెను. ఆతడు గుడ్డలు ఉతికిన బండపై తన తలను బాదుకొనసాగెను. శివుడాతనికి కానఁ-బడి, ఆతనికి ముక్తి నొసంగెను.

శివుని అనుగ్రహముచే నామినంది అడిగళ్ నీటితో దీపము-ను వెలిగించెను. దైవానుగ్రహముచే భక్తుడు ఎట్టి కార్యము నైనను ఒనర్పగలుగును.

## *శివుడు - శివపూజ*

కాళికంబ కాయనారు శివభక్తులను తన ఇంటికి ఆహ్వా నించి, వారి పాద ప్రక్షాళనా నంతరము వారికి భోజనమొసంగు చుండెను. ఈకార్యమునందు ఆతని భార్య అతనికి సహాయము చేయుచుం-డెను. ఒకప్పుడు తన ఇంటిలో చాకిలి పని చేసిన వాడు

శివభక్తునిగా తన ఇంటికి వచ్చెను. ఎప్పటివలెనే నాయనా అతని పాదములను కడుగనారంభించెను. కాని అతని భార్య సహకరించుటకు నిరాకరించెను. నాయనారు ఆమె చేతులను నరికి వేసి, తానే స్వయముగా సేవ చేసెను. ఆతడు కూడా శివుని స్థానమును చేరెను.

కాళియ నాయనార్ తాను స్వయముగా సరఫరా చేసిన నూనెతో దేవాలయములో దీపములను వెలిగించుచుండెను. అతడు తన ఆస్తినంతటిని పోగొట్టుకొనెను. అతడు తన భార్యను అమ్మదలంచెను. కాని ఎవరున్నూ ఆమెను కొనలేదు. అప్పుడాతడు తన స్వంత రక్తమును నూనెకు బదులుగా వాడుదునని ప్రతిజ్ఞ చేసెను. ఇట్లు చేయుటకు ప్రయత్నించునప్పుడు శివుడాతనిని ఆశీర్వదించెను.

కనంపుల్ల నాయనార్ శివాలయములలో దీపములను వెలిగించుచుండెను. అతడు తన ఆస్తినంతటిని పోగొట్టుకొనెను. అతడు గడ్డికోసి దానిని అమ్మిన డబ్బుతో నూనెను కొనుచుండెను. ఒక రోజు అతడు గడ్డిని అమ్మజాలకుండుటచే ఆతడు గడ్డినే కాల్చి వేసెను. ఒక రోజు అతనికి గడ్డికూడా దొరకకుండెను. అతడు తన వెంట్రుకలను కాల్చుటకు ప్రయత్నము చేసెను. శివుడు నాయనారు పై తన అనుగ్రహమును ఒరపి, అతనిని తన ధామమునకు గొంపోయెను.

## ***శివుడు - శివపూజ***

శివునికై ప్రోగుచేయబడిన ఒక పుష్పమును వాసన చూచి అక-

స్మాత్తుగా భూమిపై పడవేసినందుకు సెరుత్తునైనాయ నార్ ఒక రా-ణియొక్క ముక్కును కోసి వేసెను ఈ విషయము రాజుకు తెలిసి రాణి యొక్క తలను కూడా నరికి వేయుమని మరియొక శిక్షను వి-ధించెను. అప్పుడు పుష్పవర్షము కురిసెను. రాజైన కలరుంగనాయనారు దైవానుగ్రహమునుఁబడసెను.

నాయనారులకు శైవ సిద్ధాంతముతోఁగాని, శైవ సూత్ర ముల-తోఁగాని ఎక్కువ సంబంధము లేదు. సామాన్య విధుల యొక్క మంచి చెడ్డలకు విరుద్ధమైయున్నను, వారు శివపూజకు ప్రాధాన్య-ము నొసంగిరి. వారు శివపూజ యొక్క బాహ్య విషయములకు మిక్కిలి గౌరవము నొసంగిరి. వారు తమ జీవితముల నొడ్డియైనను, ఈ బాహ్యరూపములను సంరక్షించుటకు ఏలాటి కార్యమునైనను చేయుటకు వెనుకాడ లేదు, మూఢ విశ్వాసముతో కూడిన దురభి-మానము కూడా పాపముగా పరిగణింపబడకుండెను.

ఈ నాయనారుల జీవిత చరిత్రలను బట్టి ఆతడెట్టి జాతి వా-డైనను, అతడేలాటి సేవ యొనర్చినను, ఆతడు దైవాను గ్రహము నొందఁగలుగునను విషయము స్పష్టముగా తెలియు చున్నది.

ఈ కాలములోని శైవులు శైవమతములోని దృఢమైన భక్తులై-యుండిరి. నాయనారులకు సర్వసామాన్యమగు నైతిక మఱియు ధార్మిక నియమములు వర్తింపకుండెను.



# 13వ అధ్యాయము

# పండుగలు

## అరుణాచల దీపోత్సవము

తమిళనాడులోని తిరువణ్ణామలైలో శివుడు ఒక పర్వత రూపముని ధరించెను. తమ తమ గొప్పఁదనమును గూర్చి పోరాడుచున్న బ్రహ్మ మఱియు విష్ణువు యొక్క గర్వమును శివుడిచ్చట అణచివేసెను. ఒక రోజు శివుడు ధ్యానస్థితుడై యుండగా పార్వతి అతనిని వదలి అరుణాచల పర్వతమునకు వెళ్ళెను. అచ్చట ఆమె తపస్సు నొనర్చెను. ఆమె గౌతమమునికి అతిథిగా నుండెను. ఈమె తపస్సు నొనర్చుచున్న కాలములోనే పార్వతిచే ఆజ్ఞాపింపఁబడిన దుర్గ మహిషాసురుని సంహరించెను. పార్వతి శివుని అరుణాచలేశ్వరునిగా దర్శించెను. ఆమె శివునిచే మరల తీసుకొనిపోబడి "అపీతకుచాంబ" నామముతో అర్ధనారిగా చేసుకొని, తన పార్శ్వమునందుంచుకొనెను.

అరుణాచలేశ్వరుడు తేజోలింగము పంచభూత క్షేత్రములలో అరుణాచలము అగ్ని తత్త్వమునకు సంబంధించి యున్నది.

తిరువణ్ణామలైకి అరుణాచలమనెడి మరియొక పేరు కలదు. పూర్వకాలములో అనేక సిద్ధపురుషులీపర్వతము నందు వసించిరి. ఇద్యకదర్, అరుణగిరినాథర్ ఇచ్చట నివసించిరి. కార్తీక నక్షత్రము నందు పౌర్ణమి వచ్చినప్పుడు ప్రతి సంవత్సరము కార్తీకమాసము (నవంబరు)లో కార్తీక దీపమును వెలిగించుటకీ స్థలము ప్రఖ్యాతి

వహించినది. ఈదీపమును సాయంకాలము 5 లేక 5-30 గంటలకు వెలిగింతురు. ఒక పెద్ద రాయిలోని గోతి యందు నెయ్యి, నూనె మఱియు కర్పూరమును నింపుదురు. నేతియందొక పెద్దవత్తిని వే-సి వెలిగింతురు. ఈ జ్యోతిని పదు నారు మైళ్ళ దూరమునుండి కూడా చూడవచ్చును. ఈ జ్యోతిని దర్శించినవారికి పునర్జన్మ లేద-ని చెప్పుదురు. ఈ జ్యోతి అఖండముగా మూడు మాసముల వరకు వెలుగుచుండును.

అరుణాచల పర్వతము పై ఈ జ్యోతి చుట్టు ఒక పరదా. ఉం-చబడును. కార్తీక నక్షత్రము వచ్చిన వెంటనే ప్రజలు ఈశ్వర విగ్రహమును సాయంకాలం 5.30 గంటలకు దేవాలయము నుండి బయటికి తీసుకొని వత్తురు. అప్పుడు కొండలోని జ్యోతి వైపు ఒక బాణము ఆకాశము నందు విడువఁబడును. కొండలోని జ్యోతికై ని-యమింపఁబడిన వ్యక్తి వెంటనే ఆ పరదాను. తొలగించును. అప్పుడు ప్రజలందఱు ఒక పెద్ద జ్యోతిని దర్శించి, చేతులను జో-డించి నమస్కరించి, ఆరాధింతురు. వారు 'హరహరా, హరోహర' యని పెద్దగా ఉచ్చరింతురు.

దీని అంతరార్థమేమనగా నిరంతర ధ్యానముచే మానవుని హృదయ గుహయందు శాశ్వతముగా వెలుగుచున్న పరంజ్యోతిని ఎవ్వరు దర్శింతురో, వారు అమృతత్వమునొందుదురు. ఆత్మ, లేక పరమశివుడు స్వయంప్రకాశము, జ్యోతిస్వరూపము, పరం జ్యోతి, సూర్యులకు సూర్యుడనెడి సందేశమును అరుణాచల జ్యోతి మనకొసంగెను.

పర్వతములోని మహాజ్యోతి పరమశివుడు, లేక పరమాత్మను సూచించును. బాణమే జీవుడు. జీవుని కప్పి చేయునట్టి అవిద్యయే పరదా. బాణము పరదాను దహింపఁ జేసి, అది స్వయముగా మహా-జ్యోతియందు లయించును. అదే విధముగా నీవు ధ్యానము మఱియు విచారణయనెడి అగ్ని చే విద్యను నశింపజేతు వేని పర-మాత్మ, లేక పరంజ్యోతియందు లయింపఁగలుగుదువు.

కంచి జంబుకేశ్వరము, తిరువణ్ణామలై, కాళహస్తి చిదంబర-ము ఈయైదున్నూ భూతలింగ క్షేత్రములని చెప్పఁబడును. పృథ్విలింగము కంచియందున్నది. జంబుకేశ్వరము నందు ఆపఃలింగమున్నది. తిరువణ్ణామలైలో తేజోలింగమున్నది. కాళ-హస్తిలో వాయు లింగమున్నది. చిదంబరము నందు ఆకాశలింగమున్నది.

ఈ సమస్త ప్రపంచమునకు కారణమై యున్న పంచ భూత-ములను సూచించు త్రిగుణాత్మకములగు పంచకోణ శిఖరమును ఈయైదు స్థలములు సూచించును. ఈ పంచ భూతములకు మధ్య తేజస్తత్వమున్నది. జీవుడు పరమాత్ముని, లేక పరమశివుని పొందు మార్గమునిది మనకు వ్యక్త మొనర్చును. ధ్యానమనెడి అగ్ని జీవుని అవిద్యను భస్మమొనర్చి. ఆతడు పరంజ్యోతి యందైక్యమగునట్లు సహకరించును.

వాక్కే బ్రహ్మమని వేదాంతి పలుకును. వాక్కే అగ్నియని అతడు నిరూపించి, తన ఐక్యతా సిద్ధాంతమును ఊహించును.

అగ్నియే వాక్కునకు అధిష్ఠాన దేవత. వాక్కే అగ్ని. వాక్కే బ్రహ్మ-
ము.

## *శివుడు - శివపూజ*

రాత్రి పగలుగాని కాని సమయమునందు, సూర్య చంద్రులు కలిసి ప్రకాశించుచున్నప్పుడు పంచమూర్తులు, లేక

పంచతత్త్వములు కలియును. పర్వతముపైన జ్యోతి పదునా-రు మైళ్ళ దూరము నుండి కానఁబడును. ఇది పూర్ణకళ, లేక బ్రహ్మమును సూచించును.

యోగి ధ్యాననిష్ఠలో సహస్రారమునందు జ్యోతినిఁ గాంచును. అరుణాచల పర్వతశిఖరము సహస్రారమును సూచిం చును. ని-ర్వికల్ప సమాధిద్వారా యోగి సహస్రారమునందు లయించును.

అణవ, కర్మ మరియు మాయయనెడి మంత్రయమును తొల-గించుము. ఆత్మజ్ఞానము, లేక శివజ్ఞానమనెడి అగ్ని యందు మనస్సు, ఇంద్రియములు మఱియు వాసనలను దహించి వేయు-ము మనస్సు, బుద్ధి, సూర్యుడు, నక్షత్రములు, విద్యుత్తు, అగ్నులను ప్రకాశింపఁజేయు జ్యోతులకు జ్యోతియైన పూర్ణప్రకాశ-మునొందుము. ఇదియే నిజమైన కార్తీక దీపము.

మిమ్ములనందరిని ఆ పరంజ్యోతి ప్రకాశింపఁజేయునుఁ గాక శివుడు మీకు అధికమైన ప్రకాశము నొసంగును గాక ! మీరు ఈ పరంజ్యోతియందు లయించి, అమృతత్వమనెడి శాశ్వతానంద-మునుఁ బడయుదురుఁగాక!

# విజయ దశమి

దేవుని మాతృరూపము శక్తి, సంపద మరియు విద్యలకు మూలమైయుండుటచే నవరాత్రి, లేక దసరా సమయములో దుర్గ, లక్ష్మి మఱియు సరస్వతిగా ఆరాధింపఁబడు చున్నది, ప్రతి రూపము మూడు రాత్రులు పూజింపఁబడును.

ఆశ్వయుజ శుక్ల దశమిరోజు విజయదశమి వచ్చును. ఇది భారతదేశమునందంతటను మిక్కిలి శోభాయమానముగా జరుపఁబడు గొప్ప ప్రేరణదాయకమగు ఉత్సవము.

దుష్టులైన కౌరవులతో పోరాడుటకు ముందు పాండవ వీరుడైన అర్జునుడు విజయదశమిరోజు దేవిని పూజించెను. ఈ దినమునందే రాముడు రావణుని రణరంగమునందు చంపెను.

ఇది విజయము నొసంగు దినము. ఈ రోజే బాలురను పాఠశాలలో ప్రవేశ పెట్టుదురు. "హరి ఓం నారాయణ సిద్ధం " "ఓం శ్రీ గణేశాయ నమః" "ఓం శ్రీ హయగ్రీవాయ నమః" మున్నగునవి వారికి నేర్పఁబడును. ముముక్షువులు ఈ రోజు మంత్రదీక్షను స్వీకరింతురు.

అదర్శవంతమగు ఈ దినమునందు వడ్లవాడు, మేర వాడు, తాపీ పనివాడు, కళాకారుడు, గాయకుడు, మైపుచేయు వాడు మఱి-

యు సమస్త శిల్పకారులందఱును తమ పరికరములను మరియు సాధనములను పూజింతురు. ఇది ఆయుధపూజ యనఁ బడును. ఈ పరికరముల వెనుక

## *శివుడు - శివపూజ*

దాగియున్న శక్తిని వారు గుర్తించి . తమ విజయము, శాంతి మఱి-యు సంపదకై దేవిని ఆరాధింతురు.

శ్రీ రాముడు భారతీయ సమైక్యతను నిర్మించెను. లంకను రా-జధానిగా చేసుకొని, భారత దేశములోని అనేక రాజ్యముల వాక్రమించుకొన్న రావణుని శ్రీరాముడు జయించెను. విజయ దశ-మి సమైక్య భారతదేశము యొక్క వార్షికోత్సవముగా పరిగణింపఁబడును. శ్రీరాముడు రాక్షస రాజైన రావణుని జయిం-చిన దానికి స్మారకముగా ఈ విజయదశమి జరుపఁబ డును. అధర్మముపై ధర్మము యొక్క విజయపతాకమునకిది యొక చి-హ్నము వంటిది.

విభీషణుని నాయకునిగా చేసుకొని అంగద హనుమం తాదు-లు శ్రీ రాముడు రావణునిపై విజయము సాధించిన నాటి ఉత్సవమును జరిపి, పరస్పరము ఆలింగనమొనర్చు కొని, శ్రీరా-మునిపై తమకు గల స్నేహభావమును, గౌరవ భావమును భక్తి భావమును ప్రదర్శించిరి. ఆ రోజు నుండి హిందువులందఱిచే ఈ యుత్సవము ప్రతి సంవత్సరము జరుపఁబడు చున్నది.

రావణునిపై రాముని విజయము జడపదార్థముపై చైతన్యము

యొక్క విజయము వంటిది. రజస్సు మఱియు తమస్సు లపై సత్త్వము యొక్క విజయమువంటిది. మనస్సు, ఇంద్రియము మరియు శరీరముపై ఆత్మ యొక్క విజయము వంటిది. జగత్సత్య-మను వాదముపై జగన్మిథ్యయను వాదము యొక్క విజయము వంటిది. దుర్గుణముపై సద్గుణము యొక్క విజయము వంటిది. అసూయ

## శివుడు - శివపూజ

మరియు అసత్యముపై ప్రేమ మరియు సత్యము యొక్క విజయ-ము వంటిది. స్వార్థపరత్వము మరియు సంచయబుద్ధిపై అత్మత్యాగము మరియు సన్న్యాసము యొక్క విజయమువంటిది. హింసించువానిపై హింసింపఁబడు వాని విజయము వంటిది. ధని-కులు మరియు అధికారులపై కూలివారి విజయము వంటిది. ఈ స్మారక దినము బీదవారికి మరియు క్రుంగిపోయిన వారికి ఆశను మరియు ఆనందము నొసంగును. ఇది ధనికులు, బలవంతులు మరియు విద్వాంసుల గర్వమునణచి బీదవారిని, బలహీనులను మరియు నిరక్షర కుక్షులను ప్రేమ తోను, భ్రాతృభావముతోను ఆలింగన మొనర్చుకొనునట్లు వారికి ప్రేరణనొసంగును. సమస్త వర్గములలోని ప్రజల సమైక్యతకై ఇది జాగృతిని కలుగజేయును.

ఇట్లే విజయదశమి విశ్వసమైక్యత, భ్రాతృత్వము, శాంతి మరియు అనందములను వెదజల్లు ఉత్సవముగా శోభిల్లుచున్న-ది.

శాక్త పురాణములు దీనిని మరియొక విధముగా వ్యాఖ్యా నిం-

చును. రాముడు తన స్వంత బలపరాక్రములచే విజయమును సాధించుటకు ప్రయత్నమొనర్చి విఫలుడయ్యెను. తదనంతరమా తడు తన అహంకారమును మహాశక్తి, లేక దేవికి సమర్పించి, ఆమె చేతులలో తానొక పరికరముగా మారెను, అటు పిమ్మట దేవియే నిజముగా రావణునితో యుద్ధమొనర్చి, రామునికి విజయమును చేకూర్చెను.

దేవతలు -అసురులకు మధ్య, సత్త్వము మరియు రజస్త మములకు మధ్య, మానవుని యందున్న పాపపుణ్య వృత్తుల మధ్య ఒక

### *శివుడు - శివపూజ*

శాశ్వతమగు యుద్ధము కొనసాగుచున్నది, సాత్త్విక శక్తులకు దేవతలు ప్రాతినిధ్యమును వహింతురు. దుష్టశక్తులకు అసురులు, లేక రాక్షసులు ప్రాతినిధ్యమును వహింతురు. మోహము, క్రోధము, పేరాస, అహంకారము, ద్వేషమనెడి దుష్ప్రవృత్తులను హతమార్చి, జగజ్జనని యొక్క అనుగ్రహముచే ఆత్మజ్ఞానమునుఁబడసిన దినమే నిజమైన విజయదశమి, లేక అనాత్మపై అత్మ విజయమును సాధించిన దినమని చెప్పఁబడును.

దుర్గాదేవి మానవజాతికి ధర్మమార్గమును ప్రబోధించి వారికి శాంతి, సంతృప్తి, సంతోషములను మరియు మోక్షా నందము నొసంగునుగాక !

# దసరా

దేవిని పూజించుటకు దసరా హిందువులకొక గొప్ప పండుగ. ఈ ప్రపంచమునందు హిందూమతము, మాత్రమే దేవుని మాతృ-త్వమును బలపఱచు మతమైయున్నది. మానవులందరికి తల్లి ప్రియతమము మరియు మధురతమమై భాసించును. కావున దేవు-ని తల్లిగా భావించుట భావ్యమేయగును.

దసరా, దుర్గాపూజ మఱియు నవరాత్రి ఒకే అర్థము నొసంగు-ను. శివుని శక్తియే దుర్గాదేవి. ఆమె పరమాత్ముని శక్తికి ప్రతీకమువంటిది. దేవుడు మఱియు ఆతని శక్తి యందు భేదము లేదు. ఆమె ప్రపంచము



యొక్క బాగోగులను చూచుకొనును. దివ్యజనని యొక్క అంశయగు దుర్గాదేవి యొక్క పదిచేతులలో పది ఆయుధములు ఉండును. ఆమె ఒక సింహము పై కూర్చుండును, క్రూరశక్తికి ప్రతీకమగు సిం-హమును వాహనముగా చేసికొనుటచే ఆమె సమస్త శక్తులను తన స్వాధీన మొనర్చుకొన్నట్లు తెలియుచున్నది.

దేవతలు, మనుష్యులు, పశువులు, సముద్రములోని జీవుల-న్నింటియందు వ్యక్తమగు పరమాత్ముని శక్తియు జగజ్జ ననితో అనబిర్ణముని పుత్రియగు వాక్కుతాదాత్మ్యమునొందిన ఒక విష-యము ఋగ్వేద సంహితలోని దేవీ సూక్తమునందు నీకు

లభించును.

జగజ్జనని ఇంద్రునికి మఱియు దేవతలకు జ్ఞానము నొసంగె-నవియు మఱియు పరమేశ్వరుని శక్తి యొక్క సహాయము చేతనే దేవతలు రాక్షసులను ఓడింపఁగలిగిరనియును కేనోపనిషత్తును-డువును.

మహిషాసురుడనెడి మహా అసురుడు దేవతలను మిక్కిలి బా-ధించుచుండెను. దేవతలు దుర్గాదేవియొక్క సహాయమును అర్థించిరి. ఆమె పదితలలు మఱియు ఆయుధములుఁగల పది చేతులున్న రూపమును ధరించి, అసురుని సంహరించెను. దేవి భాండాసురుడు మరియు అతని శక్తులతో తొమ్మిది పగళ్ళు, తొ-మ్మిది రాత్రులు యుద్ధమొనర్చి, పదియవరోజు సాయంకాలము సమస్త అసురులను నశింపఁజేసెను. ఇదియే విజయ దశమియని చెప్పఁబడును. ఈ పదిరోజులున్నూ దేవికి పవిత్రములై యున్నవి.

## *శివుడు - శివపూజ*

బెంగాల్ దేశములోని హిందువులు విజయదశమికి ముందు మూడురోజులు దుర్గాదేవిని పూజించి, విజయదశమి రోజు ఉద్వా-సన కార్యక్రమమును జరుపుదురు. వసంతపూజ (మార్చి-ఏప్రిల్) సమయములో కూడా దుర్గాదేవి పూజింపఁబడును.

హిమవంతుని భార్యయగు దుర్గాదేవి యొక్క తల్లి తన కూతు-రగు దుర్గను చూడఁగోరును. సంవత్సరమునకు మూడురోజులు మాత్రమే తన తల్లిని చూడవచ్చునని దుర్గాదేవికి శివుడు అనుమ-తి నొసంగెను. దుర్గాదేవి తన తల్లి వద్దకి వచ్చి, మరల విజయ

దశమిరోజు కైలాసమునకు వెళ్ళు ఈ మూడు రోజులలో దుర్గాపూజ జరుపబడును.

రావణునితో యుద్ధమొనర్చు సమయములో శ్రీ రాముడు తనకు యుద్ధములో సహాయమొనర్చుటకై విజయదశమికి ముందు దుర్గాదేవిని పూజించెను. ఆమె యొక్క అనుగ్రహముచే అతడు యుద్ధమొనర్చిజయించెను.

బెంగాల్ దేశమునందు దుర్గాపూజ ఒక పెద్ధ ఉత్సవము. ఇంటికి దూరముగానున్న వారందరు పూజాదినములలో ఇంటికి తిరిగి వత్తురు. తల్లులు దూరముగానున్న తమ కొడుకులను, కూతుర్లను మరియు భార్యలు తమ భర్తలను ఈదినములలో కలిసికొందురు.

కుమ్మరి వాడు మూర్తులను తయారుచేయుటలోను, కళా కారుడు బొమ్మలు వేయుటలోను, గాయకుడు తన వాద్య నినాదము చేతను మఱియు పండితుడు సద్గ్రంథపఠనము నందును తననేర్పును

## ***శివుడు - శివపూజ***

సంపాదించిన ధనమంతటిని ఈ పూజా దినములలో ఖర్చు పెట్టుదురు. వస్త్రములను కూడా వితరణ యొనర్తురు.

బెంగాల్ దేశములోని హైందవ స్త్రీ దేవిని తల్లి ప్రేమతో ఆహ్వానించి, చివరిరోజు ఆమె తన భర్త ఇంటికి వెళ్లునప్పుడు తన కళ్ళలో నీరు తెచ్చుకొని, దేవిని సాగనంపును.

మీరందఱు దుర్గాదేవిని భక్తిశ్రద్ధలతో ఆరాధించి, ఆమె యొ-క్క అనుగ్రహము ద్వారా శాశ్వతానందమును మరియు అమృతత్వమును బడయుదురు గాక ! విశ్వమునకు మాతాపిత-లైన జగజ్జనని దుర్గాదేవికి మఱియు జగత్పితయగు శివునికి జయమగునుఁగాక !.

## వసంత నవరాత్రి

వసంత నవరాత్రి సమయములో దేవి పూజింపఁబడును. వసంతకాలమునందిది ఏతెంచును. దేవీపూజ స్వయముగా ఆమె యొక్క ఆజ్ఞచే విధింపఁబడినది. దేవీ భాగవతములోని ఈ క్రింది ఉపాఖ్యానము ద్వారా ఈ విషయము మనకవగతమగును.

చాలాకాలము పూర్వము సూర్యవంశములోని రాజైన ధృవ-సింధువు కోసల రాజ్యమును పాలించెను. అతనికి మనోరమ మరియు లీలావతి యనెడి ఇద్దరు భార్యలుండిరి. మనోరమ పెద్ద భార్య. ఇద్దరికి ఇద్దరు అందమైన కుమారులు జన్మించిరి. మనో-రమ కుమారునికి



సుదర్శనుడనియు, లీలావతి కుమారునికి శత్రుజిత్తనియును నా-మకరణమొనర్పఁబడెను.

ధృవసింధువు వేటాడుటకు వెళ్ళినప్పుడు అతడొక సింహ-

ముచే చంపఁబడెను సుదర్శనుని పట్టాభిషిక్తునిగా ఒనర్చుటకై సన్నాహములు జరుగుచుండెను. కాని లీలావతి తండ్రియైన ఉజ్జయిని రాజగు యుధాజిత్తు మరియు మనోరమ తండ్రియైన కళింగరాజగు వీరసేనుడు తమ మనుమడే కోసల దేశమునకు పట్టాభిషిక్తుడు కావలయునని పరస్పరము కోరుచుండిరి. వారు పరస్పరము పోరాడిరి. యుద్ధమునందు వీరసేనుడు మరణించెను. యువరాజైన సుదర్శనుడు మఱియు ఒక నపుంసకునితో కలిసి మనోరమ అరణ్యమునకు పారి పోయెను. వారు భరద్వాజఋషి యొక్క ఆశ్రమమును శరణుం జొచ్చిరి.

కోసల దేశమునకు ముఖ్యపట్టణమైన అయోధ్యయందు యుధాజిత్తు తన మనుమడైన శత్రుజిత్తును పట్టాభిషిక్తునిగా నొనర్చెను, మనోరమ మరియు ఆమె కుమారుని బంధించుటకై అతడు ప్రయత్నించెను. కాని అతనికి వారు లభింపకుండిరి, కొంతకాలమునకు వారు భరద్వాజ ఋషియొక్క ఆశ్రమము నందున్నట్లు అతడు తెలిసికొనెను.

వెంటనే ఒక పెద్ద సైన్యముతో ఆశ్రమమునకు బయలుదేరెను. యుధాజిత్తు దురహంకారముఁగలవాడై మనోరమను, ఆమె కుమారుని తన వశమొనర్చుమని భరద్వాజఋషిని కఠినముగా అడిగెను. తనను శరణుఁ జొచ్చిన వారిని ఇవ్వఁజాలనని ఋషి ప్రత్యుత్తర మొసంగెను.

## ***శివుడు - శివపూజ***

యుధాజిత్తు మిక్కిలి క్రోధపూరితుడయ్యెను. అతడు ఋషిని

ఎదుర్కొనఁ దలంచెను కాని ఆ ఋషి యొక్క సామర్థ్యమునుఁగూ-ర్చిన సత్యమును అతని మంత్రి వెల్లడించెను. యుధాజిత్తు తన ముఖ్యపట్టణమునకు తిరిగి వచ్చెను.

యువరాజైన సుదర్శనునిపై అదృష్టము తాండవమాడ సా-గెను. ఋషిపుత్రుడు నపుంసకుని "క్లీబ" యని పిలచు చుండెను. యువరాజు "క్లీ" యను శబ్దమును మాత్రము జ్ఞప్తి యందుంచుకొని, "క్లీం" అని పలుకనారంభించెను. ఈ యక్షరము శక్తివంతమైన, పవిత్రమైన మంత్రము ఇది పరాశక్తి యొక్క బీజాక్షరము. ఈ యక్షరమును మరల మరల ఉచ్చరించుటచే యువరాజు మన-శ్శాంతిని మఱియు జగజ్జనని యొక్క అనుగ్రహమును పొందెను. దేవి అతనికి దర్శనమొసంగి, ఆతనిని అతనికి దివ్యాస్త్రములను మఱియు అనంతమైన అమ్ములపొది నొసంగెను.

కాశీ రాజు యొక్క గూఢచారులు ఈ ఋషి ఆశ్రమ మునకు వచ్చి, యువరాజై న సుదర్శనునిఁ గాంచి, కాశీ రాజు కూతురైన శశి-కళయనెడి యువరాణికి తెలియఁజేసిరి.

ఒక స్వయంవరము ఏర్పాటు చేయఁబడెను. శశికళ సుదర్శ-నుని వరించెను, యుధాజిత్తు కూడా అచ్చటనేయుండెను శశికళ సుదర్శనుని పెండ్లాడెను. యుధాజిత్తు కాశీ రాజుతో యుద్ధము ప్రారంభించెను. దేవి సుదర్శనునికి మరియు అతని మామగారికి



సహాయ మొనర్చెను. యుధాజిత్తు దేవిని గూర్చి పరిహాసమొనర్చె-

ను. దేవి యుధాజిత్తును మరియు అతని సైన్యమును భస్మ మొన-
ర్చెను.

సుదర్శనుడు, అతని భార్య, అతని మామ దేవిని స్తుతించిరి. ఆమె మిక్కిలి సంతసించి, హెూమాది సహితముగా తన పూజను ఆషాఢ, ఆశ్వయుజ, మాఘ మరియు చైత్ర మాసములలో శుక్ల ప్రథమ మొదలుకొని నవరాత్రుల వరకు చేయుమని వారిని ఆజ్ఞాపించెను. అప్పుడామె అంతర్ధానము నొందెను.

తదనంతరము యువరాజైన సుదర్శనుడు, యువ రాణి యైన శశికళ భరద్వాజఋషి ఆశ్రమమునకు తిరిగి వచ్చిరి. మహర్షి వారిని ఆశీర్వదించి, సుదర్శనుని కోసల రాజుగా పట్టాభి షిక్తునొనర్చెను. సుదర్శనుడు, శశికళ మరియు కాశీరాజు దేవి యొక్క ఆజ్ఞకు తిరుగు లేకుండా నాలుగు మాసములలోని నవ రాత్రులను శోభాయమానముగా ఆచరించిరి.

సుదర్శనుని తరము వారైన శ్రీరాముడు మరియు లక్ష్మణుడు కూడా వసంతనవ రాత్రులలో దేవీపూజ నొనర్చి, సీతాదేవిని తిరిగి పొందుటలో ఆమె యొక్క సహాయమునార్జించిరి.

సుదర్శనుడు మరియు శ్రీ రాముని ఆదర్శముగాఁగొని నీ భౌతిక మరియు ఆధ్యాత్మిక శ్రేయస్సు కొరకై వసంతనవరాత్రి సమయములో పూజ నొనర్చుట నీ కర్తవ్యమైయున్నది. తల్లి యొక్క ఆశీర్వాదములు లేకుండా నీవు దేనిని కూడా సాధింపఁజాలవు. జగజ్జనని యొక్క స్తోత్రములను పాడుము. ఆమె యొక్క మంత్రమును మరియు

నామమును ఉచ్చరించుము. ఆమె యొక్క రూపమును గూర్చి ధ్యానించుము, పూజ యొనర్పుము. ప్రార్థించి ఆమెయొక్క శాశ్వ-తమైన అనుగ్రహమును మరియు ఆశీర్వాదములను పొందుము.

## గౌరీపూజ

గౌరీదేవి లేక పార్వతి శివుని అర్ధాంగిని. ఆమె శివుని యొక్క శక్తి ఆమె భారతీయ మహిళలందరికి గొప్ప ఆదర్శ వంతురాలు, ఆమె స్త్రీ ధర్మములన్నింటికి పూర్ణ ప్రతిరూపము కన్యలు తమకు తగిన వరుని పొందుటకై గౌరీదేవిని పూజించి అమె యొక్క అనుగ్రహము-ను మఱియు ఆశీర్వాదముల నర్థింతురు. తమ భర్తలకు దీర్ఘజీవనమును ప్రసాదించుటకై వివాహితలైన స్త్రీలు కూడా ఆమెను ఆరాధింతురు.

ఆమెను స్మరించుటకై కొన్ని ప్రత్యేక పవిత్రదినములు విధిం-పఁబడినవి. ఈ రోజులలో హైందవ స్త్రీలు ఉపవసించి, పారణకు ముందుగా చంద్రుడు వికసించుచున్న సమయములో గౌరీపూజ నొనర్తురు.

# 14వ అధ్యాయము

## శివయోగమాల

## శైవమత గ్రంథములు

ఇరువది ఎనిమిది శైవాగమములు, తేవారము మఱియు తిరువాచకము దక్షిణ దేశ శైవమతమునకు మూలకందములు, క్రీ శ. 1000లో నంబి అండర్ నంబిచే సంకలన మొనర్పఁ బడిన సామూహిక పద్యములు తిరుమురైయని చెప్పఁబడును. తేవారమునందు సంబంధర్, అప్పర్ మఱియు సుందరర్ యొక్క పాటలుండును. మాణిక్యవాచకర్ యొక్క పాటలు తిరువాచక మని చెప్పఁబడును.

శైవ సిద్ధాంతమని చెప్పఁబడు ఆగమంత 28 సంస్కృత ఆగమముల యొక్క సారము. వేదము యొక్క అంతరార్థమే ఆగమంతయనఁబడును.

11వ శతాబ్దములోని నక్కియర్ యొక్క పెరియపురాణము నందు అరువది ముగ్గురు శివభక్తుల యొక్క వర్ణనకలదు.

తిరువాచకమునందు సాటిలేని, మహిమోపేతములైన ఆధ్యాత్మిక అనుభవములను తెలుపు ఏబదియొక్క పాటలున్నవి. డాక్టర్ జి.వి.పోప్ దీనిని ఆంగ్ల భాషయందనువదించెను.

సుప్రసిద్ధమైన శివజ్ఞాన బోధము యొక్క గ్రంథకర్తయైన మే-

వేదాంత సంచలనమును ప్రారంభించెను. శివజ్ఞాన బోధము గౌరవ ఆగమములోని పంద్రెండు శ్లోకములకు వ్యాఖ్యానముగా పరిగణింపఁబడును. శైవ సిద్ధాంత దృష్టికీ గ్రంథము ప్రామాణికమైయున్నది. దీనియందు శైవ సిద్ధాంత జ్ఞానమొక క్రమబద్ధముగాను, సంక్షిప్తముగాను అమర్పఁబడినది ఇది తమిళ ప్రజల నేత్రములను తెఱచి, వారిని పరమజ్ఞాన సముపేతులను నొనర్చెను. మేయకందర్ మహాపురుషుడు ఈ సిద్ధాంతమును నలుబది తొమ్మండుగురు శిష్యులకు ప్రబోధించి, దానిని ప్రజానీకమునకు పరివ్యాప్తమొనర్చెను.

మేయకందర్ యొక్క నలుబదితొమ్మిదిమంది శిష్యులలో మొదటివాడైన అరుల్నంది శివాచార్యర్ ప్రముఖ గ్రంథమైన శివజ్ఞానసిద్ధియర్ను రచించెను. అతడు ఇరుప - ఇరుపతు యనెడి గ్రంథము కూడా రచించెను.

పదమూడు మరియు పదునాల్గవ శతాబ్దములలో ప్రామాణిక శై వసిద్ధాంత శాస్త్రములనెడి పదునాలుగు వేదాంత గ్రంథములు రచింపఁబడెను. అవి ఏవనగా :- తిరువుండియర్, తిరుకలిత్రు పదియర్, శివజ్ఞానబోధమ్, శివజ్ఞాన సిద్ధియర్, ఇరుప-ఇరుపత్తు, ఊమైవిలక్కమ్, శివప్రకాశమ్, తిరుఅరుల్ పయన్, వీణవెంబ, పఠ్రిపతిరొడై, కొడిక్కావి, నెంజువీడు తూత్తు, ఉన్మైనెరివిలక్కమ్ మఱియు శంకర పాణిగ్రహణమ్.

శివప్రకాశమ్ మఱియు తిరుఅరుల్ పయన్ అను సుప్రసిద్ధ మగు రెండు గ్రంథములను, ఉమాపతి శివాచార్యర్ 14వ శతాబ్ద-ములో



రచించెను. ఈతడు ఇతరములగు శాస్త్రషట్కమును కూడా రచిం-చెను. 12వ శతాబ్ది మధ్యభాగములో తిరు వియలూర్ నివాసియగు ఉయ్యవంద దేవనాయనార్ తిరువెండియర్ను సంకలనమొన-ర్చెను. తిరుక్కడవూర్ వుయ్యవంద దేవనాయనార్ “తిరుకాళి త్రుపదియర్" అను గ్రంథమును రచించెను.

మేయకందర్ యొక్క మరియొక శిష్యుడైన మానవా సగంక-దంతర్ పదునాల్గు శాస్త్రములయందొకటియైన ఉనై విలక్కమ్ను రచించెను.

శై వసిద్ధాంత ప్రతిపాదితనుగు తిరుమందిరమ్ మిక్కిలి ప్రా-మాణిక గ్రంథముల యందొకటియై యున్నది. దీనిని తిరుమూలనాయనార్ రచించెను. ఈ గ్రంథము నాధారముగాఁ గొ-ని తదనంతర శైవ సిద్ధాంత వేదాంత భవనము నిర్మింపబడెను. సంస్కృత ఆగమములలోని శైవ సిద్ధాంతము ఈగ్రంథమునం దనువదింపఁబడినది. మూడువేల సంవత్సరములలో మూడు వేల శ్లోకములు రచింపఁబడిన గ్రంథమిది. దీనియందు శైవమత-ము మరియు దర్శనము యొక్క సాంకేతిక మరియు ఆచరణాత్మకములగు అంశములు చర్చింపబడినవి.

ఆదిగ్రంథమైన జ్ఞానామృతమునందు సిద్ధాంతమునకు సం-

బంధించిన అంశములు ఆధునిక విజ్ఞాన వైఖరి కనుగుణము గా వివరింపఁబడినవి.

శైవ సిద్ధాంతము వేదములు మరియు ఆగమముల సాంప్ర-దాయము పై ఆధారపడియున్నది. 14వ శతాబ్దము దున్న నీలకంఠుడు ఈ రెండింటిని క్రమబద్ధముగా సమన్వయ పఱచెను.

## *శివుడు - శివపూజ*

ఆతడు బ్రహ్మసూత్ర భాష్యమును కూడా రచించెను. ఆతడు దాని-ని శైవసిద్ధాంత శైలియందు వ్యాఖ్యానించెను.

అప్పయ్యదీక్షితుని భాష్యమగు శివార్కమణిదీపిక గొప్ప అమూల్య గంథమైయున్నది.

శివపురాణము, లింగపురాణము, శివపరాక్రమము, తిరు విల-యడల్ పురాణము, పెరియపురాణములలో శివుని మహిమ విస్తరింపఁబడి యున్నది. ఈ గ్రంథములు తమిళ భాషయందను వదింపఁబడినవి. భక్తవిలాసమొక సంస్కృత గ్రంథము. ఇది స్కం-ధపురాణము పై ఆధారపడియున్న ఒక ఉపపురాణము వంటిది.

కాశ్మీర్ లోయలో సంస్కృత భాషయందు ఇరువది ఎనిమిది అగమములు రచింపఁబడెను. ఈ యాగమంత జైనమతము ప్ర-ఖ్యాతివహింపక పూర్వమే ఉత్తర హిందూ దేశమునందు ఉద్భవించెను. అది అచ్చట సత్యభిజ్ఞదర్శనమను పేరుతో వి-ఖ్యాత మయ్యెను, తదనంతరమది పశ్చిమమునందు మరియు దక్షిణము నందు పరివ్యాప్తమయ్యెను. పశ్చిమభారతమునందది వీర మహేశ్వరదర్శన మఱియు మరియు దక్షిణ భారతమునందు

శుద్ధ శైవదర్శనమనియు చెప్పఁబడును. వీరమాహేశ్వరులు లింగ పురాణమును మిక్కిలి గౌరవభావముతో అధ్యయన మొనర్తురు.

*శివుడు - శివపూజ*

## చిదంబర రహస్యము

శివుడు చిదంబరమునందు నిరాకారుడగు ఆకాశలింగ ముగా పూజింపఁబడును. మతము మరియు సంస్కృతికి చిదంబరమొక పురాతన కేంద్రమై యున్నది. చిదంబరమునందు శివుడు నటరా-జరూపమునందు పూజింపఁబడును. దక్షిణదేశము లోని ముఖ్యమైన పండుగలయందొకటియగు మార్గశీర్షమాసము నందు వచ్చు ఆరదర్శనము ప్రతిసంవత్సరము చిదంబరము నందు జరుపఁబడును.

దేవాలయ అంతర్భాగమునందు "నృత్యసభ" యొకటి కల-దు. కేంద్ర ఆలయమునకు ఎదురుగా చెక్కలతో అమర్పఁ బడిన "కనకసభ" యనెడి ఎత్తైన బంగారు పైకప్పుకలదు. కేంద్రదేవాల-యమునందు నటరాజు విరాజమానుడై యుండును. కఱ్ఱతో నిర్మింపఁబడిన ఈ భవనమొక తాళ్ళతో చదును చేయఁ బడిన స్థ-లమునందు నిలిచియున్నది. కాని దీనికి వెనుక బంగారు రేకుల కప్పుఁగల, నల్లని చలువరాళ్ళతో నిర్మింపబడిన గదియొకటి కల-దు. శివగంగ సరస్సునకెదురుగా ఒక వేయి స్తంభములుఁ "రాజసభ

కలదు. ఇవి నల్లరాతి స్తంభములు ఈ సరస్సు నందు స్నానమొనర్చిన పరువ చోళరాజు పవిత్రుడై, బంగారు వర్ణము కలవాడయ్యెను.

శివాలయమునందున్న పంచప్రాకారములు శరీరములోని పంచకోశములను సూచించును. కొన్ని దేవాలయములలోని మూడు ప్రాకారములు మానవుని శరీరత్రయముమ సూచించును. గర్భగృహము,



అర్ధమండపము, మహామండపము, స్నాన మండపం, అలంకారమండపము, సభామండపములు శరీరము లోని ఆరు ఆధారములను, లేకషట్చక్రములను సూచించును.

**దర్శనోపనిషత్తు ఇట్లు నుడువును :-** "చిదంబరము హృదయ మధ్యమునందున్నది. చిదంబరము విరాట్పురుషుని హృదయ వెయ్యి స్తంభముల మండపము సహస్రారమును, లేక శిరస్సులోని సహస్రదళ పద్మమును సూచించును. శివగంగ సహస్రారములోని అమృతవాపిని సూచించును. జ్యోతిర్లింగము మఱియు శ్రీగురుమూర్తి ఉన్న స్థలము విశుద్ధ చక్రమును సూచించును. తిరుచిత్తంబలం, లేక మహాసభయందు బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, మహేశ్వరుడు మఱియు సదాశివునికి పంచపీఠములున్నవి. ఐదు సోపానములు పంచాక్షరములోని ఐదు అక్షరములను సూచించును మఱియు పరదా అవిద్య, లేక ఆవరణమును సూచించును. తొంబదియారు కిటికీలు బర తత్త్వములను సూచించును. మధ్య

భాగము దున్న నాలుగు బంగారు స్తంభములు నాలుగు వేదముల-ను సూచించును. వాటిని ఆవరించియున్న ఇరువది ఎనిమిది దారుస్తంభములు ఇరువది ఎనిమిది ఆగమములను సూచించు-ను, స్తంభముల మధ్య యందున్న స్థలము శుద్ధవిద్యను సూచించును. పీఠమేనట రాజుకు ఆసనమైయున్నది.

వెనుక భాగమునందు "తిరుచిత్తంబల" మున్నది. ఇదియే చిదాకాశము, లేక సుప్రసిద్ధమగు "చిదంబరరహస్యము" గర్భ



గృహమునందు శివకామిసుందరి, లేక పరాశక్తికి ఆసన మున్నది. రహస్యము నిష్కళము, ఆనంద నటరాజమూర్తి సకలుడు.

బ్రహ్మ తూర్పుదిశయందుండును. విష్ణువు దక్షిణదిశ యం-దుండును. ఉత్తరదిశయందు భైరవుడు లేక సంహార రుద్రు డుండును. శిఖరమునందు తొమ్మిది కలశములుండును. ఇవి నవశక్తులను సూచించును, శిఖరములోని అరువదినాలుగు దారు మూలములు అరువదినాలుగు విద్యలను, లేక కళలను సూచిం చును. బంగారుపూత పూయఁబడిన ఇరువది యొక్క వేల ఆరు-వందల రాగిరేకులు మానవుడు ప్రతినిత్యము శ్వాసించునట్టి ఇరువదియొక్కవేల ఆరువందల శ్వాసలను సూచించును. డెబ్బ-ది రెండువేల మేకులు శరీరములోని డెబ్బదిరెండు వేల నరములను సూచించును.

కనకసభనానుకొని పదునెనిమిది స్తంభములు పదునెనిమిది పురాణములను సూచించును. కనకసభ మణిపూరచక్రమును సూ-

చించును. పంచసభలు పంచకోశములను సూచించును.

చిదంబర దేవాలయములోని రహస్యములను సవ్యముగా అర్థమొనర్చుకొని నటరాజును మిక్కిలి శ్రద్ధ, భక్తి, పవిత్రత, ఏకాగ్రచిత్తములతో ఎవ్వడు పూజించునో అతడు జ్ఞానమును మరియు శాశ్వతానందమును(బడయును. అతడు బంధ విముక్తుడగును.

తిరువలూర్ జననము ముక్తి నొసంగును. కాశీలో మరణము ముక్తి నొసంగును. చిదంబరములోని నటరాజ దర్శనము ముక్తి నొసంగును .

### ***శివుడు - శివపూజ***

కనకసభనానుకొని విష్ణ్వాలయము, లేక గోవిందరాజ మందిర మొకటికలదు. దీనిచే శివకేశవులు తాత్త్వికముగా ఏకమే ననియు, వీర శైవ మఱియు వీరవైష్ణవ దురభిమానమును వదలి, విశాలహృదయముతో శివకేశవులను సమానముగా పూజించి, తన ఇష్ట దైవమును అన్ని మూర్తులలో(గాంచవలయునను పాఠమును మనము నేర్చుకొనవచ్చును.

చిదంబర రహస్యమును గుర్తెరుంగుటకై నటరాజు మరియు శివకామి మీయందఱికి విశాలహృదయము నొసంగి, ఆశీర్వదింతురు(గాక !

## శివకేశవుల అభేదము

శివునిభక్తుడు శైవుడనఁబడును. విష్ణుభక్తుడు వైష్ణవున బడు-ను. ఉపాసనయనగా పూజించుట, లేక దేవుని సన్నిధియందు కూర్చుండుటయని అర్థము. ఉపాసనమొనర్చువాడే ఉపాస కుడ-నబడును. ఉపాసన, లేక ఆరాధన దైవసాక్షాత్కారమునకుఁ గొంపోవును. దురభిమానముఁగల వీరశైవుడు విష్ణువు, వైష్ణవులు మరియు వైష్ణవ పురాణములయందు ద్వేషమును చూపును. అత-డు విష్ణ్వాలయమునందు ప్రవేశింపడు. అతడు వైష్ణవ చేతినుండి నీటిని కూడా త్రాగడు. అతడు వైష్ణవునితో కలిసి భోజనము చేయ-డు. ఆతడు

## ***శివుడు - శివపూజ***

హరినామ మునుచ్చరింపడు, అతడు విష్ణువు, వైష్ణవులు మఱియు విష్ణు పురాణమునుఁ గూర్చి దుష్టమైన మాటలను పలుకును. శివు-డు విష్ణువుకంటే శ్రేష్ఠుడని అతడు తలచును. అతడు విష్ణుపురాణమును పఠింపడు. ఇది మహాపరాధము కాదా? ఇది గొ-ప్ప అజ్ఞానముకాదా ? అతడు శివునియొక్క నిజమైన స్వరూపమును గుర్తెఱుంగలేదు. అతనికి నిజమైన మతముయొక్క జ్ఞానము లేదు. అతడు ఉన్మత్తుడు, దురభిమానుడు, కించిజ్ఞుడు మరియు మిక్కిలి సంకుచితమైన హృదయముఁగల అల్పబుద్ధి కలవాడని చెప్పవలసియుండును, అతడు సముద్రము యొక్క వైశాల్యము తెలియని ఒక నూతిలోని మండూకము వంటి వాడు.

దురభిమానముఁగల ఒక వీర వైష్ణవుడు కూడా శివుడు, శైవులు మఱియు శివపురాణములను ద్వేషించును. అతడు శివాలయ-మునందు ప్రవేశింపడు అతడు శైవునితో స్నేహ మొనర్పడు,

అతడు శైవుని చేతినుండి నీటిని కూడా త్రాగడు. అతడు నిజముగా వీర శైవుని వలెనే వర్తించును. అట్టి మానవుని గతి కూడా మిక్కిలి శోచనీయమైయున్నది.

తమిళనాడులోని తిరునెల్వేలి జిల్లాలో శంకర నారాయణ దేవాలయమొకటి కలదు, దీనిలోని మూర్తి అర్ధభాగము శివుడు గాను, మిగిలిన అర్ధభాగము విష్ణువు గాను చిత్రింపఁబడినది. శివుడు మరియు విష్ణువు ఏకమేయని దీనియొక్క అంతరార్ధము. శివుడు మరియు విష్ణువు సర్వవ్యాపకమగు ఏకైక ఆత్మయేయని శ్రీ శంకరాచార్యులు వారు కూడా స్పష్టముగా నుడివి యున్నారు.

### *శివుడు - శివపూజ*

ఒకప్పుడొక వీరశైవుడు దేవుని పూజించుటకై శంకర నారాయణ ఆలయమునందు ప్రవేశించెను. అతడు ధూపమును వెలిగించెను. ఈ ధూపము విష్ణువుయొక్క ముక్కులో కూడా ప్రవేశించుచుండుటచే అతడు విష్ణువు యొక్క నాసా పుటములను దూదితో మూసివేసెను. తదనంతరము ఒక వీరవైష్ణవుడు దేవాలయమునందు ప్రవేశించి, ధూపమును వెలిగించెను. ఆ ధూపము శివుని ముక్కులో కూడా ప్రవేశించుచుండుటచే అతడు శివుని ముక్కురంధ్రమును మూసివేసెను, పాఖండుల దురభిమానము మరియు సంకుచితబుద్ధి ఇట్టిదై యుండును. ఒక భక్తుడు విశాలమైన గొప్ప హృదయమును కలిగియుండ వలయును. ఆతడు తన ఇష్ట దైవమును అన్ని రూపములలోను, దేవుని యొక్క సమస్త అంశములలోనుఁ గాంచవలయును. ప్రారంభమునందు తన ఇష్టదైవముపై తీవ్రమైన ప్రేమనిష్ఠను పేంపొందించుట కై మిక్కిలి

భక్తిని కలిగి యుండవచ్చును. కాని దేవుని యొక్క ఇతర రూపము-లయందు కూడా ఆతడు సమానమైన భక్తిని కలిగియుండవలయును.

శివుడు మఱియు విష్ణువు తాత్త్వికముగా ఏకమేనై యున్నారు. వారు వాస్తవముగా ఏకైక స్వరూపులు. సర్వవ్యాపి యగు పరమా-త్ముని విభిన్నమైన అంశములకు శివుడు, విష్ణువు అనెడి నామములొసంగ(బడినవి. "శివశ్చహృదయం విష్ణుః - విష్ణోశ్చ హృదయం శివః" విష్ణువు యొక్క హృదయమే శివుడు. మరియు శి-వుని యొక్క హృదయమే విష్ణువు.

## *శివుడు – శివపూజ*

ఒక తెగకు సంబంధించిన పూజ ఈ మధ్య ఉత్పన్నమైనది. కాంతాచార్యుని శైవ సిద్ధాంతము ఐదువందల సంవత్సర ముల క్రితమేర్పడినది. మాధ్వ మరియు రామానుజ సాంప్రదాయములు వరుసగా ఆరువందలు మరియు ఏడువందల సంవత్సరముల క్రితమేర్పడినవి. ఏడువందల సంవత్సరములకు పూర్వము ఒక తెగకు సంబంధించిన పూజ లేకుండెను.

శ్రీ పరమాత్ముని సృష్ట్యంశమే బహ్మ, పరిపాలక అంశమే వి-ష్ణువు. సంహారక అంశమే శివుడు. ఇది నానా సందర్భములలో నానా విధములగు వస్త్రములను ధరించుటవంటిది. నీవు జడ్జి పనిచేయుచున్నప్పుడు ఒక రకమైన దుస్తులను ధరింతువు. ఇం-టియందు నీవు మరొకరకమైన దుస్తులను ధరింతువు. నీవు

దేవాలయములో పూజయొనర్చునప్పుడు ఇంకొక రకమగు వస్త్రములను ధరింతువు. నానా సందర్భములలో నీవు నానా విధములగు భావములను ప్రదర్శింతువు. అదే విధముగా దేవుడు రజోగుణ సమన్వితుడైనప్పుడు సృష్టికార్యమునొనర్చును. అప్పుడాతడు బహ్మయని చెప్పఁబడును. అతడు సత్త్వగుణ సమన్వితుడైనప్పుడు ప్రపంచమును పోషించును. అప్పుడాతడు విష్ణువనఁబడును. అతడు తమోగుణ సమన్వితుడైనప్పుడు ఈ ప్రపంచమును లయింపఁజేయును. అప్పుడతడు శివుడు, లేక రుద్రుడనఁబడును.

త్రివిధచైతన్య భూమికలలో బ్రహ్మ, విష్ణువు మరియు శివుడు అన్యోన్యసంబంధమును కలిగియుందురు. జాగ్రదావస్థ యందు సత్త్వగుణము అధికముగా నుండును. స్వప్నావస్థయందు రజోగుణము

## *శివుడు - శివపూజ*

అధికముగానుండును. మరియు సుషుప్తియందు తమోగుణము అధికముగానుండును. కావున జాగ్రత్స్వప్న సుషుప్త్య వస్థలలోని చైతన్యమూర్తులే క్రమముగా విష్ణు, బ్రహ్మ మరియు శివులైయున్నారు. తురీయావస్థయే పరబ్రహ్మమనఁబడును. సుషుప్తికి అనంతరము తురీయావస్థ ఏర్పడును. శివుని పూజించుటచే శీఘ్రముగా తురీయావస్థను చేరగలుగుదుము.

విష్ణు పురాణమునందు విష్ణువు స్తుతింపఁబడి, కొన్ని స్థలములలో శివునికి తక్కువ స్థానమొసంగబడినది. ఇక శివ

పురాణమునందు శివుడు స్తుతింపఁబడి, విష్ణువుకు తక్కువ స్థాన మొసంగఁబడినది. దేవీ భాగవతమునందు దేవి స్తుతింపఁబడి బ్ర-హ్మ, విష్ణు, శివులకు తక్కువ స్థానమొసంగఁబడినది. కేవలము భక్తుల హృదయములలో ఆయా దేవతలయందు భక్తి భావమును చొప్పించి, వృద్ధినొందించుటయే దీని ఉద్దేశ్యమైయున్నది. నిజ-మునకు ఏ దేవత కూడా మరియొక దేవతకంటే అధిక మైనదికాదు. నీవు గ్రంథకర్త యొక్క హృదయమును అర్థ మొన-ర్చుకొనవలసియున్నది.

మీరందఱు శివకేశవుల అభేదమును గుర్తెఱుంగుదురు గాక! మీ రందఱు శుద్ధమైన సూక్ష్మబుద్ధిని మఱియు సర్వ జ్ఞానమును కలిగియుందురుఁగాక!

***వుడు - శివపూజ***

# శివరాత్రి మహిమ

పార్వతీపతియు, బహ్మము యొక్క సంహారాంశమున్నా, శం-భు, శంకర, మహాదేవ, సదాశివ, విశ్వనాథ, హర, త్రిపురారి, గంగాధర. శూలపాణి, నీలకంఠ, దక్షిణామూర్తి, చంద్రశేఖర, నీల-లోహిత మున్నగు పేర్లచే పిలువఁబడు వాడును, తన భక్తులకు

శుభమును, అమృతత్వమును మరియు దివ్యజ్ఞానమును ప్రసా-దించువాడును, ప్రళయ కాలమునందు తాండవనృత్యం మొనర్చువాడుము, మరియు నిజమైన పునరుద్ధారకుడే కాని సం-హారకర్త కాని వాడునగు శివునికి నా మౌనమైన స్తుతులు.

శివపూజకై ప్ర్యత్యేకింపఁబడిన మహాశివరాత్రియే శివరాత్రి యనఁబడును. కుంభమాసము (ఫిబ్రవరి, మార్చి)లోని కృష్ణపక్ష త్రయోదశిరోజు మహాశివరాత్రి జరుపఁబడును.

భీష్ముడు బాణముల శయ్యపై పరుండి, ధర్మోపన్యాసము నొ-సంగుచున్నప్పుడు చిత్రభానురాజుచే నిర్వహింపఁబడిన మహా శివరాత్రినిఁగూర్చి మహాభారతములోని శాంతిపర్వమునందు ఉల్లేఖింపఁబడినది.

ఒకప్పుడు ఇక్ష్వాకువంశములోని చిత్రభానురాజు జంబూ ద్వీపమంతటిని పరిపాలించుచుండెను. మహాశివరాత్రి రోజు అత-డు

## శివుడు - శివపూజ

మఱియు అతని భార్య ఉపవసించుచుండిరి. అష్టావక్ర ముని రా-జును చూచుటకై ఆస్థానమున కేతెంచెను.

ఈరోజు నీవు ఏల ఉపవసించుచుంటివి?" అని ముని అడిగె-ను. ఆరోజు ఉపవసించుచున్న కారణమును చిత్రభానురాజు వివరించి చెప్పెను. అతడు తన పూర్వజన్మ వృత్తాంతములను

జ్ఞప్తి యందుంచుకొను శక్తిని కలిగియుండెను,

అతడు అష్టావక్రమునితో ఇట్లు పలికెను. “నా పూర్వ | జన్మలో నేను సుస్వరుడను పేరుగల ఒక వేటకాడనై యుంటిని. నేను పశు-పక్ష్యాదులను చంపి వాటిని అమ్మి నాజీవితమును గడుపుచుంటిని. ఒకరోజు నేను మృగములనన్వేషించుచు ఒక అడవిలో సంచరించుచుంటిని. ఆ దినము చాలా రాత్రియయ్యె-ను. నేను తిరిగి ఇంటికి వెళ్ళజాలకపోయితిని. కావున ఆశ్రయము కొరకై ఒక బిల్వవృక్షము నెక్కితిని. ఆ రోజునే నొకజింకను గురి పె-ట్టితిని. కాని దానిని ఇంటికి తీసుకొని వెళ్ళుటకు సమయము లేకుండెను. నేను ఆకలి, దప్పులచే మిక్కిలి బాధపడుచుండుట-చే రాత్రియంతయు నేను జాగరణ చేసితిని. నా రాకకై ఆతురతతో చూచుచు, పస్తుపడియున్న నా భార్య పిల్లలను తలంచుకొని నేను అఖండముగా కన్నీరు కార్చితిని. బిల్వదళములను కోసి క్రింద పడవేయుచు నేను కాలమును గడిపితిని. ఆ బిల్వవృక్షమూలము నందొక శివలింగ ముండెను. ఆ శివలింగము పై నా కన్నీరు మరి-యు బిల్వదళములు రాలెను.

## శివుడు - శివపూజ

ప్రాతఃకాలమయ్యెను. నేను ఇంటికి వెళ్ళి జింకను అమ్మితిని నాకు, నా కుటుంబసభ్యులకు ఆహారము లభించెను. నేను పార-ణచేయుటకు సిద్ధముగానుంటిని. ఒక అతిథివచ్చి ఆహారము నడిగెను. మొదట ఆతనికి భోజనము నొసంగి పిదప నేను భుజిం-

చితిని. మరణ సమయములో నేను ఇద్దరు. శివదూతలను గాంచి-తిని. నా ఆత్మను శివుని సన్నిధికిఁ గొంపోవుటకై వారు భూలోకమునకు పంపఁబడిరి. నాకు తెలియక ఒనర్చినను మహాశి-వరాత్రి రోజు ఉపవసించిన దాని ఫలితమెంత ఘనమైనదో. అప్పుడు నాకర్థమయ్యెను. నేను శివలోకమునందు అనేక యుగ-ములు వసించి, దివ్యానందము ననుభవించితిని. ఇప్పుడు నేను చిత్రభానునై ఈ పృథ్వీయందు జన్మించితిని."

శివుని రాత్రియే "శివరాత్రి" యనఁబడును. ఇరువది నాలుగు-గంటలు కఠినమైన ఉపవాసము నొనర్చుట మరియు రాత్రియంతయు జాగరణచేయుట ఈ ఉత్సవము యొక్క ముఖ్య-మైన అంశములు. ప్రతియొక్క శివభక్తుడు శివరాత్రిరోజు ఉపవసించి, జాగరణయుండి, ధ్యాననిష్ఠయందు కాలమును గడు-పును.

శివునికి ప్రతీకమగు లింగముపై పుష్పములను, బిల్వ పత్ర-ములను మఱియు ఇతర పదార్థములనర్పించి, దానిని పాలు, తేనె, వెన్న, నేయి, గులాబిజలము ఇత్యాదులతో అభిషేక మొన-ర్చుట శివపూజ యనఁబడును.

## శివుడు - శివపూజ

సృష్టికార్యము పూర్తియైన తర్వాత శివపార్వతులు కైలాస శి-ఖరమునందు వసించుచుండిరి. పార్వతి ఇట్లడిగెను, "ఓ పూజ్య ప్రభూ! మీ గౌరవార్థము ఒనర్పఁబడు వ్రతములలో ఏ వ్రతముచే

మీకు మిక్కిలి ప్రీతికలుగును." శివుడిట్లు సమాధానమునొసంగెను. ఫాల్గుణమాసము (ఫిబ్రవరి-మార్చి) నందు కృష్ణపక్షములోని త్ర-యోదశిరోజు శివరాత్రివచ్చును. ఇదియే నాకు మిక్కిలి ఇష్టమైనతిథి, నానావిధములగు అభిషేకములు మఱియు ఫల-ములు, మధురపదార్థములు, ధూపదీపాదులనర్పించుటకన్న ఆరోజు కేవలము ఉపవసించి నాభక్తుడు నాకు ప్రీతిని కలిగించు-ను.

నా భక్తుడు దినమంతయు ఆధ్యాత్మికానుష్ఠానమునందు గడి-పి రాత్రియంతయు ప్రతి మూడుగంటలకొకసారి వచ్చు నాలుగు ప్రహరములలో నాలుగు రూపములయందు నన్ను పూజించును. విలువైన రత్నములు మరియు పుష్పహారముల కంటే, కొన్ని బి-ల్వదళములనర్పించినచో నేను మిక్కిలి ప్రీతి నొందుదును. ప్రథమ ప్రహరమునందు నా భక్తుడు పాలతోను, ద్వితీయ ప్రహర-మునందు పెరుగుతోను, తృతీయ ప్రహరము నందు నేయితోను, చతుర్థ ప్రహరమునందు తేనెతోను నన్ను అభిషేకించవలయు-ను. రెండవరోజు ఉదయము మొదట బ్రాహ్మణులకు భోజన మొసంగి, కొన్ని విధులను నిర్వర్తించిన అనంతరము పారణమొ-నర్పవలయును. ఓ పార్వతీ ! ఈ సామాన్యమగు దినచర్యను పవిత్ర భావముతో ఆచరించుటకు మించిన గొప్ప వ్రతము మరి-యొకటి లేదు.

## శివుడు - శివపూజ

ఈ వ్రతము యొక్క మహిమను మఱియు శక్తిని నిరూపించు-నట్టి ఒక వృత్తాంతమును చెప్పెదను, ఓ ప్రేయసీ! శద్ధతో వినుము.

"ఒకప్పుడు కాశీపట్టణమునందొక వేటకాడు వసించు చుండెను. ఒక సాయంకాలము అతడు చంపిన పక్షులతో అరణ్యమునుండి తిరిగి వచ్చుచుండెను. అతడు అలసి పోవుటచే విశ్రాంతికై ఒక వృక్షమూలమునందు కూర్చుండెను. అతనికి మితిమీరిన నిద్రవచ్చెను, అతడు లేచుసరికి కటికె చీకటితో కూడిన రాత్రియయ్యెను. ఆ రాత్రి శివరాత్రి. కాని ఆ విషయ మాతనికి తెలియకుండెను. అతడు వృక్షము నెక్కి, మరణించిన పక్షులమూటను ఒక కొమ్మకు కట్టి, తెల్లవారు పర్యంతము కూర్చొనియుండెను. ఆ వృక్షము నాకు ప్రీతికరమైన బిల్వ వృక్షమైయుండెను.

ఆ వృక్షము క్రింద ఒక శివలింగముండెను. అతడు కొన్ని దళములనుకోసి క్రింద పడవేసెను. చలికాలపు రాత్రి మంచు అతని శరీరమునుండి జాఱిపడెను. అప్రయత్నముగా వేటకాడొనర్చిన చిన్నని అర్పణలచే నేను మిక్కిలి ప్రీతి నొందితిని. ప్రాతఃకాలము కాగానే వేటగాడు తన ఇంటికి తిరిగి వెళ్ళెను.

కొంతకాలము తర్వాత ఆ వేటకాడు వ్యాధిగ్రస్తుడై మరణించెను. యమదూతలు అతని ఆత్మను యమలోకమునకు తీసుకొని వెళ్లుటకై వచ్చిరి. నా దూతలు కూడా అతనిని నా లోకమునకు తీసుకొనివచ్చుటకై ఆతనిని సమీపించిరి. యమ దూతలు మఱియు నా దూతలమధ్య గొప్పపోరాటము జరిగెను. యమదూతలు పూర్తిగా ఓడింపఁబడిరి. ఆ

సంగతిని వారు తమ ప్రభువుకు విన్నవించుకొనిరి. కైలాసద్వారము నందాతడు స్వయముగా వచ్చి నిలఁబడెను. శివరాత్రి యొక్క పవిత్రతనుఁ గూర్చి మఱియు వేటకానిపై నాకుఁగల ప్రేమను గూర్చియు నంది అతనికి తన భావమును వ్యక్తపరచెను. "యముడు వేటకానిని ఒప్పగించి, నెమ్మదిగా తన స్థానమును చేరుకొనెను.

ఆరోజు శివరాత్రి యగుటచే, అనిచ్ఛాపూర్వకముగా ఉపవసించి కొన్ని బిల్వదళములను మాత్రమర్పించినను, వేటకాడు మృత్యువును తప్పించుకొని, నా లోకమునందు ప్రవేశింపఁగలిగెను. ఈ శివరాత్రియందంతటి పవిత్రత మరియు గాంభీర్యము కలదు.

ఈ యుత్సవము యొక్క మహిమ మఱియు పవిత్రతనుఁ గూర్చిన శివుని వ్యాఖ్యానమును విని పార్వతికి మిక్కిలి ప్రేరణ కలిగెను. ఆమె దానిని తన స్నేహితులకు చెప్పెను. వారు దానిని భూపాలురకు అందజేసిరి. ఇట్లు శివరాత్రియొక్క మహిమ ప్రపంచమంతయు ప్రాకిపోయెను.

# ద్వాదశ జ్యోతిర్లింగములు

1. సౌ రాష్ట్ర సోమనాథంచ, శ్రీశైలే మల్లికార్జునమ్ | ఉజ్జ-
యిన్యాం మహాకాళమోంకార మమ లేశ్వరమ్ ||

2. పరళ్యాం వైద్యనాథం, డాకిన్యాం భీమశంకరమ్ |
సేతు బంధేతు రామేశం, నాగేశం దారుకావనే ||

3. వారాణస్యాంతు విశ్వేశం త్ర్యంబకం గౌతమీతటే | హిమా-
లయేతు కేదారం, ఘుసృణేశం శివాలయే ||

4. ఏతాని జ్యోతిర్లింగాని, సాయంప్రాతః పఠేన్నరః |
సప్త జన్మకృతంపాపం, స్మరణేన వినశ్యతి ||

|| ఇతిద్వాదశ జ్యోతిర్లింగాని ||

ఉదయ సాయంకాలములలో ఈ ద్వాదశ జ్యోతిర్లింగముల చెప్పుడు స్మరించునో, ఆతడు తన ఏడు పూర్వజన్మలయందొన-ర్చిన పాపముల నుండి విముక్తుడగును. ఈ ద్వాదశ జ్యోతిర్లింగము లేవనగా :

(1) సౌరాష్ట్రము (గుజరాత్)లో సోమనాథుడు (2) శ్రీశైలము (ఆంధ్రప్రదేశ్) లో మల్లికార్జునుడు (3) ఉజ్జయిని (మధ్యప్రదేశ్) లో మహాకాళుడు

(4) నర్మదా తీరమునందున్న అమ లేశ్వరము (మధ్యప్రదేశ్) లో ఓంకారేశ్వరుడు (5) పరళీ (బీహార్)లో వైద్యనాథుడు (6) డాకిని (మహారాష్ట్ర)లో భీమాశంకర్ (7) సేతుబంధము (తమిళనాడు) లో రామేశ్వరము (8) దారుకా వనము (గుజరాత్) లో నాగేశుడు (9) కాశీ (ఉత్తరపదేశ్)లో విశ్వేశుడు (14) నాసిక్ (మహారాష్ట్ర) లోని గోదావరీ-తీరము నందున్న త్ర్యంబకేశ్వరుడు (11) హిమాలయము (ఉత్తరప్రదేశ్) నందున్న కేదార్నాథ్ మఱియు (12) శివాలయము (కర్ణాటకము) నందున్న ఘుసృణేశుడు.

దక్షిణ హిందూదేశమునందు పంచభూతములను సూచించునట్టి ప్రఖ్యాతమైన పంచశివలింగములున్నవి.

1) కాంచీవరము (తమిళనాడు) నందు పృథ్వీలింగము 2) తి-రువనకోయిల్ (తమిళనాడు) నందు అప్పులింగము. ఈ లింగమెల్లప్పుడు జలమునందుఁడును . తిరువనకోయిల్ జంబుకేశ్వరమని కూడా చెప్పఁబడును. 3) శ్రీ కాళహస్తి (ఆంధ్రప్రదేశ్) యందు వాయులింగమున్నది. 4) తిరువణ్ణామలై తమిళనాడు లో తేజోలింగము (అరుణాచలేశ్వరము) 5) చిదంబరము (తమిళనా-డు) లో ఆకాశలింగము.

# శివనామ కీర్తన

1. శివాయ నమ ఓం శివాయనమః || శివా-
యనమ ఓం నమశ్శివాయ ॥
శివ శివ శివ శివ శివాయనమఓమ్ |
హర హర హర హర నమఃశివాయ ॥
శివ శివ శివ శివ శివాయనమ ఓమ్ |
భం భం భం భం నమశ్శివాయ ॥ సాంబస-
దాశివ సాంబసదాశివ | సాంబసదాశివ
సాంబశివా ॥ ఓం నమశ్శి-
వాయ ఓం నమశ్శివాయ | ఓం
నమశ్శివాయ ఓం నమశ్శివాయ ॥ శి-
వాయ నమ ఓం శివాయనమః |
శివాయ నమ ఓం శివాయ నమః ॥

2. ఓం శివ ఓం శివ ఓంకారాశివ | ఉమామహే-
శ్వర తవచరణమ్ ॥ ఓం శివ ఓం
శివ ఓంకారాశివ | పరాత్పరా శివ తవ
చరణమ్ ॥ నమామి శంకర
భవాని శంకర | గిరిజాశంకర తవచరణ-
మ్ ॥ నమామి శంకర భవాని
శంకర | మృడాని శంకర తవచర-
ణమ్ ||

3. హరహర శివశివ శంభో |
హరహర శివశివ శంభో ॥
హరహర శివశివ హరహర శంభో |
హరహర శివశివ శంభో ॥
హరహర శివశివ శంభో ॥

4. నమస్తే నమస్తే విభో విశ్వమూర్తే |
నమస్తే నమస్తే చిదానంద మూర్తే ॥
నమస్తే నమస్తే తపోయోగగమ్య |
నమస్తే నమస్తే శ్రుతిజ్ఞానగమ్య ॥

5. శంకరనే శంకరనే శంభోగంగాధరనే
శంకరనే శంకరనే శంభోగంగాధరనే ॥

6. కాశీవిశ్వనాథ సదాశివ, భంబోలో । కైలాస-
పతీ, భంబోలో కైలాసపతీ ॥

7. హరహర మహాదేవ శంభోకాశీ విశ్వనా-
థగంగే | విశ్వనాథ.
గంగే కాశీవిశ్వనాథ గంగే ॥

8. ఓం శివ హరహరగంగే హరహర ।
ఓం శివ హరహరగంగే హరహర ॥

ఓం శివ హరహర ఓం శివ హరహర ।
భంభం హరహర ఓం శివ హరహర ||

9. మహా దేవ శివ శంకరశంభో |
ఉమాకాంత హర త్రిపురారే ॥
జయ వృషభధ్వజశూలిన్ |
మృడమదనారే ॥
జయ గౌరీశంకర |
జయశంభో ॥
జయశంభో |
మృత్యుం-
గంగాధర
జయశంభో
జయ శంభో
జయగౌరీ శంకర
రుద్రం పశుపతి-
మీశానం |
కలయామి కాశీపురినాథమ్
॥
హరశివశంకర గౌరీశం |
వందే గంగాధరమీశమ్ ||

10. జయశివ శంకర హర త్రిపురారే |
పాహి పశుపతీపినాక ధారిన్ ॥

11. చంద్రశేఖర చంద్ర శేఖర చంద్రశేఖరపాహిమామ్ | చం-
ద్రశేఖర చంద్రశేఖర చంద్రశేఖర రక్షమాం ॥

12. అగడభం అగడభం జెడమరూ |
నాచే సదాశివ జగద్ గురూ ॥

నాచే బ్రహ్మ నాచే విష్ణు నాచే మహాదేవ ।
ఖప్పర్ లే కే కాళీ నాచే నాచే ఆదిదేవ ॥ (అగడభం)

13. నట రాజ నట రాజ, నర్తన సుందర నటరాజా ।
శివ రాజ శివ రాజ, శివకామి ప్రియశివ రాజా ॥

14. బోల్ శంకర్ బోల్ శంకర్, శంకర్ శంకర్ బోల్ ।
హరహర హరహర మహాదేవ, శంభోశంకర్ బోల్ 1
శివశివ శివశివ సదాశివ, శంభోశంకర్ బోల్ ॥

15. జయజగజ్జనని, సంకటహారిణి| త్రి-
భువన తారిణి మహేశ్వరీ ॥

16. జయగంగే జయగంగేరాణి |
జయగంగే జయహరగంగే ॥

17. దేవిభజో దుర్గ భవానీ ।
దేవీభజో దుర్గా ॥
జగజ్జనని మహిషాసురమర్ధిని |
దేవిభజో దుర్గా ॥

18. రాధేగోవింద భజో రాధేగోపాల్ | రాధే-
గోవింద భజో రాధేగోపాల్ ॥

19. బ్రూహిము కుందేతి రసనే (బ్రూహి)
కేశవ మాధవ గోవిందేతి | కృష్ణా-
నంద సదానందేతి ॥ (బ్రూహి)
రాధారమణ హరే రామేతి | రా-
జీవాక్ష ఘన శ్యామేతి ॥ (బ్రూహి)

20. గౌరీరమణ కరుణాభరణా | పా-
హికృపా పూర్ణ శరణా ||
నాథ జన శుభకరమందార | (గౌరీ) బాలచం-
ద్రధర పుణ్యశరీరా ॥ సుమశర
మదహరశంకర ॥ (గౌరీ)

21. పిబరే రామరసం రసనే,
పిబరే రామ రసమ్ | దూరీకృత-
పాతక సంవర్గం | పూరిత
నానా విధ ఫలవర్గమ్ ||(పిబరే) జనన మర-
ణభయ శోకవిదూరం | సకలశాస్త్ర
నిగమాగమసారమ్ || (పిబరే) పరిపాలిత సర-
సిజగర్భాండం | పరమ
పవిత్రీకృత పాషండమ్ ॥ ( పిబరే) శు-
ద్ధ పరమహంసాశ్రమగీతం ॥
శుక శౌనక కౌశిక ముఖపీతమ్ || (పిబరే)

22. శివోహం శివోహం శివోహం సోహం |
శివోహం శివోహం శివోహం సోహం |
సచ్చిదానంద స్వరూపో హమ్ ॥

23. చిదానంద రూపశ్శివోహం శివోహమ్ | చిదా-
నంద రూపశ్శివోహం శివోహమ్ ॥

24. అరుణాచల శివ అరుణాచల శివ |
అరుణాచల శివ అరుణశివ ॥
అరుణాచల శివ అరుణాచల శివా |
అరుణాచల శివ అరుణశివా ||

# 15వ అధ్యాయము

# శివ స్తోత్రమ్

# శివార్చనమ్

ఓం శివాయ నమః

ఓం మహేశ్వరాయనమః

ఓం శంభ వేనమః

ఓం పినాకినేనమః

ఓం శశిశేఖరాయనమః

ఓం వామదేవాయ నమః

ఓం విరూపాక్షాయ నమః

ఓం కపర్దినేనమః

ఓం నీలలోహితాయ నమః

ఓం శంకరాయనమః

ఓం శూలపాణయేనమః

ఓం ఖట్వాంగినే నమః

ఓం విష్ణువల్లభాయ నమః

ఓం శిపివిష్టాయ నమః

ఓం అంబి నాథాయ నమః

ఓం శ్రీ కంఠాయ నమః

ఓం భక్త వత్సలాయ నమః

ఓం భవాయ నమః

ఓం శర్వాయ నమః

ఓం ఉగ్రాయ నమః

ఓం కపాలినే నమః

ఓం కామారయే నమః

ఓం అంధకాసుర సూదనాయ నమః

ఓం గంగాధరాయనమః

ఓం లలాటాక్షాయ నమః

ఓం కాలకాలాయ నమః

ఓం కృపానిధయే నమః

ఓం భీమాయనమః

ఓం పరశుహస్తాయ నమః

ఓం మృగపాణయేనమః

ఓం జటాధరాయనమః

ఓం కైలాసవాసినేనమః

ఓం కవచినే నమః

ఓం కఠోరాయ నమః

ఓం త్రిపురాంతకాయ నమః

ఓం వృషాంకాయ నమః

ఓం వృషభారూఢాయ నమః

ఓం భస్మోద్ధూళిత విగ్రహాయ నమః

ఓం త్రిలోకేశాయ నమః

ఓం శితికంఠాయ నమః

ఓం త్రయీమూర్తయే నమః

ఓం సర్వజ్ఞాయ నమః

ఓం పరమాత్మనేనమః

ఓం సోమసూర్యాగ్నిలోచనాయనమః

ఓం హవిషే నమః

ఓం యజ్ఞమయాయ నమః

ఓం సోమాయ నమః

ఓం పంచవక్త్రయ నమః

ఓం సదాశివాయ నమః

ఓం విశ్వేశ్వరాయ నమః

ఓం వీరభద్రాయ నమః

ఓం గణనాథాయ నమః

ఓం ప్రజాపతయేనమః

ఓం హిరణ్యరేతసే నమః

ఓం దుర్ధర్షాయ నమః

ఓం గిరీశాయ నమః

ఓం అనఘాయ నమః

ఓం భుజంగ భూషణాయ నమః

ఓం భర్గాయ నమః

ఓం గిరిధన్వనే నమః

ఓం కృత్తి వాససే నమః

ఓం పురాతయే నమః

ఓం భగవతే నమః

ఓం హరయే నమః

ఓం సామప్రియాయ నమః

ఓం సర్వమయాయ నమః

ఓం ప్రమాధాధిపాయ నమః

ఓం మృత్యుంజయాయ నమః

ఓం సూక్ష్మతనవే నమః

ఓం జగద్వ్యా పినే నమః

ఓం జగద్గురవే నమః

ఓం వ్యోమకేశాయ నమః

ఓం మహా సేనజనకాయ నమః

ఓం చారువిక్రమాయ నమః

ఓం రుద్రాయ నమః

ఓం భూతపతయే నమః

ఓం స్థాణవే నమః

ఓం అహిర్బుధ్న్యాయ నమః

ఓం దిగంబరాయ నమః

ఓం అష్టమూర్తయే నమః

ఓం అనేకాత్మనే నమః

ఓం శాశ్వతాయ నమః

ఓం ఖండపరశవే నమః

ఓ అజాయ నమః

ఓం పాశవిమోచకాయ నమః

ఓం మృడాయ నమః

ఓం పశుపతయే నమః

ఓం దేవాయ నమః

ఓం అవ్యయాయ నమః

ఓం సహస్రాక్షాయ నమః

ఓం పూషదంతభిదే నమః

ఓం అవ్యగ్రాయ నమః

ఓం దక్షాధ్వరహరాయ నమః

ఓం హరాయ నమః

ఓం భగనేత్రభిదే నమః

ఓం అవ్యక్తాయనమః

ఓం అనీశ్వరాయ నమః

ఓం సహస్రపదే నమః

ఓం సాత్త్వికాయ నమః

ఓం అపవర్గ ప్రదాయ నమః

ఓం అనంతాయ నమః

ఓం తారకాయ నమః

ఓం పరమేశ్వరాయ నమః

ఓం గిరిప్రియాయ నమః

ఓం మహాదేవాయనమః

## దేవ్యర్చనమ్

ఓం ఆదిశక్త్యై నమః

ఓం మహాదేవ్యైనమః

ఓం అంబికాయై నమః

ఓం పరమేశ్వర్యై నమః

ఓం ఈశ్వర్యై నమః

ఓం అనైశ్వర్యైనమః

ఓం యోగిన్యై నమః

ఓం సర్వభూతేశ్వర్యై నమః

ఓం జయాయై నమః

ఓం విజయాయై నమః

ఓం జయంత్యై నమః

ఓం శాంభవ్యై నమః

ఓం శాంత్యై నమః

ఓం బ్రాహ్మ్యై నమః

ఓం బ్రహ్మాండ ధారిణ్యై నమః

ఓం మహేశ్వర్యై నమః

ఓం లోక రక్షిణ్యై నమః

ఓం దుర్గాయై నమః

ఓం దుర్గపారాయై నమః

ఓం భక్త చింతామణ్యై నమః

ఓం మృత్యై నమః

ఓం సిద్ధ్యై నమః

ఓం మూర్త్యై నమః

ఓం సర్వసిద్ధి ప్రదాయై నమః

ఓం మంత్ర మూర్త్యై నమః

ఓం మహాకాళ్యై నమః

ఓం సర్వమూర్తి స్వరూపిణ్యై నమః

ఓం వేదమూర్త్యై నమః

ఓం వేదభూత్యైనమః

ఓం వేదాంతాయై నమః

ఓం భగవత్యై నమః

ఓం రౌద్రాయై నమః

ఓం మహారూపాయై నమః

ఓం మహామాయాయై నమః

ఓం రుద్రస్వరూపిణ్యై నమః

ఓం నారాయణ్యై నమః

ఓం నారసింహ్యై నమః

ఓం నాగయజ్ఞోపవీతిన్యై నమః

ఓం శంఖచక్రగదాధారిణ్యై నమః

ఓం జటాముకుటశోభిన్యై నమః

ఓం అప్రమాణాయై నమః

ఓం ప్రమాణాయై నమః

ఓం ఆదిమధ్యావసానాయై నమః

ఓం పుణ్యదాయై నమః

ఓం పుణ్యోపచారిణ్యై నమః

ఓం పుణ్యకీర్త్యై నమః

ఓం స్తుతాయై నమః

ఓం విశాలాక్ష్యై నమః

ఓం గంభీరాయై నమః

ఓం రూపాన్వితాయై నమః

ఓం కాల రాజ్ఞై నమః

ఓం అనల్పసిద్ధ్యై నమః

ఓం కమలాయై నమః

ఓం పద్మవాసిన్యై నమః

ఓం మహా సరస్వత్యై నమః

ఓం మనఃసిద్ధ్యై నమః

ఓం మహాయోగిన్యై నమః

ఓం చండముండచారిణ్యై నమః

ఓం దేవదానవ వాసిణ్యై నమః

ఓం వ్యవహారిణ్యై నమః

ఓం అనఘాయై నమః

ఓం భేషజ్యోతిషే నమః

ఓం పరంజ్యోతిషే నమః

ఓం ఆత్మజ్యోతిషే నమః

ఓం సర్వజ్యోతిస్వరూపిణ్యై నమః

ఓం సహస్రమూర్త్యై నమః

ఓం శర్వాణ్యై నమః

ఓం సూర్యమూర్తిస్వరూపిణ్యై నమః

ఓం ఆయుర్లక్ష్యై నమః

ఓం సర్వలక్ష్మీప్రదాయై నమః

ఓం విచక్షణాయై నమః

ఓం క్షీరార్ణవవాసిన్యై నమః

ఓం వాగీశ్వర్యై నమః

ఓం వాక్సిద్ధ్యై నమః

ఓం అజ్ఞానాగోచరాయై నమః

ఓం బలాయై నమః

ఓం పరమకళ్యాణ్యై నమః

ఓం భానుమండలవాసిన్యై నమః

ఓం అవ్యక్తాయై నమః

ఓం వ్యక్తరూపాయై నమః

ఓం అనంతాయై నమః

ఓం చంద్రాయై నమః

ఓం చంద్రమండలవాసిన్యై నమః

ఓం చంద్రమండలమండితాయై నమః

ఓం మాతంగిన్యై నమః

ఓం పరమానందాయై నమః

ఓం శివాయై నమః

ఓం అపరాజితాయై నమః

ఓం జ్ఞానప్రాప్త్యై నమః

ఓం జ్ఞానవత్యై నమః

ఓం జ్ఞానమూర్త్యై నమః

ఓం కళావత్యై నమః

ఓం శ్మశానవాసిన్యై నమః

ఓం మాత్రే నమః

ఓం పరమకల్పిన్యై నమః

ఓం సర్వరక్షాయై నమః

ఓం భైరవ్యై నమః

ఓం మహాలక్ష్మై నమః

ఓం ఘోషవత్యై నమః

ఓం దారిద్రహారిణ్యై నమః

ఓం శివతేజోముఖ్యై నమః

ఓం విష్ణువల్లభాయై నమః

ఓం కేశవిభూషితాయై నమః

ఓం కూర్మాయై నమః

ఓం మహిషాసురఘాతిన్యై నమః

ఓం ఉమాయై నమః

ఓం శాంకర్యై నమః

ఓం మహాకాంత్యై నమః

# అథశివ నీరాజనమ్

హరిః ఓం నమోస్త్వనంతాయ సహస్రమూర్తయే సహస్ర పాదా-క్షి శిరోరు బాహవే సహస్రధామ్నే పురుషాయ శాశ్వతే సహస్ర కోటియుగ ధారిణేనమః॥ (1)

ఓం జయగంగాధర హరశివజయ గిరిజాధీశ, శివజయ గౌరీ-నాథ। త్వంమాంపాలయ నిత్యం, త్వంమాంపాలయశంభో కృపయాజగదీశ ॥ ఓం హర హరహర మహదేవ (2)

కైలాసే గిరిశిఖరే కల్పద్రుమవిపినే శివకల్పద్రుమవిపినే, గుంజతి మధుకరపుంజే కుంజవనేగహనే। కోకిలకూజతి, ఖేలతి హంసావళి లలితా, ఖేలతి హంసావళి లలితా, రచయతి కళా కలా-పం, నృత్యతిముద సహితా॥ ఓం హరహరహరమహాదేవ(3)

తస్మింలలిత సుదేశేశాలామణిరచితా, శివశాలామణి రచితా, తన్మధ్యేహరనిక టే, తన్మధ్యేహరనిక టే గౌరీముద సహితా! క్రీడాం-రచయతి భూషాం రంజితనిజమీశం, శివ రంజిత నిజం, ఇంద్రాదిక సురసేవిత, బ్రహ్మాదిక సుర సేవిత ప్రణమతితే శీర్షమ్!! ఓం హరహరహరమహాదేవ (4)

విబుధవధూగర్భహునృత్యతి హృదయేముదసహితా, శివ హృదయము సహితా ధినకత థై థై ధినకత మృదంగం వాదయతే, శివమృదంగం వాదయతే, క్వణ క్వణ జ్వాలలితా శ్రీ వేణుం మధు-రం నాదయతే॥ ఓం హరహరహర మహాదేవ (5)

కణకణ చరణే రచయతి నూపురము జ్వలితం, శివనూపుర ముజ్వలితం, చక్రాకారం భ్రమయతి, చక్రాకారంభ్రమయతి, కురు-తేతాంధికతామ్ | తాంతాంలుపచుపతాళం నాదయతే, శివ తాళం నాదయతే, అంగుష్ఠాంగుళీనాదం లాస్యకతాం కురుతే ॥ ఓం హర-హరహరమహాదేవ (6)

కర్పూరద్యుతిగౌరం పంచానన సహితం, శివపంచానన సహి-తం, త్రినయన శశధరమౌళే, త్రినయన శశధరమౌళే, విషధర కంఠయుతం సుందరజటాకలాపం, పావకయుతఫాలం,శివపావక శశిఫాలం, డమరు త్రిశూలపినాకం, డమరు త్రిశూల పినాకం, కర-ధృతనృకపాలమ్!! ఓం హరహరహరమహాదేవ (7)

శంఖనినాదం కృత్వాఝల్లరి నాదయతే, శివఝల్లరి నాద-యతే నీరాజయతే బహ్మనీరాజయతే విష్ణుర్వేద ఋచంపఠతే॥ ఇతి మృదుచరణ సరోజం హృదికమలేధృత్వా, శివహృదికమలే ధృత్వా, అవలోకయతిమహేశం, అవలోకయతి సురేశం, ఈశం అభినత్వా । ఓం హరహరహర మహాదేవ (8)

ర మాలాం పన్నగము పవీతం శివ పన గము పవీతం, వామ విభాగేగిరిజా, వామ విభాగేగౌరీ, రూపం అతిలలితమ్ ! సుందర సక-లశరీరే, కృతభస్మాభరణం, శివకృత భస్మాభరణం, ఇతి వృషభధ్వజరూపం, హరశివ శంకరరూపం తాపత్రయహరణమ్ ॥ ఓం హరహరహర మహాదేవ (9)

ధ్యాన ఆరతి సమయే, హృదయే ఇతికృత్వా, శివహృదయే ఇతికృత్వా. రామంత్రి జటానాథం, రామంత్రి జటానాథం, ఈశం అభినత్వా ॥ సంగీతమేవం ప్రతిదిన పఠనం యఃకురుతే! శివసా-యుజ్యంగచ్ఛతి, హరసాయుజ్యంగచ్ఛతి, భక్త్యాయఃశృణు తే ॥ ఓం హరహరహర మహాదేవ (10)

జయగంగాధరహర శివజయ గిరిజాధీశ, శివజయగౌరీ నాథ, త్వంమాంపాలయనిత్యం, త్వంమాంపాలయశంభో, కృపయాజగ-దీశ ॥ ఓం హరహరహర మహాదేవ (11)

ఇతి శ్రీ శివ నీరాజనం సంపూర్ణమ్

## అథశివ ధ్యానావళి

1. ఓం వందేదేవ ముమాపతిం సురగురుంవందే జగత్కారణం
   వందే పన్నగభూషణం మృగధరం వందే పశూనాంపతిమ్ !
   వందే సూర్యశాంక వహ్ని నయనం వందే ముకుందప్రియం,
   వందే భక్త జనాశ్రయంచ వరదం వందే శివంశంకరమ్ ||

2. శాంతం పద్మాసనస్థం శశధరముకుటం పంచవ-
   క్త్రంత్రి నేత్రం, శూలం
   వజ్రంచఖడ్గం పరశుమభయదం

దక్షిణాంగేవహంతమ్ |
నాగం పాశంచ ఘంటాండమరుక సహితం ।
చాంకుశం వామ భాగే, నానాలంకార-
దీప్తం స్పటికమణినిభం పార్వతీశం నమామి ||

3. కర్పూర గౌరం కరుణావతారం, సంసారసారం భుజ-
గేంద్ర హారమ్ |
సదావసంతం హృదయారవిందే, భవం
భవానీ సహితం నమామి ॥

4. అసితగిరి సమంస్యాత్కజ్జలం సింధుపాత్రే, సుర-
తరువర శాఖలేఖినీ పత్ర ముర్వీ ॥
లిఖతి యది గృహీత్వా శారదా సర్వకాలం
తదపి తవగుణానామీశపారం నయాతి ॥

5. త్వమేవ మాతాచపితాత్వమేవ,
త్వమేవ బంధుశ్చసభాత్వమేవ |
త్వమేవ విద్యాద్రవణంత్వమేవ,
త్వమేవ సర్వం మమ దేవ దేవ ॥

6. కరచరణకృతం వాక్కాయజం కర్మజంవా,
శ్రవణ నయనజం వామానసంవా పరాధమ్ |

విహితమవిహితంవా సర్వమేతత్ క్షమస్వ,
జయజయ కరుణార్ద్రే శ్రీమహాదేవశంభో ॥

7. చంద్రోద్భాసితశేఖరే స్మరహరే గంగాధరే శంకరే,
సర్పైర్భూషిత కంఠకర్ణ వివరే నేత్రోత్థ వైశ్వానరే దంతిత్వ-
క్కృత సుందరాంబరధరే త్రైలోక్యసారేహరే,
మోక్షార్థం కురుచిత్త వృత్తి మచలామన్యైస్తు కింకర్మభిః||

- ఇతి శివధ్యానావళిః సంపూర్ణా -

## అథశివ పుష్పాంజలిః

హరిః ఓం యజ్ఞేన యజ్ఞమయజంత దేవాస్తానిధర్మాణి ప్రథ-మాన్యాసన్ | తేహనాకం మహిమాన ః సచంతే యత్ర పూర్వేసాధ్యాః సంతిదేవాః

ఓం రాజాధిరాజాయ ప్రసహ్యసాహినే | నమోవయంవై శ్రవ-ణాయ కుర్మహే | సమేకామాన్ కామకామాయ మహ్యం కామేశ్వరో వై శ్రవణోదదాతు | కుబేరాయ వై శ్రవణాయ మహా రాజాయనమః

ఓం విశ్వతశ్చక్షురుత విశ్వతోముఖం విశ్వతో బాహురుత వి-శ్వతస్పాత్ | సంబాహుభ్యాంధమతి సంపతన్ త్రైర్ద్యావాభూమి

జనయన్దేవ ఏకః | ఓం తత్పురుషాయ విద్మహే, మహాదేవాయ ధీ-
మహి, తన్నోరుద్రః ప్రచోదయాత్ ||

నానాసుగంధపుష్పాణి, యథాకాలోద్భవాని।

మయాహృతాని దివ్యాని, గృహాణపరమేశ్వర

- ఇతి శివపుష్పాంజలిః సంపూర్ణా –

## శివమహిమ్నః స్తోత్రమ్

ఓం శ్రీ గణేశాయనమః

హరిః ఓమ్

గజాననం భూతగణాధిసేవితం |

కపిత్థజంబూ ఫలసారభక్షణమ్ ॥

ఉమాసుతం శోక వినాశకారణం,

నమామి విఘ్నేశ్వర పాదపంకజం ॥

1. మహిమ్నః పారంతే పరమవిదుషోయద్యసదృశీ, స్తుతి-
ర్బ్రహ్మాదీనామపితదవసన్నాస్త్వయి గిరః |
ఆథావాచ్యః సర్వఃస్వమత పరిణామావధిగృణన్ మా-
మప్యేషః స్తోత్రేహరనిరపవాదః పరికరః ॥

2. అతీతః పంథానంతవచ మహిమాజ్మనయో
రతద్వ్యావృత్త్యాయంచకితమ భిధత్తే శ్రుతిరపి |
సకస్య స్తోతవ్యః కతివిధగుణః కస్యవిషయః పదేత్వ-
ర్వాచీనే పతతినమనః కస్యనవ చః

3. మధుస్ఫీతావాచః పరమమృతం నిర్మితవత స్తవబ-
హ్మాన్ కింవాగపి సురగురోర్విస్మయపదమ్ |
మమత్వేతాం వాణింగుణ కథనపుణ్యేన భవతః పునామీ-
త్యర్థే స్మిన్పుర మథనబుద్ధిర్వ్యవసితా ॥

4. తవైశ్వర్యం యత్తజ్జగదు దయరక్షా ప్రళయకృత్ |
త్రయీవస్తువ్యస్తం తిసృషుగుణభిన్నా సుతనుషు |
అభవ్యానామస్మిన్ వరదరమణీయామ రమణీం, వి-
హంతు వ్యాక్రోశీం విదధత ఇహైకే జడధియః ॥

5. కిమీహః కింకాయః నఖలు కిముపాయస్త్రిభువనం,
కిమాధారో ధాతా సృజతి కిమపాదాన ఇతిచ ॥
అతర్క్యైశ్వర్యేత్వయ్యనవసరదుః స్థోహతధియః కుత-
ర్కోయం కాంశ్చిన్ముఖరయతి మోహాయజగతః ॥

6. అజన్మానోలోకాః కిమనయనవంతోపి జగతా మధిష్ఠా-
తారం కింభవవిధి రనాదృత్యభవతి

అనీశోవా కుర్యాద్భువన జననేకః పరికరో, యతోమందా-
స్త్వాం ప్రత్యమరవర సశేరత ఇమే ॥

7. త్రయీ సాంఖ్యంయోగం పశుపతిమతం వైష్ణవమితి,
ప్రభిన్నే ప్రస్థానే పరమిదమదః పథ్యమితిచ | రు-
చీనాం వైచిత్ర్యాదృజుకుటిల నానా పథజుషాం,
నృణామేకోగమ్యస్త్వ మసిపయ సామర్ధవ ఇవ ॥

8. మహొక్షః ఖట్వాంగం పరశురజినం భసుపడిన
కపాలం చేతీయత్తవ వరద తంత్రోపకరణమ్ |
సురాస్తాంతామృద్ధిం విదధతి భవద్ర్యూ ప్రణిహితం,
నహిస్వాత్మారామం విషయ మృగతృష్ణా భ్రమయతి ॥

9. ధ్రువంకశ్చిత్సర్వం సకలమపరస్త్వద్ ధ్రువమిదం, పరో-
ధ్రావ్యా ధ్రావ్యే జగతి గదితి న్యస్త విషయే | సమస్తే
ప్యేతస్మిన్ పురమథనత్రైర్విస్మిత ఇవ, స్తువంజి
హ్యేమిత్వాం నఖలు నను దృష్టాముఖరతా !॥

10. తవైశ్వర్యంయత్నాద్యదు పరివిరించో హరిరథః పరి-
చ్ఛేత్తుం యాతావనల మనల స్కంధవపుషః |
తతో భక్తి శ్రద్ధా భరగురు గృణద్భ్యాంగిరిశయత్
స్వయంతస్థితాభ్యాంతవ కిమనువృత్తిర్న ఫలతి ॥

***శివుడు - శివపూజ***

11. అయత్నాదాపాద్య త్రిభువనమ వైరవ్యతికరం,
దశాస్యోయద్బాహూనభృతరణ కండూపరవశాన్ శిరః
పద్మశ్రేణి రచితచరణాంభోరుహబలేః స్థిరాయాస్త్వ-
ద్భక్తే స్త్రిపురహర విస్ఫూర్జితమిదమ్ ||

12. అముష్యత్వత్సేనా సమధిగతసారం భుజవనం
బలాత్కైలా సేపిత్వదధివసతౌ విక్రమయతః ! అలభ్యా-
పాతాలే ప్యలస చలితాంగుష్ఠ శిరసి
ప్రతిష్ఠాత్వయ్యాసీద్ ధ్రువముపచితోముహ్యతిఖలకి

13. యదృద్ధిం సుత్రామ్ణో వరద పరమోచ్చైరపిసతీ,
మధశ్చ క్రేబాణః పరిజనవిధేయ త్రిభువనః నత-
చ్చిత్రం తస్మిన్వరివసి తరిత్వచ్చరణయో
ర్న కస్యాప్యున్నత్యై భవతి శిరసస్త్వయ్యవనతిః ||

14. అకాండ బహ్మాండక్షయచకిత దేవాసుర కృపా విధేయ-
స్యాసీద్య స్త్రీ నయన విషంహృతవతః సకల్మాషః
కంఠే తవ నకురుతేనశ్రియమహొ వికారోపి శ్లా-
ఘ్యోభువన భయభంగవ్యసనినః ||

15. ఆసిద్ధార్థానైవక్య చిదపిస దేవాసురవరే, నివర్తంతే-
నిత్యం జగతి జయినో యస్సవిశిఖాః |

సపశ్యన్నీ శత్వామితరసుర సాధారణమభూత్, స్మరః-
స్మర్త వ్యాత్మానహి వశిషుపథ్యః పరిభవః ॥

16. మహీపదా ఘాతాద్ర్యజతి సహసాసం శయపదం,
పదం విష్ణోరామ్యద్ భుజపరిఘురుణ్ణ గ్రహగణమ్ ।
ముహుర్ద్యార్థౌస్థంయాత్య నిభృతజటా తాడితతటా,
జగద్రక్షాయైత్వం నటసినను వామైన విభుతా ॥

17. వియద్వ్యాపీ తారాగణగుణిత ఫేనోద్గమరుచిః
ప్రవాహోవారాంయః వృషతలఘుదృష్టః శిరసితే ।
జగద్వీపాకారం జలధివలయంతేనకృతమి
త్యనేనైవోన్నేయం దృతమహిమ దివ్యంతవవపుః ॥

18. రథఃక్షోణీయంతా శతదృ తిరగేంద్రో ధనురథో,
రథాంగేచంద్రార్కౌ రథచరణపాణిః శరఇతి ।
దిగక్ష స్తేకోయంత్రి పురతృణమాడంబర విధి
ద్విధేయైః క్రీడంత్యోన్జలు పరతంత్రా ప్రభుధియః ॥

19. హరిస్తే సాహస్రం కమలబలిమాధాయపదయో
ర్య దేకోనే తస్మిన్నిజ ముదహరనేత్ర కమలమ్
గతో భక్త్యుద్రేకః పరిణతిమసౌ చక్ర వపుషా త్ర-
యాణాం రక్షాయై త్రిపురహరజాగర్తి జగతామ్ ॥

20. క్రతౌసుప్తే జాగ్రత్త్వమసి ఫలయోగ్రే క్రతుమతాం
క్వకర్మ ప్రధ్వస్తం ఫలతి పురుషారాధనమృతే
అతస్త్వాం సంప్రేక్ష్యక్రతుషు ఫలదానప్రతిభువం శృ-
తౌశ్రద్ధాం బద్ధ్వాదృఢ పరికరః కర్మసుజనః ||

21. క్రియాదక్షోదక్షః క్రతుపతి రధీశస్తనుభృతా
మృషీణామార్త్విజ్యం శరణ దనదస్యాః సురగణాః |
క్రతుభ్రంశస్త్వతః క్రతుఫల విధానవ్యసనినో,
ధ్రువంకర్తుః శ్రద్ధా విధురమభిచార యహిమఖాః ॥

22. ప్రజానాథంనాథ ప్రసభమభికం స్వా దుహితరం,
గతం రోహిద్భూతాం రిరమయిషుమృష్యస్యవపుషా |
ధనుష్పాణేర్యాతం దివమపి సపాత్రాకృతమముం,
త్రసంతంతే ద్యాపిత్య జతిన మృగన్యాధరభనః ॥

23. స్వలావణ్యాశం సాధృత ధనుష మహ్నాయత్పణవత్
పురః పుష్టం దృష్ట్వా పురమథన పుష్పాయుధమపి
యది స్త్రైణం దేవీయమనిరత దేహార్ధఘటనా దవైతి-
స్త్వామ బద్ధాబతవరద ముద్ధాయువతయః ॥

24. శ్మశానే శ్వాక్రీడా స్మరహరపిశాచాః సహచారా
శ్చితా భస్మా లేపః స్రగపి నృకరోటీ పరికరః |

అమంగళ్యం శీల తవ భవతునామైన మఖిలం,
తథాపి స్మరూణాం వరద పరమం మంగళమసి ॥

25. మనః ప్రత్యక్చిత్తే సవిధమవధాయాత్త మరుతః ప్ర-
హృష్య ద్రోమాణః ప్రమద సలిలోత్సంగిత దృశః |
యదాలో క్యాహ్లాదం హ్రద ఇవ నిమజ్జ్వమృతమయే
దధత్యంతస్తత్వం కిమ పియమినస్తత్కిలభవాన్ ॥

26. త్వమర్కసం సోమస్త్వమసి పవనస్త్వం హుతవహః త్వమా-
పస్త్వం వ్యోమత్వము ధరణిరాత్మాత్వమితిచ
పరిచ్చిన్నా మేవంత్వయి పరిణతా భ్రతుగిరం నవి-
ద్మస్తత్తం వయ మిహతు యత్త్వంనభవాన్ ॥

27. త్రయీంతి ప్రోవృత్తీ స్త్రిభువన మథోత్రీనపిసురా
నకారాద్యైర్వర్ణై స్త్రీ భిరభిదధత్తీర్ణ వికృతిః
తురీయంతే ధామధ్వనిభిర వరుంధానమణుభిః
సమస్తం వ్యస్తంత్వాం శరణద గృణాత్యోమితిపదమ్ |

28. భవః శర్వోరుద్రః పశుపతిరథోగ్రః సహమహాం
స్తథా భీమేశానావితి యదభిధా నాష్టకమిదమ్
అముష్మిన్ ప్రత్యేకం ప్రవిచరతిదేవ శ్రుతిరపి, ప్రి-
యాయాస్మై ధామ్నే ప్రణిహిత నమస్యోస్మిభవతే ॥

29. నమోనే దిష్ఠాయ ప్రియదవ దవిష్ఠాయచనమో
నమః క్షోధిష్ఠాయ స్మరహర మహిష్ఠాయచనమః ।
నమోవర్షిష్ఠాయ త్రినయన యవిష్టాయచనమో,
నమః సర్వస్మైతే తదిదమితి సర్వాయచనమః
||

30. బహుళరజసేస్తే విశ్వోత్పత్తౌ భవాయనమోనమః
ప్రబల తమసే తత్సంహారే హరాయనమోనమః
జన సుఖకృతే సత్వోద్రిక్తో మృడాయనమోనమః,
ప్రమహసి పదేని(స్త్రైగుణ్యే శివాయనమోననుః ||

31. కృశ పరిణతి చేతః క్లేశవశ్యం క్వచేదం క్వ-
చతవ గుణ సీమోల్లంఘినీ శశ్వధృద్ధిః |
ఇతిచకిత మమందీకృత్య మాంభక్తి రాధా
ద్వరదచరణ యోస్తేవాక్య పుష్పోపహారమ్ ॥

32. అసితగిరి సమంస్యాత్కజ్జలం సింధుపాత్రే
సుర తరువరశాఖా లేఖినీపత్రముర్వీ |
లిఖతియది గృహీత్వా శారదా సర్వకాలం
తదపితవ గుణానామీశ పారంనయాతి ॥

33. ఆసుర సురమునీంద్రైరర్చితస్యేందు మౌళే (గ్రథి-
తగుణ మహిమ్నో నిర్గుణస్యేశ్వరస్య |

సకలగుణ వరిష్ఠః పుష్పదంతాభిధానో,
రుచిర మలఘువృత్తైః స్తోత్రమేతచ్చ కార ॥

34. అహరహరనవద్యం ధూర్జటేః స్తోత్రమేతత్,
పఠతి పరమభక్త్యా శుద్ధచిత్తః పుమాన్ యః |
సభవతి శివలోకేరుద్ర తుల్యస్త థాత్ర,
ప్రచుర తరధనాయుః పుత్రవాన్ కీర్తిమాంశ్చ ॥

35. దీక్షాదానంతపస్తీర్థం జ్ఞానంయాగాదికాః క్రియాః
మహిమ్న స్తవ పాఠస్య కళాంనార్హంతి షోడశీమ్ ||

36. ఆ సమాప్తమిదం స్తోత్రం పుణ్యం గంధర్వ భాషితం।
అనౌపమ్యం మనోహారి శివమీశ్వరవర్ణనమ్ ॥

37. మహేశాన్నా పరో దేవో, మహిమో నాపరాస్తుతిః !
అఘోరాన్నా పరోమంత్రో, నాస్తి త్వంగురోః పరమ్ ||

38. కుసుమదశన నామా సర్వగంధర్వరాజః,
శశిధర వరమౌళిర్దేవ దేవస్య దాసః |
సఖలు నిజమహిమ్నో భ్రష్ట ఏవాస్యరోషాత్,
స్తవనమిదమ కార్తీద్దివ్య దివ్యంమహిమ్నః ॥

39. సురవర మునిపూజ్యం స్వర్గమోక్షైక హేతుం
పఠతి యదిమనుష్యః ప్రాంజలిర్నాన్యచేతః
ప్రజతి శివసమీపం కిన్న రైః స్తూయమానః స్తవన-
మిద మమోఘం పుష్పదంత ప్రణీతమ్ ॥

40. శ్రీ పుష్పదంత ముఖపంకజ నిర్గతేన
స్తోత్రేణ కిల్బిషహరేణ హరప్రియేణ |
కంఠస్థితేన పఠితేన సమాహితేన
సుప్రీణితో భవతి భూతపతిర్మ హేశః ॥

41. ఇత్యేషావాఙ్మయీ పూజాశ్రీమచ్ఛంకరపాదయోః
అర్పితాతేన దేవేశః ప్రియతాంమే సదాశివః ||

42. యదక్షరపద భ్రష్టం మాత్రాహీనం చయద్భవేత్ ।
తత్సర్వం క్షమ్యతాం దేవప్రసీద పరమేశ్వర ॥

ఇతి శ్రీ పుష్పదంతాచార్య విరచితం

శివమహిమ్నః స్తోత్రం

సంపూర్ణమ్

# అథ శివస్తుతిః

ఓం మహాదేవ శివశంకరశంభో ఉమాకాంతహర త్రిపు రారే,
మృత్యుంజయ వృషభధ్వజ శూలిన్ గంగాధర మృడ మదనారే |

1. హరశివ శంకర గౌరీశం వందే గంగాధరమీశం
   రుద్రం పశుపతిమిశానం కలయే కాశీపురినాథమ్ ॥

2. జయశంభో జయశంభో శివ గౌరీశంకర జయశంభో |
   జయశంభో జయశంభో శివ గౌరీశంకర జయశంభో ॥

॥ ఓం నమః పార్వతీపతయే ॥

# వేదసార - శివస్తవః

1. పశూనాంపతిం పాపనాశం పరేశం, గజేంద్ర-
   స్యకృత్తిం వసానంవరేణ్యమ్ | జటాజూట
   మధ్యేస్ఫురద్గాంగవారిం మహాదేవ మేకం
   స్మరామి స్మరారిమ్ ॥

2. మహేశం సురేశం సురారాతినాశం,
విభుం విశ్వనాథం విభూత్సంగభూషమ్ |
విరూపాక్ష మింద్వర్కవహ్ని త్రినేత్రం,
సదానందమీడే ప్రభుం పంచవక్త్రమ్ ॥

3. గిరీశం గణేశం గలేనీలవర్ణం, గవేంద్రాధి-
రూఢం గుణాతీతరూపమ్ | భవం భాస్వరం
భస్మనా భూషితాంగం, భవానీ కళత్రం
భజే పంచవక్త్రమ్ ॥

4. శివాకాంతశంభో శశాంకార్ధమౌళే,
మహేశానశూలిన్ జటాజూటధారిన్ |
త్వమే జగద్వ్యాపకో విశ్వరూపః
ప్రసీద ప్రసీద ప్రభోపూర్ణ రూప ॥

5. పరాత్మానమేకం జగద్బీజమాద్యం,
నిరీహం నిరాకార మోంకార వేద్యమ్ |
యతోజాయతే పాల్యతేయేన విశ్వం,
తమీశంభజే లీయతేయత్ర విశ్వమ్ ||

6. నభూమిర్న చాపోనవహ్నిర్న వాయు,
ర్న చాకాశమాస్తేన తంద్రీననిద్రా |

న గ్రీష్మోనశీతంనదేశో నవేషో,
నయస్యాస్తి మూర్తి స్త్రీమూర్తింతమీడే ॥

7. అజం శాశ్వతం కారణం కారణానాం,
శివం కేవలం భాసకం భాసకానామ్ ।
తురీయంతమః పారమాద్యంతహీనం,
ప్రపద్యే పరంపావనం ద్వైత్యహీనమ్ ॥

8. నమస్తే నమస్తే విభో విశ్వ మూర్తే,
నమస్తే నమస్తే చిదానందమూర్తే ।
నమస్తే నమస్తే తపో యోగగమ్య,
నమస్తే నమస్తే శ్రుతిజ్ఞానగమ్య ॥

9. ప్రభో శూలపాణే విభో విశ్వనాథ,
మహా దేవశంభో మహేశ త్రినేత్ర |
శివాకాంత శాంతస్మరారే పురారే,
త్వదన్యోవరేణ్యో నమన్యోన గణ్యః ||

10. శంభో మహేశ కరుణామయ శూలపాణే,
గౌరీపతే పశుపతే పశుపాశనాశిన్
కాశీపతే కరుణయా జగదేతదేక,
స్వంహంసిపాసి విదధాసి మహేశ్వరో2సి

11. త్వత్తో జగద్భవతి దేవ భవస్మరారే,
త్వయ్యేవ తిష్ఠతి జగన్మృండ విశ్వనాథ |
త్వ-
య్యేవగచ్ఛతి లయం జగదేతదీశ,
లింగాత్మకం హరచరాచర విశ్వరూపిన్ ॥

ఇతి శ్రీ మచ్ఛంకరాచార్య విరచితం

వేదసార శివస్తోత్రం

సంపూర్ణమ్ |

## మావద్ద లభించు గ్రంథములు

| | | |
|---|---|---|
| 1. | ఈ సత్యాన్ని యోచించండి | రూ. 100/- |
| 2. | దివ్య భజన మాల | రూ. 70/- |
| 3. | శ్రీకృష్ణ లీలామృతము | రూ. 65/- |
| 4. | యోగసారము | రూ. 60/- |
| 5. | సనాతన ధర్మము - దాని విశిష్టత | రూ. 50/- |
| 6. | త-థ-ద-ధ | రూ. 50/- |
| 7. | ఆధ్యాత్మిక ప్రపాఠములు | రూ. 50/- |
| 8. | ఆధ్యాత్మిక ప్రబోధము | రూ. 50/- |
| 9. | మోక్షగీత | రూ. 50/- |
| 10. | ఆనంద గీత | రూ. 50/- |
| 11. | యోగవాసిష్ఠ కథలు | రూ. 45/- |
| 12. | జపయోగము | రూ. 35/- |
| 13. | శివానంద చిత్రకథ | రూ. 35/- |
| 14. | సాంస్కృతికాభ్యుదయము | రూ. 30/- |
| 15. | అ - ఆ - ఇ - ఈ | రూ. 30/- |
| 16. | క - ఖ - గ - ఘ | రూ. 25/- |
| 17. | పూర్ణత్వ ప్రాప్తికై పోరాటము | రూ. 20/- |
| 18. | ఆధ్యాత్మిక కథా స్రవంతి (3వ భాగము) | రూ. 20/- |
| 19. | ఆధ్యాత్మిక కథా స్రవంతి (4వ భాగము) | రూ. 20/- |

ప్రతులకు ఈ దిగువ అడ్రసుకు వ్రాయవలయును.


**SIVANANDA PUBLICATION LEAGUE**

**SIVANAANDANAGAR - 249192**

Theri Garhwal District (Uttarakhand)

Email : bookstore@sivanandaonline.org